శ్రీ

# భారతకథామృతము


రాజ్యలక్ష్మీపరిణయాది గ్రంథకర్త్రియగు

శ్రీమతి కల్లూరి విశాలాక్షమ్మగారిచే

రచింపఁబడినది





రాజమహేంద్రవరము

శ్రీ లలితా ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడినది

1930

వెల రు 2—0—0

భారతము — శాంతిపర్వము. ఆ ౪.

సీ. ఇరుప్రొద్దు గుడుచుట నెడనెడఁ గుడువకయుండు నాతండు సదోపవాసి
ఋతుకాలముల భార్యసంగతియందుఁ గలిసెడు భవ్యశీలుఁడు సదా బ్రహ్మచారి
దేవపితృతిథిపూజావిధులందుఁ మిగిలె మఱి నంజు పురుషుఁ డమాంసభోజి
తనయాశ్రితుల్ పంక్తి గారుగ భుజింప భుజించు నంచితాత్ముఁడు విఘసాశనుండు
తే. భృత్యవర్గంబు గుడిచిన పిదపఁ గుడుచు, నాతఁ డమృతాశి దివసంబునందు నిదుర
వోని పుణ్యుఁ డస్వప్నుఁ డీగుణములను మ, హాధికపవిత్రములు దేహబాధకములు.

దీనికి భారతకథామృతమునందు,

తే. దినమునకు రెండుమారులు దినుట మాని, మధ్య భుజియింపకుండెడు మానవుండు
పరఁగు నాతండిల సదోపవాసి యనఁగ, సావధానుఁడవై విను సార్వభౌమ.
క. ఋతుకాలంబున నే తన, సతి సాంగత్యం బొనర్చి సర్వదినములం
దతిథుల వేల్పుల గొల్చెడు, నతఁడు సదా బ్రహ్మచారి యగు లోకేశా.
తే. తనదు పంక్తిఁ గూర్చుండిన మనుజులకును, దన భుజించు విధమున భోజన మొసంగు
నతఁడు విఘసాశనుండగు ననఘవర్య, ధర్మమూర్తిగ తెలియఁ గిది ధర్మరాజ.
వ. మఱియు భృత్యులు భుజించిన పిదప భుజించువాఁ డమృతాశియుఁ బగలు నిద్రింపనివాఁ డస్వప్నుఁడు

భారతము — శాంతిపర్వము — ఆ ౪.

ఆ॥ కడిమిలేములనఁగఁ గల వొం డెండవి, యత్నగౌరవము నయత్నతయును
గలుగవచ్చు ననుట గాదది నూఱేండ్లు, దనము వినుము తెలియ నవనిమహేంద్ర
క॥ తేరకయుండఁగఁ జేరుఁ, దేరంగాఁ బోయియు విధియధీనంబులుగా
కారయవిస్తంబులు పురు, షాకంభాయత్తములె మహాబుద్ధినిధీ
ఆ॥ ఏనుఁ గర్త ననుట గొఱలఁ గమిదాఁ గర్త, యేని నెల్లఫలము లెడలకుండ
నఖిలకర్మములను సాధింపుచునున్న, వాఁడె కానఁ గర్త గాఁడు దాను.

దీనికి భారతకథామృతమునందు

సీ॥ కలిమిలేములు రెండుఁ గలవు దైవాయత్తములవి పురుషయత్నములును గావు
శత్రులఁ జెనుటయు మిత్రులఁ బ్రోచుట, యును నాపదలయందు మునుఁగకుంట
యనునవి కూడ దైవాయత్తములె యగు, మనుజయత్నము లేదు వినఁగ నెందుఁ
దెలివి లేమి కతంబున నలసను జేఁ గర్త, నని తలంచుచు నుందు రవనిజనులు
తే॥ కాన దేనికి మనుజుఁడు కర్త కాఁడు, సిద్ధ్యసిద్ధులయందున స్థిరుఁడు కాని
సుఖమునందు దుఃఖమునందు సుంత యేని, జింతఁ బొందక యుండుటే శ్రేయ మొసఁగు.

భారతము — శాంతిపర్వము ఆ ౫

సీ॥ గురుభక్తినిరతులు సురపితృపూజనపరులును సత్యసంభాషణులును
దానశీలురు పరధనపరదార పరాఙ్ముఖచిత్తులు బ్రాహ్మణప్రి
యులు దివానిద్రావియుక్తులు వృద్ధదుర్బలదీనయోషిత్కృపారతులును
గాచుటలు నతిథిభోజనశిష్టభోజులు సేసు మెచ్చు జనంబు లిట్లు కాక

అంతఁ గతిపయదినంబులు సమఁడు శాస్త్రివారిని నేను మగఁడఁ గాంచినపుడు నిజపుత్రీవిరచిత భారత కథామృతముం గూర్చి నాతోఁ బ్రస్తావింప నేను దానిం జూచితిననియు దాని సవర్ణ్యము మీరు ముద్రింపించి ప్రకటింపఁదగునని యుఁ జెప్పిన వారును వల్లె యనిరి కాని ; యిందు స్ఖాలిత్యము లున్న వే నేను వానిని సవరింపను. ఉన్నది యున్నట్టులే ముద్రణంబు గావింతు. అట్లయిన లోకులు గారవింతురా యని యడిగిరి. దానికి నేను రుచిరాన్నములలో సికతాకణంబు లొకఁడు రెండున్నచో నయ్యన్నము నెవరైనం బరిహరింతురా ; ఈ విధముగనే వారి యీ గ్రంథమును వైశంబ ముద్రణంబు గావించి ప్రకటింపుఁడని చెప్పిన వారును నియ్యకొనిరి.

ఈ గ్రంథమునకు భారతకథామృతమని యీ కవయిత్రీమణి పెట్టిన పేరు కరంబు సమంజసమై యలరారెడు. అమృతంబు విధంబున నీ గ్రంథము చదువువారి యుల్లంబుల నానందలహరి నోలలార్చు. అదియునుగాక దీనియందుఁ జెప్పఁబడినది పరమపావనం బగు శ్రీకృష్ణపాండవాదుల చరిత్రము. శైలి యనర్గళం బగు మంజులనిర్ఝరపూరంబుపగిది ధారాళంబై సోయగంబున నింపారు తేటతెనుఁగుమాటలం గ్రాలెడు. కఠిన పదంబులు వెదుకనైన నిందులేవు. అన్వయక్లిష్టత లేమి గ్రంథమునకుఁ బట్టుగొమ్మ సుగుణము. ఈ కవయిత్రీమణి ప్రాక్తనజననసుకృతపరిపాకవిశేషంబున నీయమ కవనంబునకుఁ బాకము సులలితద్రాక్షాపాకమై కుదిరినయది. కావున దీనిం జదువునప్పుడింపగు యర్థ మమందమందమతులకును సుగోచరంబగు. నేనీ పాత్రమును జదువుచుండ విద్యావిహీనులగు స్త్రీపురుషులును నిండలి యర్థములను దెల్లముగా నెఱుంగఁ జాలిరని చెప్పఁగలను. పదములు కడు లలితములు. అన్వయము కరము సులభము. శైలి తిద్దయు సరళము. ధారయెంతయు ధారాళము. ఇట్టి కవనము మిగులఁ బొగడఁదగినయది యని చెప్పుట యతిశయోక్తి కానేరదు.

శ్రీమతి విశాలాక్షమ్మ భర్తగారు కల్లూరి సుబ్బారాయనామధేయులు లౌకికోద్యోగమునమున్న వారు. వీరికి నొక పుత్రుఁడు నొక పుత్రికయుఁ గలరు. ఈ కవయిత్రికిఁ బతిదేవ వినయమును లజ్జయు నార్యులడెస విన్రమతయును గృహకృత్యములు నలుపుచో నప్రమత్తతయు నీమొదలగు సుగుణములు విలసిల్లుచుండును. ఎప్పుడు గ్రంథములు చదువునో యెప్పుడు పద్యములు రచియించునో యది సామాన్యముగా నితరులకుఁ దెలియదు. గృహకార్యములన్నియు సాగించి జరుపును నెడనెడ నించుక యవకాశము వలనఁ జదువుటయో వ్రాయుటయో గూఢముగా సలుపును. తనకుఁ గవిత్వము చెప్ప నేర్పుగలదని యీమ యించుకేని గర్వపడదు. అందఱియెడను సుముఖురాలై వారివారి కుచితరీతిం బ్రవర్తించుచుండును. ఇట్టి యుత్తమగుణోపేత యగునారీశిరోమణి సాధ్వీమతల్లి యనుటకు సందియమేమి ? స్వయముగా నే నీమె సుగుణముల నెఱుంగుదుం గావున వీనిని వివరింపఁజాలితి.

ఈ కబ్బంబునఁ బాండవకౌరవులచరిత్రము సంగ్రహముగాఁ జెప్పఁబడినది. ఇది భాషాంతరీకరణము గాక స్వతంత్రగ్రంథమయి నెలవారు భారతమునందలి కథలలోఁ బ్రధానములగువానిని గైకొని శ్రీవిశాలాక్షమ్మగారు సంక్షేపముగా నిందుఁ జెప్పియున్నారు. కావున నిందుఁ బెక్కు లుపాఖ్యానములును వర్ణనలును విపులముగాలేవు. నలోపాఖ్యానము రామాయణము మున్నగునవి యిందు సంగ్రహముగాఁ జెప్పఁబడినవి. ఎక్కడకేని యిక్కావ్యంబునఁ దిక్కనాది భారతకవుల కవనంబు ననుసరించిన పట్టులు గానంబడును. కొన్నిచోటుల వక్తవ్యవిషయముల నతిసంగ్రహముగాఁ జెప్పుటలో నిపుణిక చాల రమ్యముగాఁ బొడసూపును. వీని కుదాహరణము లొకకొన్ని ప్రదర్శింతు.

భారతము — శాంతిపర్వము. ఆ 4.

సీ. ఇరుప్రొద్దు గుడుచుట నెడనెడఁ గుడువక యుండు నాతండు సదోపవాసి
ఋతుకాలముల భార్యనతియంచు రతిసల్పు భవ్యశీలుఁడు సదా బ్రహ్మచారి
దేవపితృతిథిపూజావిధులనిడి మఱి నంజు పురుషుఁ డమాంసభోజి
తనయట్లు పంక్తి వారును గుడిచిన భుజించు నంచితాత్ముఁడు విఘసాశనుండు
తే. భృత్యవర్గంబు గుడిచిన పిదపఁ దినుము, నాతఁ డమృతాశి దివసంబునందు నిదుర
వోని పుణ్యుఁ డస్వప్నుఁ డీగాలములకు మ, హాధికవ్రతములు దేహబాధకములు.

దీనికి భారతకథామృతమునందు,

తే. దినమునకు రెండుమారులు దినుట మాన్య, మన్య భుజియింపకుండెడు మానవుండు
పరఁగు నాతఁ డిల సదోపవాసి యనఁగ, సాంఘానుఁడవై విను సార్వభౌమ.
క. ఋతుకాలంబుననే తన, సతి సాంగత్యం బొనర్చి సర్వదినములం
దతిథుల వేల్పుల గొల్చెడు, నతఁడు సదాబ్రహ్మచారి యగు లోకేశా.
తే. తనదుపంక్తిఁ గూర్చుండిన మనుజులకును, దనభుజించువిధమున భోజన మొసంగు
నతఁడు విఘసాశనుఁ డన నలఘువర్త్య, ధర్మసూక్ష్మత తెలియఁగ నిది ధర్మరాజ.
వ. మఱియు భృత్యులు భుజించినపిదప భుజించువాఁ డమృతాశియుఁ బగలు నిద్రింపనివాఁ డస్వప్నుఁడు.

భారతము — శాంతిపర్వము — ఆ 4.

ఆ॥ కలిమిలేములఁ గలుగఁ గల వొకరెండవి, యత్నగౌరవము నయత్నరేయును
గలుగవచ్చు ననుట గాదజనులకెల్లఁ, దనము వినుము తెలియ ననిమిషేంద్ర
క॥ లేరకయుండఁగఁ జేరుఁ, దేరంగాఁ బోయు విధియధీనంబులుగా
కారయవిత్తంబులు పురు, షాకాంక్షాయత్తములె మహాబుద్ధినిధీ
ఆ॥ ఏనుఁ గర్త ననుట యెఱుఁగమిఁ గర్త, యేని నెల్లఫలము లెడలకుండ
నఖిలకర్మములను నాచరించుచునున్న, నాఁడె కానఁ గర్తఁ గాఁడు దాను.

దీనికి భారతకథామృతమునందు

సీ॥ కలిమిలేములు రెండు గలవు దైవాయత్తములు అవి పురుషయత్నములును గావు
శత్రులఁ జెఱచుట మిత్రులఁ బ్రోచుట,యును నాపదలయందు మునుఁగకుంట
యనునవికూడ దైవాయత్తములె యగు, మనుజయత్నము లేదు వినఁగ నెందుఁ
దెలివి లేమికతంబు నలసను నేఁ గర్త, నని తలంచుచు నుందు రవనిజనులు
తే॥ కాన దేనికి మనుజుఁడు కర్త గాఁడు, సిద్ధ్యసిద్ధులయందున స్థిరముకాని
సుఖమునందు దుఃఖమునందు సుంతయేని, చింతఁ బొందక యుండుటే శ్రేయ మొసఁగు.

భారతము — శాంతిపర్వము ఆ ౫

సీ॥ గురుభక్తినిరతులు సురపితృపూజనపరులును సత్యసంభాషణులును
దానశీలురు పరధనపరదార పరాఙ్ముఖచిత్తులు బ్రాహ్మణప్రి
యులు దివానిద్రావియుక్తులు వృద్ధదుర్బలదీనయోషిత్కృపారతులును
శౌచులు నతిథిభోజనశిష్టభోజులు నేను మెచ్చు జనంబు లిట్టు గాక

తే॥ ధర్మమొదలి కామంబుఁ గోరి ధనంబుఁ జాలఁ, గలిగి గర్వులై బలిమిఁ భిక్షంబు లిడక
పరుష వాక్యులఁ గ్రూరంపు చరితములును, మిగుల వర్తించువారు నా మెచ్చుగారు

దీనికి భారతకథామృతమునందు—

క॥ గురుభక్తి నెఱపువారలు, నిరత మతిథి దేవపూజ నెఱపెడువారల్
పరధనము గోరనట్టిరు, సిరులును సంపదలఁ గాంతురు క్షితివరణించే.

తే॥ సత్య మాడెడువారలు శాంతమతులు, దానశీలురు సు మహోత్యాగపరులు
పరసతులఁ గోరకుండెడువారలందు, నిశ్చయముగ శాశ్వతలక్ష్మి నిలిచియుండు.

సీ॥ పరధనంబులయందుఁ బరదారలందుఁ బ, రాఙ్ముఖచిత్తులై పరిబలువారు
బ్రాహ్మణప్రియులును బగటి జామునయందు, ఖవళింపకుండెడు ప్రాజ్ఞులందు
వృద్ధులయందును వెలఁదులయందును, శౌచనిరతులందు సదయులందు
నతిథిపూజ లొనర్చువానరక్తులందును, శమదమోన్నతుల జనులయందు

తే॥ కలిమిలేమ నిక్కంబుగాఁ దెలఁగుమండు, గావమును గోత్రమును గర్వ గర్వులైన
వారియందును బరుసము పలుకువారి, దరికిఁ జేరగాఁ జాలదు సిరి నృపాల

వ॥ భిక్షమువేయక క్రూరచరిత్రములఁ బ్రొద్దులు పుచ్చువారలను లక్ష్మి మెచ్చఁబోదు. బుద్ధి నీతి తప
కాంతి ధృతి సమ్మతి శ్రద్ధ యనునీయేడుగురు దేవతలు లక్ష్మి నభివృద్ధిఁ బొందింతురు.

భారతము—ఉద్యోగపర్వము ఆ 3

క॥ పగవారియింటఁ గుడిచిన. నగుఁ దమ కనుమాన మమృతమయినదు దారుం
బగతురకుఁ గుడువఁ బెట్టఁగఁ, దగదొడంబుల కప్పు డెవ్విధము వాటిలునో.

వ॥ నేను బగతుండనె యంటేని,

క॥ అలుగుదు పాండవులకు నా, రలు నాకుం బ్రాణములు ధరావల్లభ యి
ట్టలముగఁ దమప్రాణములుకు, వలుగు జనులు పగతు రనుట యనుమానంబే.

దీనికి భారతకథామృతమునందు,

సీ॥ పగవారి యింటిలోపలను భుజించిన, నమృతతుల్యం బగునట్టిదైన
హాలాహలం బని యనుమానమగును నా, ప్రాణసమానులు పాండుసుతులు
వారికి మీకును వైర మున్నది కదా, పాండవదూతనై వచ్చినాఁడ
కార్యసుసంసిద్ధి కలిగినమీఁదట, మర్యాద లొనరింప మంచి దగును

తే॥ విదురునింట భోజనము సంప్రీతికరము, సందియం బందఁబోకు నీస్వాంతమందు
ననుచు నాతని యనుమతి వనజనాభుఁ, డరిగెనంతట విదురు మందిరమునకును

భారతము—అరణ్యపర్వము ఆ 2

మధ్యాక్కర

ఆరాజుగుణవలు నాకు నెఱింగించినట్టులు నన్ను, నారాజున కెఱింగించి కరుణామయందుఁ గావింప
మారంగ నమడు నిషధదేశంబున కరిగి హంస, వీరసేనజునకు దానిగుణరూప విభవములు జెప్పె

దీనికి భారతకథామృతమున,

చ. నలుని చరిత్ర మంతయును నా కెఱిగించిన హంసరాజమా
నలున కెఱుఁగ జేసి కరుణన్ నను జూడఁ గదే యటంచు -న

క్కలికి వచింప హంస కుతుకంబున నట్లన నంచఁ బోయి య
వ్వలునిసందేశముం బరిసి నవ్వుమొగంబున వాని కిట్లనున్.

ఈగ్రంథమందలి పైరెండుభాగములలో యుదాహరణముగం జూపవలయునన్న నెన్నియో పద్యములు చూపఁదగియుండును. అయినను పీఠిక పెరుగు వారికిఁ బ్రీతికావించుపొంటెఁ గొన్నిపద్యము లుదాహరించుచున్నాఁడను.

చ. సురవరనందనుండు రణశూరుఁడు కుంతికిఁ గూర్మిపుత్రుఁడా
సురుచిరరూపవంతుఁడు విశుద్ధమనస్కుఁడు భారతాన్వయా
భరణుఁడు శత్రుభీకరుఁడు ఫల్గుణుఁడా ద్రుపదాధినాథుతో
దురమొనరించి పట్టుకొని ద్రోణునిపాదములం జెచ్చిపెట్టినన్.

చ. మనసిజరాగమగ్న నయి వాటికి నేఁ జనుచున్నదాన నో
మనసిజరూప నన్నిపుడు మానక పెండిలి గమ్ము మే హిడిం
బను విను నాదు నన్న మిముఁ బట్టి భక్షింపు మటంచుఁ బల్కె నే
నినుఁ గని మోహమందితిని నీసతి నయ్యెద నో మనోహరా.

ఉ. నారదమౌనినాథవచనంబుల బోధితుఁడై జగత్ప్రియుం
గూరిమిఁ గూర్చుచిత్తమున గొంతిసుతుండు యుధిష్ఠిరుండు పెం
పారఁగ రాజసూయ మనునధ్వరముం బొనరింప నెంచి యా
ధారణినాథుఁ డయ్యెడను ధౌమ్యునితో నాలోచించె నంతయున్.

శా. నీవే తల్లివి తండ్రియుం గురుఁడవున్ నీవే జగన్నాథుఁడున్
నీవే విశ్వము తాల్చువాఁడవు ప్రభూ నీవే మహాత్ముండవున్
నీవే నన్నిటఁ బ్రోవ దిక్కురఁగా నీసోదరిన్ నే నయన్
రావే కావవె దేవదేవ ననుమా రాజీవపత్రేక్షణా

ఉ. ద్యూతమునందు నోడిన ప్రభూత్తము లా జగదేకసన్నుతుల్
భూతలనేతపాండువరపుత్రులు ధర్మసుతైక భూమణుల్
పూతచరిత్రులున్ ఘనులు పుణ్యులగణ్యమహాపరాక్రమో
పేతులు దేవసన్నిభులు వీరులు కౌరవవంశభూమణుల్.

సీ॥ ఉద్యానవనమున నువిదలతోఁ గూడి, పూలు గోయుచు నున్నకాలమందు
హంసము లెన్నియో యట వచ్చి వ్రాలిన, దమయంతి యొకహంసఁ దాను బట్టి
విడువకున్నను బల్కె విడువు నన్దమయంతి! నీకు మే లొనగూర్తు నిక్కముగను
నిషధాధినాథుండు నిత్యసత్యరతుండు, నలుఁ డనునొక రాజు కలఁడు సుమ్ము

తే॥ అతనికి నిన్నుఁ గూర్చెద నలరుఁబోఁడి, నన్ను విడు మని పల్కిన సన్నుతాంగి
విడిచె దానిని శీఘ్రము విడువ గానె, హంస యిట్లని వచియించె నాదరమున.

చ॥ చెలువల మేలుబంతి యిది శీతమయూఖునిఁబోలు మోముతో
గలువలమించి పెంపలరు కన్గవతో నపరంజి మేనితో

వల పెనఁగింపఁ జేసెడిని పల్కులిఁ కేల కిసాలపాణి నీ
యళికులవేణిఁ గోరు టిది యందనిపండ్లకు నఱ్ఱు సాచుటే.

ఉ॥ అంతఁ బ్రభాతకాలమున యాదవభూషణుఁ డైన రుక్మిణీ
కాంతుఁడు కాల్యకృత్యములు గ్రక్కునఁ దీర్చి సభాంబికేయున
భ్యంతరమందిరంబునకు నప్పుడు సాత్యకితోడఁ బోవ భూ
కాంతుఁడు గారవించి నను గంజదళేక్షణుఁ డప్పు డిట్లనన్.

ఉ॥ తప్పుల నన్నిటి న్విడిచి తాలిమితోడ మహానుభావ యిం
దొప్పుల స్వీకరింపఁ గదె యో పరమేశ్వర భక్తితోడ నేఁ
జెప్పితి నీపదాబ్జములఁ జేర్చితి నన్ను మెఱుంగఁ జాల నా
కెప్పుడు నీదయామృతము నీయఁ గదయ్య హిమాంశుశేఖరా.

ఇట్టి లలితమధురశైలిం గావ్యము నీపాత్రమునందు లక్షణవిరుద్ధము లగుప్రయోగములు కొన్ని కానం బడుచున్నవి కాని "ప్రబంధము నా జలరాశి దానిలోపల నెరసు ల్గణింతురె యపారములౌ మణులెల్ల నుండఁగన్" అని తొల్లి యొకప్రియకవి వచించిన చొప్పున నుదాత్తమతు లగు నార్యులు వానిని సరకు సేయక సుగుణములనే గ్రహించి యానందింతురనియు నీకవయిత్రిని గౌరవింతురనియు నమ్ముచున్నాఁడ.

ఇప్పుడీతిమిన్న యిన్నలువునే భాగవతకథామృతమును రామాయణకథామృతమును వ్రాసి యున్నది. ఆ రెండు గ్రంథములును నచిరకాలములోనే ముద్రితములై యాంధ్రజనులకుఁ బ్రమోదము సమకూర్చునని తలంచెదను.

ఈగ్రంథమున గొండొక్కవిశేష మెఱింగింతు. ఇది పరమశివున కంకితము సేయఁబడినది. ఈ స్త్రీశిరోమణికి శివభక్తి యగ్గలంబని యిందలి యాశ్వాసాంతపద్యములను జదువఁ దెల్లంబగు. ఒక్క పద్య ముదాహరించి దీని నుపసంహరించెద.

మ. శివలింగంబును బూజఁ జేసినయెడన్ జేకూఱు సర్వార్థముల్
శివుఁడే లోకము లన్నిటిన్ గరుణతో సృష్టించువాఁ డంచు నీ
యవనీచక్రమునందు మానవులు నిన్నర్చింత్రు కాదే సదా
శివ నాకావ్యము నీదయామృతమునన్ జేకొమ్ము సర్వేశ్వరా.

ఈకవయిత్రీమణికిఁ బరమేశ్వరియుఁ బరమేశ్వరుండును సర్వాభీష్టశుభంబు లొసంగి ప్రోతురు గాకయని ప్రార్థించుచున్నాఁడ.

తిరుపతి.
5—10—30

ఇట్లు
నాగపూడి కుప్పుస్వామయ్య బి. యే.

# భారతకథామృతము.



## ఆదిపర్వము — విషయసూచిక.

—(౦)—

విషయము.



## సభాపర్వము.



## ఆరణ్యపర్వము.

## భీష్మపర్వము.



## ద్రోణపర్వము.



## కర్ణపర్వము.



## శల్యపర్వము.



## సౌప్తికపర్వము.



## స్త్రీపర్వము.

## శాంతిపర్వము.



## అనుశాసనికపర్వము.



## అశ్వమేధపర్వము.



## ఆశ్రమవాసపర్వము.

## మౌసలపర్వము.

## మహాప్రస్థానికపర్వము.



## స్వర్గారోహణపర్వము.

శ్రీరస్తు

# భారతకథామృతము.

## ఆదిపర్వము.

### ఇష్టదేవతాప్రార్థనాదికము.

శ్లో. నారాయణం నమస్కృత్య నరం చైవ నరోత్తమం
దేవీం సరస్వతీం వ్యాసం తతో జయ ముదీరయేత్.

శా. శ్రీరాధార్చితపాదపద్మయుగళున్ శీతాంశువంశాళికిన్ మహా
నారాసింహాకృతివహున్ బరాత్పరుని బ్రేమస్వాంతుని న్వంకరున్
నానా దేవవరేణ్యులన్ మాకు జగన్నాథు న్మహాదేవునిన్
జ్ఞానానందమయస్వరూపుఁ డగు నాసర్వేశ్వరుం గొల్చెదన్. 1

మ. హిమవత్పుత్రిక యై మహామహిమతో నీరేడులోకంబులన్
గరిమన్ బెంపగఁ బ్రోచు నీశ్వరునకున్ గారాబపున్ రాణి యై
విమలంబౌ మతి నెల్లలోకములలో విఖ్యాత యై యొప్పు న
య్యమలాక్షి న్వినుతింతు నామనమునన్ శ్రీకాత్యాయనీదేవినిన్. 2

శా. శ్రీరామామణి యైన లక్ష్మి హరిమన్ సేవింప సర్వేసురుల్
కారుణ్యంబలరార నేలుఁ బరలుం గైవారముల్ సేయఁ గాఁ
క్షీరాంభోనిధియందు శేషునిపయిం బన్నుండు వైకుంఠుఁ డా
నీరేజాక్షుఁ డనంతుఁ డాద్యుఁడు దయన్ వీక్షించి మమ్మేలుతన్. 3

చ. కమలమునన్ జనించియును గౌరవ మూన సముద్రపుత్రి యై
కమలదళాయతాక్షునకుఁ గామిని యై ధరణీతలంబులోఁ
గ్రమమున నెల్లవారలకుఁ గల్మి నొసంగుచుఁ బ్రోచుచు న్నశ్రీ
రమణి త్రిలోకసుందరి నిరంతరము న్మముఁ గాచుఁ గావుతన్. 4

కం. హరినాభీసరసిజమున, గరిమంబున జన్మ మొంది కమలేశుకతో
ధరణీస్థలి సృష్టించిన, పరమాత్ముం డగు విధాతఁ బ్రణుతి యొనర్తున్. 5

ఉ. తెల్లనిచాన యై పరఁగి దేవవరేణ్యుఁడు నల్వరాణి యై
చల్లనివాలుఁజూపులను సర్వజనంబుల నేలుచుండు నా
తల్లి మహాప్రభావనిధి ధారుణి విద్యల కెల్ల దేవి మా
వల్లకిపాణి వాణి సదయామతిఁ గోర్కులు మా కొసంగుతన్. 6

ఉ. ఎవ్వనిరాకచే జగము లెంతయుఁ దేజము నొందుచుండునో
యెవ్వనికై సమస్తజను లీధరసేవకు లేచి యుందురో
యెవ్వఁడు చీఁకటి న్వడి హరించునొ భక్తుల నాదరించునో
యవ్వనజాతమిత్త్రుని మహాత్ముని భాస్కరునిం భజించెదన్. 7

చ. పలుకుల కెల్ల నాథుఁడయి పాపవినాశకుఁడై ధరిత్రిలో
నలహరుముద్దుబిడ్డఁడయి యన్నిఁటియందును విఘ్ననాశకుం
డెలమి గణేశ్వరుం డనుచుఁ బేరఁ జెలంగినయమ్మహాత్మునిన్
నలిమలపట్టిపట్టి యగునాని వినాయకునిన్ భజించెదన్. 8

శా. వేదంబుల్ విభజించి నట్టిఘనుఁడై విజ్ఞాని యై పుణ్యుఁడై
యాదిం బంచమవేద మై తనరు నానాభారతాఖ్యానమున్
మోదం బొప్ప రచించినట్టిత్రిజగత్పూజ్యున్ బవిత్రున్ ఘనున్
వేదవ్యాసుని సన్నుతింతు పరమున్ విజ్ఞాన మేపారఁగన్. 9

మ. ఘనుఁడై తాఁ గవిరాజునై సుగుణియై ఖ్యాతిం బ్రకాశించుచుం
దన పేరన్ రచియించి భారతము నీధాత్రీతలం బందుఁ జే
ర్మిలిఁ బెంపొందెడునట్టిసత్కవివరున్ శ్రీపాదకృష్ణాఖ్యు నా
జనకున్ భక్తి భజింతు సంతతనమస్కారంబు లర్పించుచున్. 10

తే. ఘనులఁ బూర్వకవీంద్రుల మానసమునందు
నిల్పి ధ్యానించి యెంతయు నిర్మలముగ
గురువరేణ్యుల నాత్మలోఁ గొలిచి భక్త
గ్రంథ మొక్కండు రచియింప గడఁగికొంటి. 11

సీ. రాజమహేంద్రివరమున భారతకథా, మృతము వ్రాయంగ నామతిఁ దలంచి
గుంటూరుపురమునఁ గోరికతో నాది, పర్వము సాంతము వ్రాసి యుంటి
నవల నెల్లూరున నాసభారణ్యవి, రాటపర్వంబులు వ్రాసి యుంటి
నానరబళ్ళారిలో నుద్యోగమును భీష్మ, మును ద్రోణమును మఱియును గ్రమముగఁ
తే. గర్ణశల్యసౌప్తికములు కామినియును, శాంతిపర్వము మఱి యనుశాసనికము
నశ్వమేధమాశ్రమవాసమంతమౌస, లమును నలమహాప్రస్థానికమును మఱియు.

వ. అనంతరంబ స్వర్గారోహణమును రచించి. 13

ఆ. పదియు నెన్మిదైనపర్వసంగ్రహముల, భారతామృత మనుపేర వ్రాసి
నీకు భక్తితోడ నే సమర్పించితి, దీనిఁ జిత్తగింపు దేవదేవ. 14

ఉ. ఎవ్వనిరాకచే జగము లెంతయుఁ దేజము నొందుచుండునో
యెవ్వనికై సమస్తజను లీధరణీస్థలి వేచి యుందురో
యెవ్వఁడు చీఁకటి న్వడి హరించునొ భక్తుల నాదరించునో
యవ్వనజాతమిత్రుని మహాత్ముని భాస్కరునిం భజించెదన్. 7

చ. పలుకుల కెల్ల నాథుఁడయి పాపవినాశకుఁడై ధరిత్రిలో
నలహరుముద్దుబిడ్డఁడయి యన్నిఁటియందును విఘ్ననేతయై
వెలసి గణేశ్వరుం డనెడుపేరఁ జెలంగినయమ్మహాత్మునిన్
నలిమలపట్టిపట్టి యనునాని వినాయకునిన్ భజించెదన్. 8

శా. వేదంబుల్ విభజించి వాసికెనఁగై విజ్ఞానియై పుణ్యుఁడై
యాదిం బంచమవేదమై వినుత మహాభారతాఖ్యానమున్
మోదంబొప్ప రచించినట్టితరిజగత్పూజ్యున్ బవిత్రున్ ఘనున్
వేదవ్యాసుని సన్నుతింతు సతమున్ విజ్ఞాన మేపారఁగన్. 9

మ. ఘనుఁడై తాఁ గవిరాజునై సుగుణియై ఖ్యాతిం బ్రకాశించుచుం
దనపేరన్ రచియించి భారతము నీధాత్రీతలం బొందుఁ జే
ర్మిని బెంపొందెడునట్టిసత్కవివరున్ శ్రీపాదకృష్ణాఖ్యు నా
జనకున్ భక్తి భజింతు సంతతనమస్కారంబు లర్పించుచున్. 10

తే. ఘనులఁ బూర్వకవీంద్రుల మానమునను
నిల్పి ధ్యానించి యెంతయు నిర్మలముగ
గురువరేణ్యుల నాత్మలోఁ గొలిచి భక్త
గ్రంథ మొక్కండు రచియింప గడఁగికొంటి. 11

సీ. రాజమహేంద్రివరమున భారతకథా,మృతము వ్రాయంగ నామతిఁ దలంచి
గుంటూరుపురమునఁ గోరికతో నాది,పర్వము సాంతము వ్రాసి యుంటి
నవల నెల్లూరున నాసభారణ్యవి,రాటపర్వంబులు వ్రాసి యుంటి
నానరబళ్ళారిలోనుద్యోగమును భీష్మ,మును ద్రోణమునుమఱియును గ్రమముగఁ
తే. గర్ణశల్యసౌప్తికములు కామినియును,శాంతిపర్వము మఱి యనుశాసనికము
నశ్వమేధమాశ్రమవాసమంతమౌస,లమునవలమహాప్రస్థానికమునుమఱియు.

వ. అనంతరంబ స్వర్గారోహణమును రచించి. 13

ఆ. పదియునెన్మిదైనపర్వసంగ్రహములు, భారతామృత మనుపేర వ్రాసి
నీకు భక్తితోడ నే సమర్పించితి, దీనిఁ జిత్తగింపు దేవదేవ. 14

గోరిక తెల్లఁ దీరెడును గూరును సంపద లెల్ల సౌఖ్యముల్
వారు పవిత్రు లయ్యెద రవారితకీర్తివిశాలమూర్తులై. 24

క. నిత్యము శుచులై మానవు, లత్యంతపవిత్ర మగుమహాభారతముం
శ్రుత్యనుకూలత విను రేని, సత్యంబుగఁ గలుగుసర్వసౌఖ్యంబు లిలన్. 25

తే. గోవులకు స్వర్ణమయముగఁ గొమ్ము లిడుచు
వేదవిదు లయి యలరారువిప్రులకును
దాన మిచ్చినంత ఫలంబు తప్పకుండఁ
గలిగెడును మహాభారతాఖ్యానము విన. 26

చ. భరతకులప్రదీపకులభవ్యచరిత్రము నాలకించినన్
నరకముఁ గాంచువారయిన నాకముఁ గాంతురు పాపదూరులై
నిరతము దీని మానవుఁడు నిష్ఠఁ బఠించు నెడం గృతార్థుఁడౌఁ
బరమపదంబుఁ జేరుటకుఁ బాయనిమిత్రము భారతం బగున్. 27

ఉ. ఇందున లేనిధర్మము ల వెందును లేవు తలంచి చూడఁగా
నిందుఁ గలట్టిధర్మము ల వెందును లే వన నేల వేదమే
యిందుల నుండు నీచరిత మెవ్వఁడు గాని పఠించు నేని యా
నందముఁ బొందు సౌఖ్యము లనారతముం గొను నిదు నమ్మఁగన్. 28

క. పావన మగునీకావ్యం, బేవేళఁ బఠించువారు లిలఁ బాపములన్
వేవేగఁ బాసి పుణ్యము, దేవత్వముఁ గాంచఁ గలరు తేజస్వులునై. 29

తే. అజుఁడు మొదలుగ నిదివఱకైనపూరు
వంశవృత్తాంత మెఱిఁగింప బ్రహ్మకేని
వశము గాదు నానేర్చినపగిది నీకుఁ
దెలియఁ జెప్పెద వినుమయ్య! సలలితాత్మ. 30

వ. అని వైశంపాయనుండు జనమేజయునకుఁ బూరువంశవృత్తాంతసంగ్రహ మెఱింగించి మహాభారతగ్రంథరచనాధురంధరుండును భారతవంశమూల పురుషుండు నగు వేదవ్యాసునిపవిత్రచరిత్ర మిట్లని చెప్పం దొడఁగె.

—• సత్యవతీ పరాశరుల వృత్తాంతము •—

క. మును యమునానది నద్రిక, యనునచ్చరలేమ యొకత యజశాపవశం
బున మీనంబై యుండెను, గనుఁగొనఁ గాఁ గొన్నివేలఘనవర్షంబుల్.

చ. వసు వసురాజశేఖరుఁడు పావనమౌ యమునాతటంబునం
బొసఁగెడుపూలతోఁటకును బోయి విహార మొనర్చు చున్నెడన్

మక్కువ దీరఁగా నిప్పుడు మాటికి నింటిమి గల్గ కుండినన్
దక్కునె నాకుఁ బ్రాణములు దక్కవు నీ కేమి యొనర్తు దైవమా. 44

ఉ. కాంచనగర్భుఁ డెంతయును గాంచనపుత్రిక గాయ వోసిన
ట్లుంచఁగ నయ్యె నేఁ డిచట నించుముఖీమణిఁ జూచినంత నేఁ
గాంచినదాని గా నిపుడు కాముని బారికి జిక్కి యుంటి నీ
కాంచనగంధితో ముదము గల్గగ నే నెటు మాట లాడుదున్. 45

క. చిఱునగవు చంద్రికళవలెఁ, బరఁగె న్నెమ్మోముసొంపు పద్మముఁ బోలెన్
వరవర్ణనీయ యగునీ, తరుణీమణిఁ గూడ కెట్లు తాళుదు నకటా. 46

క. పిలిచి యెటు మాటలాడుదుఁ, బిలిచిన గోపించునో కొమ్మ విమలాంగిని నేఁ
బిలువక యుండి కెట్లు తాళుదుఁ, జెలువలమేల్బంతి నెట్లు చేరుదు నో కొ.

క. అని యమ్మౌనివరేణ్యుఁడు, ఘనుఁ డైన పరాశరుండు కడు మోహముతో
ఘనతరసౌందర్యము గల, వనజాననఁ గాంచి యిట్లు పలికెం గడఁకన్.

ఉ. ఎవ్వరిదాన వెవ్వతెవొ యెందుల కియ్యెడ నున్నదానవో
జవ్వని! నామ మెయ్యదియొ చక్కఁదనాలకు నిక్క మైననీ
వెవ్వరొ యోడమీఁద నిటు లేమిటి కుంటి వటంచుఁ బల్కఁ గా
నవ్వనజాయతాక్షి యపు డా మునినాథునితోడ నిట్లనున్. 49

చ. మునివర! దాశరాజునకుఁ బుత్త్రిక నామము మత్స్యగంధి నాఁ
దనరుదు ధర్మమార్గమునఁ దండ్రియనుజ్ఞను నౌకఁ ద్రిప్పుచున్
జనులకు రాకపోకలను సల్పుచు నుందు నటంచుఁ దెల్పినన్
మునివరుఁ డిట్లు పల్కె వసుపుత్త్రికతో నతిమోహమగ్నుఁ డై. 50

ఉ. కాంతరొ! నీదుసుందరతఁ గాంచిననాకు విరాళి యయ్యె నేఁ
గంతునిబారిఁ జిక్కితిని గావుము నీయధరామృతంబు నా
కింత యొసంగ కుండు నెడ నే నెటు మేను భరింతు నన్న న
య్యంతులమేలుబంతి యపు డిట్లను నమ్మునినాథమూర్తితోన్. 51

ఉ. ఈవు మహామహుండవు మునీంద్రకులాభరణంబ వెన్నఁ గా
నీవు మునీంద్రచంద్రుఁడవు నీచకులంబున నైనదానినిన్
దావి నసహ్య మై తనరుదానిని గన్నియ నైనదాని న
న్నీ వెటు లంటఁ గోరితివొ నే వివరింపఁగఁ జాల నక్కటా. 52

తే. మీనుపోలనువాసన గలమేనిదానఁ, దల్లిదండ్రులచాటున నున్నదానఁ
గన్నెనే నిన్నుఁ గూడినఁ గాంచిరేని, తల్లిదండ్రులు నడపింతు రిల్లువెడల.

ఆ. తపము చేతును గాదె తాపసేశ్వర! నన్ను, నీవు గోరునంత నిమిషమునంద
తపము చెఱుప నేల తప్పు సేయఁగ నేల, నీకు కోర్కెనిత్తుఁ జనుము నీవు తొలఁగి.
వ. అనిన నప్పల్లవాధరిం గాంచి మునిశ్రేష్ఠుండు కన్యకా! నీవు జాలరి
దానవు గావు వసునృపాలపుత్రికవు దివ్యదృష్టిం జేసి నీచరిత్రము నా కా
ద్యంతంబుఁ దెలియ నయ్యె నాకోర్కెం దీర్పుము నీకన్యాత్వంబు దూషి
తంబు గాకుండ నియ్యది దైవనిర్మితంబు నీకు నావలన వంశోద్ధారకుం
డగు నందనుం డుదయించు నన నమ్మందయాన యిట్లనియె. 55
క. మునినాథ! చూడు మల్లదె, జను లెల్లరు దిరుగుపగటిసమయం బిది యే
నిను గూడు టెట్టు లన్నా, ముని తమముం బర్వఁ జేసెఁ బోఁడిమి నచటన్.
ఆ. తమము పర్వఁ జేసి కమలాయతాక్షిని, జేరెఁ దాపసుండు శీఘ్రముగను
మీనుపోలసుకంపు మేను విడి సుగంధమ్ము లందుకొనియెఁ దన్వి యంత.
వ. పరాశరహస్తసంస్పర్శంబువలనం గలిగినసుగంధ మ్మొక యోజనమ్ము
దాఁక వ్యాపించుం గావున నామెకు యోజనగంధ యనియు గంధవతి
యనియు నామంబు లేర్పడియె నంత. 58
క. తనపూర్వజన్మమునకుం, దన కేనం గలిగినట్టి తావికి మదిలో
ఘన మైనమోదమందుచు, వనజానన మాఱికోర్కె వాసిగఁ దీర్చెన్. 59
వ. అంత నయ్యోజనగంధి సద్యోగర్భముం దాల్చి. 60

—• వ్యాసుని జన్మప్రకారము •—

మ. ఘనునిన్ దండకమండలుప్రథితునిం గాంతిచ్ఛటాధామునిన్
ఘననిష్ఠాపరుని న్మహామహునిఁ గృష్ణప్రస్తుతాకారునిన్
మునిలోకప్రచయాధినాథుని జటాభూషావిశేషాంచితున్
గనియెన్ వ్యాసుని భారతాన్వయగురున్ గంజాతునంశంబునన్. 61
వ. సర్వవిద్యానవద్యుండును వేదధర్మోద్ధారకుండును భారతగ్రంథకర్తయు
నగు వేదవ్యాసుండు జన్మించి వెంటన పెరిగి పెద్దవాఁ డై తల్లికి మ్రొక్కి
నీ వెప్పుడు పిలిచిన నప్పుడ నత్తు నని విన్నవించె నంత. 62
ఆ. ఆపరాశరుఁడు మహాత్ముఁ డయ్యోజన, గంధిఁ గాంచి పలికెఁ గడఁకతోడ
నాదుకోర్కి దీరె నాతి! శంతనురాజ, పత్ని వగుదు వీవు భాసురముగ. 63
వ. అని యాశీర్వదించి వేదవ్యాసునితోఁ దపోవని కేగె నంత. 64
క. సంచితపుణ్యుఁడు వ్యాసుఁడు, పంచమవేదం బనంగ భారతమును ము
న్నంచితగతి వ్రాసెను లో, కాంచితమహనీయమూర్తి యాతఁడు తలఁపన్.

క. కురువంశం బని మెఱుసా, గర మభివర్ణింప నేరు గల రీధరలో
సరసిజగర్భుండును జాలఁడు, నరు లెంతటివారు తెలుప నగనాథమణీ. 66

— యయాతివృత్తాంతసంగ్రహము —

వ. ఆకౌరవవంశంబున ననేకులు రాజ్యము పాలించినయనంతరంబ నహుషుండు పట్టాభిషిక్తుండై యతి యయాతి సంయాతి మొదలగునార్వురు పుత్రులం గాంచి దివి కేగె యతి తపోనియతి నుండుటయు యయాతి రాజై పూజ్యసామ్రాజ్యపట్టాభిషిక్తుండై ధరిత్రీచక్రం బవక్రవిక్రమంబునఁ బరిపాలించుచు. 67

తే. దేవయాని శర్మిష్ఠను దేజమలరఁ, బరిణయుండై యయాతి భూవల్లభుండు
రాజసూయాధ్వరంబుఁ గొణలెసఁగఁ, జేయుచును రాజ్యపాలనాస్థితి నెసఁగి.

తే. దేవయానిరమణియందు దేజములరఁ గాంచె నిరువురసుతుల భూకాంతుఁడవల
ముదితశర్మిష్ఠవలన నమ్ముగురుసుతులఁ గాంచె వంశభూషణులలో కాంచితులను.

వ. అనంతరం బయ్యయాతి శుక్రశాపంబున యౌవనం బుడిగి జరాభారపీడితుండై కామాభిలాషం దగిలి తనయేవురు పుత్రులం గాంచి నాముదిమిం గైకొని మీయౌవనంబు నా కొసఁగుఁడవల మీయౌవనంబు మీకొసంగి నాముదిమి నేను గైకొందు నాయభిలషితమ్ము దీర్చినవాఁడే నారాజ్యార్హుండగు ననిన నల్వురుపుత్రులు సమ్మతింపమియుఁ బూరుండు పితృమనోరథంబు దీర్పఁ దలంచి తన యౌవనమాతని కొసంగి యాతని ముదిమిం గైకొనియె యయాతి నూతనయౌవనంబున విరాజిల్లుచుఁ దనమనోభిలాషం దీర్చుకొని సహస్రవర్షములయనంతర మాపూరుని యౌవనంబు వాని కొసంగి తనముదిమి దాను గైకొని పూరునకుఁ బూజ్యసామ్రాజ్యపట్టాభిషేక మొనర్చి తపోవని కేగె నంత. 70

ఉ. భారతవంశభూషణుఁ డపారపరాక్రమశాలి యైనయా
పూరుఁ డిలాతలేశుఁ డయి పొల్చి ఘనం బగునట్టియాగముల్
సారమతిం బొనర్చి గుణసాగరుఁడై విభవాభిరాముఁడై
ధారుణి రాజ్య మేలుచును ధర్మము నిల్పుచు నుండె నెయ్యెడన్. 71

క. సురనాయకునింబోలెను, బరమైశ్వర్యంబుతోడ భాసిల్లుచు నా
ధరణీశ్వరుండు పూరుం, డరుదారగ రాజ్య మేలె నాకాలమునన్. 72

వ. అంత నప్పూరుండు పౌష్టి యనుసతియందుఁ బ్రవీరుం గాంచె వాని యందు శక్తుండు మొదలుగఁ బదునెన్మిదితరంబుల కన్వాల నీలుండను వానికి రథంతరి యనుకాంతయందు దుష్యంతుండు జన్మించి సార్వభౌముండై చతుస్సముద్రముద్రితమహీచక్రం బవక్రవిక్రమంబునఁ బరిపాలించు చుండె. 73

—•దుష్యంతుని చరిత్రము•—

క. కురువంశాభరణుం డై, ధరణీంద్రుల నెల్ల గెలిచి ధర్మవిదుం డై
యరుదారఁగ దుష్యంతుఁడు, పరిపాలించెను ధరిత్రిఁ బ్రజ్ఞానిధి యై. 74
సీ. సర్వసర్వంసహాచక్రమ్ము సుగుణి యై, దుష్యంతుఁ డేలెను దోర్బలమున
నతనిపాలనమున నధము లెవ్వరు లేరు, గతపుణ్యు లెందును గలుగఁబోరు
నష్టోన్నతాచారదుష్టు లెందును లేరు, వర్ణసంకరకరుల్ వసుధ లేరు
ధర్మమే కాని యధర్మ మెందును లేదు, పాపసంగతి యెందుఁ బరఁగఁ బోదు
తే. ధనము ధాన్యము లెప్పుడు దనుపు మీఱు, జారచోరభయం బనుపేరు లేదు
సకలధర్మనిరతులయి సర్వజనులు, సౌఖ్య మందిరి దుష్యంతశాసనమున. 75
శా. ఆదుష్యంతనరేంద్రచంద్రుఁడు విలాసార్థంబు వేఁటాడ నై
మోదం బొప్పఁగ నొక్కనాఁ డడవికిం బోయె న్మహాసేనతో
నా దారిం గలక్రూరజంతువుల నష్టాత్ముఁడు చానేసి యా
హ్లాదం బై తగుకణ్వునాశ్రమముచాయం బోయి యున్నంతటన్. 76
ఉ. ఉల్లము పల్లవించునటు లుండెను బుష్పవనంబు లయ్యెడన్
జల్లనిగాలి వీఁచుచును సౌరభ మీనెడుపూలు రాజుపై
జల్లున రాల భూజములు స్వాగత మిచ్చెను జిల్కలెల్ల న
ల్లల్లన మాటలాడెను గృహస్థులుబోలె మనోహరంబుగన్. 77
ఉ. ఆరమణీయ మావనమునందు మహీపతి కొంత నిల్చి యా
శారికకీరముల్ వలుకుచక్కనిపల్కుల నాలకించి పెం
పారఁగఁ గణ్వమౌని విమలాశ్రమముం గనుఁగొఁ దలంచుచున్
మారసమానసుందరుఁడు మానక లోనికిఁబోయె నాయెడన్. 78
మ. సికలన్ సంపదలన్ దలిర్చెడుమహాచిహ్నంబుతో నొప్పి బం
గరుచాయం బురుణించుమేనిరుచితోఁ గాషాయవస్త్రంబుతో
సిరివాల్గంటికి నెత్తువచ్చునది యై శీతాంశుబింబాస్య యై
తరుణీరత్న మొకర్తు వచ్చె నటకున్ ధాత్రీశ్వరుం జేరఁగన్. 79
క. కాంతారత్నం బాదు,ష్యంతునిఁ గని నృపతి యనుచు స్వాగత మిడి య
త్యంతామోదముతో భూ,కాంతునకుం బలికె నిట్లు గౌరవ మలరన్. 80
ఉ. ఈ రొకరాజచంద్రు లని యేను గ్రహించితి మీరు నేమహా
మీరలు ప్రోచుదేశ మెది మీ రిట కెందుల కేఁగుదెంతురో

కోరితి నాకుఁ దెల్పుఁ డని కూరిమితో నటు లాడె యన్న నా
భూరమణుం డనున్ భువనమోహినితో జలజాయతాక్షితోన్. 81

క. నను దుష్యంతుం డందురు, వనితామణి! హాస్తిపురికిఁ బరివృఢుఁడను నే
మునినంద్యుఁడు కణ్వమహా,మునిఁ జూడఁగ వచ్చితి నెటుపోయిరో వారల్. 82

చ. అనవుడు నాశకుంతల ప్రియం బగువాక్యము లిట్లు పల్కెనో
జనవర! కణ్వమౌని యిటఁ జయ్యన వచ్చెడుఁ బూలుఁ బండ్లుఁ దేఁ
జనియె వనాంతరంబు సురసన్నిభుఁ డామహనీయమూర్తినిన్
గనుఁగొన నెంచితేని క్షణకాలము నిల్వుము భూతలేశ్వరా. 83

వ. అనిమందహాసభాసురవదనారవిందయై మృదుమధురవచనరచనలం బలికినశకుంతలం
గాంచి దుష్యంతమహీకాంతుం డిట్లనియె. 84

ఉ. ఎవ్వని కీవు పుత్రికవొ యెవ్వతెవో తెలియంగఁ బల్కుమీ
యివ్వనమందు నొంటిమెయి నేల వసించితి నీదునామ మో
పువ్వులఁబోఁడి నాకు విన ముచ్చట గల్గిన దంచుఁ బల్కఁ గా
నవ్వుచుఁ గణ్వపుత్రి నరనాథున కిట్లని పల్కెఁ గుల్కుచున్. 85

క. మునినాథుం డగుకణ్వుని, తనయ శకుంతల యనంగఁ దనరినదానన్
జననాథ నాచరిత్రము, వినిపించితి ననుడు వేడ్క విభుఁ డిట్లనియెన్. 86

క. అనఘుం డగుకణ్వమహా,ముని కెట్లు తనూజ వైతో పుణ్యుఁ డతండున్
దనవ్రతము విడువఁ డెప్పుడు, వినవలతుం జెప్పు మనుడు విమలాంగియనున్. 87

సీ. సృష్టికిఁబ్రతిసృష్టి చేసినమౌని వి,శ్వామిత్రుఁడు తపంబు సలుపుచుండఁ
గినుక దేవేంద్రుఁ డాతనితపోవిఘ్నము, పొనరింప మేనక యనెడుదాని
నచ్చరచానను జెచ్చెఱ గాధేయు,నరికిఁ బంపించె నోధన్యచరిత
కౌశికుఁ డాసతి ఘనసుందరాకృతిఁ, గనుఁగొని విభ్రాంతి కలితుఁ డగుచు
తే. సుమశరుని బారిఁ జిక్కి యాసుందరాంగిఁ, గూడి తదభీష్టమును దీర్చికొనినవెనుక
జన్మ మొందితి నచ్చరచానయందు, ఘనుఁడు గాధేయమౌనికి జనవరేణ్య. 88

క. ననుఁ గని జననీజనకులు, వనమందున నన్ను విడిచి వారలు చని రం
దునఁ గలశకుంతసంతతి, ననుఁ బెంచెం గొన్నినాళ్ళు నరవర వింటే. 89

తే. అంతఁ గొన్నినాళ్ళకును మహాత్ముఁ డైన, కణ్వమునివరుండటవచ్చి కాంచినన్నుఁ
దెచ్చి కూఁతు బోలెను బెంచె నిచ్చలోడఁ, గాన నాతనిసుత నైతి మానవేంద్ర.

వ. అని విన్నవించినయన్నలమిన్న కన్నరనాథుం డిట్లనియె. 91

మ. వనితారత్నమ నీపయిం దవిలె నాభావంబు త్రిప్పంగ లే
ననుమానింపక న న్వరింపఁ గదవే యబ్జాక్షి! రాజర్షినం
దన వంచు న్నిను మోద మందితిని గాంధర్వంబు శ్రేష్ఠంబు గా
వున నీ వట్లొనరింపు మం చనియు నయ్యుర్వీశ్వరుం డవ్వలన్. 92

క. తరుణీరత్నమ! యీవు, ద్భరకాననల నుండ నేల పరిణయ మై నా
ధరణీసామ్రాజ్యంబును, బరిపాలన సేయ రాదె పడఁతులు గొలువన్. 93

క. నీసౌందర్య మపూర్వ మి, దేసుదతులయందు నుండ దిందునిభాస్యా
గా సిల్లఁ జేయకుము నీ, దాసుఁడ నీవాఁడ నన్ను దయఁ జూడఁగదే. 94

తే. త్రిజగములు నిజకాంతిచేఁ దేజరిల్లు, సాటిలేనిసౌందర్యము సాటిలేని
పరమసాధ్వీమహత్వము పరఁగ నీవు, వనులయం దుండఁగా నేల వనరుహాస్య.

శా. కాంతారత్నమ! పుష్పబాణు గెలువంగాఁ జాల న న్నావు మ
త్యంతేష్టం బగు నీదుకోరికెను నేతన్మాత్రలోఁ దీర్తు నీ
చెంతం జేరితి దివ్యభూషణములం జెల్వారఁగా నిచ్చెదన్
స్వాంతంబందలికోర్కి దీర్పఁగదె నాసామ్రాజ్య మే నీ దగున్ 96

క. అని దుష్యంతనరేంద్రుం, డనిన శకుంతల వచించె నాతనితో నో
జననాయక! కణ్వమహా, ముని నను నీకొసఁగు నెడల మోదమె నాకున్. 97

వ. అని మిగులవగలం గులుకుచుఁ బలికిన శకుంతలకు దుష్యంతుం డిట్లనియె. 98

చ మరునిశితాస్త్రపాతమున మ్రగ్గుచు నుంటిని దాళఁ జాల మేన్
దొరఁగెడునో యటంచు మదిఁ దోఁచుచు నుండె స్వతంత్రి వీవ యో
తరుణి! నను న్వరించి పరితాపముఁ దీర్పు మటంచు వేఁడఁగా
సరసిజచారులోచన శశాంకకులేశునితోడ ని ట్లనున్. 99

చ. జనవర! నీదుకోరికను సమ్మతిఁ దీర్చెద నాకుఁ గల్గునా
తనయుఁడు నీదురాజ్యమునఁ దప్పక రాజుగఁ జేయునట్లు బా
సను బొనరింపు మంచు మృగశాబవిలోచన పల్కినంత ని
ట్లనియె మహీతలేంద్రుఁడు నిజాత్మను గౌతుక ముప్పతిల్లఁగన్. 100

క. నీకోరినతీఱున నే, నీకొమరుఁడు రాజ్యలక్ష్మి నిశ్చయముగఁ దాఁ
గైకొని పరిపాలించును, నాకోరికిఁ దీర్పు మింక నలినదళాక్షీ. 101

క. అనిన శకుంతల లజ్జా, ననమున నంగీకరింప నరనాయకుఁ డా
వనజాక్షిని గాంధర్వం, బునఁ బాణిగ్రహణ మపుడు పొనరించెఁ దగన్. 102

వ. అంత దుష్యంతభూకాంతుండు జగదేకసుందరి యగుశకుంతలాకాంతం బరిగ్ర

హించి తనయభీష్టంబు నెఱవేర్చుకొని మరల వరుదెంచి నిన్ను నారాష్ట్రింబున కుం గొంపోవుదు నని యామె నొడంబఱిచి వీడ్కొని నిజపురంబునకు నిష్క్రమించె నంతఁ గొంతసేపటికిఁ గణ్వమహర్షి చనుదెంచి శకుంతలావృత్తాంత మంతయు దివ్యదృష్టి నవలోకించి సంతసించుచు నక్కుమారి నాశీర్వదించి యిట్లనియె.

క. తనయా! సంతసమందితి, ననఘుఁడు దుష్యంతనృపతి నాత్మేశ్వరుఁగాఁ
గొని వరియించితి కులవ, ర్ధనుఁ డగునందనుఁడు నీకుఁ దగ జనియించున్. 104

చ. అనిన శకుంతలాసతి నిజాత్మను సంతసమంది భక్తితో
జనకునకుం బ్రదక్షిణము సల్పి నమస్కృతిఁ జేసి పల్కె నో
యనఘ! మదీయవల్లభునియందునఁ గిన్క సహింపరాదు నా
మనమునఁ గోర్కెపెంపునను మానవనాథుని నే వరించితిన్. 105

తే. ధర్మమూర్తి యాదుష్యంతధరణిపతికి, నాయురైశ్వర్య మధిక మానట్లు గాఁగఁ
దండ్రి! వరముఁగోరితినిన్నుఁ దగనొసంగు,మనుట యుంగణ్వుఁ డట్లగునని వచించె.

వ. అంత శకుంతల గర్భవతి యై మూఁడువర్షములు నీరు మోసి శశాంకమకరాంకసదృశుండు రాజలక్షణలక్షితుండు నగుసర్వదమనుం డను కొక్కుసుకుమారుం గని యె నతనికిఁ బంచవర్షప్రాయ మరుదెంచినంతఁ గణ్వమహాముని శకుంతల నను నయించి యిట్లనియె. 107

చ. సుతుఁడు పొసంగె నీ కితఁడు క్షోణితలంబున కెల్ల నాథుఁడై
నుతు గుణవంతుఁ దోడుకొని సుందరి! నీపతియొద్ద కేగుమా
సతులకుఁ బుట్టినిండ్లకడ సంతత ముండుట పాడి గా దనన్
సతి జనకాజ్ఞ కెంతయును సమ్మతమందెను స్వాంతమందునన్. 108

వ. కణ్వుండును శకుంతల నాశీర్వదించి శిష్యులం దోడిచ్చి కుమారునితో నామెను దుష్యంతరాజధాని కంపిపుచ్చుటయు వార లవ్వారిజాక్షి నాతనికడం జేర్చి మరలిన శకుంతలసభాస్థలంబున మంత్రిసామంతపరివృతుం డగుదుష్యంతనరేంద్రుం దిలకించి యిట్లనియె. 109

ఉ. నాఁ డలకణ్వునాశ్రమమునన్ వరియించితి వేను నీసతిన్
వీఁడు భవత్తనూభవుఁడు వీనిని నన్నును స్వీకరించి వి
వాడినమాట బొప్పున ననంగసమానుగుని నిక్కుమారునిన్
వేడుకతోడఁ గూడి పృథివీధవుఁ జేయఁగదే మనోహరా. 110

తరలము. అని శకుంతల పల్కిన న్మనుజాధిపుండు మనంబునం
దునఁ గడుంగడుఁ గోప మందుచుఁ దోయజేక్షణ కిట్లనున్

వనిత! నీ వెవరో యెఱుంగను వచ్చినట్లుగఁ బోవుచూ
యనినఁ గన్నుల నీరు గార్చుకు నామె యి ట్లనె నాతేరికిన్. 111

మత్తకోకిలము. ధారుణీశ్వర! నన్నుఁ బూర్వము ధర్మయుక్తము గాఁగ నై
కోరి కైకొని యుంటి వప్పటికూరిమిన్ విడనాడకు దే
పూరువంశవిభూషణుండవు పోలునే యిటు లాడఁగా
మారసన్నిభ! కైనయానుకుమారుఁ గైకొనుమా విభూ. 112

చ. మనుజున కర్ధకాయ మగుమాడ్కిఁ దనర్చెడు పత్ని యైహికం
బునఁ బరలోకమందునను బూరుకులేశ్వర! పాపిణమిత్రి మా
జనవర! నీసతీమణిని సాధ్విని న న్నిటు లాడ నొప్పునే
వినుము మదీయవాక్యముల వేఁడుచు నుంటిని బ్రాణవల్లభా. 113

క. తనయుం డనఁ దనయాత్మయె, తనయుం డిల జన్మ మొందిన తండ్రి ఋణం
బును దీర్చి ప్రోచుఁ గావునఁ, దనయుని గైకొనుము రాజ! ధర్మవిచారా. 114

ఉ. సత్యము నిల్పు భూరమణ సత్యము చేయుము నాఁటివాక్యమున్
సత్యము మోక్షమార్గ మగు సత్యము పుణ్యపదైకమూలమున్
సత్యము పాపిణమిత్రి మగు సత్యము కీర్తి నొసంగుఁ గాన నీ
వత్యమలస్వభావుఁ డగునాత్మజు ముద్దిడు జివితేశ్వరా. 115

వ. అంతఁ జింతాకులస్వాంతయు ధర్మానుసారిణియు నత్యంతపావనియు నై విచారం
బునం బొగులుశకుంతలకు దుష్యంతుం డిట్లనియె. 116

చ. అనృతము లాడఁ జొచ్చి తిటు లాడఁగ నొప్పునె నాదుకొల్వునన్
మును నినుఁ జూచి యే నెఱుఁగఁ బొమ్ము సుతుం డెవరో యెఱుంగ ని
న్నును వరియించు టె నెఱుఁగ నోవరవర్ణిని! వేశ్యవోలె ని
ట్లనుటకుఁ బాడి గాదు వడి నవ్వల కేగుము నీవు దుర్మతీ. 117

వ. అనిన రోషకషాయితనేత్ర యై శకుంతలధాత్రీంద్రున కిట్లనియె. 118

చ. జనవర నీదు రాజ్యమును సమ్మతితో నిపు డీయకున్న నా
తనయుఁడు పూజ్యరాజ్యమును దప్పక ప్రోచెడుఁ జక్రవర్తి యై
మును పలదివ్యవాణి యనెఁ బోవుచు నుంటిని దండిప్రాలి కం
చును సుతుఁ గూడి పోఁ దలఁచె సుందరి యాస నిరాశ నొందఁగన్. 119

ఉ. అంతట నభ్రవాణి యనె నందఱకు న్వినవచ్చునట్లు భూ
కాంత! యితండు నీసుతుఁడె కంజదళాయితచారునేత్ర నీ

కాంత వచించె సత్యమును గావున నీసతినిం గుమారునిన్
స్వాంతము ప్రేమఁ గైకొనుము వాని కొసంగుము యౌవరాజ్యమున్. 120

క. భరియింపు మిక్కుమారుని, భరతుం డని పే రొసంగ పౌరవవంశా
భరణ! యువరాజ్య మొసఁగుము, గరిత శకుంతలనుఁ బ్రోవు క్ష్మాతలనాథా. 121

వ. అని దివ్యవాణి యెల్లవారియు హృదయంబులు పల్లవించునట్లుగా వచించిన నాలించి హర్షసంభూతుం డై దుష్యంతుండు పూర్వవృత్తాంతంబు జ్ఞప్తికిం దెచ్చుకొని సభాస్తారులం గాంచి యిట్లనియె. 122

ఆ. సభ్యులార! మీరు సమ్మతి వింటిరే, దివ్యవాణిపలుకు భవ్యతరము
కణ్వునాశ్రమమునఁ గాంతఁ బెండ్లాడితి, నాకుమారుఁ డితఁడు లోకులార. 123

చ. అనుచుఁ గుమారు ముద్దిడి ప్రియంబున సక్కన నక్కుఁ జేర్చి నా
తనయుఁడ! నిన్నుఁ గాంచితిని ధన్యుఁడ నైతి నటంచుఁ బల్కి య
వ్వనరుహచారునేత్రఁ దనపత్నిఁ బవిత్రచరిత్రఁ గాంచి యి
ట్లనె నతిగౌరవంబున మహామహినాథుఁడు ప్రేమ పెంపునన్ 124

చ. చెలువలమేలుబంతి! నినుఁ జెల్వగ నాశ్రమమందుఁ గాంచి పెం
పలరఁగఁ బెండ్లియాడితి నదంతయు లోకు లెఱుంగకున్కి నేఁ
బలికితి నిట్లసత్యములు ప్రల్లదముల్ వచియించి యుంటి నో
చెలువ! దయామతిన్ సయిచి చేకొని ప్రోవుము నిన్ను వేఁడుదున్. 125

వ. దీన నీపవిత్రచరిత్రం బెల్లరకుఁ దేటతెల్లముగాఁ దెలియు నని ప్రియోక్తుల శకుంతల నలరించె నత్తన్వియు నమందానందంబున హృదయవల్లభకరగ్రహణం బొనరించె నంత మహీజానికుమారునకు భరతుం డను నామకరణ మ్మొనరించి యౌవరాజ్యపట్టాభిషేక మ్మొనరించె నట్లు శకుంతలాదుష్యంతులు కలకాలము సర్వసౌఖ్యమ్ము లనుభవించి యవ్వల నిర్వురు తపోవనంబునకుం జని రంత. 126

క. భరతుఁడు రాజ్యార్హుం డై, పరిపాలనఁ జేసె బాహుబలమున ధరణీ
శ్వరుల గెలిచి బహుసవముల, నరుదారఁగఁ జేసె నాతఁ డాకాలమునన్. 127

చ. భరతుఁడు సార్వభౌముఁ డయి వంశవిభూషణుఁ డయ్యె నయ్యెడన్
భరతునినామ మెంతయును బ్రస్తుతి కెక్కఁగఁ బూరువంశమం
దరయఁగ వెన్కముందుఁ గలయట్టిరకెల్లను నొప్పినట్టిదై
పరఁగెడు నక్కులంబు నగువారలు భారతు లైరి పెంపునన్. 128

చ. భరతుఁడు రాజ్య మేలుచును బాహుబలంబున నొప్పి పెక్కు ల
ధ్వరము లొనర్చి విప్రులకు దక్షిణలం బలువే లొసంగియుం

దిరుఁ డయి రాజ్యమేలుటను దేశ మిదంతయు భారతం బనన్
బరఁగెడుఖ్యాతి పెంపునను భారతవర్షము నెన్న శక్యమే. 129

వ. భరతుండు పెద్దకాలము రాజ్యమేలి భుమన్యుం డను సుతునిం గాంచి యవ్వెనుక స్వర్గంబునకు నిర్గమించుటయు భుమన్యుండు రాజై సుహోత్రుం డనుసుతుం గాంచె సుహోత్రుండు రాజై రాజసూయాధ్వరాదులు పెక్కు లొనర్చి వాసిం గాంచె నటు భారతవంశము పుత్రపౌత్రాభివృద్ధిగా వర్ధిల్లె మఱికొన్ని తరంబుల కవ్వల రాజై ప్రతీపుండు ధర్మానుసారంబుగ రాజ్య మేలుచు. 130

—• ప్రతీపుని చరిత్రము •—

క. తనయులఁ గోరి ప్రతీపుఁడు, ఘననైష్ఠికుఁ, డై తపంబు గంగాతీరం
బునఁ జేయుచుండ జాహ్నవి, చనుదెంచె లలిం బ్రతీపజనపతిదరికిన్. 131

చ. సురనది యక్కురూద్వహుని శోభిలు చుండెడుదక్షిణాంకమం
దరమర లేక నిల్చుటయు నద్భుత మంది యతండు పల్కె నో
తరుణి! యిదేమి చెప్పు మనఁ దన్వి వచించె నరేంద్ర! గంగ నేఁ
బరఁగ నినున్ వరించుటకు వచ్చితిఁ గైకొని నన్నుఁ బ్రోవుమా. 132

చ. అనవుడు నాప్రతీపుఁ డను నాజలజాయితచారునేత్రితో
వనితరో! యేకపత్ని యగువాఁడ నధర్మ మొనర్పఁ జాల నా
తనయుని నీవు గైకొనుము దానను గోడలి వయ్యె దన్న నౌ
నని మది సమ్మతించి చనె నప్పుడు జాహ్నవి సంతసంబున్. 133

క. అంతటఁ బ్రతీపభూపతి, యెంతయు సంతస మెలర్ప నెసగెడుసుతునిన్
శంతనునిం గాంచెను గా,లాంతరమున యందుఁ బ్రస్తుతౌజోవంతున్. 134

వ. అంతఁ గొంతకాలంబునకుఁ బ్రతీపుండు సర్వసర్వంసహాచక్రంబునకు శంతను నధిపతినిఁ గా నభిషేకించి మున్ను గంగాదేవికిం దాను జేసినబాసం జెల్లింపు మని చెప్పి యొప్పించి తాను దపోవనంబునకుం జనియె నంత. 135

చ. జనపతి యై ప్రకాశిలెడుశంతనుభూపతి సార్వభౌముఁ డై,
జనులను బిడ్డలంబలెను సాకుచు నాతఁడు రాజసూయమున్,
మునుకొనునధ్వరంబులఁ బ్రమోదమునం బొనరించి కీర్తిం
దనరె మహేంద్రతుల్యుఁ డయి ధారుణి నెల్లరుఁ దన్ను మెచ్చఁగన్. 136

ఉ. శంతనుధారుణీవరుఁడు సర్వమహీతలరాజ్య మేలుచున్
సంతతసర్వసంపదలు సంధిల నొప్పుచు వేఁట లాడఁగా

నంతట నొక్కనాఁడు కుతుకాంచితుఁడై చని కాననంబునం
గాంతనొకర్తుఁ గాంచి తమకంబున నిట్లని పల్కె నామెతోన్. 137

—• శంతనుని వృత్తాంతము •—

ఉ. ఎవ్వరిదాన వెవ్వతెవొ యిచ్చట నెందులకుంటి వొంటి మై
నివ్వనభూమిఁ జేరుటకు నేమికతంబొ జలేజనేత్రి! యో
జవ్వని! నాదు మానసము చయ్యన దొంగిలి యున్నదాన వీ
వెవ్వరొ నాకుఁ దెల్పు మన నిట్లను నాయను నవ్వుమోమునన్. 138

చ. జనవర! నన్నుఁ గైకొనఁగ సమ్మత మౌనెడ నే నొనర్చున
ట్లనువుగ నన్నికార్యములు నౌ నటుఁ నప్రియ మాడనట్లు గా
నను వరియింపు మన్న జననాయకుఁ డౌనని బాస చేసి య
మ్మనసిజరాజ్యలక్ష్మి యగుమానినిఁ గైకొనెఁ గౌతుకంబునన్. 139

వ. అట్లు వారిసమాగమంబునం బుట్టినపుత్రుల నప్పద్మపత్రనేత్ర యేడ్వురం బుట్టి
నప్పుడ గంగాజలంబులం బాఱవైచి యెనిమిదవవాని నట్లు చేయుచుండ బాల
భాస్కరతేజుం డగునబ్బాలుం గని శంతనుం డక్కాంత కిట్లనియె. 140

క. భానుసమానుం డగునీ,సూనుని విడనాడఁ జాల సుందరి! నీ వె
ట్లైనను సమ్మత మయ్యెదు, నానందను జంప వలదు నలినదళాక్షీ. 141

చ. అనవుడు గంగ తొంటిపలు కాత్మకు జ్ఞప్తికి రాగ నప్రియం
బనుచు నరేంద్రుపైఁ గినుక నంది మహీశ్వర! యేను జాహ్నవిన్
వనితను గాను బోయెదను వచ్చినమచ్చిన నీతనూజునిన్
గొనుము సుమాత్రునన్ని భువిఁ గూరిమి తీఱెను నాకు నీ కికన్. 142

వ. వసువు లెనమండ్రుగురు వశిష్ఠశాపంబున నిహతులై మర్త్యలోకంబున నిట్లు
నాయందు జన్మించి శాపమోక్షంబు నొందిరి నేను దేవహితార్థమై మనుజాం
గనయుంబోలె నిన్నుఁ గామించితి నీయష్టమపుత్రుండు భీష్ముండని పేరఁ జిర
కాల మీభూలోకంబున నుండి యవ్వల వసువులం గలియు వీని నేఁ గొంతకాలం
బున కవ్వలం దెచ్చి యిచ్చెదనని గంగాదేవి కుమారునితో నదృశ్యయయ్యె నంత.

క. శంతనధరణీరమణుఁడు,కాంతావిరహానలమునఁ గాఁలుచు స్వాంతం
బెంతయు సంతాపించెడు,నంతట రాజ్యంబు నేలె నతిధర్మమునన్. 144

ఆ. కొన్నియేండ్లకవలఁ గోరికతోడను, వేఁట లాడఁ బోయి విష్ణుపదికిఁ
జెంత నున్నవనము చేరి విశ్రాంతిగా, విశ్రమించెను బృథివీశవరుఁడు. 145

వ. అంత సైకతశ్రేణిలో ధనుర్విద్య నభ్యసించుచున్న బాలార్కప్రతిమానతేజుం

డగు నాకబాలుం గాంచి యీమోహనాంగుఁ డెవ్వరొకో యనితలఁచుచుండు
తఱి గంగాదేవి యంగనారూపంబున నేతెంచి దేవవ్రతునిం దెచ్చి శంతనుభూ
కాంతున కిచ్చి యి ట్లనియె. 146

క. భూనాయక యీబాలుఁడు, నీనందనుఁ డగును వీనినిం గైకొనుమా
నే ననిమిషనది నెఱుఁగవె, వీనిని యువరాజుఁ జేయు వేఁడుకతోడన్. 147

వ. అని భాగీరథి యదృశ్య యగుటయు శంతనుండు సర్వవిద్యాపారంగతుం డగు
గాంగేయునితో హస్తిపురి కేగి యక్కుమారునకు యౌవరాజ్యాభిషేక మొనర్చి
సర్వప్రజానురంజకముగా రాజ్య మేలుచు నొక్కదినంబున యమునాతీరమ్మున
కరిగి యందోడ నడపుశరదిందుప్రతిమానసుందరవదన యగుమత్స్యగంధిం
గాంచి విరాళిం జెంది యి ట్లనియె. 148

మ. శరదిందుప్రతిమానవక్త్రి వగునీసర్వాంగసౌందర్యముం
బరికింపం గనుపండు వై యలరు నోపద్మాయతాక్షీ ననున్
ధరణీనాథునిఁ బెండ్లియాడి దయ నాతాత్పర్యముం దీర్పవే
తరుణీరత్నమ వేఁడుచుంటి నన నాతన్వంగి తా ని ట్లనున్. 149

ఆ. దాశరాజుకూర్మితనయను గన్య న,న్నతఁడు నీ కొసఁగిన నగు వివాహ
మనుడు దాశరాజునంతికంబున కేగి, తనదుకోర్కెఁ దెలిపె జనవరుండు. 150

వ. శంతనుభూకాంతునకు దాశరా జి ట్లనియె. 151

క. నీ కియ్యోజనగంధికి, నాకొమరుని రాజుఁ జేయునటు లగునేనిన్
నాకన్నియఁ గొను మనఁ జిం,తాకులమతి యయ్యె నంత ధరణీశ్వరుఁడున్. 152

వ. దేవవ్రతునిం దలఁచి య ట్లొనర్ప నిచ్చ లేక నిష్ఫలప్రయత్నుం డై నిజరాజ
ధాని కేతెంచి కాంతావిరహానలమ్మున మ్రగ్గుచు నిద్రాహారములను బరిత్య
జించి నిట్టూర్పు పుచ్చుచుండె నప్పుడు. 153

ఉ. ఆత్రముతోడ శాంతనవుఁ డాతనిఁ గన్గొని పల్కె ని ట్లయో
శాత్రవు లెవ్వరేనియును సల్పఁగ లే దపరాధ మయ్య! లో
కత్రయ మేలునీకిటులు కందఁగఁ గుందఁగ నేల యన్న న
ప్పుత్రునితోడ ని ట్లనియె భూతలపాలుఁడు కామలోలుఁ డై. 154

క. ఇందుకులమున జనించితి, నెందులకుం గొఱఁత లేక యేలితి ఘనునిన్
నందనుని నిన్నుఁ గని యిపు, డందనిపండులకుఁ జాతు నట్టులు పుత్రా. 155

చ. తనయులఁ బెక్కుమందిఁ గనఁ దద్దయుఁ గోర్కె జనించె నాకు నో
తనయుఁడ దాశరాజసుతఁ దామరసాయతచారులోచనిన్

గనుఁగొనినంతనుండి యిటు కామశరంబునఁ జిక్కి యుంటి నా
జనకునితోడ నిట్లనియె శాంతనవుం డతిభక్తి మ్రొక్కియున్. 156

క. జనక! భవదీయవాంఛిత, మనువలరఁగఁ దీర్చువాఁడ నాసత్యవతిన్
గొని తెచ్చి నీ కొసంగెద, నని యమునాతీరమునకు నాతం డరిగెన్. 157

వ. అరిగి దాశరాజుం గాంచి గంధవతినిఁ దనతండ్రి కిమ్మనుడు సత్యవతికి జన్మించు నందనునకుఁ గౌరవరాజ్యలక్ష్మి నొసఁగునట్లు బాస చేసిన నిచ్చెద ననుదాశరాజునకు భాగీరథీపుత్త్రుం డిట్లనియె. 158

క. ఈరాజ్యము నే నొల్లను, ధీరుఁడు సత్యవతిసుతుఁడు దీనికి బ్రభువై
కౌరవవంశాభరణుం, డై రాజ్యం బేలి ప్రోచు నఖిలజనములన్. 159

చ. అనవుడు దాశరా జనె మహాత్ముఁడవై జనకాజ్ఞఁ దీర్ప ని
ట్లని వచియించి తీవు భవదాత్మజు లిందుల కొప్పువారలో
యనవుడు నాపగేయుఁ డనె నయ్య వచించెద బ్రహ్మచర్యమున్
గొనియెదఁ బెండ్లియాడ సుమకోమలి నీసుతఁ దండ్రి కీయవే. 160

వ. అనిన భీష్ము నెల్లరుం బ్రశంసించిరి సుర లాతనిపై విరులసోనం గురిసి రనంతరంబున గాంగేయుండు యోజనగంధినిఁ గనకరథంబుపై నెక్కించుకొని పోయి శంతనునకు వివాహ మొనర్చె నాతఁడు కుమారుని పితృభక్తికి మెచ్చి యతనికి స్వచ్ఛందమరణంబు గలుగ వరం బిచ్చె నంత. 161

తే. శంతనుఁడు సత్యవతియందు సరఁగఁ గాంచె, వెలయఁ జిత్రాంగద విచిత్రవీర్యసుతుల
వారిఁ గాంచి శంతనధరావల్లభుండు, పోయె స్వర్గధామమునకుఁ బుడమి విడిచి.

వ. అనంతరమ్మున సురనదీనందనుండు తల్లియనుమతిఁ జిత్రాంగదునకు రాజ్యాభిషేక మొనర్చె నంతఁ జిత్రాంగదుండు చిత్రాంగదుఁ డనుగంధర్వునితో సమరము సలిపి విగతజీవుఁ డగుటయు భీష్ముండు రాజ్యమున విచిత్రవీర్యు నభిషేకించి యనేకరాష్ట్రంబుల గెలిచి రాజ్యాభివృద్ధిఁ గావించి తమ్మునకు వివాహ మొనర్ప నెంచి. 163

తే. కాశిరాజేంద్రతనయల గజగమనల, నంబ యంబి కాంబాలిక లనెడువారి
సాల్వరాజాదులను గెల్చి సరగఁ దెచ్చి, యనుజునకు నిచ్చి పెండ్లి సేయఁగ దలంచె.

తే. అంబ సాల్వుని వరించినట్టి దాట, శాంతనవునకు నెఱిఁగించి సాల్వుదరికిఁ
బోయె సాల్వుఁడు వల దనఁ బూవుఁబోఁడి, హస్తిపురి కేగి భీష్మునకదియుఁ దెలిపె.

వ. అన్యాసక్తహృదయ వగునిన్ను నాతమ్మునకుఁ బెండ్లిసేయఁ బోమ్మన నంబ పరశురామునిదరి కేగి విన్నవించిన నాజామదగ్న్యుం డంబను దోడ్కొని భీష్ముని

దరి కేతెంచి దీని విచిత్రవీర్యునకుఁ బెండ్లిచేయు మన నతంafu నిరాకరింప శాంతనవపరశురాములు సంకులసమరం బొనర్చి రందు భీష్ముం డే జయమ్ముఁ గాంచె నంబ తపోవని కేగె నంత గాంగేయుం డంబికాంబాలికల విచిత్రవీర్యునకు వివాహ మొనర్చె నతండును. 166

క. ప్రేమాస్పదు డై యతులిత, కామాసక్తిం దనర్చి కాంతలయందున్
భూమీశుఁడు కొంతటిలోఁ, దా మేను వ్విడిచి స్వర్గధామము చేరెన్. 167

ఆ. అంత సత్యవతి నిజాత్మ విచారించి శాంతనవునితోడ సాధ్వి పలికె
నీవు పెండ్లియాడి నిలుపుము వంశవి, చ్ఛేద మయ్యె ననుచు ఖేదపడియె. 168

క. అనవుడు గంగానందనుఁ, డనియె జనని యిట్టు లాడ నగునే నీకున్
మును బ్రహ్మచర్యవ్రత మే, నొనరించెద ననుచుఁ బ్రతిన నుంటినిఁ గాదే 169

వ. అనిన సత్యవతి భీష్మాభిమతంబుగా వంశాభివృద్ధిం గోరి తనపుత్రుం డగు వేదవ్యాసుం దలఁచె నతండును. 170

—• వ్యాసానుగ్రహంబునఁ జిత్రాంగద విచిత్రవీర్యు లుద్భవించుట •—

క. మును లెల్లఁ గొల్వ వ్యాసుఁడు, చనుదెంచియు సత్యవతికి సద్భక్తిని మ్రొ
క్కినఁ గౌఁగిలించి యిట్లని, యనె నాగంధవతి యామహాత్మునితోడన్. 171

చ. తనయుఁడ వంశ మిట్టు లగుఁ దమ్మునిపత్నులయందు నీవు స
త్తనయులఁ గాంచి వంశమును దద్దయు నిల్పుము నాదునాజ్ఞ పై
ననవుడు మౌనినాథుఁ డగువ్యాసమహర్షి వచించె నమ్మ నీ
వనునటు లే నొనర్తు నన నందఱు సంతస మంది రయ్యెడన్. 172

వ. అంత వ్యాసుం డంబికయం దంధుం డగుధృతరాష్ట్రుని నంబాలికయందుఁ బాండుశరీరుం డగుఁ బాండురాజును దాసీకన్యయం దఖిలధర్మవిదుం డగువిదురునిం గాంచి తపోవని కేగె నాముగ్గురుబిడ్డలను సత్యవతీగాంగేయులు పెంచుచుండిరి పుట్టుగుడ్డగుధృతరాష్ట్రుండు రాజ్యపాలనార్హుండు కాడని భీష్ముండు పాండురాజునకు రాజ్యపట్టాభిషేక మొనర్చె నంత. 173

ఆ. అంత నదితనూజుఁ డాంబికేయునకును, బరిణయం బొనర్పఁ బరఁగఁ దలఁచి
సుబలతనయ వినుతసుగుణశీల యగుగాం,ధారిఁ దెచ్చి పెండ్లిఁ దగ నొనర్చె.

క. కరిపురసామ్రాజ్యంబును, బరిపాలనఁ జేయుపాండువసుధేశునకున్
బరిణయ మొనర్ప భీష్ముం, డరుదారఁగఁ దలఁచుచుండె నంతట మదిలోన్.

చ. అను వగుయాదవాన్వయమునం దుదయించినశూరశేనుఁ డా
తనిసుత కుంతిభోజునకుఁ దద్దయుఁ బెంపుడుపట్టి కుంతి యన్

వనజదళాయతాక్షి భగవానుని సేవ నొనర్చునట్టి దై
తనరి సమస్తదానములు ధర్మములుం బొనరించుచున్నెడన్. 176

క. మునిసోముఁడు దూర్వాసుఁడు, చనుదెంచి పృథాకుమారిసత్పరిచర్యల్
గొని యొసఁగె దేవవశ మా, ఘనమంత్రము నొక్కదానిఁ గడువేడుకతోన్.

తే. అంత నొక్కదినంబునఁ గుంతి గంగ, కరిగి మంత్రప్రభావము నరయఁ దలఁచి
సూర్యదేవు నారాధించె సుందరాంగి, భానుఁ డపుడు ప్రత్యక్షమై వచ్చి పలికె 178

క. ననుఁ గోరి పిలిచి యుంటివి, వనితా నీకోర్కెఁ దీర్చువాఁడ ననుచుఁ దా
నిని గలసె గర్భవతి యై, కనెఁ గర్ణునిఁ గుంతి యపుడు కడుచిత్రముగన్. 179

వ. దివాకరుం డామెకన్యాత్వము దూషితము గాకుండ వరంబిచ్చి చనె నంత. 180

క. లీల దివాకరుఁ బోలిన, బాలుని విడనాడ లేక బాలామణి యా
బాలుని మందసమున నిడి, యాలోఁ బడవైచె దాని నానదిలోనన్. 181

వ. కర్ణుం డమ్మందసమ్ముతో నధిరథుం డనుసూతునకు దొరికిన నతండు పుత్రహీ
నుండు కావున నాపుత్రుని సతి యగు రాధ కిచ్చి పెంచుచుండె నాఁటనుండియుఁ
గర్ణుండు రాధేయుం డనం బరఁగె. 182

క. కుంతీమాద్రుల నిర్వురఁ గాంతలఁ బెండ్లాడి భూమికాంతుఁడు పాండుం
డెంతయు నిజరాజ్యంబును, స్వాంత మలర నేలుచుండె జను లగ్గింపన్. 183

ఉ. పౌరవవంశభూషణుఁడు పాండునరేంద్రుఁడు ధర్మపద్ధతిన్
గౌరవపూజ్యరాజ్యమును గైకొని యేలుచు సర్వరాష్ట్రముల్
కోరికఁ జేసి గెల్చియును గోట్లు ధనంబు గ్రహించి తెచ్చి పెం
పారగ నిచ్చె నగ్రజున కాతఁ డొనర్చె ననేకయాగముల్. 184

మత్త. ధారుణీశ్వరుఁ డైనపాండుఁడు ధర్మపత్నులతోడఁ గాం
తారమందున వేఁటలాడఁగఁ దాల్మి మీఱఁగ నేగి తాఁ
గ్రూరమైనమృగావళిం గొని కూల్చుచున్ మిథునంబునై
మారుకేళినిఁ దేలులేళ్ళను మానవేంద్రుఁడు కాంచియున్. 185

క. ఆమృగమిథునము పైఁ బడ, భూమీంద్రుఁడు వేగబాణమును విడువంగా
నామిథునము శాపం బిడె, భూమీంద్రుఁడు సతినిఁ గూడఁ బొలియు నటంచున్.

మ. తనశాపంబుఁ దలంచి చింతిలుచు నాధాత్రీశ్వరుం డయ్యెడన్
దనవీటం గలబంధుమిత్రతతికిన్ దచ్ఛాపవృత్తాంతమున్
వినఁ గాఁ దెల్పి సతీసమేతుఁ డగుచున్ వేంచేసెఁ బెంగానకున్
మునిఁ బోలెం దపముం బొనర్చుకొననై పొల్పొంద వైరాగ్యమున్ 187

క. శతశృంగాద్రికిఁ బోయి, క్షితినాథుఁడు సతులతోడఁ జేరి నియతితోఁ
నతిదీక్షాపరుఁ డగుచున్, యతిఁ బోలెం దప మొనర్చె నతినిష్ఠమెయిన్. 188

వ. అంత నప్పాండుభూకాంతుండు కుంతిం గాంచి సంతాపించి కాంతా! పుత్త్రులు లేనివానికి గతులు లే వందురు కావున బ్రాహ్మణప్రసాదమునఁ బుత్త్రులఁ గాంచి నాకు గతులు గలిఁగింపు మన నాపృథాదేవి దేవవరంబున బుత్త్రులఁ గాంచెద నని నిజకాంతునిసంతాప ముడిపి. 189

క. యము నారాధించిన దా, కమలాక్షి యమప్రసాదగరిమంబునఁ గై
కొమరు యుధిష్ఠిరుఁ గాంచెను, విమలాంగుని సకలధర్మవిజ్ఞాననిధిన్. 190

వ. కాంచి మఱియును. 191

క. వాయువరంబునఁ గాంచెను, వాయుబలోపేతుఁ డైనవరనందనునిన్
శ్రీయుతుని భీమసేనునిఁ, దోయజదళనేత్రి కుంతి తోరముప్రీతిన్ 192

వ. భీముఁడు జన్మించినదినమ్మున గాంధారి దుర్యోధనుం గాంచి దినంబున కొక్కఁడుగాఁ గ్రమంబునఁ బుత్త్రశతలాభంబుఁ గాంచి దుస్సల యనునొక కూతుం గాంచె నంత. 193

చ. ఘనుఁడగు పాండుభూవిభుఁడు కాంతను గన్గొని యిట్లు పల్కె నో
వనజదళాయతాక్షి యలవాసవుఁ బోలినయట్టివానిన్
దనయునిఁ బొందఁ గోర్కె యనఁ దన్వి భజించెను శైలశాసనున్
వెనుక జనించె నర్జునుఁడు విక్రమమూర్తి మహేంద్రతుల్యుఁ డై. 194

క. ఆవెనుక మాద్రి పాండుక్ష్మావల్లభుఁ గాంచి ప్రాణకాంతుఁడ నాకుం
గావలయుఁ బుత్త్రు లనునెడ, భూవరుఁ డాకుంతి గాంచి పోఁడిమిఁ బలికెన్. 195

చ. తనయులు నీకుఁ గల్గి రిఁక దన్వికి మాద్రికి నాదుపంపునన్
దనయులఁ గల్గఁ జేయు మనఁ దామరసేక్షణ సమ్మతించి య
శ్వినులను గూర్చి యాజపము చేయు మటంచును జెప్పె మంత్రమున్
దనయులు కల్గి రిర్వు రలతామరసేక్షణ కవ్వరంబునన్. 196

వ. అశ్వినులవరప్రసాదమున మాద్రికి నకులసహదేవు లుద్భవించుటయు నామువ్వురు నీయిర్వురుం బంచపాండవు లన నొప్పి రంత నొకానొకదినంబున. 197

ఉత్సాహము. కుంతిదరిని లేనివేళ కురుకులేశ్వరుండు భూ
కాంతుఁ డైనపాండు డపుడు కామశరవిలోలుఁ డై
యింతి మాద్రితోడఁ గవియ నెంచె నామె వలదనన్
గొంతయేని వినక దానిఁ గూడె నిచ్చనంతటన్. 198

క. మానినిఁ గూడినపాండు, క్ష్మానాథుఁడు మేను దొఱఁగి స్వర్గము చేరం
గా నలమాద్రియు వేగమె, ప్రాణంబులు విడిచి తనదుపతినిం జేరెన్. 199

వ. అంతఁ గుంతియుఁ బాండవులును విచారించుచుండ మునులు వారలం గొని
పోయి హస్తిపురంబున ధృతరాష్ట్రభీష్మాదులకుఁ బాండురాజమరణవృత్తాంత
మెఱింగించి వారల నప్పగించి చని రంత నాంబికేయుండు సోదరమరణమ్మునకు
విలపించి యథావిధిగా నాతనికి శ్రాద్ధక్రియ లొనరించి యనేకదానధర్మము
లొనర్చె నయ్యవసరమ్మున. 200

తే. వ్యాసుఁ డరుదెంచి తల్లికిఁ బలికె నిట్లు, ధర్మమూర్తులు పాండురాట్తనయు లమ్మ
వీరు ధార్తరాష్ట్రులు మహాక్రూరు లగుట, వారికిని వీరికినిఁ గల్గు భండనంబు.

వ. నీ వీకులక్షయంబును జూడ లేవు కావునఁ దపోవని కేగు మన సత్యవతి కోడం
డ్రం గూడి తపోవనంబున కేగి మహానిష్ఠం దపం బొనర్చి కొంతలో మేను
దొఱఁగి స్వర్గారోహణ మొనర్చె. 202

—• పాండవుల వృత్తాంతము •—

చ. ఘను లగుఁబాండవేయులను గన్గొని యాధృతరాష్ట్రుఁ డెంతయే
ననువగుప్రేమఁ గన్గొనె ననారతముం దనపుత్రు లట్లు వా
రనయము గౌరవేశ్వరునియానతి మీఱక సేవఁ జేయుచున్
దనరిరి ప్రీతిపాత్రు లయి ధారుణిలోపల నెల్లవారికిన్. 203

క. ఘనబలవంతుని భీముని, మునుకొని వధియింప దుష్టబుద్ధిని దుర్యో
ధనుఁ డాత్మఁ దలఁచుచుండెను, దనతమ్ముల కెఱుఁగఁ జెప్పి తద్వాక్యంబుల్. 204

క. భీముని భీమాకారునిఁ, బాములఁ గఱపించి నీటఁ బడఁ ద్రోయించెన్
బాములు వెట్టియుఁ జంపం, గామి విషాన్నంబుఁ బెట్టెఁ గడుదుర్మతి యై. 205

వ. దుర్యోధనుండు భీమసేనుం జంప ననేకప్రయత్నము లొనర్చి విఫలమనోరథుం
డయ్యె నట్లు కురుపాండవులు కృపుం డనువానియొద్ద విద్యాభ్యాస మొనర్చు
చుండి రాకృపాదులవృత్తాంత మెట్టిదనిన. 206

క. ధర గౌతమమునిసూనుఁడు, పరఁగు శరద్వంతుఁ డనెడువానికిఁ బుత్రుం
డరయంగఁ గృపాచార్యుఁడు, వరపుత్రిక కృపియు వారు వఱలెడునంతన్. 207

తే. ధర భరద్వాజుఁ డనియెడుతాపసేంద్ర, సత్తనయుఁడు ద్రోణుఁడు కృపాచార్యుచెల్లె
లైనకృపిని వేడుకఁ బెండ్లియాడి యతఁడు, కనియెఁ దనయునశ్వత్థామయనెడువాని.

వ. భరద్వాజశిష్యుం డగుపృషతుం డనుపాంచాలదేశచక్రవర్తి తనకుమారుఁ డగు
ద్రుపదు నాభరద్వాజాశ్రమమునఁ జదువఁ బెట్టుటయు ద్రుపదుండును ద్రోణుం

డును నత్యంతస్నేహానురాంగబున భరద్వాజునొద్ద సమస్తవిద్యల నభ్యసించు
చుండిరి. 209

ఉ. అంతటఁ గొంతకాలమున కావృషతుండు సమస్తవిద్యలన్
వంతున కెక్కువాని గుణవంతుని నాద్రుపదాఖ్యుని న్మహా
శాంతునిఁ గొంచుఁ బోయి తనసర్వమహీతలరాజ్యలక్ష్మికిన్
సంతస మొప్ప నాథునిఁగ సల్పె ననల్పవిభూతి పేర్పడన్. 210

వ. ద్రోణాచార్యుఁడు పరశురామునివలన సమస్తధనుర్విద్యలను నేర్చి ననంతరంబ.

క. ఘనుఁ డగుద్రోణాచార్యుఁడు, తనబాల్యసఖుండు ద్రుపదు దర్శించి ధనం
బును గైకొనంగఁ దలఁచుచుఁ, జనెఁబాంచాలమ్మునకును సమ్మతితోడన్. 212

మ. ఘనుఁ డాచార్యుఁడు పోయి యాద్రుపదునిన్ గన్గొంచుఁ దా నిట్లనున్
విను నీబాల్యసఖుండ ద్రోణుఁడను నే విత్తార్థినై వచ్చితిన్
జననాథా! ధన మిచ్చి నన్నుఁ గరుణాస్వాంతుండవై ప్రోవవే
యనఁ బాంచాలనరేంద్రుఁ డిట్లనియె రాజ్యాంధుండు గర్వాంధుఁడై 213

క. నిను నే నెన్నఁడుఁ గానీ, వినియుఁ గనియు నెఱుఁగఁ బేద విప్రుఁడ వీవున్
జననాథుండను నే నీ, మన కెట్లు సఖిత్వ మిట్టిమాటలు తగునే. 214

వ. అని పొమ్మనుటయు నట్లు ద్రుపదునిచేఁ బరిభవింపంబడి ద్రోణాచార్యుఁడు సతీసుతులతో హస్తినాపురి కేగిన నాతనిధనుర్విద్యాకౌశలంబున కచ్చెరు వంది భీష్ముండు తనపౌత్రులఁ గురుపాండవుల నతనికి శిష్యులుగాఁ జేసి యస్త్రశస్త్రాది విద్యలు నేర్పించుచుండె. 215

క. గురు వగుద్రోణుఁడు ద్రుపదునిఁ, బరిభవ మొనరింప నెంచి వజ్రిసుతున కె
ల్లరకన్న నధికవిద్యల, ననుదారఁగఁ జెప్పుచుండె నతిదయతోడన్. 216

వ. అయ్యవసరమ్మున. 217

తే. ధర హిరణ్యధన్వుం డనునెఱుకరాజు, తనయుఁ డేకలవ్యుం డనఁ దనరునాతఁ
డస్త్రశస్త్రవిద్యాదుల నభ్యసింపఁ, దలఁచి ద్రోణున కెఱిఁగించెఁ దనదుకోర్కి.

వ. ద్రోణుం డేకలవ్యుని నిరసించిన, వాఁ డడవికిం బోయి మంటితో ద్రోణవిగ్రహము గావించి విలువిద్య నభ్యసించినఁ గాంచి పాకశాసననందనుం డావార్త యాచార్యున కెఱింగించిన ద్రోణుం డేకలవ్యునిదరి కేగి నీ వెవ్వండ వన నతండు నేను నీశిష్యుండ నేకలవ్యుఁడనువాఁడ నని యెఱింగించిన ద్రోణుఁడు వానిదక్షిణాంగుష్ఠము గురుదక్షిణగాఁ గొని యేతెంచి కురుపాండవులకు విలువిద్య గఱపుచుండె నంత. 219

సీ. ధార్తరాష్ట్రులు పాండుధరణీశనందనుల్, సకలాస్త్రవిద్యలు సాంతముగను
నేరిచినంతట వారలవిద్యలఁ, దిలకింపఁ గా నెంచి చెలువుమీఱ
ధృతరాష్ట్రుఁ డొకసభఁ దొడరినిర్మించెను, గుంతి గాంధారులు కోర్కి వారిఁ
జూడ నేతెంచి రానాఁడు సభాసదుల్, విచ్చేసి రెంతయు హెచ్చుగాఁగ
తే. భీమదుర్యోధనుల్ మహాభీకరముగ, నలిపి రట గదాయుద్ధ మాచార్యునాజ్ఞ
భీమసేనువిక్రమమును వినుతిఁ జేసి, రెల్లవారికి నుల్లము వల్లవించె. 220
తే. అర్జునుఁడు ధనుర్విద్యాదు లందఱకును, జూప రంగస్థలమునకుఁ జొచ్చె నంత
సహజకవచకుండలుఁడును స్వర్ణవర్ణుఁ, డైనకర్ణుఁ డేతెంచెఁ దా నప్పు డటకు.
వ. కర్ణార్జును లిర్వురును ద్వంద్వయుద్ధ మొనర్చి యొకరికన్న నొకరధికపౌరుషమ్మున నలరుచుఁ జూపఱ నానందసాగరనిమగ్నులఁ జేయుచుండి రందలివా రెల్ల నర్జునుం గాంచి. 222

—కురుపాండవుల యస్త్రశస్త్ర ప్రదర్శనము—

క. వీఁడు మహేంద్రతనూజుఁడు, వీఁడు సమర్థుండు లోకవీరుఁడు వీఁడే
వీఁడు మహాస్త్రాభిజ్ఞుఁడు, వీఁడు మహాత్ముఁ డని పార్థు వినుతించి రొగిన్. 223
తే. అంత దుర్యోధనుండు నిజాత్మఁ గర్ణు, శక్తి కచ్చెరు వందుచు సంతసమున
నతని నంగరాజ్య మొసంగి యంతలోనఁ, జేసెఁ బట్టాభిషేకము స్నేహ మలర.
వ. సూతుం డేతెంచి నూతనరాజ్యలాభ మందిన కర్ణు నాలింగన మొనర్చుకొనియె నంత భీమసేనుఁడు సూతపుత్రునకు రాజ్య మిచ్చు టేల యనిన దుష్టబుద్ధి యగుదుర్యోధనుం డిట్లను గర్ణున కంగమహీశ్వరత్వ మే కాదు నాసర్వమహీశ్వరత్వ మైన నిత్తుఁ గాక నాకుఁ గూర్చువాఁ డితఁ డనియె నంత నెల్లవారుం దమతమతావుల కేగిరి. దుర్యోధనుఁడు కర్ణునితోఁ దనమందిరమున కేగె. 225
తే. సహజకవచకుండలుఁడును స్వర్ణవర్ణుఁ, డరుణసమతేజుఁ డగుకర్ణు నరసి కుంతి
తనసుతుం డని మదిలోనఁ దా నెఱింగి, యెఱుఁగ నట్లు చరించె నయ్యిందువదన.
చ. అరయఁగ నొక్కనాఁడు గురుఁ డందఱ శిష్యులఁ జేరఁ బిల్చి నే
గురుఁడను నాకు దక్షిణను గోర్కి నొసంగఁ దలంతు రేని మీ
రరుగుఁడు సోమకుం డనెడునాద్రుపదాఖ్యునిఁ బట్టి తెం డిదే
పరమహితంబు గైకొనెడువాఁడను దక్షిణ నంచుఁ బల్కినన్. 227
క. గురువాక్యంబులు విని యా, కురునందను లెల్ల ద్రుపదుఁ గొని వచ్చుటకై
యరిగిరి పాంచాలమునకుఁ, బరమోత్సాహంబుతోడ బలములతోడన్. 228

 

వ. కౌరవపుత్త్రశతమ్ము ద్రుపదావనీశుం దాఁకి యాతని తీవ్రశరమ్ములకుఁ దాళ లేక నిష్ఫలప్రయత్నులై పాండవులదరి కేతెంచి రయ్యవసరమ్మున. 229

చ. సురవరనందనుండు రణశూరుఁడు గొంతికిఁ గూర్చుపుత్త్రుఁడా
సురుచిరరూపవంతుఁడు విశుద్ధమనస్కుఁడు భారతాన్వయా
భరణుఁడు శత్రుభీకరుఁడు ఫాల్గుణుఁ డాద్రుపదాధినాథుతో
దుర మొనరించి పట్టుకొని ద్రోణునిముందటఁ దెచ్చి పెట్టినన్. 230

క. కని యాచార్యుఁడు శిష్యుని, వినుతించుచు ద్రుపదుఁ గాంచి పృథ్వీనాథా
నను ద్రోణుని నెఱుఁగుదువే, ఘనుఁడవు పట్టుపడినావె కటకట యనియెన్. 231

వ. అని గేలి చేసి యాచార్యుండు ద్రుపదుని విడిచి యర్జునుం బ్రశంసించె నంత నాంబికేయుండు భీష్మానుమతుం డై కౌంతేయాగ్రజుఁ డగుధర్మరాజును సకల మహీచక్రమునకు యువరాజుగాఁ జేసె నతనితమ్ములు నల్వురు నానాదేశాధీశులఁ గెల్చి ధనంబు దెచ్చి యుధిష్ఠిరున కర్పించుచుండి రయ్యవసరమ్మున. 232

ఉ. క్రూరసుయోధనుం డపుడు కొందల మందుచుఁ దండ్రిపాలికిన్
జేరి వచించె నిట్టు లని చిత్తమునందు విషాద మొప్పఁ గాఁ
గౌరవనాథ ధర్మజుని క్ష్మాతలనాథునిఁ జేసి యుంటి వీ
పౌరులు వారియందునన భక్తి మెలంగుచు నుందు రెప్పుడున్. 233

మత్త. వార లెల్లఁ బరాక్రమక్రమవంతు లౌటను నే సదా
వారికిఁ భయ మందుచుందును వారిసంతతివారికే
పౌరవాన్వయరాజ్యమెల్లను వచ్చుచుండును గావునన్
వారణావతమందు నుంచుము వారిఁ గొన్ని దినంబులన్. 234

చ. అన ధృతరాష్ట్రుఁ డెంతయును నాత్మ విచారము నొంది పల్కె నా
యనుజుఁడు పాండుపుత్త్రకుల నక్కట నే నెటు పాసి యుందు నిం
దనియుఁ గుమారువాక్యముల నవ్వలఁ ద్రోయఁగ లేక పాండునం
దనులను వారణావత ముదారత నేలఁగఁ బంపెఁ బంపినన్. 235

ఉ. భారతవంశభూషణులు పాండునరేంద్రకుమారశేఖరుల్
మారసమానులై నమతిమంతులు ధర్మగుణైకమానసుల్
భూరిపరాక్రముల్ సుగుణభూషణభూషితు లిందువంశజుల్
వారలు వారణావతమువద్దకుఁ బోయిరి మాతృదేవితోఁ. 236

వ. అంత దుర్యోధనుండు పురోచనుం డనుసఖుం జేరి వారణావతంబున లక్కయిల్లు నిర్మించి పాండవుల నందుఁ బ్రవేశపెట్టి యెరు లెఱుంగకుండ దానికిఁ జిచ్చు

వెట్టిరా వలయుఁ బాండవులు సమసినఁ జతుస్సముద్ర ముద్రితమహీమండలము నిరాటంకంబుగ నేన యేలెద నని వానిఁ బంపించుటయు. 237

—• లాక్షాగృహదహనము •—

ఆ. ఆపురోచనాఖ్యుఁ డావారణాసిలో, లక్కయిలు రచించె లలితగతులఁ
బాండవేయులందు వసియించి దానధ, ర్మము లొనర్చు చంద్రవిమలయశులు. 238

వ. అంత విదురుం డీవృత్తాంతము విని పాండవులు నిష్కారణముగాఁ బొలియుదురని విచారించి యొకవీరున కీవృత్తాంత మాద్యంతంబు విన్నవించి పాండవుల నెట్లైన రక్షింపు మని పంచిన నాతండు వారణావతమున కేగి లక్కయింటినుండి పాండవులు పోవుటకు రహస్యముగ నొకసొరంగము నిర్మించె. 239

చ. పరమపవిత్రమూర్తు లగుపాండుతనూభవు లాసొరంగమున్
విరివిగ దాఁటి పోవునెడ భీముఁడు కిన్కఁ బురోచనాఖ్య మం
దిరమున కగ్ని పెట్టి చనెఁ ద్రెళ్లె పురోచనుఁ డంత నయ్యెడన్
బురజను లెల్ల దుఃఖమును బొందిరి పార్థులు చచ్చి రంచెదన్. 240

వ. ఏవురుపుత్రులతో నిషాదవనిత లాక్షాగృహాకవాటంబున భస్మీభూతం బైన నెల్లరుఁ గుంతీపాండవులు చచ్చిరని చెప్పికొనువార్త హస్తినాపురికిఁ దెలియ గురుభీష్మవిదురధృతరాష్ట్రులు పాండవులకై మిక్కిలి విచారించి యుత్తరక్రియల నెఱవేర్చి రంత. 241

సీ. పాండుకుమారు లవ్వేల లక్కయిలు వీడి, చేరిరి యొక్కకాంతారమునకు
వటభూరుహముక్రింద వారు నిద్రింపఁగ, భీముఁడు నిద్రను విడిచి వారిఁ
గాచుచునుండ రక్కసుఁడు హిడింబుఁడు, మనుజమాంసముఁ దిన మదిఁ దలంచి
తనసోదరిని హిడింబను జీరి వారలఁ, జంపి తె మ్మతివ మాంసంబుఁ దిందు

తే. మనుచుఁ బంపించిన హిడింబ చనెను వారిఁ, జంప నట కేగి భీమునిసొంపుఁ గాంచి
వారలను జంప నొల్లక మారుతిఁ గని, నన్ను వరియింపు మనుచును విన్నవించి.

చ. మనసిజరాగమగ్న యయి మాటికి వేఁడుచునున్న దాన నో
మనసిజరూప! న న్నిపుడు మానక పెండిలియాడు మే హిడిం
బను విను నాదునన్న మిముఁ బట్టివధింపు మటంచుఁ బల్కె నే
నినుఁ గని మోహ మందితిని నీసతి నయ్యెద నోమనోహరా! 243

సీ. అనుహిడింబకు భీముఁ డనె నిట్లు రక్కసి, వనితవు నా కేల చను పోవలకు
నని పల్కునెడ హిడింబాసురుం డేతెంచి, బలుకోప మొంది యవ్వాయుసుతుని

గ్రమింగ నేతెంచె సమీరకుమారుఁడు, భీముఁ డారక్కసుఁ బీచ మడఁచె
నంత నిద్రితు లైనకుంతియుఁ దనయులు, లేచి ముందటఁ గలలేమఁ గాంచి
తే. తెలుప! నీదువృత్తాంతము దెలియఁ జేయు, మనహిడింబతనదువృత్తమును దెలుపుచు
భీమసేనునకును నన్నుఁ బెండ్లిసేయు, మనుచు వేఁడెను గుంతిని వినయ మలర.

—• భీముఁడు హిడింబుని సంహరించి హిడింబను బెండ్లియాడుట. •—

ఉ. అంతట బాదరాయణమహాముని యచ్చటి కేగుదెంచి యా
కుంతినిఁ గాంచి యి ట్లనియెఁ గోడల! యిప్పుడు భీమసేనుఁ డీ
కాంతను బెండ్లియాడఁ దగుఁ గా దన కుండఁగ దీనియందునన్
వంతున కెక్కువాఁడు బలవంతుఁడు పుత్త్రుఁడు కల్గుఁ గావునన్. 245

వ. అని కృష్ణద్వైపాయనుండు పాండవులం గాంచి మీకు హిత ముపదేశింప వచ్చితి మీరు విప్రవేషధారులై యేకచక్రపురి కేగుఁడు కౌరవులు మి మ్మెన్ని వెతలపాలుచేసినను మీకు తుదకు రాజ్యలాభము గాని చిరకాలము వర్ధిల్లుదు రని యంతర్హితుం డయ్యె భీముండు హిడింబను బెండ్లాడి దానియందు వివిధ మాయావిద్యాకుశలుండును గామరూపుండును నగుఘటోత్కచుం డనునంద నుం గాంచె నతండు మీరు తలఁచినప్పు డరుదెంతు నని తల్లిం దోడ్కొని పోయె నంత. 246

సీ. ఆవ్యాసభట్టారకాజ్ఞానుమతు లైన, పాండుకుమారులు భవ్యమూర్తు
లేకచక్రపురికి నేగి యచ్చట నొక, విప్రగేహంబున విడిసి వారు
బ్రాహ్మణవేషముల్ వైచి వేదాదులు, పఠియించుచుండిరి వడుగు లట్లు
భిక్షాన్నమును దెచ్చి వెన భుజియించుచుఁ, గడపిరి కొన్నినాళ్ కష్టమునను
తే. అకట భూలోకదేవేంద్రుఁ డట్టివాని, కాత్మజాతు లై పాండవు లాపురమున
బిచ్చ మెత్తుక జీవింప వచ్చె నకట, దైవమాయను దప్పింపఁ దరము గాదు.
తే. అంత బలవంతుఁ డగుభీముఁ డాపురమున, మనుజులను సంహరించెడుదనుజవీరుఁ
డగుబకాసురు వధియించి యచటివారి, కెల్లరకు సౌఖ్యమును గూర్చె నంతయేని.
వ. బకాసురాంతకుం డగువృకోదరు నేకచక్రపురపౌరులు మిక్కిలిప్రశంసించి రంత.
క. ఘను లైనపాండవేయులు, వినుతసుగుణశీలు రగుచు విలసిలి యాప్రో
లను గౌరవంబుఁ గాంచుచుఁ, దన రారిరి విప్రునింట ధర్మవిచారుల్. 250
వ. అయ్యవసరమ్మున. 251
తే. ధరణిఁ బాంచాల మనుపేర ధన్య మైన, దేశమున ద్రుపదాఖ్యుండు తేజ మలరఁ
దనదురాజ్యము నేలుచు జనులఁ బ్రేమఁ, దండ్రివలెఁ బ్రోచుచుండెను దగినపగిది.

వ. ఆద్రుపదమహీజాని తన్నుఁ బరిభవించినద్రోణాచార్యులను వధింపఁ దగు పుత్రుండును దనకన్న బలీయుఁ డగునర్జునునకుఁ బరియణయ మొనర్పఁ దగు పుత్రికను బడయఁ గోరి యాజోపయాజు లను కాశ్యపుల నుపాసించి యి ట్లనియె.

తే. ద్రోణు వధియింపఁ జాలుపుత్రు నీఁ బవిత్రు, నర్జునునకుఁ బత్నిగఁ జేయ నట్టిపుత్రిఁ బడయఁ గాఁ గోరి నాచిత్తపద్మమందు, మిమ్ము నర్థింప వచ్చితి మీకరుణకు.

క. అని ద్రుపదుండు వచించిన, నని రాయాజోపయాజు లాతనితోడన్
ఘనతరమఖ మొనరింపుము, జననాయక తత్ఫలంబుఁ జయ్యనఁ గలుగున్. 255

—• ద్రౌపదీవృత్తాంతము •—

వ. అనిన వారియాజ్ఞ శిరసావహించి ద్రుపదుండు పుత్రకామేష్టి చేయునపు డభిమంత్రించిన హవిస్సు నయ్యగ్నిహోత్రములో వేయుటయు నయ్యవసరంబున.

తే. కవచకుండలములతోడఁ గ్రాలువాఁడు, సశ్త్రశస్త్రాదులును గల్గినట్టివాఁడు
ఘనరథాశ్వగజంబులుఁ గలుగువాఁడు, తనరె నందు ధృష్టద్యుమ్నుఁ డనెడువాఁడు.

తే. త్రిజగములు నిజకాంతిచేఁ దేజరిల్ల, సాటిలేనిసౌందర్యము సాటిలేని
పరమసాధ్వీమమత్వము పరఁగియున్న, తరుణి ద్రౌపది జన్మించెఁ దక్షణమున.

క. అంతట ద్రుపదమహీశ్వరుఁ, డెంతో మోదంబుతోడ నెసఁగుచు మఖమున్
సాంతముగాఁ నొనరించెను, స్వాంతంబునఁ జింత లుడిగి సదమలమతి యై. 259

తే. కవలకును నామకరణముల్ గ్రాలఁ జేసె, శౌర్యధనఖనియును నతిచతురుఁ డగుటఁ
దనయునకును ధృష్టద్యుమ్నుఁ డనెడు పేరు తనయకును గృష్ణయనుచును ఘనత మీఱ.

తే. ద్రుపదనందన కావున ద్రౌపదియును, గృష్ణవర్ణిని కావునఁ గృష్ణ యనఁగ
యజ్ఞసేనునిసుతయౌట యాజ్ఞసేని, పరఁగఁ బాంచాలి యనుచు ద్రౌపదికిఁ బేర్లు.

వ. పాంచాలేంద్రుం డగుద్రుపదుండు మఖజనితు లగు బిడ్డల ద్రౌపదీధృష్టద్యుమ్నులఁ గడుగారాబమునఁ బెంచుచు వారిఁ గాంచి యానందించుచుండె ధృష్టద్యుమ్నుఁడు ద్రోణాచార్యుల యొద్ద కేగి విద్యాభ్యాస మొనర్చుచుండెఁ బాంచాలియు. 262

సీ. జగదేకవిఖ్యాతసౌందర్యరాశి యై, సుగుణాలవాల యై సొంపు మీఱె
దానదయాసత్యధర్మకర్మములను, భూషలఁ బోలెఁ దాల్చి పొలుపు మీఱె
పెద్దలందలిభక్తి పిన్నలందలిప్రేమ, గలిగి మహోన్నతిఁ జెలువు మీఱె
పరమసాధ్వీమణి మఱి యయోనిజ యని, జననుతిపాత్రి యై ఘనత మీఱె

తే. అట్టిద్రౌపది సర్వవిద్యాధురీణ, సుగుణవర్ణిత లోకైకశుద్ధచరిత
పరిణయోచిత యైనంతఁ బార్థివుండు, సుతస్వయంవర మొనరింప మతిఁ దలంచె

వ. అయ్యవసరమ్మున నర్జునుండు గూఢప్రచారంబున నుంటం జేసి. 264
క. బంగారుమత్స్యయంత్రము, శృంగారంబుగ నొనర్చి క్షితినాథుండున్
రంగున దీనిన్ వేసిన, సంగనఁ బాంచాలి నిత్తు నతనికి సతిఁ గాన్. 265
క. అని నిశ్చయించి ద్రుపదుఁడు, వనితస్వయంవర మటంచు వరదేశములం
దునఁ బ్రకటనమున్ సలిపెను,జననసుతుఁ డర్జునునికొఱకు సకలము వెదకెన్. 266
ఆ. అర్జునుండు తప్ప నన్యు లీయంత్రము, విఱుగఁ జేయ లేరు పృథివిలోన
నతఁడె వచ్చి విఱుచు నదిగాక యొకనికి, యాజ్ఞసేని నొసఁగ నని వచించె. 267
వ. ఆస్వయంవరమ్మున కేతెంచినరారాజులతోఁబాటు ధనంజయుం డేతెంచు వారు లాక్షాగృహమున దహనముగా రని తలంచి వివాహప్రయత్నము లొనర్చుచుండె నయ్యవసరంబున. 268
ఆ. పాండురాజసుతులు పరమపవిత్రులు, విప్రవేషములను వెలయఁ దాల్చి
ద్రౌపదీస్వయంవరము విని జనయిత్రి, కుంతితోడ ననిరి కోర్కు లలర. 269
క. జననీ! కృష్ణస్వయంవర, మును జూడఁగఁ ద్రుపదపురికిఁ బోవుద మని వా
రనవుడుఁ గుంతి ముదంబునఁ, జనియెం గాంపిల్యమునకు సత్తనయులతోన్. 270
వ. పాండవులు ధౌమ్యునిఁ బురోహితునిఁగా వరించి యర్జునుం డంగారపర్ణుని జయించి బ్రాహ్మణవేషములతో వారు రాజన్యుల సమక్షమున నాసీనులై యుండ ద్రుపదమహీకాంతుండు స్వయంవరరంగమ్మున బంగారుమత్స్యయంత్రంబునుంచి దానిని గ్రింద నుదకములో నాలోకించి పైనున్నమత్స్యము నేయ వలయు నని యెల్లరు వినఁ జెప్పిన రాజేంద్రు లెల్లరు లేచి. 271

—•అర్జునుండు మత్స్యయంత్రంబు దెగనేయుట•—

క. ఆయంత్రము శక్తిం దెగ, నేయఁ బ్రయత్నించి యేయ నేరక వారల్
పాయనివిచార మొందుచు, నేయెడవా రాయెడలకు నేగినమీఁదన్. 272
క. రాధాతనయుఁడు సూతకు, లాధారుం డైనకర్ణుఁ డప్పుడు తా దు
ర్యోధనబోధితుఁ డగుచున్, వే ధనువుం బూని శక్తి వేయఁగఁ బోయెన్. 273
తే. పరఁగఁ బాంచాలి యిట్లని పలికె నపుడు, సూతసుతుఁ డగుకర్ణుని భూతలమున
నేను వరియింపఁ జాలను గాన యంత్ర, మేయఁ గా రాదు మరల నాసీక్షణంబ.
క. అని ద్రౌపది వచియించుట, విని కర్ణుఁడు సిఁకతోడ వెనుకకు మరలెన్
జనవరు లెల్లరు సిగ్గునఁ, జనఁ జొచ్చిరి పీండ్ల కట్టినమయములోనన్. 275
మ. వెలయన్ బ్రాహ్మణవేషభాషలు ధనుర్విద్యాధురీణుండునై
తెలియన్ బాండవవంశసోముఁడు జగద్వీరుండు శూరుండు నా

జలజాతాప్తునిమిత్రుఁ డర్జునుఁడు తాసంప్రీతితోఁ గొంచు విల్
జలమందుం గని మత్స్యయంత్రము రహిన్ క్ష్మామండలిం గూల్చినన్. 276

క. యంత్రముఁ గూల్చినపార్థుని, మంత్రులు బంధులును ద్రుపదమహీనాథుండున్
మంత్రములను మెచ్చియు విను, తంత్రు సభాస్థలములందుఁ దెలియఁగ వేడ్కన్.

వ. అంత ధృష్టద్యుమ్నప్రేషితురా లగుపాంచాలి సర్వాభరణాలంకృతురాలై కరంబున మాల్యము ధరించి సమస్తరాజన్యులుఁ గనుఁగొనుచుండ భూసురునిం బోలె భాసిలుధర్మరాజానుజుం డగునర్జునునికంఠమున హారము శృంగారించి కరగ్రహణ మొనర్ప సురలు విరులవానం గురిసిరి. పాండవులు ద్రౌపదీసహితులై నివాసగేహమున కేగి కుంతిదేవి కిట్లనిరి. 278

క. అమ్మా భిక్షము గొని మే, మిమ్మెయి వచ్చితి మటంచు నెఱిఁగించిన నా
యమ్మ కుమారులతోఁ గై, కొమ్మనె నేవురను గూడఁ గూరిమితోడన్. 279

తే. భిక్ష మన ఫల మని పాండవేయజనని, మదిఁ దలంచి పాండవులను సదమలమతిఁ
గొనుఁడనుచు ద్రౌపదిని రాజతనయఁ గాంచి, తనయులనుజూచియిట్లనెమనములలర.

క. ఈకాంతామణి యెవ్వరొ, నాకివు దెఱిఁగింపరయ్య నాసుతులారా
యాకుంతి యట్లుపలికిన, నాకొమరులు పలికి రిట్టు లాజనని కొగిన్. 281

తే. మత్స్యయంత్రము దెగనేసి మచ్చెకంటిఁ
గైకొనుచు వచ్చితి మటంచుఁ గ్రమము మీఱఁ
దెలుపునెడఁ జింతతోఁ గుంతి పలికె నపుడు
తనయులార! చూడక వేఱ తలఁచియుంటి. 282

క. ఫల మనఁ గన్నియ యని యే, దెలియక నే మోసపోయితిని సుతులారా
ఫలమిట్టు లయ్యె నే మని, పలుకుదు నేవురు వరింప వలెఁ బాంచాలిన్. 283

తే. తల్లిమాటను దప్పినఁ దనయులకును, ధర్మమే లేదు జగతిలోఁ దనయులార
నాదునాజ్ఞానుసారులై మోద మలరఁ, బెండ్లియాడుఁడీకృష్ణను బ్రేమ మలర. 284

తే. అనిన ధర్మజుఁ డిట్లు పార్థునకుఁ బలికె, నీవె తెచ్చితిఁ గావున నీరజాక్షిఁ
బార్థనీవె వరించు యథార్థ మనిన, విజయుఁ డిట్లని పల్కె ధర్మజునితోడ. 285

వ. అన్నా నీవు జ్యేష్ఠుండవు శ్రేష్ఠుండవు నీవే యీపూవుఁబోఁడిని వరింపు మన నజాతశత్రుఁ డిట్లనియె. నర్జునా! మున్ను నేను వేదవ్యాసునివలన ద్రౌపదీపూర్వజన్మవృత్తాంతము వింటి దైవశాసనంబున నేవురు పతులుం దప్పరు కావునఁ దల్లివాక్యము సత్యము గావించి మన మేవుర మీమెను వరింత మన నెల్లరు సంతసించిరి. 286

క. అంతటఁ బాంచాలేశ్వరుఁ, డింతినిఁ గైకొన్న యాతఁ డెట్టిఁడొ యనుచున్
స్వాంతంబునఁ దలఁపోయుచుఁ, జింతాకులుఁ డయ్యె నతఁడు చిత్తము కలఁగన్.
క. వేదవ్యాసమునీంద్రుం, డాదరమున వచ్చి ద్రుపదు నవలోకించెన్
మేదినినాథుఁడు వ్యాసుని, పాదములకు భక్తి మ్రొక్కి పల్కె నిటులుగన్. 288
తే. అనఘ! నీరాక నేను కృతార్థుఁ డైతి, జన్మసార్థకతయుఁ గంటి జగతిలోన
ననుచుఁ గృష్ణస్వయంవరమును దెలిపిన, నాత్మదృష్టిని వీక్షించి వ్యాసుఁ డనియె.
వ. రాజేంద్రా! పాంచాలిని మత్స్యయంత్రము నైచి స్వీకరించినవాఁ డర్జునుండు నీకు మారిత పంచపాండవులకు దైవశాసనమున ధర్మపత్ని యగు నీవు సందేహింపక నామెను ధర్మజభీమార్జున నకులసహదేవులకుఁ బాణిగ్రహణ మొనరింపుము నీకూఁతుపూర్వజన్మవృత్తాంత మెఱింగింతు నాలింపుము. 290
ఆ. తనదుజీవితమ్ము దగబ్రహ్మచర్యన, తము నొనర్చిననట్టి తపసికన్య
శివునిఁ గూర్చి తపము చేసె ఘోరంబుగా, హరుఁడు వచ్చె నప్పు డామెకడకు.
చ. వర మది యేది కోరితివొ వారిజలోచన తెల్పు మన్న నా
వరమునికన్య యీశ్వరునిపాదసరోరుహముం భజించుచున్
వరము నొసంగు నాకుఁ బతివాంఛిత మంచును నేను మాఁ ర్లనన్
హరుఁ డటు లౌను నీ కనుచు నానతి నిచ్చె మునీంద్రకన్యకున్. 292
వ. జీవితాంతమ్మున నమ్మునికన్య నీగృహమ్మున యజ్ఞకుండమ్మున ద్రౌపదియై జన్మించె శివశాసనమున దానికిఁ బతు లేవురు తప్పరు కావునఁ బాండుపుత్రుల కియ్యండజయాన నొసంగి వివాహ మొనర్పుము మఱియును. 293
ఆ. పాండవేయు లనఁగఁ బరఁగ దేవాంశసం, భవులు లోకనుతులు భవ్యమతులు
కురుకులాభరణులు కుంతీతనూజులు, వారి కొసఁగు సుతనుఁ బార్థివేంద్ర. 294
వ. అని చెప్పి పారాశర్యుం డంతర్హితుం డైనంత. 295
ఉ. నావుడు సోమకుండును మనంబునఁ జింతిలి దైవనిర్మితిన్
బావనగాత్రిఁ బాండవులపత్నినిఁ జేయఁగ నిశ్చయించి సం
భావితకీర్తిఁ బాండవులు వచ్చుటకై తనవారి నంపఁగా
నేవురు కృష్ణతో నలమహీశునివద్దకు నేగుదెంచినన్. 296
వ. పాంచాలధరానాథుండు పాండవుల గౌరవించి బంధుమిత్రుల రావించి సర్వభూషణాలంకృత యగు ద్రౌపదినిఁ బంచపాండవులకుఁ గన్యాదానము చేసి యథావిధిఁ బాణిగ్రహణమహోత్సవము నెఱవేర్చి సబహుమానంబుగా బంధుమిత్రుల వీడ్కొలిపి కుంతీపాండవులకుఁ గానుక లొసంగి తనయింట నుంచుకొనియె. 497

సతి కొడుకులతో, నింతులమేల్బంతి ద్రౌపదీసతితోఁ దా
తయు సంతసమున భూ, కాంతుం డగుద్రుపదునింట గౌరవ మందెన్. 298

వరమతులైనపాండవులు వారలు నాఁ డలలక్కయింటిలో
నురవడిఁ జావ లేదనుచు నొక్కవదంతి యెసంగె మత్స్యమున్
నరుఁ డిలఁ గూల్చినాఁడు నళినాక్షిని ద్రౌపదిని న్వరించి యే
వురు ద్రుపదేశగేహమునఁ బొల్చి రటంచు వినంగ వచ్చినన్. 299

వ. పాండవులు జీవించి రని విని కర్ణదుర్యోధనదుశ్శాసనాదులు మహావిచారమన
స్కులై యుండ ధృతరాష్ట్రానుజుం డగువిదురుండు సామవచనంబుల ధృతరా
ష్ట్రుని కిట్లనియె. 300

సీ. నీపుత్రులును బోలె నాపాండుపుత్రుల, మన్నింప వలె నీవు మహితమతిని
దుర్యోధనునిమీఁద దుర్మోహమును జేసి, పాండవులకు వెతల్ పఱపితీవు
జాతుషగృహమునఁ జంపింపఁ దలఁచిన, పుత్రఘాతుకుఁడవు పుడమి నీవు
వీరు వా రనుచును వారు వీ రనుచును, భేద ముండఁగరాదు వేరికైనఁ
తే. గాన నామాటలను విని కౌరవేంద్ర, పాండవులఁ దోడుకొని వచ్చి వైభవమున
వారిరాజ్యము సగమును వారి కిమ్ము, దుష్టచింతాబ్ధి దరియింపు మిష్టమునను.

క. అనిన విదురోపదేశం,బును విని ధృతరాష్ట్రుఁ డనియెఁ బొ మ్మట కీ వా
జననిని సతినిం గూడుక, చనుదె మ్మను బాండవులను జయ్యన నిటకున్. 302

తే. అనినవిదురుఁడుపాంచాలమునకుఁబోయి,సోమకునియింటఁ గుంతినిఁద్రోపమీఁటఁ
బాండవులఁగాంచి ధృతరాష్ట్రువంపువలన, మిమ్ముఁ గొనిపోవ వచ్చితి మేలుగోరి.

వ. అనినఁ బాండవులు విదురునకు మ్రొక్కి ద్రుపదమహీశునాజ్ఞం గొని కుంతీద్రౌ
పదీసమేతముగా ధృతరాష్ట్రశాసనమున హస్తినాపురి కేగి గురుకృపభీష్మధృత
రాష్ట్రాదులకు మ్రొక్కిన వారక్కుమారుల నక్కునఁజేర్చి కౌఁగిలించి రనంతరంబ.

తే. సగము రాజ్యము ధృతరాష్ట్రజనవరుండు, పాండవేయుల కొసఁగెను నిండువేడ్క
ఖాండవప్రస్థపురమున నుండి వారు, రాజ్య మేలుచు నుండిరి ప్రౌఢివెలయ. 305

వ. ధర్మావతారుం డగునజాతశత్రుండు తమ్ములఁ ద్రౌపదిం గూడి ధర్మానుసార
ముగా నర్ధరాజ్యం బగుకురురాజ్యమ్మను బూజ్యసామ్రాజ్యంబున బట్టభద్రుండై
ప్రజాపరిపాలన మొనర్చుచుండె నిందప్రస్థము ధర్మజునిపాలనమున రెండవ
స్వర్గముఁ బోలి యలరారె. 306

చ. సురవరకూర్మినందనుఁడు సుందరదేహుఁడు ఫల్గుణుండు భూ
వరుఁడు యుధిష్ఠిరాజ్ఞ నొకవర్షము తీర్థము లెల్లఁ గాంచనై

యరిగెను గాంగతీరమున కక్కడఁ గాంచె నులూపి నాఁగ నుం
దరి నది పార్థుఁ గోరుటయు దాని వివాహము పొందె నయ్యెడన్. 308

వ. అర్జునుం డులూపిం గూడిన సద్యోగర్భమున దాని కిరావంతుం డనుసుతుం డుద్భవించె నతం డవ్వల మణిపూరపురంబున కేగి చిత్రవాహనపుత్త్రిఁ జిత్రాంగదను బరిణయమై దానివలన బభ్రువాహనుం గాంచి యతివేషంబున ద్వారకానగరంబున కేగిన మేనబావ యగుధనంజయు గౌరవించి శ్రీకృష్ణుండు తనమందిరమునకుఁ గొనిపోయె. 309

—• అర్జునుండు యతివేషంబున ద్వారవతి కరుగుట •—

క. శ్రీకృష్ణునిసౌధంబున, నాకౌంతేయుండు మౌనియట్లుండం గా
శ్రీకృష్ణానుమతంబున, నాకన్నె సుభద్ర సలిపె నతనిసపర్యల్. 310

క. యతిరూపంబున ద్వారా, వతియందున ఫల్గునుండు వర్తిలుచుండన్.
నతి యాసుభద్ర యొకనాఁ, డతులితమతి నిట్టు లనియె నాతనితోడన్. 311

ఉ. దేవ మహానుభావ జగదీశ్వర మీరు సమస్తతీర్థముల్
సేవ యొనర్చినా రనుచుఁ జెప్పఁగ నే విని యున్నదాన నో
పావనమూర్తి నాయనుఁగుబావలు పాండుతనూజులుం బృథా
దేవియు వారిఁ జూచితిరె తెల్పుఁడు వారల కెల్ల సేమమే. 312

సీ. సంపూర్ణపూర్ణిమా చంద్రబింబము సరి, పోలి యుండెడుముద్దు మోమువాఁడు
కమలరేఖలఁ బోలి కడుసుందరంబైన, ధవళనేత్రంబులఁ దనరువాఁడు
మరుకొల్వుకూటము మాడ్కి నొప్పిన దగు, చెలువగువక్షంబు గలుగువాఁడు
భానుతేజము సరి వచ్చుచు నుండెడు, కాయసౌందర్యము గలుగువాఁడు.

తే. సాటి లేనివరాక్రమశాలి యైన, వానినిం ధనుర్విద్యావిభావనిధిని
మేనయత్తకు వజ్రికి నైనవాని, విజయు నెందైనఁ గంటిరే పృథివిలోన. 313

తే. కటకటా! తీర్థయాత్రకుఁ గదలిపోయె, ననుచు వింటి నే నాతనిఁ గనులఁ గాంచు
భాగ్యమున్నదొ లేదొ యాభావజసము, మీర లెందైనఁ గాంచినవార లొక్కొ. 314

వ. అని హావభావవికారములం బొందఁగ నర్జునుండును సుభద్రను మున్నే వలచి మోహించెఁ గావున నవ్వుచు నాపువ్వుఁబోఁడికి ట్లనియె. 315

చ. నరు నెటు చూడ లేదు నలినాయతలోచన యోసుభద్ర యా
నరుఁ డని యెంచి మోహమున నన్వరియింపు మటంచుఁ బల్క న
వ్వనజదళాక్షి కోపమునఁ బల్కెను నిష్ఠురవాక్య మప్పు డ
ర్జునుఁ డను నేనటం చతఁడు సుందరికేలును బట్టఁ బోయినన్. 316

వ. సుభద్ర లజ్జావదన యై తనమందిరము కేగెఁ గృష్ణుండు సుభద్రార్జునులయనురాగ మెఱింగి వారికి రహస్యమున వివాహ మొనర్చి యింద్రప్రస్థంబునకుఁ బంపె

ధనంజయుండును ధర్మజభీమనకులసహదేవుల నాలింగన మొనర్చి సుభద్రచేఁ
గుంతీద్రౌపదులకు మ్రొక్కించిన నెల్ల రానందించి రయ్యెడ. 317

సీ. చెలియలు బావయుఁ జెలువార ఖాండవ, ప్రస్థమందున మహావైభవమున
నలరుచుండి రటంచు నాలించి శ్రీకృష్ణ, బలదేవసాత్యకిప్రవరు లెల్ల
వివిధభూషణములు వేడ్కఁ గైకొని ఖాండ, వప్రస్థమునకును వచ్చి రపుడు
కానుక లెల్లను గవ్వడికిని సుభ, ద్రకు బంధువులకును దగ నొసంగి.

తే. పోయి రంత ద్వారకకును శౌరియు మరలఁ, గుంతి యెంతయు మనమున సంతసించెఁ
దమ్ములును బత్నులును సదా తన్నుఁ గొలువ, రాజ్యమేలె ధర్మసుతుండు ప్రౌఢిమెఱయ

—• సుభద్రకభిమన్యుండు పుట్టుట •—

చ. తరుణి సుభద్ర గర్భమును దాల్చి కుమారునిఁ గాంచె దివ్యసుం
దరునిఁ బరాక్రమక్రముని దామరసాయతనేత్రునిన్ ధురం
ధరు నతివీరు లోకనుతు ధర్మవిచారుని శౌర్యమూర్తినిన్
గురుకులవంశశేఖరుని గోరికతో నభిమన్యు నంతటన్. 319

క. తనయుఁడు కలిగినపిమ్మట, ఘనుఁడైనయుధిష్ఠిరుండు కడు వేడుకతో
నొనరించె దానధర్మము, లను వలరఁగ వేలకొలఁది యాసమయములోన్. 320

వ. శుక్లపక్షసుధాకరుం బోలెఁ దేజరిల్లు నాయభిమన్యున కర్జునుం డస్త్రశస్త్రాది
విద్యల నేర్పుచుఁ దనయంతవానిం జేసె నంత ద్రౌపదియు నీరుమోసి ధర్మజ
భీమార్జుననకులసహదేవులందు బ్రతివింధ్యాదుల నేవురుపుత్రులం గాంచె వారు
ద్రౌపదేయులనం బరఁగి యభిమన్యునితో సకలవిద్యల నేర్చుచుండిరి. 321

ఉ. తనయులముద్దుఁ జూచుచును దల్లికి భక్తి సపర్యఁ జేయుచున్
గుణవతులైనపత్నులను గూడి మెలంగుచు సర్వసౌఖ్యముల్
గొనుచు మహానుభావు లగుకుంతికుమారులు రాజ్య మేలుచున్
దనరిరి నిర్విచారు లయి ధర్మపరాయణులై ధరాస్థలిన్. 322

సీ. ఘనులు కృష్ణార్జునుల్ ఖాండవవనమున, విహరించి రొకనాఁడు వేడ్కతోడ
నపుడొక బ్రాహ్మణుడరుదెంచి యిష్టాన్న, మొసఁగుఁడంచును వారిఁ బొసఁగఁ గోర
నీ కేది యిష్టమా నో కోరు మని కృష్ణుఁ, డనుటయు నా విప్రుఁ డనియె నిట్లు
ఖాండవదహనము మెండగు నాకలి, తీర్చు నా కని పల్కఁ దెలిసి వారు

తే. అగ్నిదేవునిఁ బూజింప నగ్నిదేవుఁ, డపుడు ప్రత్యక్షమై వచ్చి యవల వరుణుఁ
దలఁచి సన్నిహితుం జేసి చెలువుమీఱ, విజయునకు దివ్యరథమును వేడ్క నొసఁగె.

వ. మఱియు నర్జునునకు గాండీవ మను కార్ముక మొసంగి కృష్ణునకు సుదర్శనచక్రం
బును గౌమోదకి యనుగదయు నొసంగి యంతర్ధానంబు నొందినఁ గృష్ణార్జునులు

ప్రహృష్టాంతరంగులై ఖాండవదహన మొనర్చి రంత నాయగ్నిం దప్పించు కొన లేక. 324

క. మయుఁ డనెడువాఁడు కృష్ణా, ప్రియుఁ డగునర్జునుని గృష్ణు వీక్షించుచుఁ దా రయమున నట కేతెంచి విజయ! నన్నుం గావు మనుచు శరణము వోచ్చెన్.

వ. అర్జునుండు మయుని రక్షించినంత నాయగ్ని జ్వాలలకు దేవతలు భయపడి దేవేంద్రుని కెఱింగింప నింద్రుఁ డేతెంచి యర్జునునిఁ బోరి యతనిపరాక్రమమునకు సంతసించి వారుణవాయవ్యాదిమహాస్త్రము లిచ్చి చనియె నంత 326

క. నరనారాయణు లిర్వురు, పరమానందమున ఖాండవప్రస్థముఁ దా మరిగిరి మయునిం దోడ్కొని, జరిగినకథ చెప్పి రపుడు స్వాంతము దనరన్. 327

ఉ. ధర్మతనూభవుం డదియుఁ దా విని యెంతయొ సంతసించి యీ కార్ముకలాభముం గలిఁగె గల్గదు శత్రుభయం బటంచు లో నర్మిలిఁ దమ్ములం బొగడి యాదవభూషణుభక్తిఁ గొల్చి యా ధర్మవిచారుఁ డెంతయును ధర్మము తప్పక రాజ్య మేలెఁ బో. 328

వ. సుగుణాభరణాలంకారుం డగునజాతశాత్రవుండు తమ్ములతో సర్వసౌఖ్యము లనుభవించుచు సర్వప్రజానురంజకముగా సర్వసర్వంసహాచక్రముపారిపాలించుచుండె నని వైశంపాయనుండు జనమేజయున కాదిపర్వవృత్తాంతసంగ్రహ మెఱింగించిన నతం డవ్వలికథ నడుగుటయు. 329

ఆశ్వాసాంతము.

చ. తెలియవు మంచిచెడ్డ లవి దేవవరేణ్యా నినుం భజించుటే
తెలియదు బాలభావమున దివ్యమయం బగుభారతంబులోఁ
గలిగినసత్కథాక్రమము గైకొని వ్రాసితి నీ కొసంగితిన్
జెలువుగ స్వీకరించి ననుఁ జేకొని ప్రోవుము చంద్రశేఖరా. 330

గద్యము—ఇది కవిరాజ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారి
పుత్రికయును, కల్లూరి వేంకటసుబ్బరాయఁడుగారి
పత్నియును, రాజ్యలక్ష్మీపరిణయాది గ్రంథకర్త్రి
యును అగు విశాలాక్షమ్మచే
రచియింపఁబడిన భారతి
కథామృతమునం
దాదిపర్వము.

శ్రీ పరమేశ్వరార్పణ మస్తు.

శ్రీ శ్రీ శ్రీ

శ్రీ

# భారతకథామృతము.

## సభాపర్వము

క. శ్రీవాసుదేవ దయేశ్వర, దేవాధిప లోకవినుత దివ్యాకారా
సేవితసకలమునీశ్వర, సేవించి భజింతు నిన్ను శ్రీపరమేశా. 1

వ. జనమేజయభూవల్లభునకు వైశంపాయనమునివల్లభుం డిట్లనంతరవృత్తాంతము
చెప్పం దొడంగె. 2

క. నలువురు తమ్ములతోడన్, జెలి యాపాంచాలితోడఁ జెలువు దలిర్పన్
సలలితమతి ధర్మసుతుఁడు, విలసిల్లుచు రాజ్యలక్ష్మి వేడుకఁ బొందెన్. 3

వ. అట్లు మహావైభవంబున ధర్మనృపాలుండు ప్రజాపరిపాలనం బొనర్చుచుండ
నొకనాఁడు శ్రీకృష్ణసమేతులై వినోదించుపాండవులదరి కేతెంచి యమ్మయుండు
యుధిష్ఠిరున కిట్లనియె. 4

చ. జనవర! సత్యభాషణ! విశాలయశోధన! ధర్మరాజ! యో
వినుతసుశీల! నానుడులు వేడుకతో నిపు డాలకింపు నీ
యనుజుఁడు సవ్యసాచి సుగుణాఢ్యుఁడు ఖాండవదాహమందునన్
నను దయఁ బ్రోచె నోయనఘ! నా కతఁడే యిడె ప్రాణదానమున్. 5

క. దానికిఁ బ్రత్యుపకారము, మానసమునఁ జేయఁ దలఁతు మానవనాథా
యే నసురవిశ్వకర్మఁడ, నే నేర్చితి శిల్పశాస్త్ర మెంతయుఁ దెలియన్. 6

ఉ. ఆనతి మీ రొసంగిన మహాప్రభువా! యొకరమ్య మౌ సభా
స్థానము నే నొనర్తు నన సంతస మంది ధనంజయుం డనున్
దానవశిల్పి! మా కొనఁగుదాని రచించి మురారి కిచ్చినన్
మానవనాథుఁ డెంతయును మానసమందున సంతసించెడున్. 7

క. అనునెడల వాసుదేవుం, డనె నామయుతోడ దానవాధీశ్వర మేల్
ఘన మైనసభ యొనర్పుము, జనపతి ధర్మజున కిమ్ము సమ్మతి నాకున్. 8

తే. అనిన మయుఁ డిట్లు పల్కె నోవనజనాభ!, దేవవరులసభలఁ బోలి తేజరిల్లు
దివ్య మగుసభ రచియించి భవ్యమతికి, ధర్మసుతున కొసంగెదఁ దత్పరతను. 9

వ. అని పలికి మయుండు పూర్వము వృషపర్వునకు సభాభవనము నిర్మింప నెంచి
వివిధరత్నముల బిందుసరస్సున దాఁచి యుంటి నవి తెచ్చి సభ నిర్మింతు

మఱియు భీమునకు గదను ధనంజయునకు దేవదత్తముఁ దెచ్చెద నని హరియును
మఱి ధర్మరాజాజ్ఞను బిందుసరస్సున కేగె వాసుదేవుండు ద్వారక కేగె నంత
మయుండు బిందుసరమునుండి యింద్రనీలవజ్రవైడూర్యమరకతమాణిక్యములం
దెచ్చి యపూర్వసౌందర్యనిధి యగుసభాభవనము నిర్మించె. 10

సీ. మయవినిర్మితసభ మాటికిఁ జూడంగ, వేయికన్నులవేల్పు వెఱఁగుపడును
బ్రహ్మసభను మించి వరుణసభను మించి, దేవేంద్రసభ మించి తేజరిల్లు
ధనరాజుసభ మించి కనుఁగొన సమవర్తి, సభ మించి యెంతయుఁ బ్రభ నెసంగు
జగతి నెందున లేని సభను వినిర్మించి, మయుఁడు ధర్మజునకుఁ బ్రియత నొసఁగె
తే. దేవదత్త మర్జునునకుఁ దెలియ నొసఁగెఁ భీమసేనునకును గదఁ బ్రీతి నొసఁగె
దానవాధీశ్వరుం డంత మానవేంద్రుఁ, డైనధర్మజు మన్నన లంది పొందె. 11

మయసభావర్ణనము

ఉ. పచ్చలగోడలున్ వెలయువజ్రము లుంచినద్వారబంధముల్
హెచ్చగుతల్పు లద్దములు నింపగున ట్లపరంజిమెట్లు నున్
మచ్చగుదూలముల్ మలఁచుమానికముల్ గిటికీలు నీలముల్
ముచ్చట లీనునట్టి సభ మోహముఁ గూర్చెడు నెల్లవారికిన్. 12
చ. అలరెడు నాసభాభవనమందు సరోవర మొక్కదానినిన్
సలిపె సువర్ణపద్మములు స్వర్ణమయం బగునట్టిమత్స్యముల్
గలిఁగి వినిర్మలోదకము గల్గి ప్రకాశిలునట్టిదాని ని
య్యెల వినుతింప శక్తిఁగలఁ డెవ్వఁడు కల్గిన శేషుఁ డొక్కఁడే. 13
క. చలువల నెసఁగెడునీడలు, గలిగి మనోహరము గూర్పఁ గా దగఁబూదో
టలు మయుఁ డఁట నిర్మించెను, విలుసిల్లు సువాసనలను వెలయుచు నుండన్. 14
తే. అద్దములతోడఁ గిటికీలు నందమైన, బొమ్మలును గీలుబొమ్మలు పొంది పొసఁగ
వేయిగన్నులవేల్పుకు వింతఁగొలుపు చిత్రనిర్మితశాలను జేసె మయుఁడు. 15
ఉ. ఆపరమస్వరూప మగునాసభ యంతయు రత్ననిర్మితిన్
బ్రావగు సూర్యకాంతులను గ్రక్కుచు రేలుఁ బవళ్ళు నెప్పుడున్
స్థాపిత మైన తేజమున సర్వజగన్నుత మై తలిర్చె నా
సీపృథివీస్థలంబునను నెయ్యది దానిని బోలియుండునే. 16
వ. అట్టి మహాసభాభవనమ్ము మయుండు. 17
తే. ధర్మజునకు సర్పించెను ధర్మసుతుఁడు, పరమసంతోషభరితుఁడై పలికె నిట్టు
లిందునే రాజసూయాదు లే నొనర్చ,వాఁడ ననుచు మయునిఁ జాల బ్రస్తుతించె.

సీ. ధర్మతనూజుండు ధౌమ్యు లేర్పఱచిన శుభలగ్నమందున విభవ మలర
మంగళవాద్యముల్ రంగుమీఱుచునుండ భూసురాశీర్వాదములు సెలంగ
మయవినిర్మితసభ మనుజేశ్వరుఁడు ప్రవేశించె నెంతయు వేడ్క చెలువుమీఱ
నాసభ జూడంగ నఖిలదేశాధీశు లరుగుదెంచిరి మునీశ్వరులఁ గూడి
తే. రాజులను గౌరవించి యారాజరాజు వారివలనఁ గానుకలను బడసెనంత
మునుల నెంతయు భక్తితోఁ బూజఁ జేసి వారియాశీస్సులఁగొని వారిఁబంపె. 19
వ. అజాతశత్రుం డనేక వేలబ్రాహ్మణులకు సమారాధన మొనరించి యర్థులకు
వలయువాని నొసంగి యొకనాఁడు జాయానుజసమేతముగా సభలో సుఖోపవిష్టుండై
యుండ బ్రహ్మమానసపుత్రుండు నారదుం డేతెంచి రాజనీతిం బ్రశ్నించుచుఁ
బాండుపుత్రాగ్రజున కిట్లనియె. 20
సీ. ధర్మమునందుఁ జిత్తము నిల్పి యీమహీచక్రముఁ బ్రోవుదే సదయహృదయ
యోగ్యు లౌవారి నియోగించితివి కదా నీమువనులఁ జేయ మేదినీశ
రాజుల కెప్పుడు ప్రబలుచుండు జయంబు దానిఁ గాపాడుదే ధర్మరాజ
నీపురోహితుఁ డతినిర్మలుండును వేదవేత్తయు నగునొకో విమలమూర్తి
తే. వేదశాస్త్రము లెఱిఁగినవీరవరుల సచివులుగఁ జేసి యుంటివా శాంతమూర్తి
వైద్యశాస్త్రప్రవీణులౌ వైద్యవరులు గలిగిరే నీదుగృహమున లలితమూర్తి. 21
తే. ఆశగలవారి దొంగల ననృత మాడువారలను దుష్టులను శత్రుపక్షపాతు
లను మఱియు రాజకార్యములందు నెపుడు నీవు నియమింపకుందువే భూవరేణ్య.
సీ. రాష్ట్రముపై వచ్చురాఁబడిలోన మూఁడవపాలు వెచ్చింప నవుచు గాని
మిక్కిలిగా నగుటొక్కము వెచ్చింప రా దని యెఱుఁగుదే రాజరాజ
శరణము గోరిన శత్రువు నైనను రక్షింతువే ధర్మరాజ నీవు
చోరభయంబులు నీరాష్ట్రమున లేక పాలించుచుందువే పార్థివేంద్ర
తే. వైరిరాజులపక్షమై వారివలన, ధనము గొని నీ కపకృతిని దలఁపనట్టి
భక్తివిశ్వాసపాత్రులు భటులు నీకు, గలిగియున్నారె చెప్పుము సలలితాత్మ. 23
సీ. నిర్ణయకాలాన నీసేవకులకును, జీతంబు లిత్తువా భూతలేంద్ర
రాజ్యకార్యాదినిర్వాహకత్వమునకు, ధనలుబ్ధులను బంపఁ దలఁపవు కద
నీదురక్షిత మగునీ రాష్ట్రమందున, జారులు చోరులు లేరు కాదె
సరవినీ రాజ్యము సస్యసమృద్ధమై, వర్ధిల్లుచున్నదే వరనృపాల
తే. సకలరాజరాజులు నిన్ను సన్నుతించు, నట్లు గురుల బాంధవులను నాశ్రితులను
భక్తులను బేదవారలఁ బ్రీత్యహంబుఁ, బోషించుచుంటివె తెలుపుము పుణ్యమూర్తి.

చ. అనవుఁడు ధర్మపుత్త్రుఁడు మహాముని కిట్లను గేలు మోడ్చి యో
మునివర! చేత నౌవఱకుఁ బ్రోచుచునుందును బేదవారలన్
విను మిల ధర్మకార్యముల వేడ్క నొనర్చి యథార్థశక్తితో
జనులను గాచుచుందు ననిశంబును జూచెద వారిమేలుకై. 25

నారదుండు పాండురాజ సందేశ మెఱింగించుట

వ. అనిన నారదుండు సంతసించి పాండురాజసందేశ మెఱింగించి ధర్మనందనా! రాజసూయయాగ మొనర్పుము నీతండ్రి శక్రావాసము లభించు నని బోధించిన యుధిష్ఠిరుం డాతనియుపదేశము శిరసావహించి తమ్ములుఁ గొమ్మయు దాను నమ్మునికిఁ బ్రదక్షిణనమస్కార మొనర్చిన నతండు తిరోహితుఁ డయ్యె నంత.

ఉ. నారదమౌనినాథవచనంబుల బోధితుఁడై జగత్ప్రియంబునం
గూరిమిఁ గూర్చి చిత్తమున గొంతిసుతుండు యుధిష్ఠిరుండు పెం
పారఁగ రాజసూయ మనునధ్వరముం బొనరింప నెంచి యా
ధారుణినాథుఁ డయ్యెడను ధౌమ్యులతో నెఱింగించె నంతయున్. 27

క. ఘనులైనధౌమ్యులని రిటు, జననాయక పాండురాజసందేశమునన్
ఘన మైనరాజసూయము, నొనరించుట శ్రేష్ఠ మైన దుర్వీస్థలిలోన్. 28

వ. అప్పుడు భీమార్జుననకులసహదేవులు రాజసూయమునకై యగ్రజున కుత్సాహము గల్గించుటయు నయ్యవసరమ్మున. 29

క. శ్రీకృష్ణుని యదుముఖ్యునిఁ, గైకొని రావలయు ననుచుఁ గౌంతేయుం డా
లోకేశునకై యరదముఁ, బ్రాకటగతి ద్వారకకును బంపించుటయున్ 30

సీ. అంత జనార్దనుం డానందపరవశుం, డై ఖాండవప్రస్థ మపుడు చనియె
ధర్మరా జెదురేగి తమ్ములతోఁ గూడ, గృష్ణుఁ దోడ్కొచ్చెను గేల్ గ్రహించి
యమలాసనంబున నాశీనునిం జేసి, కుశలవాక్యంబులు కొన్ని పలికి
యాదవాలంకారుఁ డార్తరక్షాపరుం, డైనమురారితో ననియె నృపతి

తే. బావ! నీ వెఱుంగనిది యీవసుధలోన, లేదు తే దైనఁ జెప్పెద యాదవేంద్ర
నారదప్రబోధితుఁడనై నారసింహా!, రాజసూయము చేయ నేర్పఱచుకొంటి.

తే. పితృహితార్థము గా దీని వెస నొనర్పఁ, బూనితిని దయ నాయందుఁ బూని నీవు
అధ్వరంబును నెఱవేఱు నట్లు సేయు, మనఘ! భార మంతయు నీదె వనజనాభ.

వ. అని యజాతశత్రుండు పలికిన వసుదేవపుత్త్రుండు కరంబు సంతసిల్లి యుధిష్ఠిరా! రాజసూయము సేయుదు ననుట కెంతయు సంతసం బయ్యెఁ గాని క్షత్త్రియవీరుల నెల్ల జయించినజరాసంధుం డున్నవాఁ డతనిఁ బరిమార్చిన యాగము నిరాటం

కమ్మగా నెఱవేఱ నన భీమార్జునులు జరాసంధుని వధియింతు మని యగ్రజున
కానంద మాపాదించిరి. 33

తే. ధర్మరా జిట్లు పలికె నోదైత్యదమన, యాజరాసంధుపుట్టువు నంత నాకుఁ
దెలియఁ జెప్పు మనంగను బలికె నిట్లు, లార్తరక్షాపరుండు నారాయణుండు. 34

క. నరవర! తెల్పెద నాతఁడు, జర యనురక్కసివలనను సంధింపఁ బడెన్.
బరఁగి జరాసంధుం డన, నరిభీకరుఁడై యొసంగె నాతఁడు ధరలోన్. 35

వ. అని జరాసంధుని జన్మవృత్తాంతము సాంతముగా విన్నవించె నంత. 36

ఆ. నరుఁడు భీమసేన నారాయణులు ధర్మ, తనయు నాజ్ఞఁ బొంది త్వరితముగను
బోయి మగధదేశమున జరాసంధునిఁ, గాంచి రతఁడు వీరిఁ గాంచి యవల. 37

—• ధర్మరాజు రాజసూయ మొనర్చుట •—

సీ. అపుడు జరాసంధుఁ డాతిథ్య మిడుటయు, సమ్మతింపక యిట్లు శౌరి పలికె
నేను గృష్ణుండ నితఁడు పార్థుండును, నతఁడు భీముండు మహాబలుండు
ధర్మనందనునాజ్ఞఁ దప్పకుండఁగ నిన్ను, వధియింప వచ్చినవార మోయి
నిరపరాధకులైనధరణిధవులను గా, రావాసమున నుంచి తకఁట నీవు

తే. దుష్టకార్య మొనర్చినదుష్టుఁ డీవు, నిన్నుఁ బోలుపరాక్రమనిపుణుఁ డవని
లే డనుచు గర్వ మొందెడువాఁడ వీవు, నీతి శాంతిని విడిచిననీచమతివి.

క. నీతోఁ గయ్య మొనర్పఁగ, నేతెంచినవార మోయి యెఱుఁగుము మ మ్మో
ఘాతుకుఁడ! వేగ రమ్మా, మాతో రణముం బొనర్పుమా బీరమునన్. 39

క. కారాగృహమం దుండిన, వారల విడిపించి రాచవారల కెందున్
గ్రూరత్వము సేయ ననిన, నోరీ నిను విడుచువార మోహో యనఁగన్. 40

తే. అన జరాసంధు డిట్లనె నలుకతోడ, యాదవకులోద్భవుండవై నట్టినిన్నుఁ
జూచి రాజుల విడుతునా నీచ! రమ్ము, మిమ్ము మువ్వుర వధియింతు మిసిమి చెడఁగ.

క. అనిన జరాసంధునితో, నని సల్పి వృకోదరుండు హా యన గదతో
ఘనకాయు నతనిఁ గూల్చెను, వనజాక్షుఁడు మెచ్చె భీముబాహాబలంబున్. 42

వ. జరాసంధవధానంతర మాతనికుమారుఁడు సహదేవునకు మగధరాజ్యాభిషేక
మొనర్చి శ్రీకృష్ణభీమపార్థు లింద్రప్రస్థమున కేగి ధర్మజునిపాదారవిందములపై
సాఁగిలిపడి మ్రొక్కిన నతండు వారిం గ్రుచ్చి కౌఁగిలించె నంత యోగేశ్వరేశ్వ
రుం డగు విశ్వేశ్వరుననుమతి నలువురు తమ్ములు నాల్గుదిశలకు దిగ్విజయార్థ మ
రిగి రంత. 43

సీ. విజయుఁ డుత్తరము దిగ్విజయముగాఁ బోయి, యోడించి యాపుళిందోర్వినాథు
నతనివల్లను వేల కగుధనంబును గొని, ప్రతివింధ్యభూపాలుపాలి కేగి

తనపరాక్రమము నాతనికిఁ జూపియు వాని, చే నధికధనంబు స్వీకరించి
సర్వదేశములలో నర్శిపతుల గెల్చి, వెల లేనిధనముతో వేడ్కమీఱఁ
తే. జనియెఁ బ్రాగ్జ్యోతిషమునఁ గాజనవరేణ్యుఁ, డైనభగదత్తుతోడుత ననిఁ యొనర్చి
జయము గాంచె వేలు ధనంబు సంగ్రహించి, తెచ్చి ధర్మనందనునకు నిచ్చె వేడ్క.

వ. అంత భీమసేనుండు పూర్వదిగ్విజయమ్మును సలిపి పాంచాలవిదేహదశార్ణపతులవలన మహాధనంబు సేకరించె సహదేవుండు దక్షిణదిగ్విజయంబును నకులుండు పశ్చిమదిగ్విజయంబును సలిపిరి. సమస్తరాజులం గెల్చి తమ్ములు మితిమీఱినధనం బగ్రజున కొసంగిరి. 45

క. ఘనులగు తమ్ములు తెచ్చినఁ ధన మంతయు నిల్లునిండఁ దనరారుటయున్
జననాయకుండు సంతస, మున యాగప్రయత్న మపుడు మొదలిడఁ బోయెన్.

సీ. సకలభూదేవులు సమవర్తితనయుని, జయము గోరుచు నుండ్రె ప్రియము మీఱ
నపుడు లీలామానుషాకారుఁ డగునట్టి, దేవకీసూనుఁ డే తెంచుటయును
మత్స్యపాంచాలాదిమగధవిదేహాది, ప్రభువు లేతెంచిరి వైభవమున
వసుదేవసాత్యకిబలరామప్రద్యుమ్న యాదవు లెల్లరు నరుగుదేఱ
తే. భీష్మకలశజాశ్వత్థామవిదురసంజ, యాంబికేయదుర్యోధను లంద ఱపుడు
వచ్చి రప్పూరి కెంతయు నిచ్చతోడ, ధర్మనందనునాజ్ఞను దప్పకుండ. 47

క. వచ్చిరి కౌరవు లెల్లరు, వచ్చిరి యదుముఖ్యులెల్ల వాంఛ దలిర్పన్
వచ్చి రనేకనృపాలురు, వచ్చిరి యా రాజసూయవైభవ మరయన్. 48

తే. రాజసూయమ్ము చూడంగ రాజ లెసఁగ, వచ్చినట్టివారలను భూవల్లభుండు
మిగుల మర్యాద లొనరించి తగినపగిది, నిచ్చె వారలు వసియింప నిండ్లు కొన్ని. 49

వ. యాగకార్యము లొనర్ప భీష్మద్రోణకృపాశ్వత్థామకర్ణశకునిదుర్యోధనదుశ్శాసనాదులు నియమింపఁబడిరి దీక్షితుండై యజాతశత్రుండు రాజసూయ మొనర్చుచుండె.

చ. అనువుగ ధర్మసూనుఁడు సితాబ్జదళేక్షణ యాజ్ఞసేనితో
ఘన మగురాజసూయమును గౌతుక మొంద నొనర్చెఁ దత్సభన్
జనపతు లెల్లరున్ వినుతి సల్పుచు నుండిరి పాండవేయులన్
దనరెడునన్నభావమహిమ ధన్యమతిం గనుచుండి రెల్లరున్. 51

క. కొందఱు మఖమును బొగడియు, గొందఱు ద్రుపదాత్మజాతఁ గొలుతురు భక్తిన్
కొందఱు మయసభఁ బొగడుచు, గొందఱు పాండవుల భక్తిఁ గొలిచెద రచటన్.

వ. నిరాటంకముగా రాజసూయాధ్వరము నెఱవేఱుచుండె నంత దేవవ్రతుం డజాతవైరికి ట్లనియె. 53

ఉ. నీవలనం బవిత్ర మయి నిల్చెఁ గులంబు నృపాలశేఖరా
యీవు కులాబ్ధిచంద్రుఁ డగు దీవె కుమాద్వహా! నాదుపంపుగా

నీవొక పుణ్యపూరుషుని నీసమయంబునఁ బూజఁ జేయుమా
నావుడు ధర్మపుత్రుఁడు మనంబున వేడుకతోడ నిట్లనున్. 54

క. తాతా యిప్పు డెవ్వారికి, నాతఁడు నర్ఘ్యం బొసంగి నయ మయ్యెడునో
ప్రీతి నెఱిఁగించి నను నం, ప్రీతునిఁగాఁ జేయు మనుచు వేఁడిన మీఁదన్. 55

మ. ఘనునిన్ ధర్మవిచారు నీశుని జగత్కల్యాణు నీదేవకీ
తనయున్ బూతచరిత్రునిన్ సుగుణవిస్తారున్ రమానాథునిన్
వనజాతాయతలోచనున్ విమలభాస్వద్మూర్తి నీకృష్ణుఁ గొ
ల్చిన నొల్వుల్ గడు సుప్రసిద్ధము లగుఁ క్షోణీతలాధీశ్వరా. 56

మ. అని భీష్ముండు వచించినన్ మనములో నాహ్లాద మేపారఁగా
ఘనుఁడా ధర్మతనూభవుండు త్రిజగత్కల్యాణమూర్తిన్ మహా
త్ముని లోకైకనుతుం బరాత్పరు జగత్పూజ్యున్ రమానాథునిన్
గని పూజించి యొసంగె నర్ఘ్యమును లోకప్రస్తుతుం డయ్యెడన్. 57

వ. అజాతశత్రుం డొసంగినయర్ఘ్యము యదూద్వహుండు సంప్రీతుండై పరిగ్రహించెఁ బరిగ్రహించుటకుఁ జేదినాథుండు శిశుపాలుండు సహింప నేరక గాంగేయుఁ బదరి కృష్ణు నధిక్షేపించి కన్నుల నిప్పులు రాల మండిపడుచుఁ గౌంతేయాగ్రజున కిట్లనియె.

క. ఇందు మహాత్ములు నరపతు, లెందఱో గుమిగూడి యుండ నిందుకులేశా
యందఱ విడిచి యనర్హుం, డందసుతునకు నర్ఘ్య మొసఁగినాఁడ వి దేలా. 59

తే. వృష్ణికులపాంసనుం డగుకృష్ణునకును, నర్ఘ్య మిచ్చుట దూష్య మౌ నని యెఱుఁగవొ
గుణగరిష్ఠులు పాండురాష్ట్రనయు లిట్టి, యక్రమం బొనరించి రేమందు నహహ. 60

సీ. యాదవు నందు మీ కభిమాన ముండిన, నడిగిన ధన మిచ్చి యనుప రాదె
యంతియే కాని మహాసభాస్థలమునఁ, బూజించు టే తప్పు పూరువంశ్య
నిత్యసత్యవ్రతాన్వితుఁడ వనుచు నీదు, క్రతువుకై వచ్చుభూపతుల నెల్ల
నవమాన మొనరించితివి మహారాజ నీ, విటు సేయఁ దగునొ యక్కట యటంచు

తే. సభను వెడలి పోవుచు నుండ జముసుతుండు, వాని వారించి యిట్లని పలికె నతఁడు
మాపితామహు నాజ్ఞను మానకుండ, దేవకీసూతిఁ బూజించితిని నరేంద్ర. 61

వ. అని చంద్రాన్వయాధీశుండు పలికిన శిశుపాలుండు ధర్మజు గర్హించి పలికి కృష్ణుని దూఱిన భీష్ముండు వానికి బుద్ధి సెప్పుటయు నంత వాని దౌష్ట్యము చూడలేక పాంచజన్యధరుండు సుదర్శనచక్రమును వదలి శిశుపాలుని విగతజీవునిం జేసె నంత. 62

ఆ. ధర్మతనయునకును ధరణిలో నృపతులు, కట్నముల నొసఁగిరి కడఁకతోడ
వెలలు లేని రత్నములు వజ్రనీలముల్, పరఁగు దివ్యమైన వస్త్రములును. 63

క. శ్రీకృష్ణుఁడు యదుముఖ్యుఁడు, పాకారిప్రముఖవినుతపదమేశ్వరుఁ డా
లోకస్తుత్యుఁ డనంతుఁడు, కైకొని మని మునుల నొసఁగెఁ గౌంతేయులకున్ 64

వ. అంత రాజసూయము పరిసమాప్తి నొందినఁ యుధిష్ఠిరుండు వచ్చినవారినెల్ల సబహు
మానమ్ముగా వీడ్కొలిపె. 65

సీ. హస్తినాపురి కేగి యంత దుర్యోధనుఁ, డెంతయో చింతించె స్వాంతమందుఁ
బాండవేయాగ్రజు భాగ్యభోగ్యములకు, నోర్వలే కుండె సుయోధనుండు
నెరితోఁ బలుకక నింతయుఁ గుడువక, సంతాప మొందెను సంతతంబు
భూలోకమున లేనిపూజ్యసభాగేహ, సుందరాకృతిఁ గనికుందికుందె

తే. వారి రాజ్యలక్ష్మి హరింపవలయు ననుచు, ఖలుఁడు గాంధారిసూనుండు తలచుచుండె
యొక్కదినమున శకునితో నూహఁ జేసి, చనియె ధృతరాష్ట్రుపాలికి సమ్మతమున.

మ. జనకుం డా ధృతరాష్ట్రుఁ గాంచి పలికె న్సంతాపచిత్తమ్ముతో
విను మా ధర్మజు రాజ్యలాభము జగద్విఖ్యాతికిం గాత్రమై
కన నయ్యెం గదె రాజసూయమున నీక్ష్మామండలిం దద్వశం
బునుగాఁ జేసికొనె న్విచార మిది నాబుద్ధిం దలంపోయఁగన్. 67

క. కావున ధర్మాత్మ నరాభవు, వేవేగమ పిల్వు మిటకుఁ బృథ్వీనాథా
మావెనక జూదమాడుదు, నావుడు ధృతరాష్ట్రుఁ డనియె నందనుతోడన్ 68

తే. ఏల నీ కయ్యె విపరీత మిట్టిబుద్ధి, పాండవులసిరి గాంచి నీ వుండలేవొ
కదర వారికంటెను సిరి గలదు నీకు; కుటిలవృత్తిని మానుమా కొడుకుకుఱ్ఱ 69

సీ. అని విచారించి యయ్యంబికేయుఁడు వెండి, రాజులు గౌరవార్థంబు గాఁగఁ
గానుక లొసఁగిరి కౌంతేయునకుఁ గాని, వారెల్ల నీప్రియుల్ కౌరవేంద్ర
వారిభాగ్యంబును గోర నేటికి నీవు, దేవేంద్రభోగము తేజరిల్ల
నేకొఱంతయు లేక యోకురుభూషణా, వర్ధిల్లుచుంటివి వసుధయందు

తే. నిన్నుఁ బోల రెవారలు కన్నకొడుక, పాండవులయందు ద్వేషంబు వదలు మయ్య
యవనిపతులు నీయరిగాపు లగుదురయ్య యనిన దుర్యోధనుం డను జనకునకును.70

తే. ధర్మజునికీర్తివల్లి యీధరణిలోన, సకలదిశలకుఁ బ్రాఁకెను జనవరేణ్య
సర్వదేశముల్ గెలిచెను సవ్యసాచి, నేను సహియింపఁగాఁ జాల దీని నయ్య. 71

వ. సప్తద్వీపసముద్రముద్రితమహామహీమండలంబెల్ల వారివశంబై యుండె నిర్వక్రపరాక్ర
మవంతుండ నగునే నిది చూచి సహింపఁ జాల ధర్మనందనుమందిరము రత్నమ
యంబై విరాజిల్లుచున్నయది వినుము. 72

క. పదివేలగేస్తు లనిశము, ముదమున, ధర్మజుని యింట భుజియింతురు న
చ్చెద రెల్లఋషులు నచటికి, మది నాకువిచార మయ్యె మానవనాథా. 73

క. యమతనయునింట నిత్యము, విమలాత్ములు కుడుచుచుండ్రు విప్రులు వేవేల్
క్రమముగ నంపటివెనుకన్, గమలాక్షి భుజించుఁ గృష్ణ కౌరవనాథా 74

ఆ. యజ్ఞదీక్షితుఁ డగుయమసూతిఁ దమ్ములు, ఛత్రచామరములు సరగఁ బట్టి
కొలుచుచుందు రతనిఁ గోరికమీఱఁ దద్విభవ మెన్న నగునె యిభపురీశ. 75

వ. ధృష్టద్యుమ్నుండును గృష్ణుండును సర్వమహీపతులచే ధర్మజునకు మ్రొక్కించు
చుండి రది నాకుఁ దలవంపు లయ్యె నయ్యెడ. 76

క. నవ్వెను ద్రోవది నన్నుఁ గని, నవ్వెడుఁ బాండవులుఁ గూడ నవ్విరి భటులున్
నవ్విరి కృష్ణప్రభృతులు, నవ్విరి పరిభవము గలిగె నరవర! నాకున్. 77

వ. అయ్యవసరంబున. 78

తే. శకుని దుర్యోధనుం గాంచి శమనసుతుని, మాయజూదమునం గెల్చి శ్రేయములఁ
గుఱ్ఱ! వారిరాజ్యము నీకుఁ గూర్చువాఁడ, జింతఁ బోనాడు మని పల్కె సంతసముగ.

క. అనినన్ దుర్యోధనుఁ డి, ట్లనియెన్ మామామ జూదమందు నిపుణుఁ డో
జననాథ! పాండవేయులఁ, గొని తేరం బంపవలయుఁ గోరుచు నుంటిన్. 80

క. అనునెడ ధృతరాష్ట్రుం డను, దనయా! యిది విదురుతోడఁ దగ నాలోచిం
తు నతండు సెప్పినట్లుగఁ, జను నెడ మే లగును మనకు సర్వవిధములన్. 81

వ. నావుడు దుర్యోధనుండు దండ్రిం గాంచి విదురునితో నాలోచింపఁ దగ దతండు
పాండవపక్షపాతి మనమేలు కోరండు శకునిమతంబునకే యొడంబడ కున్న నే నిదె
నామేనిం బాయుదు నని యటనుండి యొంటిచోటికిం బోయె నంత. 82

ఆ. అంబికాతనూజుఁ డాత్మజుపల్కులుఁ, జింతఁగూర్చి నట్టిచిత్తమునను
దనయుమీఁదిమోహ మును వీడఁగా లేక, యెట్లొనర్తు ననుచు నెంచుచుండె. 83

వ. అనంతరం బాదుర్యోధనునకుఁ బ్రియంబు సేయుటక నిశ్చయించి శిల్పశాస్త్రజ్ఞుల
రావించి కాంచనమణిమయంబుగా నొకసభాస్థలంబు రచింప నాజ్ఞ యిచ్చె. 84

క. ముదుకం డగుధృతరాష్ట్రుఁడు, విదురుని రావించి సుతుని విధ మెఱిఁగింపన్
మది నాలోచించుచు నా, విదురుం డిట్లని వచించెఁ బృథ్వీశునితోన్. 85

ఉ. కౌరవవంశభూషణ యకార్యము సు మ్మిది విన్మ నానుడుల్
క్రూరులు ధార్తరాష్ట్రు లతిక్రుద్ధులు ధర్మవిహీను లెందునుం
గౌరవపాండవుల్ గలిసి కయ్య మొనర్పక యుండు నట్లుగా
భారతమం దొనర్చుటకు బాధ్యుఁడ వౌదువు జూడ మొప్పునే. 86

క. జననాథ యెట్టి శాంతుల, కును జూదమునందుఁ బోరు కూడును గానన్
నిను మ్రొక్కుచుంటిఁ బొందుని, తనయుల నీతనయులట్లు తలఁపుము మదిలోన్. 87
క. అన్నా! ధర్మము నిల్పుము, సన్నుతమతులై నపాండుజనపతిసుతులన్
మన్నింపుము నీరాజ్యము, కన్నాకై యొప్పుమీఁకుఁ గౌరవనాథా. 88
వ. అని సర్వధర్మవిదుం డగువిదురుండు పలికిన ధృతరాష్ట్రుండు. 89
క. వీరలు వారలు నా కొక, తీరున నైనట్టివారు తెలియఁగ విదురా
వారికి వీరికి భేదము, కూరుతునే బుద్ధి లేనికుజనుఁడ నొక్కో. 90
వ. జూదంబుఁ జూడ నభిలషించువాఁడఁ గావునఁ జెప్పితి నేను నీవు భీష్మ ద్రోణ
కృపాదు లుండఁ బాండవుల కేకీడును వాటిల్లదు గావున నీ విచ్చటికి శీఘ్రమ్ముగ నేగి
నజాయానుజమ్ముగఁ బాండవాగ్రజుం దోడ్కొని రమ్మని యంపి పుచ్చి దుర్యోధను
రావించి యి ట్లనియె. 91
సీ. జూదంబువలన నో సుతుండ శాంతులకైన, గెలుగును నైన నుకాలోనముఁ
సన్నదమ్ములపుత్రు లగుమీకు మీలోన, భేదము గల్గిన భేద మగును
దానితో నెగ్గు లుత్పాదిల్లుఁ గావున, మానుము జూదము మానధనుఁడ
యీవు పాండవులతో నెప్పటియట్లుగాఁ, బూర్ణానురాగముఁ బొందు మయ్య
తే. కలిసి వారుమీరును బోరిన వలయు ధాత్రిఁ, బరులధనమును గోరుట పాతకము
కలదు వేయిరె ట్లధికము కలిమి నీకు, రాజసూయ మొనర్పుము రాజరాజ. 92
ఉ. ఆతఁడు చేసె ధర్మసుతుఁ డధ్వర మంతకు గొప్పగా నిటం
బ్రీతిని నీ వొనర్పఁ గదె వేలకు వేలను బంచి పెట్టుచున్
భూతలనాథు లెల్లరును బోడిమి నిత్తురు నీకుఁ గాన్కలన్
నాతగుబోధనల్ వినుము నాదుకుమార ! నరేంద్రశేఖరా. 93
తే. జూద మాడుట తగదని నాదుతమ్ముఁ, డైనవిదురుండు తెల్పెను గాన నట్టి
మాయజూదము నాడుట మంచి దగునె యనిన దుర్యోధనుం డను జనకునకును. 94
సీ. రాజసూయానంతరము మయనిర్మిత, సభఁ జూడఁ బోతి నాసమయమందు
జలపరిపూర్ణకాసారంబు కానిది గా నెంచి యచ్చోటికే నరిగితి
వలువలు దడిసిన వాయుతనూజుండు,ననుఁ జూచి నవ్వెనుజనవరేణ్య
యపుడు ధర్మాత్మజుననుచరుల్ వలువలఁ,దెచ్చి వేవేగ నా కిచ్చి రొండు
తే. నన్నుఁ గని నవ్వె నానళినాక్షి కృష్ణ,హృదయశల్యమై బాధించె నిభపురీశ
యక్కటక్కట పరులక్ష్మి నపహరింప,కున్నఁ బురుషార్థ మున్న దే యుర్విపతికి. 95

చ. అనవుడు నంబికాతనయుఁ డాత్మగతంబున నెంచి చూచి య
త్తనయుఁడు కోరుకోర్కెకను తప్పక తీర్పఁదలంచి తమ్మునిన్
జననుతచిత్తుని న్విదురుఁ జయ్యనఁ బిల్చుచుఁ బాండురాజనం
దనులను దోడితెమ్మనుచుఁ దత్పరతన్ వచియించి పుచ్చుడున్. 96

వ. విదురుండును గనకరథం బెక్కి ఖాండవప్రస్థంబునకుం జని ధర్మనందనుం గాంచి యతండును దమ్ములును గొమ్మయును మ్రొక్కిన దీవించి సుఖాసీనుండై యున్న సమయంబునఁ బాండవాగ్రజుం డతనిం గని యిట్లనియె. 97

క. మాతండ్రి శ్రీ యాంబికేయుఁడు, మాతల్లి సతీమతల్లి మాసుబలజమా
తాత నదీశతనయుండర్క, భ్రాతలు సుఖమున్నవారె పావనచరితా. 98

తే. గురుఁడు కృపుడు నశ్వత్థామ కురుకులజులు, కుశలముగ నున్నవారలే విశదకీర్తి
మజ్జనకుఁ డెప్పుడైన ను మముఁ దలఁచునె, విన వచింపవె వీనుల విందుగాను. 99

చ. అనుటయు ధర్మరాజునకు నవ్విదురుండును ధర్మపుత్ర నీ
జనకుఁడు కౌరవేశ్వరుఁడు సర్వజనంబులు సౌఖ్యవంతు ల
జ్జనపతి రత్నచిత్రసువిశాలసభాభవనం బొనర్చి ని
న్ననుజులతోడ రమ్మనియె నచ్చటి కెచ్చినవేడ్కఁ జూడఁగన్. 100

వ. అనిన సంతసించి కుంతీనందనుండు కాంతయుం దమ్ములుం బరివేష్టింప ధౌమ్య విదురసహితుండై కరిపురంబునకుం జనుదెంచె నంత. 101

చ. ఘనుఁ డగుధర్మనందనుఁడు ఖాండవప్రస్థమునుండి వచ్చె నం
చును విని యాసుయోధనుఁడు సోదరసంయుతుఁడై యెదుర్కొనెం
దనవరమందిరంబున కుదారతఁ గైకొని వచ్చి వారికిం
దనరుసపర్యలన్ సలుప దాసులఁ బుచ్చెను గారవంబునన్. 102

క. మఱుచటిదినమున వారం దఱుఁ దోడ్కొని నూతన మగుకనదివ్యసభాం
తరమును జూపెను వారం దఱుఁ జూచిరి దానిసొగసుఁ దనరినవేడ్కన్. 103

వ. ధర్మజుండు సభావిశేషంబులం దిలకించియొక్కరత్నపీఠంబున నాశీనుండై యుండ శకుని యతనిం గాంచి యిట్లనియె. 104

తే. మానవాధీశ! యీసభాస్థానమందుఁ గొంతకాలము మనమెల్ల సంతసమున
ద్యూతమాడుద మనిన నాభూతలేంద్రుఁడనియె సౌబలుఁగాంచి రోషావృతుఁడయి.

వ. శకునీ! ద్యూత మనర్థదాయకము నా కిష్టము కా దనుచున్నంత దుర్యోధనుం డజాతశత్రుం గాంచి సుహృద్ద్యూతంబు నీకిష్టం బేని యాడుము లేకున్న నోడితి వని పల్కు మనిన ధర్మనందనుం డెట్టకేల కంగీకరించి సుయోధనున కిట్లనియె. 106

ఆ. కురుకుమారులందుఁ గోరి యెవ్వరితోడ, జూదమాడవలయు మేదినీశ
తెలుపవలయు ననుడుఁ దెలిపె గాంధారేయుఁ, డిటులు ధర్మజునకుఁ గుటిలవృత్తి
ఆ. మామ శకుని నాకు మాఱుగా నాడును, విత్త మెంతయేని పెట్టువాఁడ
ననిన ధర్మసూనుఁ డౌఁగాక యనుచును శకునితోడ నాడ సమ్మతించె. 108
వ. అంత నాద్యూతవిశేషంబు లరయ భీష్మద్రోణకృపాశ్వత్థామవిదురసంజయాదు
లెల్ల సభాసమ్యులై యుండి రనంతరంబ. 109
చ. తన దగు రాజ్యమంతయును ధర్మతనూభవుఁ డొడ్డి యోడె న
జ్జననుఁ డెన్నగా నికృతి సౌబలుఁ డంతయు గెల్చె బాండునం
దనుఁ డటు లోడుచుండుటయు దద్జ్ఞుఁడు వాఁ డటు గెల్చుచుండుటయున్
గనుఁగొన నయ్యె మాటి కటఁ గల్గినవారల కెల్లఁ దెల్లమై. 110
వ. ఇట్లు ధర్మద్యూతంబు ప్రవర్తించుచున్నంత విదురుండు ధృతరాష్ట్రుం జేరి
యిట్లనియె 111
క. ఖలుఁ డగుదుర్యోధనుఁ డిలఁ, గలిగినదుశ్శకునము లవి గలిగెను నీకుం
దెలిపితి వీని న్విడు మని, పలికితి విన వైతి వీవు పార్థివముఖ్యా. 112
చ. ఖలుఁ డగునీసుయోధనునిఁ గానల కేగఁగఁ బంపి పాండుపు
త్రులకు ధరాతలం బొసఁగి తొల్లిటిరాజులు వోలె గీర్తిమైఁ
జెలఁగుము పుత్రమోహమును జెచ్చెర వీడుము ధర్మ మిట్లుగా
సలుపుము భారతాన్వయము సాకుము నేర్పునఁ గౌరవేశ్వరా. 113
తే. దుష్టుని సుయోధనుని వీడు త్రోలఁగఁ జేసి, పాండుసుతులకు రాజ్యభూభార మెల్ల
నొసఁగు భారతాన్వయము పెంపెసఁగుచుండుఁ గౌరవాధీశ! సల్పు మిక్కార్య మిప్పు.
వ. అట్లు పలికినవిదురునిపలుకులు పుత్రమోహంబున నయ్యంబికేయుండు గణింపక
మాఱుపలుక కున్నంత విదురుండు ధార్తరాష్ట్రాగ్రజుం గాంచి యిట్లనియె. 115
చ. పరమదురాత్మ ! నీ విటులు పాండవలక్ష్మిని మోసకారివై
యరమర లేక కైకొనుట న్యాయవిరుద్ధము నీదుచేఁత లీ
ధరణిని మెచ్చ రెవ్వరును దమ్ములు నీవును గర్ణసౌబలుల్
మరిమరి మెచ్చుకోఁ గలరు మానుము జూదము వాదు వోవఁగన్. 116
క. అనునెడ గాంధారేయుం, డను విదురా నీదునీతు లవి మా కేలా
యనయము పార్థులమేలే, కనుఁగొందువు నాదుమేలు కనుగొన వెపుడున్. 117
తే. ధార్తరాష్ట్రుల నిందింపఁ దలఁతు వీవు, పాండవులకు మేలొనఁగూర్చు వాఁడ వైతి
శమనుఁ డైతివి మాపట్ల శత్రుపక్ష, పాతి వగునీవు మారాడ వలదు మాకు. 118

వ. అనిన విదురుం గౌంతేయుఁ డాతనిం దూలనాడి నిష్ఫలప్రయత్నుం డయ్యె నంత శకుని
యుధిష్ఠిరునితో నిట్లనియె. 119

ఆ. ధర్మతనయ! నీవు ధనము రాజ్యంబును, నొడ్డి యోడినాఁడ వొడ్డుటకును
నింక నేమి కలదొ యెఱిఁగింపు మనవుడు శమనతనయుఁ డనియె సౌబలునకు. 120

చ. కలధన మెల్ల నోడితి విఁక న్మఱి లేదని పల్కు వాఁడ వో
తులువ! యిదే పణం బిడితి దొడ్డధనం బని కోట్లు కోట్లుగాఁ
గలధన మెల్ల నొడ్డియును గన్గొన నోడెఁ గుమారద్వయుండు ని
ర్మలచరితుండు ధర్మజుఁ డమాయకుఁ డై నృపధర్మవర్తియై. 121

క. తనకుఁ గలరాజభూషలు, తనతమ్ములవెల్ల దీసి తాత్పర్యమునం
గన నొడ్డి యోడ సౌబలు, డణుమాత్రములోన గెల్చె నాభూషణముల్. 122

ఆ. ఒడ్డుటకును లేకయున్నధర్మసుతుండు, తనదుసోదరుల నుదారు లైన
నకులుని సహదేవుని కురుభూషణులను, ద్యూతపణము చేసి యోడిపోయె. 123

వ. అంత నయ్యజాతశత్రుండు క్రమమ్మున నకరిమం బగునమ్మాయాదురోదరమ్మున
భీమార్జునులను దన్నును నొడ్డి యోడి చేయునదే మియు లేక చింతాకులస్వాం
తుం డై యుండ శకుని వెండియును. 124

ఉ. ధర్మతనూజ! యేల యిటు తాలిమిఁ దూలిచలించుచుంటి నీ
కర్మముఁజేసి యివ్వెతకుఁ గారణమయ్యెను యాజ్ఞసేని నీ
యర్మిలిపత్ని నొడ్డుమిపు డన్నను ద్రౌపది నొడ్డిచింతతో
దుర్మతి యైనయాశకునితో మఱి యాడెను మాయజూదముల్. 125

తే. శకుని పాంచాలరాట్సుతన్ సాధ్వి నపుడుఁ గెలిచె ద్యూతమునం దట్లుగెలిచినంత
ధార్తరాష్ట్రులు సంతోషమూర్తు లైరి పాండుసూనులు సిగ్గున నుండి రంత. 126

తే. అపుడు సభనుహాహాకారమతిశయిల్లెగురుఁడు భీష్ముఁడుఁగృపుడువిదురుఁడుమరియు
విలువు నీ రయి పోవగాఁ గలతపడిరి కౌరవులు చెలరేగిరి కౌతుకమున. 127

వ. అంత నాంబికేయుండు కుమారులారా! మీర లేమేము గెలిచితి రనుచుండదుర్యో
ధనుండు విదురుం బిలిచి యిట్లనియె. 128

క. విదురుఁడ వేగను పాండవ, సుదతిం దోడుకొని రమ్ము సుందరి నాయీ
సదమలగేహము దాసీ, సుచరితులతోఁ దుడుపవలయు సొంపలరారన్. 129

చ. అని విదురుండు మానసమునందు సుదుఃఖముతోడ నోసుయో
ధన తగ దోరి నీ కిటులు ద్రౌపది దాసియటంచుఁ బల్క నా

వనజదళాక్షి సోమకునివహ్ని జనించినయాజ్ఞసేని యా
జనసుత సాధ్వి ని ల్లనుట సర్వముతోఁ జెలగాట లాడుటే. 131

వ. చతుస్సముద్రముద్రితం బగుమహామహీచక్రంబె యుపాండవపత్ని యిల్లు చేయు
టుచితంబు గాదనుచుండ దుర్యోధనుండు ప్రాతికామిం బిలిచి 132

ఉ. పాండవపక్షపాతి యగువాఁ డగుట న్విదురుండు పోఁడు నే
నుండ భయంబు లే దిచట నోయి! వడిం జని నాదునాజ్ఞ నా
పాండవధర్మపత్నిని సభాస్థలికిం గొనిరమ్ము నావుడున్
గొండొకయింతలోన నటకుం జని కృష్ణకుఁ జెప్పె నంతయున్. 133

చ. మనమునఁ జింత సేయుచును మానిని పల్కెను బ్రాతికామితో
ఘనుఁ డగుధర్మజుండు కులకాంతను న న్నెటు లొడ్డియోడెనో
విని కని యే నెఱుంగ నిది వింతగ నున్నది పోయి పాండురా
ట్తనయునిఁ గాంచి దీనిని యథార్థము గన్గొని రమ్ము చెచ్చెరన్. 134

వ. ముందు నన్నోటువడి తన్నోటువడియెనో తన్నోటువడి నన్నోటువడియెనో కనుం
గొని రమ్మనుఁడు వాఁడుపోయి పాంచాలివాక్యములు సుయోధనుని కెఱింగింప
నతండు ద్రోవదియే వచ్చిసభాస్థానమునందనసందేహముదీర్చుకొనుంగాకయని. 135

తే. దుస్ససేనునిఁ దమ్ముని దుశ్చరితునిఁ,బిలిచి నీ వేగి వడిఁ బాండవేయసతిని
ద్రౌపదిని సభలోనికిఁ ద్వరగఁ దెమ్మటంచుఁ బల్కిన నాదుష్టుఁ డరిగె నంత. 136

ఉ. భూతలనాథుఁ డాద్రుపదపుత్త్రికిఁ బాండవధర్మపత్ని న
బ్జాతదళాయతాక్షిఁ గులపావని నాసుకుమారి సుందరిం
బూతచరిత్ర ద్రోవదిని మూర్ఖుఁడు పల్కెను దుస్ససేనుఁ డి
ట్లోతరళాక్షి రమ్ము సభ కూడిగము ల్వొనరింపఁ జెచ్చెరన్. 137

తే. మేము నిను గెల్చి కొంటిమి కోమలాంగి, సిగ్గు విడి మాసుయోధనుఁ జేరి కొలిచి
వరవుడ మొనర్చుచుండుము పాండవేయ, సతివి కావు మాదాసివి సారసాక్షి. 138

చ. అనవుడు యాజ్ఞసేని హృదయంబున నెంతయు భీతి గుందుచున్
గనుఁగవ నశ్రుధార లొగి గాఱఁగ మేను వడంకఁ దత్తఱం
బున నతిదీనతన్ బఱచి పోయెను దా సుబలాత్మజాగృహం
బున కటు లామె వెన్వెనుకఁ బోయెను క్రూరుడు దుస్ససేనుఁడున్. 139

క. పడ తీ యిఁకేల పోయెదు, తడయక నాతోడ రమ్ము తరుణీమణి మా
పడసినదాసివి పార్థుల, పడతివి కా వంచు సతిని భర్జించెఁ గడున్. 140

వ. అయ్యవసరంబున. 141

ఉ. ఆకురువంశపావనుని కాయము పల్కె ననాథవోలె ని
ట్లోకురుపుత్త్ర ! యి ట్లనుట లొప్పదు దూష్యము నే రజస్వలన్
నీ కిది ప్రార్థనం బిడుదు నే నట రాఁ జన దేకవస్త్ర నై
యాకురుముఖ్యు లుండుసభయం దెటు జొత్తు నటంచుఁ బల్కెడున్. 142

వ. దుశ్శాసనుండు పాంచాలీసమ్ముఖంబున కేగి రజస్వలయు నేకవస్త్రయు నగునా రాజపుత్త్రి కుటిలకుంతలంబులు ప్రభుగర్వంబునం బట్టి సభాస్థలంబున కీడ్చి తెచ్చుటయుం గాంచి. 143

— దుశ్శాసనుండు ద్రౌపదిని సభకుఁ దెచ్చుట. —

ఉ. గర్వమునన్ సుయోధనుఁడు కారులు ప్రేలఁగఁ జొచ్చె ద్రౌపదిం
బర్వఁగ ద్యూతదాసి వలెవా యిఁకమారమణీయగేహముల్
సర్వము శుభ్రతం గొలుప నాఁటను పాండవు లెల్ల మాకు నీ
యుర్విని దాసులైరి పరమోన్నతమన్యుఁడ నంచుఁ బల్కినన్. 144

చ. వనజదళాక్షి ద్రౌపది సభాసదులం గని యిట్లు వల్కె నో
జనపతులార యోసుగుణసాగరులార మహాత్ములార మీ
రనఘులు పెద్దవారలు దురాత్ముఁడు న న్నిటు సేయఁ జూతు రీ
వనితను గావకుంటి రిది పాడియె చూడఁగ ధర్మ మొప్పునే. 145

చ. కరుణ వహింప రయ్య కులకాంతను పాండవపత్ని నైన న
న్నరయుఁడు దుస్ససేనుఁ డిటు లక్కట నన్నొనరింపఁ బాడియే
గురువులు వృద్ధులున్ ఘనులు క్రూరుని వీనిని మందలింపరే
పరమదయాళులార జనవందితులార యిఁ కేమి చెప్పుదున్. 146

చ. ఘనుఁ డలయజ్ఞసేననిముఖంబున జన్మము నొంది పాండురా
ట్తనయులధర్మపత్ని నయి తామరనాథునికూర్మిచెల్లె నై
ఘను లగునట్టిపుత్త్రులను గాంచి పతివ్రత నైన నేను దు
ష్టునికరమందుఁ జిక్కితిని జూచితి రయ్య మదీయదుఃఖమున్. 147

ఉ. క్రూరుఁడు కౌరవాధముఁడు కోరిక న న్నిటు చేయఁ బెద్దలే
యూరక చూచుచుండి రిటు లొప్పునె ధర్మము ద్రోణభీష్ములే
వీరిని మందలింప రొకో వేడినఁ దుల్ విననైరి చూడ నీ
భారతవంశ మెంతయును పాపమయం బయి పోయె నక్కటా. 148

వ. అని పాంచాలరాజపుత్త్రి భర్తలఁ దిలకించుచుండ వారు దాసు లౌట నేమియుం బలుకలేక తలలు వాంచుకొనిరి. కురువృద్ధు లెవ్వరును మాటాడరైరి. వికర్ణుం డొక్కరుం డిక్కరణిం జేయుట ధర్మంబు గా దనిన వానిం బదరి కర్ణుం డిట్లనియె.

చ. పలువురు భర్తలుండుటను వారిజపత్రవిశాలనేత్రకున్
వలువల నూడ్చినన్ విగతవస్త్రగఁ జేసిన దోస మేమి యీ
చెలువను వస్త్రహీనఁగను జేయు మటంచును ధార్తరాష్ట్రుతోఁ
బలికెను గర్ణుఁ డయ్యెడను బాండవు లెంతయు లజ్జఁ బొందఁగన్. 150

వ. ఆకర్ణవాక్యము లాకర్ణించి దుర్నయుం డగు దుర్యోధనుం డా ద్రౌపదిని వస్త్రహీనం జేయుమని దుశ్శాసనుని బురికొల్పుటయు నాతఁడు సతీజనశిరోభూషణ మగు కృష్ణ సమక్షమ్మున కేగి యాయమ్మ దాల్చినపట్టము లూడలాగుచుండ నామె యిట్లని దేవాదిదేవుం డగు శ్రీకృష్ణుని బ్రస్తుతించెను. 151

ఉ. హా యదువంశహారమణి! హా జగదేకసురూప! కేశవా
హా యిటు నన్ను దుఃఖముల నందఁగఁజేయుచునుండె దుష్టుఁ డీ
పాయనిదుఃఖవారిధిని బాపవె నన్ దయతోడఁ బ్రోవవే
నాయెడ సత్కృపారసము నందఁగఁజేయవె నందనందనా. 152

ఉ. దేవతలందు మేటి యగుదేవుఁడ వీవు యదూత్తముండ వో
నీవు సమస్తజీవముల నిల్పెడువాఁడవు వాసుదేవ నీ
సేవకురాల దుర్మతులు చిక్కులు వెట్టుచు నున్నవారలో
దేవ భవత్కటాక్షమునఁ దేలిచి నన్ను ననుగ్రహింపవే. 153

చ. సనకసనందనాదులకు శక్యము గాని భవత్సుదర్శనం
బున నలరించి నన్ను దయఁ బ్రోవుము దేవ దయాసముద్ర నే
ననయము నీకృపారసము నందిన నేమికొఱంత గల్గెడున్
వనజదళాయతాక్ష మునివందిత దేవ! పరాత్పరా! హరీ. 154

మ. నినుఁ బ్రార్థించినవారికెల్ల సుగతుల్ లౌ నీరేజపత్రేక్షణా
కనుఁగొంటే పరమేశ నాదువెతలం గారుణ్యవారాన్నిధీ
ఘనులౌ పార్థులపత్నినై ద్రుపదభూకాంతాత్మసంజాత న
య్యును నీదుష్టుల బాఱిఁ జిక్కికొని నే నుంటిన్ హరీ మాధవా. 155

చ. పరమదయాకరా సుజనవందిత పాండవపక్ష శ్రీహరీ
దురితవినాశ! సోదరిని దుష్టులబాఱి వసించియున్న న
న్నరయుము ప్రేమతోడను మహాత్మ జగన్నుత దీనరక్షకా
సరసిజనాభ దిక్కెవ్వరు సాకఁగ నన్ను రమామనోహరా! 156

శా. నీవే తల్లివి తండ్రియుం గురుఁడవున్ నీవే జగన్నాథుఁడున్
నీవే విశ్వము తాల్చువాఁడవు ప్రభూ నీవే మహాత్ముండవున్

నీవే నన్నిటఁ బ్రోవ దిక్కరయఁగా నీసోదరి న్వే దయన్
రావే కావవె దేవకీతనయ యోరాజీవపత్రేక్షణా. 157

తే. అనుచు ద్రౌపది ప్రార్థింప నచ్యుతుండు, ద్వారకాపురినుండియు ద్రౌపదికిని
నక్షయము గల్గుఁ గావుత మని వచించె, నంత కురుసభ నెసఁగె హాహారవంబు. 158

క. ఒకపుట్టం బొలిచిన నిం, కొకపుట్టము తోన వచ్చె యువతీమణికిన్
ఒకటొకటి గాఁగ వలువలు, ప్రకటింపంబడియెఁ బెద్దపర్వతమువలెన్. 159

వ. ఒకదానిపై నొకటిగా దివ్యవస్త్రము లామహాసాధ్వికిఁ గాన వచ్చుటయు నొలువ
లేక డిగ్గున దుశ్శాసనుండాశతపత్ర జైత్రనేత్రను విడిచె నప్పాంచాలియుఁ దనమాన
భంగము గాక తప్పెనని శ్రీకృష్ణభగవానుని స్మరించుచుండె నాసమయమునఁ
గ్రోధానలము సైపలేక భీముం డిట్లు ప్రతిజ్ఞ సలిపె. 160

చ. నరవరులార మీరలు వినఁ దగు నేను బ్రతిజ్ఞఁ జేయుదున్
నురమున దుస్ససేను ఖలుఁ దున్మెదువాఁడఁ దదీయరక్త మే
నరమర లేక త్రావెద మహామహిమాంచితమూర్తియైన యీ
తరుణికి మానభంగమును దా నొనరించుఫలం బొసంగెదన్. 161

వ. భీముని ప్రతిజ్ఞ మెచ్చి యెల్లరు ధృతరాష్ట్రాదుల దూరిన విదురుం డెల్లవారు విన
నిట్టు లనియె. 162

తే. ద్రౌపదీదేవిప్రశ్న కుత్తరము చెప్పు, వార లుండినఁ జెప్పుఁ డోధీరులార
ధార్తరాష్ట్రనిభయమున నార్తయైన, సతికి నుత్తర మిడుఁ డయ్య సభ్యులార 163

వ. ఎవ్వరును దుర్యోధనుభయంబున మాటాడక యూరకుండఁ గర్ణుండు ద్రౌపదిని సభలో
నికిఁ దెమ్మని దుశ్శాసను బురికొల్పిన నతండు ద్రుపదమహీతలేశ్వరదుహితదరి
కేగి తర్జనభర్జన మొనర్చుడు నామె యిట్లని దీనముగా విలపించెను. 164

ఉ. అత్తఱి నాస్వయంవరమునందుసభాస్థలిలో సమస్తరా
జోత్తములుం గనుంగొనఁగ నొప్పుగవచ్చినయట్టిదాననై
యిత్తఱి నీచుచేత నిటు లీడ్వఁగనై యిట వచ్చియుంటి మీ
చిత్తము జాలి బొంద దొకో చెల్వను నన్గనుఁగొన్నయింతలోన్. 165

చ. అలఘులు పాండుసూనులు మహాత్ములు వేల్పులఁ బోలువారలై
తులువ సభాస్థలంబునకు దోకొనివచ్చి పరాభవించినన్
బలుకరు నన్నుఁ జూడ రతిపాప మొనర్తురు వృద్ధరాజు లీ
ఖలు నిది కాదటం చనరు కౌరవధర్మము కాలె నక్కటా! 166

క. పరమపతివ్రత నీడిచి, యరమర లేకుండ వలువ లవి యొల్చిన నో
దురితాత్మ కూడ దని యీ కురువరు లెల్లరును బలుకకుండిరి కట్టా. 167

ఉ. కౌరవవంశపాంసనుఁడు కాల్చెడు క్రోసెకు తాశఁజాల నో
ధారుణినాథులార తగుధర్మము మీరలు నాకుఁ జెప్పుఁడీ
కౌరవదాసి నైతి నని క్రౌర్యముతో నని రట్టుతో మనా
మీరలు చెప్పినట్లుగనె మీఁద మెలంగెద నంచుఁ బల్కినన్. 168

వ. అంత నెవ్వరు మాఱాడకున్న శాంతనవుండు కౌంతేయపత్ని కిట్లనియె. 169

తే. అమ్మ దీనిధర్మ మాపృథాగ్రసుతుండు, చెప్పవలయు నొరులు చెప్పలేరు
నిన్నుఁ బరిభవించునీచు లచిరకాల మందునే ఫలంబు నొందఁ గలరు. 170

వ. అప్పుడు దుర్యోధనుండు పాంచాలరాజాత్మజ కిట్లనియె. 171

చ. అలఁతులు పాండురాజసుతు లబ్జదళేక్షణ! యంగనాసముల్
పలుకరు నీ కొకింతయును వారల వీడి సుఖింపు ధార్తరా
ష్ట్రులను వరించి యీధరణి నొంప లరారు మటంచుఁ బల్క వృ
ద్ధు లపుడు ఛీ దురాత్మ యని దూఱిరి వానిని గోపభావులై. 172

వ. అంత మహోగ్రాకారుండై భీముండు దక్షిణహస్త మెత్తి ధార్తరాష్ట్రుల నీచేతి
తోఁ బిండిచేయువాఁడ నని ప్రతిజ్ఞఁ బట్టె. కర్ణుం డాస్వర్ణ గాత్రిం గాంచి యిట్లనియె.

ఉత్సాహ. తరుణి ధార్తరాష్ట్రులకును దాసి వైతి వియ్యెడన్
వరులు పలువు రున్న నిట్లు వచ్చె నక్కటక్కటా
కురుకుమారులందు నొకనిఁ గోరి పెండ్లియాడి యో
సరసిజాక్షి విపుల మైనసౌఖ్యముల మెలంగుమా. 174

ఆ. నలిననేత్ర రాచనగరున కేగుము, నీవు చేయుపనులు నేర్పఁ గలరు
పరుల విడిచి నీవు కురుకుమారులఁ గొల్చి, జీవనంబుఁ జేయు పూవుబోడి. 175

వ. అని కర్ణుండు ప్రహసించిన దానుం డగుట భీముం డేమియుఁ బల్కకుండె సుయోధ
నుం డైశ్వర్యమదమత్తుండై కురువుమీఁది వస్త్రముం దీసి చేయి స్పృశించి ద్రుపద
జం గని నవ్వుచు నట కూర్చుండు మని సన్నఁ జేసె నంత. 176

ఉ. భీముఁడు భీమమూర్తి యయి పృథ్వీవరుల్ విన నిట్లు పల్కె నో
భూమివరేణ్యులార ప్రభుపుత్రిక పుణ్యచరిత్ర యైనమా
కోమలి నిట్లుగాఁ బలుకుక్రూరసుయోధను సంగరంబునన్
భూమినిఁ గూల్చి యీకురువు ముక్కలుముక్కలు గాఁగఁ జేసెదన్. 177

వ. భీమునివలనఁ గురువంశమునకు మహోపద్రవము వాటిల్లు నని విదురాదులు తలంచుచుండిరంత ధృతరాష్ట్రునగ్నిహోత్రాలయమున రాబందులు నక్కలు కాకులు గ్రద్ద లఱచె నాదుర్నిమిత్తముల విదురాదు లాంబికేయున కెఱింగింప నతఁడు దుర్యోధనున కి ట్లనియె. 178

తే. దుర్మదాంధ యోరిదుర్యోధనా ద్రుప, దాత్మజాత నిట్టు లంటి వకట
పరమసాధ్వి దాని భరియింపుమా యని, యాదిశక్తిరూప మని నెఱుఁగర. 179

వ. ధృతరాష్ట్రుండు కొడుకుం బదరి పాంచాలిం దరికిఁ బిలిచి యాశీర్వదించి యి ట్లనియె. — ధృతరాష్ట్రుఁడు పాంచాలి నాదరించుట. — 180

చ. అతివరొ నాదుకోడలుల యందఱిలోనను నీవె పూజ్యవౌ
కుతుకము కల్గె నీ వలనఁ గోరుము కోర్కులఁ దీర్తు నన్న నా
సతి యతిభక్తి మామకును జాగిలి మ్రొక్కి వచించె నిట్టు లో
క్షితివర ధర్మనందనునిఁ జేయుము దాస్యమునుండి ముక్తుఁగన్. 181

క. భరతర్షభ ధర్మనరే, శ్వరుతమ్ములు భూషణములు శస్త్రాస్త్రములున్
వరమతి ధరించువారై, వరవృషముం బాయునట్లు వర మీయఁ గదే. 182

క. వరవర్తిని కోరినయా, వర మిచ్చి మహీశ్వరుండు వనజదళాక్షీ
మఱియొకటి కోరు మన నా, తరుణీమణి పలికె నిట్లు తనమామకునున్. 183

వ. క్షత్రియకాంతకు రెండువరంబులకన్న నెక్కువ కోరిన ధర్మహాని యన నామెసౌశీల్యమునకు మెచ్చి యాంబికేయుండు. 184

చ. పరమపవిత్రు లైనయలపాండుతనూజులఁ గాంచి యిట్లనున్
గురుతర మైనరాజ్యమును గొండు సగ మ్మిది మీ కొసంగితిన్
వరసుతులార మున్నువలె వైభవమొప్పఁగ రాజ్యమేలుచున్
సురుచిరకీర్తివంతు లయి సొంపు దలిర్పుఁడు భూతలంబునన్. 185

క. అని పాంచాలీసహితులు, జనవినుతులు నైనపాండుజనపతిసుతులన్
దనరెడు నింద్రప్రస్థం, బున కనిపెను రాజ్యభాగము నొసఁగి యంతన్. 186

క. ఇంద్రునిపురముం బోలిన, యింద్రప్రస్థంబులోన నీపాండవభూ
మీంద్రుండు ధర్మసూనుం, డింద్రునివలె రాజ్యలక్ష్మి నేలుచునుండెన్. 187

వ. కౌరవసభలో దుశ్శాసనుచేఁ బరిభవింపఁబడిన మహాసాధ్వి తల విరియంబోసికొని వాఁడు చచ్చువరకు జడ ముడిచికొన నని ప్రతిజ్ఞ పట్టియుండె నంత. 188

తే. పాండవైశ్వర్యమునకు నోర్వంగ లేక, దుష్టుఁడు సుయోధనుఁడు తండ్రితోడఁ బలికెఁ
బాండవులఁ బిలిపింపు మీపగిది మరల, ద్యూత మాడంగవలయును భూతలేశ. 189

వ. ఆసమయంబున మహాసాధ్వి యగుగాంధారి పతికడ కేగి దుర్యోధనుం ద్యజించి పాండు పుత్రులకు రాజ్యమొసంగి పరమోత్తమంబగుభారతాన్వయము గాపాడు మని ప్రార్థించిన నతం డామెవాక్యంబుల నిరసించి పుత్రమోహము త్యజింప లేక పాండవుల రప్పించిన శకుని యుధిష్ఠిరున కిట్లనియె. 190

ఆ. ధర్మతనయ నీవు ధార్తరాష్ట్రులతోడ, ద్యూత మాడవలయుఁ బ్రీతిమీఱ
ననిన ధర్మపుత్రుఁ డాంబికేయునియాజ్ఞ, వలన ద్యూత మాడె ఖలులతోడ. 191

వ. ఓడినవారు పండ్రెండేండ్లు వనవాసంబు నొకయేఁ డజ్ఞాతవాసము చేయ నిశ్చయించుకొని యాడి రంత. 192

తే. శకునితో ద్యూత మాడెను శమనసుతుఁడు, సర్వరాజ్యము గోల్పోయె నుర్విలోన
నిలువ నీడయుఁ గట్టుగుడ్డయును లేక, నారచీరలు దాల్చిరి వార లపుడు. 193

వ. వారిం గాంచి దుశ్శాసనాదికుమారులు నవ్వుచుండిరి భీష్మద్రోణాదులు వనవాస దీక్షితులగువారిం గాంచి చింతించి నీతు లుపదేశించిరి పాండవులు ధృతరాష్ట్ర విదుర భీష్మద్రోణ గాంధారులకు మ్రొక్కి నారియుసుమతి వనమున కేగ సంసిద్ధులై రంత. 194

చ. తులువ ఖలుఁడౌ సుయోధనుని దోర్బల మేర్పడ నొంచి యూరువుల్
సలిపెద ముక్కముక్కలుగ శత్రుని నీచుని దుస్ససేను భూ
తలమున గూల్చి నెత్తురులు ద్రావెద నియ్యది నిక్క మౌను నా
పలుకులు నమ్ము డంచును బ్రభంజనపుత్రుఁడు పల్కె నయ్యెడన్. 195

చ. అనిమొనఁ గర్ణుఁ జంపెదఁ గృతాంతుఁడఁబోలె నటంచు నర్జునుం
డనియెను ధార్తరాష్ట్రులను నందఱనుం బరిమార్చువాఁడ నే
నని నకులుండు పల్కెనెడ నాసహదేవుఁడు పల్కె ధర్మనం
దన దురితాత్మునిన్ శకుని ధారుణిఁ గూలఁగ నేతుఁ బోరునన్. 196

వ. యుధిష్ఠిరుండు ధౌమ్యులతోఁ దమ్ములం ద్రౌపదిం గూడి పోయివత్తుమని యెల్లర కడ సెలవుం గొని కుంతిని విదురసదనంబున నుంచి పోవుచు నెల్లరు కుంతికి మ్రొక్కిన నామె మిక్కిలి విలపించి వారల నంపిపుచ్చెనంత. 197

తే. యాజ్ఞసేనీసమేతుఁడై యమసుతుండు, తనదు తమ్ములతోఁ గూడి వనుల కేగ
ధార్తరాష్ట్రులు రాజ్యము దక్కెననుచు, మిగుల సంతోషమూర్తులై మెలఁగిరంత. 198

వ. ఆసమయంబున నారదుం డాకాశంబున నుండి వచ్చి పదునాల్గవయేట మేటిభారత యుద్ధము జరుగు పాండవులే జయము గాంతురని పలికి యంతర్ధాన మయ్యె నంత విదుర సంజయు లేతెంచి ధృతరాష్ట్రునకు నీతు లుపదేశించినఁ బుత్రమోహంబున

నతండు పరిగ్రహింపకుండె నని వైశంపాయనుండు జనమేజయునకు సభాపర్వ వృత్తాంత సంగ్రహము దెల్పిన నతం డవ్వలి వృత్తాంత మడుగుటయు. 199

ఆ శ్వా సాం త ము

చ. సుమములు చెల్లి నేరి పరిశుద్ధతఁ బూజ రొనర్చినట్లు వా
క్సుమముల నేరి పద్యములు గూర్చి భవత్పదపంకజంబులం
దమలమనంబుతో నిడి మహాప్రభువా నినుఁ బూజ చేసితిన్
క్రమముగ భారతామృతము గైకొను మొక్కెద నోపరాత్మరా. 200

గద్యము.

ఇది కవిరాజ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారి పుత్రికయును, కల్లూరి వేంకట
సుబ్బరాయఁడుగారి పత్నియును, రాజ్యలక్ష్మీపరిణయాది గ్రంథ
కర్త్రియును, అగు విశాలాక్షమ్మచే రచింపఁబడిన
భారతకథామృతమునందు సభాపర్వము.
శ్రీపరమేశ్వరార్పణమస్తు
శ్రీ శ్రీ శ్రీ

శ్రీరస్తు

# భారతకథామృతము

## ఆరణ్యపర్వము

క. శ్రీరామాహ్వయ యోశ్వర, దేవాధిపలోకవినుత దివ్యాకారా
సేవితసకలమునీశ్వర, సేవించి భజింతు నిన్ను శ్రీపరమేశా.

వ. జనమేజయమహీనాథునకు వైశంపాయనుం డిట్లు చెప్పం దొడంగె. 2

ఉ. ద్యూతమునందు నోడినప్రభూత్తము లాజగదేకసన్నుతుల్
భూతలనేత పాండువరపుత్రులు ధర్మగుణైకభూషణుల్
పూతచరిత్రులున్ ఘనులు పుణ్యు లగణ్యమహాపరాక్రమో
పేతులు దేవసన్నిభులు వీరులు కౌరవవంశభూషణుల్. 3

వ. వారు కామ్యకవనంబున కేగుటయు వారి వెనువెంట భూదేవులెల్లం గాంచనరథారూఢులై సుభద్రాభిమన్యుప్రతివింధ్యాదుల దోడ్కొనిపోయిరి. పౌరు లప్పాండవులం గాంచి దుఃఖించి యజాతవైరిం గాంచి సవినయంబుగా నిట్లనిరి. 4

చ. నరవర యేమిచెప్పుదుము న్యాయవిహీనులు ధార్తరాష్ట్రు లా
కరిపురి నుండలేక మిముఁ గన్గొన వచ్చితిమయ్య యిందు నీ
సరిని వసింతు మెల్లరము దాలిమి మమ్ము ననుగ్రహింపు మో
పరమదయాకరా కొలుచువారము మేమును గందమూలముల్. 5

చ. అనుటయు ధర్మపుత్రుఁ డపు డంతట బౌరుల నూరడించి యీ
వనముల వసించు టెప్పటికి భాగ్యముగా దిఁక హస్తినాపురం
బునకును బోయి సౌఖ్యములఁ బొందుఁడు మీ రిటునుండఁ గష్టమౌ
నని తగ వారిఁ బంపెను మహాత్ముఁడు సంతస మాదరించుచున్. 6

క. ధరణీసురు లెల్లను భూ, వరులగు బాండవులవద్ద వసియించుటకై
కరిపురికిఁ బోక యచ్చట, సురుచిరమతి నిలిచియుండి రారణ్యకులై. 7

వ. అయ్యవసరమ్మున. 8

ఉ. కాననమందు మీ రిటుల కష్టములొందుట చూడలేను నేఁ
గాన మహాత్ములార యిఁక కామ్యకము న్విడి హస్తినాపురిన్
బోనగు నంచుఁ బాండువరపుత్రుఁడు పల్కిన నమ్మహీసురుల్
వానికిఁ బల్కి రిట్లనుచుఁ బాయని కారుణికత్వ మేర్పడన్. 9

ఉ. ధారుణినాథ యిల్లువిడి నెమ్మెయి నీకు భవత్సమీపమున్
జేరినమాకుఁ గష్టములు చేకుర వెప్పుడు కందమూలముల్
గోరి భుజించుచుండెదము బ్రాహ్మణులసన్నిధి నుండఁ జాల మో
భూరమణాగ్రగణ్య మముఁ బ్రోచెదనాడవు నీవె చూడఁగన్. 10

వ. ధాత్రీనాథా మీసన్నిధి నుండఁ జాలము. భవత్సన్నిధి నే నివసింతు మని యవనీబృందారకులు పలికిన ధర్మనందనుండు సమ్మతించి వీరల కాహార మెట్లు లభించునో యని
వితర్కించె. 11

క. ఏన నేమి చేసి నే నీ, జనులకు నన్నంబుఁ బెట్టి సాకుటయెట్లో
ప్రతిదినము షడ్రసాన్నం, బును దినువా రిట్లు వచ్చి పొగిలెదరకటా. 12

తే. ఇష్టమృష్టాన్నమును భుజియించువారు, ఘనులు భూదేవులెల్లరీ వనులలోన
కష్టములు బొంది నాతోడ కందమూల, ఫలము లెట్లు భుజింతురో తెలియదకట.

తే. ఆత్మభోగార్థమునకు నే నాసపడను, విప్రవర్యుల నెట్టులో విపినమందు
నన్నమును బెట్టి సాకుదునయ్య తెలుపు, మనుడు ధౌమ్యుఁ డిట్లను బృథాతనయు నకును.

చ. అనఘుని సూర్యదేవుని మహాత్మునిఁ గొల్చిన సుప్రసన్నుఁడై
వనజహితుండు నీకుఁ గలవాంఛిత మెల్లను దీర్చునయ్య ధా
రుణిఁ గలభూతకోటులకు రూఢిగ నన్న మొసంగి యాతఁడే
జనవర కాచువాఁ డగుట శాంతుఁడ వై భజియింపు మిత్రునిన్. 15

వ. అని ధౌమ్యులు సూర్యాష్టోత్తర శతనామస్తోత్ర ముపదేశించినఁ బరిగ్రహించి ధ
ర్మజుఁడు సుస్నాతుండై మిత్రు నుద్దేశించి. 16

ఉ. కాలుఁడు మృత్యువుం భగుఁడు కాష్ఠముహూర్తము కాలచక్రమున్
బోలఁగ సూర్యుఁ డర్యముఁడు పూష బృహస్పతి వేదకర్తయున్
మేలగు వేదవాహనుఁడు మిత్రుఁడు శుక్రుఁడు వైద్యుతుండ వో
బాలదివాకరా సుజనవందితవర్తన యోవికర్తనా. 17

ఉ. భూతవరుండు స్రష్టయుఁ దమోనుదుఁడుం గపిలుండు శౌరి జీ
మూతుఁడు జీవనుండు శశి పూషుఁడు శాశ్వతుఁడున్ సనాతనుం
డై తగువిశ్వతోముఖచరాచరుఁడున్ మనసున్ సుపర్ణుఁడున్
ఖ్యాతిగ విశ్వకర్మ రవి వ్యక్తుఁడ వీ వగుదయ్య భాస్కరా. 18

ఉ. ఎవ్వనికాంతిచే జగము లెంతయుఁ దెల్విని బొందుచుండెనో
యెవ్వనికై సమస్తజను లీధరణిస్థలి వేచియుందురో

యెవ్వఁడు చీఁకటి న్వడి హరించునో భక్తుల నాదరించునో
యవ్వనజాతమిత్రుని మహాత్ముని నిన్నలతుఁ బ్రభాకరా. 19

తే. అతిథులను బ్రోవ నన్నము నందఁగోరి, నిన్ను భజియించినాఁడ నో కిన్నతేజ
నాయభీష్టము నెఱవేర్చి నన్ను బ్రోవు, మనఘ యిదె నమస్కారము వనజమిత్ర.

మ. అని కౌంతేయుఁడు మ్రొక్కినన్ మనములో హర్షించి యాభానుఁ డి
ట్లనె నో ధర్మతనూజ నీయభిమతం బౌఁగాక నీప్రార్థనన్
విని నే మెచ్చి వరంబు నీ కొసఁగెఁగా విచ్చేసితిన్ జుమ్మి యీ
వనవాసంబున ద్వాదశాబ్దము లెటో పత్రింపు మాపిమ్మటన్ 21

తే. కౌరవులతోడియుద్ధముఁ గెలువఁగల వీవు మీఁదు జయముఁగాంచెదవయ్య ధారుణీశ
పూజ్యసామ్రాజ్య మేలుదుఁ బూరువంశ్యులకు సుఖయుతు విందు ముందు విలసితముగ.

వ. అని ప్రద్యోతనుండు పాండవజ్యేష్ఠునకుఁ దామ్రపాత్ర మొసంగి దీనిని బాంచాల
రాజనందన కిమ్ము దాన నక్షయ్యముగా నన్నము లభించుఁ గోరినంగోర్కె లతిథుల
కన్నప్రదాన మొనర్పఁ గలవని యంతర్హితుం డగునంత ధర్మజుండు ధౌమ్యులకు
మ్రొక్కి యాజ్ఞసేనిఁ గాఁగవించి తమ్ముల నాలింగన మొనర్చుకొని తామ్రపిఠరము
కృష్ణ కొసంగె నంత నన్న మక్షయ్య మయ్యె. నట్లుగా నగు నన్నమున ననేక
భూసురుల కన్నదాన మొనర్చుచుఁ బాండవులు కొన్ని దినము లావనంబున నుండిరి.

ఆ. అంత నొకదినమున నాంబికేయుం డల, విదురుఁ గాంచి పలికె ముదితుఁ డగుచుఁ
బాండుసూను లింక నొండేమి సేతురో, తెలుపవయ్య విదుర తెలిసినంత. 24

సీ. అనవుడు విదురుఁ డిట్లనియె నన్నకు మ్రొక్కి, తెలిసినంతకు నీకుఁ దెలుపువాఁడఁ
బాండుతనూజులు బాహుపరాక్రముల్, నీవెఱుంగుదు వయ్య భూవరేణ్య
అజ్ఞాతవాసము నైనంత వారలు, వైరివీరులతోడఁ బోరఁ గలరు
భండనంబున మహోద్దండగదాదండ, మును దాల్చు భీమునిఁ గనిన భయము

తే. గాండివంబును దాల్చి రంగస్థలమున, నలుకనట్టియాఖండలునాత్మజున్న
శత్రులోకభయంకరశౌర్యమూర్తి, గెలువ నెవ్వారి తరముగాఁ గులవరేణ్య. 25

తే. మఱిశరాసనధారు లామాద్రిసుతులు దురమునందు నెవరికి గెల్వఁ దరముగాదు
అలుక లేనియుధిష్ఠిరుం డలిగెనేని సప్తసింధువు లింకును జంద్రవంశ. 26

క. అన్యాయద్యూతమ్మున, మాన్యుల రాజ్యము హరించి మఱి సోమకసు
తన్యను బరాభవించిరి దైన్యంబుగ నీసుతులు ధరాశేనాథా. 27

క. పల దీఁజూడఁ బన్ని నేఁదెలిపితి నీసుతులు [illegible]
వలదని వారింపక నాపలుకులు చెడచెవుల నిడితి వసుధాధీశా. 28

వ. అని కిమ్మీరుండు రాక్షసచర్యలఁ గావించుచుండ వాయునందనుండు గదాదండం
బున వానిని యమసదనమునకు బంపి కామ్యకారణ్యతాపసులకు సౌఖ్యము లొన
గూర్చె నంతఁ బాండవులు మాయాద్యూతంబునఁ బంచింపఁబడి సర్వస్వంసహా
రాజ్యంబును గోల్పోయి రని విని పాంచాలాది రాజులును సకలయాదవసమేతము
గ శ్రీకృష్ణుండును వారిం జూడఁ గామ్యకవనంబున కేతెంచి రయ్యవసరంబున.62

తే. రాజబృందంబునడుమను రాజతేజమునఁ బ్రకాశించునందనందనున కెఱఁగి
ద్రౌపది వచించెఁ దనదుపరాభవమ్ము విన్నవించుచు నెంతయు వినయమునను. 63

క. పరమేశ వాసుదేవా, దురితాత్ములు చేయుదానిఁ దోయజనాభా
విరళముగఁ దెల్ప మదిఁ దత్తర మొందెడు నేను దెల్పుదానిని వినుమా. 64

సీ. ద్రుపదభూమీశ్వరదుహితనై శాత్రవ, వీతిహోత్రుఁడు మహావీరుఁ డైన
ఘనుఁడుదృష్టద్యుమ్ననుజనై లోకైక, వినుతపరాక్రమాన్వితు లైన
పాండుసూనులధర్మపత్నినై యలరారికుంతీ మహాదేవి కోడలనయి
లోకాధినాథుఁడౌ నీకు సోదరి నయి, యతులితమతులైన సుతులఁ గాంచి

తే. కౌరవులసభలో మహాక్రూరుఁ డైనదుస్ససేనునిచేతను దోయజాక్ష
యిదియె కేశభారముఁ బట్టి యీడ్వఁబడితి దేవకీపుత్ర నాపాట్లు నీవు వింటె. 65

తే. గురుపితామహప్రముఖులెవ్వరునుఁ గాని, వారిఁ గాదని వాదించి పలుకరైరి
నాఁటిపరిభవ మోజగన్నాథ నీకుఁ దెలుప లేనట్టి యాదవకులవరేణ్య. 66

క. శరణన్నశత్రు నైనను బరిమార్పక కాచునారు బాహుబలాఢ్యుల్
సురరాట్సూనుఁడు భీముండురువడి నపు డుక్కడక్క యుండిరి కట్టా. 67

క. భీముఁడు గదఁ గొనుటయు సుత్రామసుతుఁడు గాండివంబు ధరియించుట నా
కేమియుపకార మయ్యెడుఁ గామినులట్లయిరి వీరు కౌరవసభలోన్. 68

తే. సాధ్వి నను బట్టి వాఁడు దుశ్శాసనుండు యీడ్చి సభలోన వలువల పీఁచునపుడు
నాదు పతు లబలలఁ బోలె నన్నుఁ గనిరె కాని రక్షింపరైరి కమలనాభ. 69

తే. సకలబంధులు గలిగిన సాధ్వి నయ్యు దిక్కులేని పక్షినిఁబోలెఁ బొక్కియుంటిఁ
దరణిసూనుఁడు నను నవ్వి పరిహసించె దీనకథను నేనేమి తెల్పుదాన. 70

వ. ధార్తరాష్ట్రు లొనర్చు పరిభవముకన్న సూర్యసూనుం డొనర్చిన పరిహాసము
నకుమిక్కిలి పొక్కుచుంటి మఱియును. 71

సీ. మును బాలకేళులందున సుయోధనుఁడు తా, వాయుపుత్రుని నీటఁ ద్రోయుటయును
నలసి నిద్రించిన సమయంబున విషసర్పములఁ గఱపించుటయును

విషభోజనంబును బెట్టి హింస నొనర్చి వారణావతపురి కంపి యనల
జాతుసగృహమున శమనపుత్రాదుల సహియింపగా మది దలచుటయును
తే. మాయపణమున రాజ్యరమను హరించు వానిపట్ల శౌర్యము వీడు పతులగాంచి
నాపరిభవము కీర్తి కున్నాగలంచు స్వాంతమునం జింత నుంటి నోవాసుదేవా. 72
క. అని కన్నీరు మున్నీరుగా పలకించుచు దుఃఖానలమగ్నమానస యగుం బాంచాలిన్
నూఱడించి దేవకీనందనుం డిట్లనియె. 73
తే. నేను బాండవసన్నిధి లేనుగాన నట్టిపరిభవ మందితి వతివ నీవు
యపుడు సాల్వవధోద్యోగ మందునుంటిం గాన మీ కిట్టికష్టముల్ కలిగెనకట.
సీ. అజ్ఞాతవాసము నైనంత నీపతుల్, ధార్తరాష్ట్రులను యుద్ధంబులోనం
దునుమాడ నపుడు నెత్తురు ప్రవాహముంగాంచి, యానందమును బొందుమని యెశౌరి
కరుణాంతరంగుండై కమలాక్షు డుండంగా నగనేటికి నీకు వనజనేత్ర,
యని యూఱడించె నర్జునుండు ధృష్టద్యుమ్నుం, డప్పుడు భగినితో ననియె నిట్లు
తే. ధార్తరాష్ట్రుల వాయునందనుండు చంపు, సవ్యసాచి రాధేయునిం జంపంగలండు
ద్రోణు నేను వధించెదం గాన నీవుం జింత విడనాడు మమ్మ యోచిగురుబోడి. 75
క. అని కృష్ణ నూఱడించుచు, జనె ధృష్టద్యుమ్నుం డంత స్వపురంబునకున్
వనజోదరుండు సుభద్రను, దనయుని గొంపోయె నప్పుడు ద్వారావతికిన్. 76
వ. అంతం బాండురాజనందనులు ద్వైతారణ్యమ్మున కేగి రంత, కటకటంబడి పాంచా
లరాజపుత్త్రి యజాతశత్రున కిట్లనియె. 77
సీ. అంధనృపాలుం డాయాంబికేయుండు దుష్టుడగు తనయునినుడు లాలకించి
రాజ్యలక్ష్మి హరించి రాజరాజుల మిమ్ము, నడవులపా ల్చేసె నక్కటకట
యతనినాసము నిల్లనై యుండు నిష్ఠుడు ధాత యాతనిగుండె రాతం జేసెం
గలహవాంఛ జనించి ఖలులై నపుత్త్రులు చేయు క్రౌర్యంబులం జేయనిచ్చె
తే. మణిమయం బగుసౌధమందునం జెలంగు మీర లీయరణ్యంబున నారం దాల్చి,
యుండి రకట నేలలను బరుండ నయ్యె నిట్టి మిము జూడం జాల మహీతలేశ. 78
క. మును మయనిర్మితసభలో ననుజులతో రాజ్య మేలునట్టిమహాత్మున్
నినుం జూచునట్టినా కీవనులందున నిన్నుం జూడ వలసెం గట్టా. 79
తే. భానుతేజఃప్రభాభాసమాన మైన నీదుపాదపంకేజము మేదినీశ
శిలలపై నీవు నడచుటవలన నిదియె యరుణకాంతి వహించిన దక్కటకట. 80
సీ. అనవరతంబు సౌఖ్యమున నొప్పారుచు రాజ్యమేలెడు మహారాజ నీవు
భూసురులను వేలు భోజనాదులనల్లం దృప్తిం గావించెడు దేవ నీకు

ననిశంబు కందమూలాదుల భుజియింప, వలసివచ్చెను గదా వసుమతీశ
యడవులలో మీర లిడుమలఁ బడుచుంట, కే నెట్లు సైతును నృపవరేణ్య.
తే. కాన నావాక్యము ల్వినుకౌరవేంద్ర, శాంతసమయము గా దిది శమనపుత్ర
క్రోధసమయము కావునఁ గ్రూరు లైన, ధార్తరాష్ట్రుల వధియింపఁ దలఁపుమీవు.
తే. క్రోధమూర్తి వగుము నీవు కురువరేణ్య, బాహుబలయుతుల్ తమ్ములు బవరమందు
ధార్తరాష్ట్రశతంబు నో ధర్మరాజ, యుక్కడంగింపఁ గాఁ గల రొక్కనాఁడె. 82
క. అని ద్రౌపది వచియించిన, జననాథుఁడు పలుక కున్న సమయములోనన్
గని భీముఁ డామెవాక్కుల, కనుగుణముగఁ బల్కె నిట్టు లగ్రజుతోడన్. 83
సీ. దుర్జనులందును దుర్మార్గులందును, దయఁ బూని యుండుట తగవు కాదు
నలినాక్షి వాక్యము న్యాయమై యలరారె, ధార్తరాష్ట్రులవధఁ దలఁపుమీవు
ధర్మవ్రతములకు ధనము మూలము గదా, దానిని విడనాడి ధారుణీశ!
హితుల కప్రియము నహితులకు హాస్యాస్పదము వనవాసము శమనతనయ.
తే. అడవులందున వసియింప నగునె నీకు, నీవు నాఁ డాజ్ఞ నొసఁగిన నిమిషమందు
శత్రువుల వధియించి నాస్వామి నీకు, వననివాసము నాపెడువాఁడ గానె. 84
వ. సందియం బందక శాత్రవజయోపాయమునకుఁ బూనుము. మనకు సాహాయ్య
మొనర్పఁ బాంచాలకేకయాదిరాజులు సంసిద్ధులై యున్నవారు. 85
సీ. ధార్తరాష్ట్రులు ప్రోవఁ దగనిరాష్ట్రం బది, దూష్యమై పోదె నీపోష్యులెల్ల
నాబాలగోపాల మవఘ నీపరిపాలనము గోరి యుండి రీసమయమందుఁ
గౌరవుల్ రథభటగజసహితు లటంచు, స్వాంతములోఁ జింతఁ బడకుమయ్య
నాపరాక్రమమున న న్నెదిర్చెడివారు, వారిలో నెవ్వరు లేరు నిజము.
తే. చండమార్తాండుపగిదిని భండనమున, దేవదత్తముఁ బూరించి దిశలు మ్రోఁగ
విజయుఁ డీగాండీవంబున విశిచె నేని, శత్రుసేన భస్మావశిష్టంబు గాదె. 86
ఉత్సాహము. ఇం దసత్య ముండఁ బోవ దింతయేనిఁ గావునన్
సందియంబు నొందకుండ సమరకేళి నల్పుమా
యిందువంశరత్నదీప! యీవు రిపుల నోర్చి నీ
వందునన్ స్వరాజ్యసౌఖ్య మందుమా యుధిష్ఠిరా. 87
సీ. ఇందుల కొడఁబడ వేని వనమునందు, ద్వాదశవర్షముల్ దనరవలయుఁ
బదపడి యజ్ఞాతవాసము మఱియొక, వత్సరం బొనరింప వలయు రాజ
యారణ్యవాస మె ట్లయినను నయ్యెడు, నజ్ఞాత మది కష్ట మగు నృపాల
బాహుపరాక్రమవంతుల మగుమమ్ము, ని న్నెఱుఁగనివార లున్నవారె

తే. పదియు మూఁడు నెలల్ వనవాసయాత్ర, వత్సరమునకు మాసము ప్రతినిధిగను
నగ్రజా సల్పఁ దగు ధర్మహాని గాదు, కడిప్రకికి బోవఁ దలఁపుము దుర మొనర్ప.

వ. రాజులకు రాజ్యపాలనముకన్నఁ బరమధర్మము వేఱొండు లేదు. సమరవిజయ
ప్రయాణప్రయత్నుండవు గమ్మన వాయుపుత్రున కాయజాతశత్రుం డి ట్లనియె.

ఉ. తమ్ముఁడ నీవు చెప్పినది ధర్మము సందియ ముండ దేను నాఁ
డమ్మయి నాసభాస్థలమునందు నదీసుతముఖ్యు లుండ స
త్యమ్ముగ బాసఁ జేసితిని ద్వాదశవర్షము లీయరణ్యవా
స మ్మొనరించి వత్సరము సల్పెద గూఢ మటంచు నెంచఁగన్. 90

సీ. అపుడు ప్రతినఁ జేసి యిపుడు చంచలబుద్ధి, కాసఁ జెంది యసత్యహానిఁ బొంది
ధర్మహానినిఁ బొందఁ దగదు గావున నేను, సమయభంగమునకు సమ్మతింప
శుభకాల మఱుఁదెంచుఁ జూడఁ గొంతటిలోనఁ, గాపుర ముండవు కష్టములును
నీరాజ్యభోగము లెల్ల సత్యముతోడ, సమము గా నందుదు జ్ఞాననిధులు

తే. శూరు లగుదురు ధృతరాష్ట్రసూను లెల్ల, ఘనుఁడు భూరిశ్రవుండును గర్ణశకుని
మద్రభూపతి మొదలగు మనుజవరులు, వారిపక్షము నైయె పోరువారు మనల. 91

క. మనచే నిర్జితు లగునా, జనవల్లభు లెల్ల వారి సాకెడువారై
యని నేయ నెంచుచుండిరి, మనలను నిర్జించువారె మారుతపుత్రా. 92

తే. సహజకవచకుండలుఁడును స్వర్ణవర్ణుఁ, డగుదివాకరసూనుఁ డయ్యలఘుమూర్తి
కర్ణువిలువిద్య నిపుణత గాంచునెడలఁ గన్ను మూతపడదు నాకుఁ గలుగుభీతి. 93

క. శారద్వంతుఁడు గురుఁడా, గీరథిపుత్రుండు వారికిని సుసహాయుల్
వారల జయించి కానీ, కౌరవుల వధింపలేము కఱువలితనయా. 94

సీ. పాండునందను లట్లు భాషించుచుండఁగ, వారిచింతం దీర్ప వ్యాసమౌని
యరుదెంచెఁ బాండవు లామునీంద్రుం గాంచి, పెన్నిధిం గన్నపేద లట్లు
సంతసంబున వానిచరణాబ్జముల వ్రాలి, యాశీసుఁ జేసినా రతని భక్తి
నంత మునీంద్రుఁడు కుంతీతనూజుల, కభయదాన మొసంగి యమతనూజుఁ

తే. బిల్చి యి ట్లని పల్కెను భీష్మద్రోణుఁ, లును గృపుండు నశ్వత్థామయునుఁ గలట్టి
కౌరవులనుగెల్చుటయెట్లుగలుగు ననుచు, స్వాంతమునఁ జింతిలఁగఁ బోకుసార్వభౌమ.

తే. నేఁ బ్రతిస్మృతి యనువిద్య నీ కొసఁగెద, దాని నర్జునున కొసంగు దాన నతఁడు
తపము సల్పి యీశ్వరు శచీధవుఁ బ్రసన్ను, లునుగ నొనరించివరములఁ గొనున రేంద్ర.

వ. మఱియు వారివలన దివ్యాస్త్రశస్త్రములు గలుఁగ శత్రువీరుల నఱుమాడు మని
యావిద్య ధర్మజున కుపదేశించి పారాశర్యమునీంద్రుండు వెంచేసె నంత. 97

చ. అనఘుఁ డజాతశత్రుఁ డపుడామహిమాన్వితమైన విద్యఁ బా
ర్థున కుపదేశ మిచ్చి యనె నుత్తరదిక్కున కేగి సత్తపం
బును బొనరించి దివ్యశరముల్ గొని రమ్మని యంపి పుచ్చె ఫ
ల్గునుఁ డటఁ జేగె నుత్తరము ఘోరతపం బొనరింప నిచ్ఛమై. 98

సీ. అగ్రజునానతి నౌదల ధరియించి, విజయుఁడుత్తరదిశ వెడలె నంత
వృక్షమునీడను విశ్రమించినయొక్క, వృద్ధవిప్రునిఁ గాంచి విపులభక్తి
మ్రొక్కిన మీఁదఁ నాభూసురుం డిట్లనె, నీవెవ్వరో తెల్పు నేనెఱుంగ
నిట కేకతంబుగ నేటి కేతెంచితి, విప్రులు తపియించు విపిన మిద్ది.

తే. ధారుణీంద్రులు కార్ముకధారు లగుచు, నిచటి కెన్నఁడు రాఁగూడ దిపుడు నీవు
కార్ముకము దాల్చి వచ్చితీగాన దాని, విడిచి పోవు మిచ్చటనుండి వేగముగను 99

క. అనవుడు కిరీటి యూతం, డను మాటలు లెక్క సేయ కతి ధైర్యముతోఁ
జనరాదె నాకుభూసురుఁ, డనె నాయర్జునునితోడ నతి కుతుకమునన్. 100

తే. నీదు ధైర్యము మెచ్చితి నేను వత్స, విప్రుఁడను గాను వినుపృథివీకళత్ర
నీదుతండ్రి మహేంద్రుండ నే నటంచుఁ, దనదు నిజరూప మపుడు పార్థునకుఁ జూపె.

వ. నీ కేమికావలయునో కోరు మిచ్చెద నన హర్షోత్కర్షమానసుండయి యాగాండీవి
మహేంద్రున కభివందన మ్మొనరించి యస్త్రలాభమును గోరుటయు నీశ్వరునిఁ
గూర్చి జపించిన నస్త్రలాభము చేకూరు నని వాసవుం డదృశ్యుండయ్యె నయ్యెడ.

సీ. ఇంద్రుఁ డట్లానతి యిచ్చి యేగిన యంత, భరతర్షభుఁడు హిమవన్నగమున
ఫలపుష్పభరితమై పరఁగువనమునందుఁ, బరమేశుఁ గూర్చి తపం బొనర్చె
భూతేశ్వరుండు కిరాతరూపము దాల్చి, మూకుఁ డన్ దానవముఖ్యు నొకని
సూకరమును జేసి వీఁకతో దానిని, దరుముచు వచ్చె నాతావునకును.

తే. దనదుమీఁది కేతెంచెడుదానిఁ గాంచి, విజయుఁ డద్దానిపై శరాల్ విడుచునెడల
నక్కపటకిరాతుండు సర్వాధిపుండు, దానిపై నేసె శరము లెన్నని గాఁగ. 103

వ. కిరాతార్జునుల శరంబులు దగిలి దైత్యుండు వరాహరూపము విడిచి నిజరూపంబున
నదృశ్యుం డయ్యె నయ్యెడఁ గిరాతాంగనాసమేతుం డగు నీశ్వరునితోఁ బూరు
వంశవిభూషణుఁ డిట్లనియె. 104

క. నీ వెవ్వ రీవనంబున, నీవనితం గూడి యుంటి వెఱిఁగింపఁ గదే
నే వేయుసూకరముపై, నీవేలా వైచినావు నీదుశరంబుల్. 105

సీ. నిన్ను వధించెద నేను బాణంబుల, నని పృథాత్మజుఁ డనె నాతనికి న
ట్లనుఁడుఁ గోపముతోడ నాఫాలనేత్రుండు, నిను నేలఁ గూల్చెద నని వచించె

వారిరువురు పరస్పరకోపమున యుద్ధ, సన్నద్ధు లైరి యాసమయమందు
నాయిరువురు వెనుదీయక పోరుచు, సర్వేశ్వరుం డంత స్వాంతమందు
తే. అర్జునునిపటుబాహుశౌర్యంబులకును, సంతసించి యి ట్లని పల్కె జనవరేణ్య
యేఁ గిరాతుండఁ గాను మహేశ్వరుండ, ననుచు సాక్షాత్కరించెను దనదురూపు.
తే. సవ్యసాచి విస్మయ మంది స్వాంతమందు, భక్తితోఁ గేలు మోడ్చియాఫాలనేత్రుఁ
జంద్రమౌళీశ్వరునిపాదజలజములకు, సలిపె సాష్టాంగ మప్పుడు సన్నుతించి. 107
క. నీవు కిరాతుఁడ వనియెడు, భావంబున నెంచినాఁడఁ బరమేశ్వర యో
దేవాదిదేవ నన్నుం, బ్రోవం గదె తప్పు మఱచి భూతాధీశా. 108
తే. నన్ను మన్నింపు మని వేఁడుకొన్న పార్థు, భక్తికిని మెచ్చిపార్వతీవల్లభుండు
వర మొసంగెద వేఁడు మోకురుకులేశ, యనుచు భాంతుఁ డీశున కనియెనిట్లు. 109
క. వర మొసఁగ దలఁచి తేనియుఁ, బరమేశ్వర పాశుపతము వాంఛిత మన నీ
శ్వరుఁ డిచ్చి పోయె నతని కి, తరదివ్యాస్త్రములతోడ దానిని దయతోన్. 110
సీ. పరమేశ్వరునిదయఁ బాశుపతాదిది, వ్యాస్త్రలాభము నొంది యర్జనుండు
నాపూర్వసుకృతమునన్ మహాదేవునిఁ, గనులార గాంచితిఁ గరళకంఠు
జన్మపావన మయ్యె జగదీశ్వరునిఁ గాంచి, సుదిన మియ్యది యని ముదము నొంది
ధర్మనందనునకుఁ దప్పక జయ మగు, రాజ్యలక్ష్మి లభించి రమణ మెఱయు
ఆ. అనుచు సంతసించునాసమయములోన, విజయుఁ గనులఁ గాంచు వేడ్క మీఱ
దేవగణముతోడ దేవేంద్రుఁ డరుదెంచి, యెంతయేని బ్రీతి నిట్లుపలికె. 111
తే. వత్స శంకరునిం గెల్చి పాశుపతము, స్వీకరించితి వని విని వేడ్కతోడ
దేవతలు నీకు వరము లొదీయనెంచి, వచ్చియున్నారు చూచితే వరకుమార. 112
వ. ఇంద్రనందనుం డిందునకుఁ బ్రదక్షిణనమస్కార మ్మొనరించి నంత మహేం
ద్రుండు దేవగణంబులం గాంచుట కర్జునునకు దివ్యదృష్టి నొసంగినఁ బార్థుండు వా
రందఱకు శిరము నేల సోక నమస్కార మొనరించె నంత నాభారతవంశాభర
ణునకు. —ఈశ్వరాదు లర్జునుని కస్త్రము లిచ్చుట—
సీ. వరుణుం డొసంగెను వారుణాస్త్రంబును, దండధరుం డొక్కదండ మొసఁగె
ధనవాహనుం డొసంగెను గుబేరాస్త్రము, నింద్రుఁ డి ట్లనియె నరేంద్రునకును
బరమేశువలన దేవత్వ మొందితి వీవు, దేవకార్యము దీర్ప నీవె కలవు
స్యందన మంపింతు సరగ నారోహించి, యమరావతికి రమ్ము విమలమూర్తి
తే. అనుచు నాశీర్వదించి యయ్యమరవిభుఁడు, దేవగణములతోడను దేజ మలరఁ
బోయె నమరావతికి స్వపురమునకును, నర్జునుం డెంతయే వేడ్క నలరె నపుడు. 114

వ. అంతఁ గౌంతేయుండు స్యందనమునకై యెదురు చూచుచుండ స్వర్గపురినుండి
మాతలి కాంచనరథంబుఁ దెచ్చి సత్వరము వాని నాస్యందనారూఢుఁ జేసి యమ
రావతికిఁ గొంపోయిన నింద్రుం డక్కుమారుం గాంచి హర్షించి రత్ననిర్మితసౌధ
మున నివసింపఁ జేసి కొన్నిదినంబు లుండి పొమ్మని వానిని వేఁడుకొనియె. 115

సీ. అర్జునుం డాపురమం దున్నచిత్రచి, త్రాదు లన్నియుఁ గాంచి మోద మొందెఁ
గనకసౌధంబులు మణిగవాక్షంబులు, రత్నదీపంబులప్రభలు మఱి యు
రాజమందిరములు ప్రాకారద్వారక, వాటచమత్కారవరగృహములు
దీపధూపంబులు దేవాలయంబులు, ఫలపుష్పభరితముల్ వనము లెల్ల
తే. సలిలసారము లైనకాసారములును, గీరశారికాపిక కేకిగీతములును
వివిధ మైనచిత్రంబుల వెలయుచుండు, నాకమందు వసించె ధనంజయుండు. 116

తే. సోయగంబున రతిఁ గేలి సేయునట్టి, దేవవేశ్యాంగనలతోడఁ దేజరిల్లి
కలితమంగళవాద్యముల్ గలుఁగునట్టి, యాపురమున వినోదించె నర్జునుండు. 117

ఆ. అంత నొక్కదినమునందు శీతాంశుండు, తనదుపూర్ణకళలఁ దనరి పరగఁ
జేయుచుండె మదికి హా యనిపించెడు, మందమారుతమ్ము మఱియు వీచె. 118

—ఊర్వశి యర్జును వరించుట—

ఉ. అత్తఱి దేవవేశ్య యగునచ్చర యూర్వశి యెంతయేనియుఁ
జిత్తము చిత్తజాన్వితము చేసిధనంజయుఁ గూడుకోర్కి లో
హత్తగఁ బార్థుసన్నిధికి నప్పు డలంకృతయయ్యుఁ బోయి యా
చిత్తజరూపుఁ గాంచె నటఁ జిన్నెలు వన్నెలు కొన్ని జూపుచున్. 119

క. ఊర్వశి యలంకరించుక, యుర్వీపతిసుతుని కడకు వేగి వచ్చిన నా
సర్వాభరణాలంకృత, పర్వేందుసమానముఖికిఁ బార్థుఁడు పలికెన్. 120

తే. ఏఁ గృతార్థుఁడ నోయమ్మ యిపుడు నీవు, కరుణ ననుఁ జూడ వచ్చితీకాన నిన్ను
మ్రొక్కుచుంటిని భక్తి నీపుత్రుఁ డైన, నన్ను నాశీర్వదింపవే నాదుతల్లి. 121

వ. అనుటయు నవ్వేశ్యాసుందరి సుభద్రాసుందరున కి ట్లనియె. 122

ఉ. మారసమానరూప సుకుమారశరీర సరోజలోచనా
కోరితి నీసమాగమము కోరితి నీయధరామృతంబు నిన్
గోరి యి టేగుఁదెంచితిని గోమలదేహుఁడ నన్నుఁ గూడి యా
మారునిబాధఁ బాపఁ గదె మాటికి వేఁడితి వాసవాత్మజా. 123

ఉత్సాహ. నారదాదిమునివరులు ధనంజయా! సతంబు నిన్
గోరి పొగడుచుంద్రు నీదుగుణము లేను వింటి నో

మాఱుమాప నిన్నుఁ గూడ మదిఁ దలంతు నెప్పుడున్
జేరె నట్టిపుణ్యదినము చెలఁగు నాకు భారతా. 124

తే. నిన్నుఁ జూచెదుకోర్కెతో నున్నదాన, నాపురాకృతసుకృతమునను నరేంద్ర
నీవె యరుదెంచి తిచటికి నేను ధన్య, నైతి నినుఁ గంటి మరునిపా లైతి నిపుడు. 125

చ. జనని యటంచు నన్ బిలుచుసాహస మెట్లుగ నీకుఁ గల్గెనో
మనసిజమోహమగ్న నను మానము వీడుము నన్నుఁ బొందు మో
మనసిజరూప వేశ్యలము మా కిట వావులు లే వెఱుంగవో
యనిమిషనాథనందన మహాగుణభూషణ యోయియర్జునా. 126

చ. సుమశరపీడితాత్మ యయి సుందరి పల్కిన నాలకించి యా
యమరవరేణ్యసూనుఁ డగునర్జునుఁ డి ట్లని పల్కె నూర్వశీ
క్రమమున మాపురూరవునికాంతవు నై యమరేంద్రుఁ డీశచీ
రమణునిసేవఁ జేయుప్రియురాలవు కావున నాకుఁ దల్లి వే. 127

వ. అక్కటకక్కటా! తల్లీ! యిప్పు డైన నీచిత్తము మరల్చి నన్నుఁ బుత్రవాత్సల్యంబునఁ జూడు మనుచుఁ బ్రత్యుత్తరం బొసంగిన యూర్వశి మదనబాణపీడితయై గాండీవి తన్ను నిరాకరించినకోపమ్మును సైపఁ జాలక నపుంసకుండై వనితాజనమధ్యంబున నుండున ట్లతనికి శాపం బొసంగి చనియె నంత. 128

సీ. అమరునాఁ డుదయమున నీవార్తను, దేవేంద్రుఁ డెఱిఁగిఁ గాండీవిఁ బిల్చి
తనదుసింహాసనమున నుంచి యిట్లనెఁ నూర్వశీశాప మి దోకుమార
యెఱవేఁడుఁ గావున నీ కది తప్ప ద, జ్ఞాతవాసంబున సంభవించు
నవ్వేళ నాశాప మదిమోక్షమును గాంచఁ, గలదు గావునఁ జింత వల దటంచుఁ
తే. దనయు నాలింగన మొనర్చి యనిమిషేశ్వ, రుండు సంతోషమగ్నుఁడై గాండివికిని
వేలుదివ్యశస్త్రాస్త్రముల్ వెస నొసంగె, నపుడు రోమశమౌనీంద్రుఁ డటకు వచ్చె.

క. ఇంద్రునియర్ధాసనమున, నింద్రుండో యనఁగ నొప్పునింద్రసుతుని భూ
మీంద్రుఁ డగుపార్థుఁ గని మౌనీంద్రుం డి ట్లని వచించె నింద్రునితోడన్ 130

తే. ఈతఁ డెవ్వఁడు తెల్పు మహేంద్ర నీదు, నర్ధసింహాసనంబున నధివసించు
వీనిచరితము వినఁ గోర్కి వెస జనించె, ననుడుఁ బాకారి యిట్లనె మునివరునకు. 131

వ. ఈతండు పాండురాజనందనుం డర్జునుండు. మదీయాంశంబునఁ గుంతికి జన్మించె నని పార్థుని పరాక్రమము దెలిపి మునీంద్రా! భూలోకమ్మున ద్వైతవననివాసుం డగుయుధిష్ఠిరునిగరి కేగి గాండీవి పాశుపతదివ్యాస్త్రలాభము లెఱింగించి యీతనిసేమంబు దెలిపి దేవకార్యము నెఱవేర్చి వచ్చు నని యెఱింగించి ధర్మజుని జాయానుజసహిత

ముగాఁ దీర్థయాత్రలు సేయింపు మని నియోగింప రోమశుం డంగీకరించి యిం
ద్రానుమతంబున ద్వైతవనంబునకు యుధిష్ఠిరునిఁ గనుఁగొనఁబోయె నయ్యెడ. 132

తే. శాంతమున భీమసేనుని శమకతనయుఁ, డూరడించుచు నుండఁగాఁ జేరె నటకు
మౌని బృహదశ్వుఁ డనువాఁడు వాని కెల్ల, పూజలొనరించియు ధర్మసుతుఁ డనియె.

క. సిరులున్ సంపదలు న్విడి, చుబంధుల హితుల వీడి వనవాసమునన్.
బరితాప మొందువారలు, ధరలో నెవ రైనఁ గలరె తాపసవర్యా. 134

వ. అనిన బృహదశ్వుండు యుధిష్ఠిరున కిట్లనియె. నరేంద్రా! మున్ను నిషధరాజగు
నలరాజు నీవలెఁ దనరాజ్యము జూదమున గోల్పోయి యరణ్యవాస మొనర్చె
నన ధర్మజుండు నలోపాఖ్యానము చెప్పు మని కోరినంత నమ్మునిచంద్రుం డమ్మ
నుజేంద్రున కిట్లనియె. —నలోపాఖ్యానము— 135

ఆ. వీరసేనుఁ డనెడుధారుణీ నాథుని, సుతుఁడు ధర్మరతుఁడు సూనృతుండు
నలమహీశ్వరుండు న్యాయశీలంబున, రాజ్యమేలుచుండె రమణ మెఱయ. 136

వ. అయ్యవసరంబున విదర్భానగరంబున. 137

శా. శ్రీమంతుం డనఘుండు సూర్యవరవంశేశుండు ధీమంతుఁడున్
భీమాకారుఁడు నిర్వికారుఁడు జగద్వీరుండు ధీరుండు నై
భీమాఖ్యం గొని పొల్చురాజు ప్రజలం బ్రేమించియు న్మించి ని
త్యామోదంబున నేలుచుండె సకలాహ్లాదంబుగా నప్పురిన్. 138

వ. ఆమహీజానినందన యగుదమయంతి సమస్తసద్గుణోపేత యై సుశీలయై త్రిలో
కసుందరియై వివాహోచితయౌవనవతియై యలరారె నయ్యవసరమ్మున. 139

సీ. ఉద్యానవనమున సువిదలతోఁ గూడి, పూలు గోయుచునున్న కాలమందు
హంసము లెన్నియో యట వచ్చి వ్రాలిన, దమయంతి యొకహంసఁ దాను బట్టె
విడువకున్నను బల్కె విడువు నన్దమయంతి, నీకు మే లొనఁగూర్తు నిక్కముగను
నిషధాధినాథుండు నిత్యసత్యరతుండు, నలుఁ డనునొకరాజు కలఁడు సుమ్ము.

తే. ఆతనికి నిన్నుఁ గూర్చెద నలరుఁబోఁడి, నన్ను విడు మని పల్కె న న్నన్నుతాంగి
విడిచె దానిని శీఘ్రము విడువ గానె, హంస యిట్లని వచియించె నాదరమున. 140

వ. మాచెలికాఁ డగు నలమహీసార్వభౌముండు రూపున మన్మథుఁ బోలియుండు
సామ్రాజ్యలక్ష్మీధురంధరుండును నవనీతమనస్కుండును నగు నీ వాతనిఁ జెట్టవట్టి
నఁ బసిడికిఁ దావియబ్బిన ట్లుండు నన నమ్మరాళముతో నచ్చంచలేక్షణ యిట్లనియె.

చ. నలుని చరిత్ర మంతయును నా కెఱిగించిన హంసరాజమా
నలున కెఱుంగఁజేసి కరుణన్ ననుఁ జూడఁ గదే యటంచు న

క్కలికి వచింప హంస కుతుకంబున నట్లగు నంచు బోయి య
న్నలునిసదేశముం జరిసి నవ్యముఖంబున వాని కిట్లనున్. 142

క. నలరాజ భీముఁ డను భూ,తలజానితనూజ యైన దమయంతి మహో
త్పలచారునేత్ర యామెను, జెలువుగ వరియింపు మయ్య క్షితితలనాథా. 143

వ. అని దమయంతి చరిత్ర మెఱింగించి మరాళము వేంచేసె నలదమయంతు లొకరి
కై యొకరు పరస్పరానురాగమ్మున నుండ భీమమహీజాని పుత్రికావివాహ మహో
త్సవము చాటించి సమస్తరాజబంధుమిత్రాదులఁ బిలిపించిన నెల్ల రేగు దెంచి
రంత నింద్రాగ్నియమవరుణదేవతలు భూతలంబునకు వచ్చి స్వయంవరంబున కేగుచు
న్ననలునిం గాంచి యి ట్లనిరి. 144

తే. వీరసేనకుమారకా విమలచరిత, యర్థులై మేము వచ్చితి మని వచింప
దేవవరు లని తెలిసి యాభూవరుండు, భక్తితోఁ బ్రణమిల్లి తాఁ బలికె నిట్లు. 145

చ. అనిమిషులార పుణ్యమతులార మహామహులార ధన్యులఁర్క
సను నిపు డెద్ది కోరితిరొ నా కెఱిఁగింపుఁడు వేగఁ దీర్తు నే
నని వచియింప దేవవరు లాత్మలలో గడువేడ్కఁ దోగుచుర్
జనపతితోడ ని ట్లనిరి సత్యము తప్పకు నైషధేశ్వరా. 146

క. దమయంతి పాలికిం జని, యమవరుణేంద్రాగ్ను లనెడునమరులలో నా
కమలాక్షి కేరు నచ్చినఁ, గ్రమముగ వరియింపు మనుము రాజవరేణ్యా. 147

చ. అని యిటు దేవనాథు లన నాత్మగతంబున ఖేదమొంది యా
మనుజవరుండు పల్కె నిటు మానిని నేనును గోరి యుంటి నో
యనిమిషవర్యులార తరళాక్షిని మీ కెటు కూర్పనేర్తు నా
మనవి గ్రహించి యప్పనికి మాత్రము నన్ దొలగింప వేఁడెదన్. 148

క. నలుఁ డిటు పల్కిన మదిలో, నలుక వహించియు సురేంద్రు లని రానలుతోఁ
జెలువుగఁ గోరినకోరిక, సలిపెద నని పలికితివి మృషావచనుఁడ వై. 149

వ. అని నిష్ఠురము లాడుదేవతలఁ బ్రసన్నులం జేసి వారివలన నొకయదృశ్యఘుటికం
గొని దానిమహిమమున నదృశ్యుం డై దమయంతి సౌధాంతరమున కరిఁగి చేటికల
లొలసి కొల్వ నచ్చెలువం గాంచి. 150

చ. చెలువలమేలుబంతి యిది శీతమయూఖునిఁ బోలుమోముతోఁ
గలువల మించి పెం పలరుకన్నవతో నవరంజిమేనితో
వల పెసఁగింపఁ జేసిడిని పల్కు లిఁ కేల కిసాలపాణి నీ
యలికులవేణిఁ గోరు టిది యందనిపండ్లకు నట్టు సాచుటే. 151

క. అనుచు దమయంతి వద్దకుఁ, దననిజరూపంబుతోడఁ దాఁ బోయిన న
వ్వనజాక్షి లేచి యర్ఘ్యా, సనమునఁ గూర్చుండఁ జేసె జనవల్లభునిన్. 152

వ. ఆతనివలన సురసందేశము విని వారల నిరాకరించిన సరోజాననతో ధరారమణుఁ
డి ట్లనియె. 153

ఉ. ఓతరళాయతాక్షి సుగుణోన్నతకీర్తి సతీవతంసమా
నాతగుబోధన న్వినుము నైషధు నాత్మను బాయదోలి సం
ప్రీతిని దేవనాయకుని వేడుకమై వరియించి మించి యీ
భూతలమందు సౌఖ్యములఁ బొందుచు శాశ్వతకీర్తి నొందుమా. 154

వ. అనిన దమయంతి దేవత లెట్టివా రైనను వారలను వరింపను. నలుఁడే నాప్రాణ
వల్లభుఁ డని పలుకుచుండ నలుండు తనవృత్తాంత మెఱింగించి చని దేవతలకు
జరిగిన దెల్ల విన్నవించె. వివాహరంగమ్మున నల్వురు దేవతలు నలరూపము దాల్చి
యలరార నిజనలుం గానలేక దమయంతి దేవతల నిట్లు ప్రార్థించెను. 155

చ. సురవరులార మీతనయఁ జూడుఁడు న న్దయతోడ మీర లీ
తరుణిపయిం బ్రతాపమును దర్పము చూపుట పాడి యౌనొకో
ధరణితలాధినాథుఁడు నుదారగుణుం డగునట్టినామనో
హరు నలరాజుఁ జూపుఁడు నిజాత్మ మిము న్వినుతిం బొనర్చెదన్. 156

వ. అని ప్రార్థింప దేవతలు హర్షసంభూతులై నలుం జూపుటయు నళినాక్షి యాతని
కంఠమ్మున రత్నహారము శృంగారించె నంత భీమరాజు నలదమయంతులకు వివాహ
మొనర్చి కానుక లొసంగి నిషధకుఁ బంపించె నంత. 157

చ. కలిపురుషుండు భీమసుత గర్వముతో నను వీడి నీచుఁ డౌ
నలుని వరించెఁ గావునను నైషధుతో దమయంతికి న్వెతల్
గలుఁగఁగఁ జేసి వారలకుఁ గావర మేగఁగఁ జేతు నంచు లోఁ
దలఁచి గమించి పుష్కరుని నైషధబాంధవుఁ గాంచి యిట్లనెన్. 158

తే. జూద మాడుము నలునితో జూదమందు, నీవు జయము గాంచెద వయ్య భూవరాఢ్య
యనిన ముద మంది పుష్కరజనవరుండు, నలునిదరి కేగి యిట్లని పలికె నంత. 159

తే. అగ్రజా నిన్ను గాంచిన దాది నుండి, ద్యూత మాడవలయు నని తోచుచుండె
నాదుకోరిక నెఱవేటఁ బ్రోది చేసి, జూదమాడఁ గడంగవే మోదమలర. 160

చ. అనిన నలావనీశుఁడు నిజాత్మ విచారము చేయకుండ న
య్యనుజునితోడ దుష్టకలినాత్మునితోఁ దెగియాడె జూదముల్

జనవరపూజ్య మాతనదునస్త్వమహీతలరాజ్య మొడ్డి దు
ర్జనుఁ డగుఁబుష్కరాహ్వయుఁడు రాజ్యము సర్వము గెల్చె మాయచేన్. 161

తే. అంత నలుఁడు కవచకిరీటాదు లొడ్డి, యోడె సర్వధనంబుల నోడిపోయె
నశ్వసాధము లోడెను రాజరాజు, కలి యొనర్చినదుష్కృతకార్యమునను. 162

వ. పుష్కరుఁడు సమస్తము గెల్చినవాఁడై నలుని సతీసమేతముగాఁ బురి వీడి పొ
మ్మన నలావనీశుండు సహధర్మచారిణి యగుదమయంతి కిట్లనియె 163

మ. వనితారత్నమ యేమి తెల్పుదును యానా రాజ్య మే నోడితిన్
ఘనమగా నాదుమణికిరీటమును లోకం బెంచు ఛత్రంబుతో
నను నావీటిని బాసి పొమ్మనుచు నన్యాయంబుగాఁ బుష్కరుం
డనియెన్ గష్టము సంభవించె నిది నీ కత్యంతదుఃఖం బగున్. 164

చ. నలుఁ డటువిన్నవించిన మనమ్మున ఖేదముతో భయమ్ముతో
గలువలకంటి కన్గవను గాలువలై జలముల్ స్రవింపఁగాఁ
దలువను బుష్కరుం దలఁచి దూరి కటా యెటులైతి మంచు లో
గలి యొనరించుదుష్కృతము కొంత యెఱింగి విచార మొందుచున్. 165

వ. అంత నలదమయంతులు తమబిడ్డల విదర్భకుం బంపి యిద్దరును వనమ్ముల
కేగి కలిబాధ సహింప లేక పక్షిద్వయంబుం గని దానిం బట్టి తిండ మని నృపతి
యుత్తరీయము పైకెగుర వేయ నయ్యవి వసనం బపహరించి పై కెగిరిపోయిన
నుఱింత విచారించి యిర్వురు నేకవస్త్రధారులై భూశయ్య శయనించి రంత
నలుండు మేల్కాంచి. 166

సీ. దమయంతి నెడఁ బాయఁ దనదుబుద్ధికి దోఁప, నకియ చేలంబును సగము ద్రుంచి
పలుమాఱుఁ దనగతిఁ దలఁచి శోకించి యూ, పడఁతి విడువ లేక విడువ లేక
విడనాడి పోయెను విమలోజ్జ్వలాంగినిఁ, గానలోఁ గడుభయంకరములోనఁ
గొంతవడికి మేలకువఁ గాంచి దమయంతి, తనచీఱ సగముంటఁ దలఁచి చూచి
తే. నలుఁడు తన్నుఁ బాసె నటంచుఁ బలువిధముల, నాత్మలోన విచారించి యడలుచుండ
నంత నొకకిరాతుఁడు వచ్చె నతనితోడఁ, దనదుచరితముఁ దెలుప వాఁ డనియె నిట్లు.

చ. నలుఁ డతిపాపి యాట నళినాక్షి భయంకర మైనకానలోఁ
దలిరులబోఁడి ని న్విడిచి తా నెట కేగెను దుర్మదాంధుఁ డా
నలుని మనంబులో విడిచి న న్వరియింపు కిరాతనాథుఁడన్
బలువిధ మైనసంపదలు వచ్చెడు నీకు మదేభగామినీ. 168

వ. వాఁ డట్లన నద్దేవి తోకఁ ద్రొక్కినకాలాహి వలె మండి. 169

ఉ. ఏను మహాపతివ్రతన యేని మదీయపతికి నలున్ సదా
మానక కొల్తునేని సురమానవుల భక్తిం దలంతునేనియున్
మానలరాజు సత్యమును మానఁడ యేని కిరాతనాథుఁ డీ
కాననసీమ నన్నుఁ బలుకాఱులు పల్కెడు దాన దగ్ధుఁ డౌ. 170

క. అని సంతఁ గిరాతుం డా, వనితామణి శాపమునను వసుధాస్థలమం
దునఁ బడి దగ్ధుం డయ్యెను, ఘన మైనసతీత్వ మెన్నఁగా వశ మౌనే. 171

సీ. అటు కిరాతుఁ శపించి యాసతీరత్నము, సమువరాని యెడారి నడచి నడచి
పతి నందు వెదకుచు గతి లేక శోకతయై, యధికశోకంబున నడవి దాటి
చేదిపురంబుకు జేరి నప్పురిలోన, రాణి యా విప్రుల యారమణిఁ గాంచి
తనకు సైరంధ్రిగాఁ దా నుంచికొనియెను, ధారుణీశ్వర పత్ని దాసి యయ్యె

తే. నలుఁడు సర్పదష్టుం డయి చెలువు చెడియు, బాహుకుని పేరిట నయోధ్య వచ్చి యుఋతు
పర్ణునింట వంట వానర్చి బ్రతుకుచుండెఁ, గాలగతి యేరికిం దాటఁగాదు సువ్వె. 172

వ. అంత భీమసేనేంద్రుఁడు పుత్రికాజామాతలకై యనేకదేశములను వెదకించి విప్రులఁ జేదినగరమునకుఁ బంపించి విప్రులాంతఃపురసౌధమున నూడిగము లొనర్చు దమయంతి నానవాలు పట్టి విదర్భకుఁ గొంపోయి నలునికై వెదకించుచు. 173

సీ. నలుని రప్పింపఁగఁ దలఁచియు మదిలోన, పాయ మారయుచుండెఁ బార్థివుండు
తనప్రియపుత్రిక దమయంతికి ద్వితీయ, వైవాహికము నర్పు వాఁడ ననుచుఁ
బత్రిక నొక్కటి వ్రాసి యయోధ్యలో, ఋతుపర్ణునకుఁ బంపె రూఢి మీఱ
ఋతుపర్ణుఁ డది చూచి యతివ పెండ్లికిఁ బోవ, సమకట్టి బాహుకు నరగఁ బిల్చి

తే. బాహుకా విదర్భకుఁ బోవవలయు మనము, తురగములఁ దేరునకు సిద్ధపఱుపు మనుడు
మాయ దమయంతి స్వ్నాంత మాయఁ జేసె, నని విచారించె నెంతయే నానలుండు.

వ. అంత నలుం డశ్వహృదయవిద్యాప్రభావమ్మున నొక్కపూటలో నూరుయోజనములమేఱ విదర్భకుఁ గొనిపోవ ఋతుపర్ణుండు సంతసించి తనయక్షహృదయవిద్య నలున కుపదేశించె భీమరాజువారల కొకదివ్యభవనమ్మును విడిదగా నేర్పఱిచె నంత.

సీ. బాహుకుం డొక్కచోఁ బాకంబు లొనరింప, దమయంతి యచటకుఁ దాను బోయి
వానితోఁ గొంతసంభాషించి యాతని, వ్యతిరేకవాక్యముల్ మతిఁ దలంచి
యశ్వహృదయవిద్య యచ్చు లెఱుఁగఁ గరంచు నాతనిఁ దననాథుఁ డని గ్రహించి
నాప్రాణనాయకా నన్ను మన్నింపవే, నాతప్పులు మరచి భూతలేంద్ర

తే. నిన్ను రప్పింపఁగా నిట్లు పన్నియుంటి, రాజ్యహీనత నీ విందు రా వటంచు
స్వీకరింపుము దయను నన్ స్వీకరింపు, మనుచుఁ బ్రార్థించి మ్రొక్కిన నాతఁ డనియె.

మ. తరుణీ నన్నొకవంటవానిఁ గొలువన్ దప్పౌను నీపెండ్లిలో
వరుఁ డెవ్వాఁ డగునో కదే యనినినిన్ బ్రార్థింపనొఁ గా కిటుల్
పరులన్ బ్రొక్కుమటంచు నీకు ఖలు లెవ్వారల్ నివేదించిరో
త్వరితం బవ్వలఁ కేగుమంచు నన నప్పద్మాక్షి తా నిట్లనున్. 177

చ. అనయము నిన్ను నామదిని ధ్యానము చేయుచు నేటి దాఁక నీ
తనువును నిల్పి కొంటి నిఁకఁ దా నెవ్వ డైనను వత్తునంచు ని
ట్లనుటలుఁ పాడియే నృపవరా ననుఁ బ్రోవ విదేల నేను నీ
వనితను గానె యన్య నఁటె భావములో దయఁ జూడవే ననున్. 178

తే. నాదుతప్పు లెల్ల మఱవు నాహృదీశ, నీపదాబ్జముల్ బ్రొక్కెద నెలమితోడ
ననుచు దమయంతి ప్రార్థింప నానలుండు, పలికె దమయంతితోఁ బనచెలువతోడ.

తే. చెలియరో నేను బూర్వఁపునలుఁడఁ గాను, రూపు మాఱినవికృతఁపురూపువాఁడ
నిట్టివికృతుఁడు నీ కేల యింతి యనిన, నీవె నాదుదైవ మటంచు నెంత పలికె.

వ. అప్పు డానలుండు పూర్వము దన్నుఁ దలంచిన కర్కోటకుం దలంచుచు. 181

మ. కలియాజ్ఞన్ నిరసింప రా దనుచు నాకాంతారమధ్యంబులో
పల నున్న న్ననుఁ జూచి నీవు కఱవన్ బ్రార్థించితిన్ నిన్ను నన్
దలఁపన్ నీదుసురూప మిత్తు ననుచున్ దథ్యంబుఁగాఁ బల్కినిన్
దలఁతున్ నాదుసురూప మిమ్ము ఫణినాథా నేఁడు కర్కోటకా. 182

చ. నలుఁ డటు భక్తితో భుజగనాథుని సంస్మరణంబొనర్పఁగా
పలువ యొకండు వచ్చి జనవల్లభుపైఁ బడ రూపు మాఱి ము
న్నలుఁ డయి సుందరుం డయి మనంబున మోదము నొందుచున్న న
వ్వల ఋతుపర్ణ భీమనరపాలురు వచ్చిరి సంతసంబునన్. 183

వ. బాహుకరూపము మాఱి పూర్వఁపునలుఁ డైన జామాతం గాంచి నిన్ను రప్పించుట కిట్లు పన్నియుంటి విమలశీల యగునాకూఁతుం బరిగ్రహింపు మని భీమరాజు ను వంటలవాఁ డని నీచే నీచకృత్యములు చేయించిన నన్నుఁ గరుణింపు మని ఋతుపర్ణుండును నానేరములు సైచి స్వీకరింపుమని దమయంతియు బ్రతిమలాడిన నలుం డందఱఁ గారవించి దమయంతి కిట్లనియె. 184

సీ. నామనోహారిణి నాగృహాజయలక్ష్మి, నినుఁ బెడబాసితి వనములోన
విడనాడ లేక ని న్విడనాడి పోయితి, నాకర్మగతి యట్లు నాకుఁ దోప
రమణీయ మగు సౌధరాజములం దుండు, సతిని ని న్నెంతయో వెతలఁ బెట్టి
సిగ్గుమాలినయట్టిచిత్తముతోడను, బ్రతికియున్నాఁడ నీవసుధలోన

తే. నాదులోపముల్ మన్నించి నళిననేత్ర, నన్నుఁ బ్రోవవే యని వేఁడుచున్న వాఁడ
నగిన దమయంతి యామోద మంకురింపఁ, బ్రాణనాథునితో నిట్లు పలికె నంత.

తే. అనఘ నన్నిట్లు పల్కుట న్యాయమటవె, నిన్నుఁ గనినంతఁ బ్రాణముల్ నిలిచె నాకు
మనకుఁ గలకష్టములు దీఱె మానవేంద్ర, పుష్కరుని గెల్చి రాజ్యము పొందుమింక.

వ. అంత నలమహీనాథుండు దమయంతీసమేతుండై బాంధవులతో నిషధ కేగి పుష్కరునితోఁ జూదమాడి వాని నోడించి విజయలక్ష్మీసమేతుండై పుష్కరుని క్షమించి వాని దేశమునకుఁ బంపి బంధువుల సగౌరవముగా వీడ్కొలిపి దమయంతీదేవితో నిరంతరసౌఖ్యాబ్ధి నోలలాడుచు రాజ్యము పాలించుచుండె. 187

క. దమయంతీనలచరితము, క్రమముగఁ బఠియించువారు కడువేడుకతో
విమలమతి విన్నవారును, క్షమఁ గలిబాధలకు వీడి గడఁగెద రెప్పుడున్. 188

వ. యుధిష్ఠిరా! నీవు నలునివలె నిడుమలఁ బడినను నజ్ఞాతవాసానంతరమునఁ బూజ్య సామ్రాజ్యపట్టాభిషిక్తుండ వగుదు వని బృహదశ్వుం డదృశ్యుండయ్యెఁ బాండవు లాఖండలాత్మజాగమనము కోరుచుండఁగా నారదుం డరుదెంచిన ధర్మజుఁడు సజాయానుజముగా నాతనిఁ బూజించె నంత నమ్ముని కమ్మనుజేంద్రుఁ డిట్లనియె. 189

## — తీర్థయాత్రాప్రభావము —

తే. భూమికిం బ్రదక్షిణముఁ బోలె నున్న, సర్వతీర్థముల్ సేవించు సజ్జనులకుఁ
గలుఁగు సుకృతంబు వినఁగోర్కె కలదు కాన, నాకుఁ దెలియఁగఁ జెప్పవే లోకవినుత.

వ. అనవుఁడు నమ్మునీంద్రుఁ డిట్లనియె. 191

క. గోదానంబులు ఘనతర, భూదానంబులు సువర్ణముఖదానములున్
మోదమున నిచ్చుఫల మో, మేదినివర తీర్థయాత్రమెయి లభియించున్. 192

తే. క్రతువు లొనరించువారికిఁ గలుఁగుఫలము, నన్నదానాదు లొనరించునట్టిఫలము
గుడులు గోపురాల్ గట్టించుగొప్పఫలము, తీర్థయాత్రఁ జేసినఁ గల్గుఁ బార్థివేంద్ర.

తే. ధరణిఁ బుష్కరిణి యనుతీర్థము వెలుంగు, నందుఁ బదికోట్లతీర్థము లలరుచుండు
నజుఁడు సురలతో నివసించు నందులోన, దానిఁ దలఁచినఁ బాపముల్ దరలిపోవు.

వ. మఱియు నగస్త్యసరోవరంబును, ధర్మారణ్యంబును, యయాతిపతనస్థలంబును, కోటితీర్థంబును రుద్రవటంబును నర్మదయుఁ జర్మణ్వతియు వసిష్ఠాశ్రమము, పింగళము, ప్రభాసము వరదానము సరస్వతీసాగరసంగమము పిండారకము వసుద్వారము భద్రతీర్థము వీనియందు స్నానము పితృతర్పణము నొనర్చినవారికి సహస్రగోదానఫలంబును దశాశ్వమేధఫలంబును నగ్నిష్టోమమహాఫలంబును బహుధనధాన్యాదిసంపదలును గలిగి యుత్తమలోకనివాసము గాంచఁగలుఁగు నని మఱియును. 195

సీ. నైమిశం బనఁగఁ జనరుమహాక్షేత్రము, నందుఁ గురుక్షేత్రమందు మఱియు,
పారిప్లవం బనఁబడెడుతీర్థమునందు, శాలూకిని యనెడుజలమునందు,
నశ్వినీతీర్థమునందు నను జయంతి, యందు రామహ్రదమందు నవలఁ
గాయశౌచమునందు గపిలతీర్థమునందు, శ్రీతీర్థమందును శ్రేయ మలర
తే. బరఁగుసూర్యతీర్థమున గోభవమునందు, యక్షమాతృతీర్థంబుల యందు భక్తి
స్నాన మొనరించు మానవుల్ సద్గతులను, బొందిసర్వసౌఖ్యంబులఁ బొందఁగలరు.

వ. స్వర్గద్వారం బగుగంగాద్వారంబునఁ గ్రుంకులిడిన శతకోటితీర్థయాత్రాఫలంబు లభించు గంగాగోదావరీసరస్వతీసాగరసంగమము పెన్న తుంగభద్ర శూర్పారకము మొదలుగాఁ గలపుణ్యతీర్థమ్ముల నాడినఁ బుణ్యలోకప్రాప్తియు గోసహస్రదానఫలంబును నశ్వమేధఫలంబునుగలుఁగు సర్వతీర్థములలోఁ బ్రయాగముత్తమ మైనది కోటియజ్ఞములొనర్చినఫలముకన్నఁ బ్రయాగస్నానము మహాత్మ్యమెక్కువ యని యనిమిషులు వచించుచుందు రాకర్ణింపుము. 197

ఆ. పుడమిలోన నున్నపుణ్యతీర్థము లెల్లఁ, దెలుప వశము గాదు నలువ కేని
ధర్మరాజ నీవు తమ్ములతోఁ గూడఁ, జేయు మయ్య తీర్థసేవనమ్ము. 198

వ. అని సర్వతీర్థవృత్తాంతమాహాత్మ్య మెఱింగించి కలహప్రియుఁ డంతర్ధానం బయ్యె ధర్మజుండును ధౌమ్యులతోఁ దీర్థయాత్రాప్రసంగంబు చేయుచుండునంత రోమశమహాముని విచ్చేయుటయు యుధిష్ఠిరుం డర్ఘ్యపాద్యాదివిధుల సత్కరించి యెందుండి యేతెంచితి రని ప్రశ్నింప రోమశమునీంద్రుండు మనుజేంద్రున కి ట్లనియె. 199

ఆ. అమరపురమునుండి యరుదెంచినాఁడను, ధర్మరాజ నీదుతమ్ముఁ డైన
యర్జునుండు వజ్రిమూర్ధాసనంబున, నున్న వానిఁగంటి గన్ను లలర. 200

సీ. అతఁ డెవ్వరో యని యాత్మ సందియ మంద, దేవేంద్రుఁ డిట్లనెఁ దెలియ నాకుఁ
బాండునందనుఁ డైనఫల్గుణుం డీతండు, విపినమందున ఘోరతప మొనర్చి
యీశుని మెప్పించి పాశుపతాస్త్రముఁ, బడసినవాఁడు దోర్బలయుతుండు
దేవవర్యులవల్ల నావలనం గొన్ని, దివ్యాస్త్రములు గొనెఁ దేజ మలర
తే. వీనిశస్త్రాస్త్రలాభ మోహానివర్య, ధర్మజునకును దెలుపుము ధరణిఁ గలుఁగు
తీర్థయాత్రలు సేయింపు పార్థు నతని, ననుచు వజ్రి పుత్తెంచె న న్నవనినాథ. 201
తే. దేవకార్యములన్నియుఁ దీర్చియవల, నర్జునుఁడుమీకడకువచ్చుననుచు దెలుపుమనియె
నాశైలశాసనుఁ డనఘచరిత, తెలియుమని రోమశుం డట్లు తెలుపుటయును. 202

చ. అనుజుని క్షేమవార్తయును నస్త్రము లెల్ల లభించి యుంటయున్
విని యమనందనుండు కడువేడుకతోడ నెసంగెఁ దమ్ములున్

వనితయు సంతసంబునను వ క్కలి ర త్తఱి రోమశుండును స
జ్జనవిభునిం బ్రియోక్తులఁ బ్రశంస యొనర్చె న సంతరంబునన్. 203

వ. ధర్మనందనుండు రోమశపురస్సరంబుగా సమస్తమహీసురులుం దమ్ములుం గొమ్మయుం దోడరాఁ దీర్థంబులు సేవింపఁ గదలి చని యందందుమహామునులవలన ధర్మవిశేషంబులెఱుంగుచునగస్త్యచరిత్రంబును భగీరథచరిత్రంబును సగరసుతులుభస్మీభూతు లగుటయుఋష్యశృంగమునిచరిత్రంబును బరశురామచరిత్రమును సుకన్యోపాఖ్యానంబును మాంధాతృచరిత్రంబును సోమకరాజర్షి చరిత్రమును శిబిచరిత్రమును నష్టావక్రుచరిత్రమును విని గంధమాదనపర్వతముఁ జేరంజనియొనయ్యవసరమ్మున ఘటోత్కచుండు వచ్చి వారి నెల్ల మోచుకొనిబదరికాశ్రమంబునం డించి చనినవా రందు విశ్రమించి రంత నొక్కనాఁడు. 204

సీ. భీముండు కృష్ణతో విహరించుచుండంగ, వాయువేగంబున వచ్చె నొక స
హస్రపత్రకమల మది చూచి పాంచాలి, తత్సుందరత మెచ్చి తగ వచించె
నిట్టిసుందరపుష్ప మొం డైన నుండిన, గొని తె మ్మనుచు భీముఁ గోరుటయును
ద్రౌపదికోర్కి దీర్పఁగ నెంచె భీముఁడు, పాంచాలి ధర్మజు పజ్జ కరిగె

తే. భీముఁడు గదాయుధంబును వెస ధరించి, పుష్పము పడినదెస పట్టి పోయి పోయి
కనియె నొకసరోవర మొక్కకాననమున, మదికి నానంద మొంతయు మసలుకొనగ.

వ. ఆసరోవర తీరంబున నొకశిలాతలమ్మున నూర్ధ్వదేహుండై దారి కడ్డుగం బవళించి
నిద్రించుహనుమంతుం గాంచి భీమసేనుండు సింహనాద మొనర్చె నంత. 206

—॥ భీ ము డాం జ నే యుం జూ చు ట ॥—

ఉ. ఆకపివంశచంద్రుఁ డపు డారవము న్విని లేచి పల్కె ని
ట్లోకరుణావిహీన యిపు డుంటిని నిద్దురలోన వృద్ధుఁడన్
నీ కిటు లేపఁ దోచె నను నీతి యె ఱుంగవొ చెప్పు మయ్య నీ
వీకమలాకరంబునకు నేటికి వచ్చితొ కార్య మెద్దియో. 207

వ. అనిన భీమసేనుం డతని కి ట్లనియె. 208

సీ. వనచరేశ్వర నేను పాండుభూపతికిఁ గుం, తీదేవియందునఁ దేజ మొనఁగ
వాయువరంబునఁ బ్రభవించినాఁడను, భీమసేనుం డను పేరివాఁడ
నే నొకకార్యార్థి నీపర్వతంబును, లంఘించి పోవలె లలితగతుల
హనుమత్పరాక్రముఁ డంద్రుడు నన్న వనిలో, ననుటయు హనుమానుఁ డనియె నిట్లు

ఆ. ముసలివాఁడ నేను భూనాధ నాతోక, జరిపి యవలి కేగు సత్వరమున
ననుఁడు భీమసేనుఁ డాకపీంద్రునితోక నవల జరుపఁ దలఁచె నతిబలమున. 209

క. తనభుజబల మంతయు జూ, పిన నయ్యాది జరుఁగకున్న వీక్షించియుచున్
వనచర నాథా! నీ వొక, ఘనుఁడవు సామాన్యుఁ డైనకపి వె ట్లైతో. 210
తే. నన్నురక్షింప నరుదెంచినట్టినీ వ, యాత్రిమూర్తులలో నొక్కఁ డౌదువో మ
హాత్మ నిజము తెల్పు మటంచు నడుగు నెడల, నవ్వి హనుమానుఁ డిట్లనె నరవరునకు.
మ. హనుమంతుం డను వాఁడ వాయుజుఁడ నే నౌదుం జుమీ నీవు నా
యనుజుం డౌదు వటంచు వానిఁ దగ మూర్ధాఘ్రాణముం జేసియున్
ఘనరూపంబును జూపి మీ కవల యుద్ధం బొందు దాపించు న
య్యనిలోఁ బార్థు రథధ్వజంబుపయి నే నాహ్లాదినై యుండెదన్. 212
వ. అనిసౌగంధికమార్గము చూపి యదృశ్యం బయ్యె నయ్యెడ. 213
సీ. భీమసేనుం డంత విమలసరోవరం, బున కేగి కోసెను బుష్పములను
నచట గావలి యుండు యక్షరాక్షసులెల్ల, వాయుపుత్రునితోడఁ బలికి రిట్లు
ఈసరోవరమున నీపుష్పములఁ గోయ, సాహసించితి వేల జనవరేణ్య
యిది కుబేరునివనం బెఱుఁగవొకో యతఁ, డిది విన్న నిను జంపు మద మడంచి
తే. యతనికడ కేగి యాతని యాజ్ఞఁ బొంది, కోసికొనుమ యీపుష్పముల్ కోర్కె దీఱ
నిట్లుచేయక పోయిన నిపుడు నిన్ను, మేము దునుమాడువారము మేదినీశ. 214
వ. అప్పలుకులు లెక్క సేయక వృకోదరుం డిట్లనియె. 215
సీ. నేను పాండునృపాలసూనుండ నిర్వక్ర, విక్రమక్రముఁడను విపులబలుఁడ
భీమసేనుం డనుపేర నొప్పినవాఁడ, పాంచాలికోర్కెఁ దీర్పఁగఁ దలంచి
యీపుష్పరాజము లేఁ గోయుచున్నాఁడ, శౌర్యవంతులు మహాక్షత్రియులకుఁ
దమపరాక్రమమును దాము చూపుటె కాని, యొకరియాజ్ఞలలోన నుండఁ దగదు
తే. అనుచుఁ బ్రత్యుత్తర మొసంగియచటఁ బూలు, కోయుచుండెను సతికిచ్చుకోర్కెతోడ
యక్షరాక్షసుల్ సైప లేకతనితోడ, యుద్ధ మొనరించి వా రెల్ల నోడి రంత. 216
వ. వా రాసంగతి కుబేరున కెఱిఁగించుటయు నతండు భీమసేనునిపరాక్రమమున కా
శ్చర్యమగ్నమానసుఁడై వాని నేమియుఁ జేయఁ జాలక యూఱకుండె నంతనక్కడ.
ఉ. తమ్ముఁడు రాకపోయె నని ధర్మతనూజుఁడు చింతఁ బొంది పు
ష్పమ్ముల కేగి నాఁడనుచుఁ బంకజలోచన కృష్ణ తెల్పఁ జి
త్తమ్మున నొంటి పోయె నని తద్దయుఁ జింతిలి యెల్ల తమ్ములుం
గొమ్మయు విప్రవర్యులును గూడఁగఁ బోయె వృకోదరుం గనన్. 218
అంత నజాతశత్రుండు సౌగంధిక సరోవరమ్మున కేగి యచట వృక్షంబునీడను విశ్ర
మించువాయుపుత్రుం గాంచి కౌఁగిలించిననతం డన్నకు మ్రొక్కి సౌగంధికపుష్పంబులు

తే. నీవె యష్ట దిగ్గునెడలను నిన్నెవఁడును, గాని యాపదఁగ లేదని నే నెఱుఁగుదు
నలుక లేవట్టివాఁడవు నీ వలుకఁ గనెద, సత్వరింపుము వింక నో సార్వభౌమ. 2

క. అని పలికిన ధర్మజుఁడు, వనజాక్షునిఁ బ్రస్తుతించి పలికెన్ దేవా
యనవరతము మానేము, గను జూపెడు వాఁడ వీవె ఘోరాపదలన్.

సీ. గోపాలదేవా! యోగోవింద మాధవా!, కరుణాంతరంగుఁడై కష్టమునకు
బహుదూరమున నున్న వారి మమ్ములఁ జూడ, వచ్చితి వత్యంతో వనజనాభ
భవదీయదర్శనభాగ్యమువలన మా, నయనముల్ సఫలముల్ నందతనయ
మాయందు నీ ప్రేమ మాకెవిధంబగు, భయము లేదయ్య యో వాసుదేవ

తే. స్వల్పకాల మున్నది వనవాస మింక, నదల నజ్ఞాతవాసము నైన వెనుక
వైరివీరుల మొనఁ బ్రభావంబుఁ జూపి, వారి జయింపఁ దలఁచితి నారసాక్ష. 2

తే. నీవె మముఁ బ్రోచుభారము యాదవేంద్ర, నీ భుజస్కంధమున నిడి నిలుపవలెఁ
నిను శరణుఁ గోరి యుంటిమి నెమ్మితోడ, దేవ దేవ నీవే మాకుఁ దిక్కుగా వెం

వ. అని దేవకీనందనునకుఁ గుంతీనందనుఁడు వందన మొనర్చి జగదీశ్వరా! నీ శరణ
జొచ్చిన మాకు విజయలక్ష్మి చేకూరుట కేమి సందియ మనె నంత పరమేశ్వరుఁ
సమీపంబున గల ద్రుపదరాజాత్మజం గారవించి సాధ్వీ! నీపుత్రులు సుఖంబున్న
రభిమన్యునితో శస్త్రాస్త్రవిద్యాదుల నభ్యసించుచున్నారు. నీవు చింతఁ ద
యుండు మనియె నంతలో మార్కండేయమునీంద్రుం డేతెంచిన నాతని కర్ఘ్య
ద్యాదు లొసంగి పూజించి రంత వనజనాభుం డమ్మునినాధుని కిట్లనియె.

ఉ. దేవర పార్థులే నవనిదేవత లెల్లరు నీదు రాక చే
పావను లైతి మోయనఘ ప్రస్తుతిఁ జేయుచునుంటి మా కిటన్
పావన మాపురాణములు పార్థివముఖ్యుల సచ్చరిత్రముల్
నీవలన న్వినంగఁ గమనిచ్చఁ జనించె మునీంద్రచంద్రమా.

— కర్మగతి ప్రకారము. —

ఆ. అనినఁ గృష్ణునుతుల కానందమును బొంది, ధర్మరాజు పలికెఁ దపసితోడ
నరుఁ డొనర్చు సుకృతదురితము లిందునో, యందునో భజించు టనఘ తెలుపు.

సీ. అనిన మార్కండేయుఁ డప్పుడా గాక యని యిట్లు పలికె ధర్మజునితోఁ జెలువుమీ
మనుజు లొనర్చెడు ఘనపుణ్యపాపముల్, కాయముఁ దొఱఁగిన గర్మఫలము
మేనినీడను బోలెఁ దా నేగు వెనువెంట, బుణ్యపాపము లందుఁ బొందఁ జే
దమువు నెడివఁ గర్మతతి నెడ దెప్పుడు, కర్మమే భవమునుఁ గలుగఁజేయుఁ

చ. తెలియక పల్కినా నటుల దేవి దయామతి నన్ను సైపు నీ
పలుకులలో సుధారసము బ్రచ్చికొనన్ భవదీయవృత్తముల్
తెలిసితి మోద మయ్యె నిఁకఁ దెల్పుము సాధ్వులవృత్తమున్నఁదాఁ
బలికెను గృష్ణ మాధవునిపత్నికిఁ దేనియతేట లొల్కఁగన్. 259

క. సతికిఁ బతికంటె దైవము, క్షితిలో వేఱొండు లేదు శీతాంశుముఖీ
పతిభక్తి మోక్షమార్గము, పతియానతి దాటఁజనదు భామల కెందున్. 260

తే. ప్రతిదినము భయభక్తులఁ బతికి సేవఁ, జేయ వలయుఁ దదానతిఁ జేయ వలయుఁ
బతులు దెల్పురహస్యముల్ పరులెవరికిఁ, దెలుపఁగా రాదు వినుమమ్మ చంద్రవదన.

తే. కులట చెలులతోడను మైత్రి కూడదెపుడు, నుత్తమాంగనలనుగూడి యుండవలయు
భర్తకును హితులగువారు వత్తురేని, మిగుల మర్యాద నొనరింపఁదగును దరుణి.

తే. ఉన్నదానితో సంతుష్టి నొందవలయు, నతిథు లేతెంచు నెడల నత్యధికభక్తి
గారవింపంగ వలయును గలిగినంత, ధర్మము లొనర్పవలయును దలిరుబోఁడి. 263

వ. అని చెప్పిన సత్యభామ ప్రీతచిత్తయై దేవి! నీచెప్పినట్లిఁకమీఁద మెలంగెద నీవు చింతఁ దక్కి యుండుము నీపుత్రులు ప్రతివింధ్యాదులు ద్వారకలో సుఖులై యున్నవారలు, నీవు చతుస్సముద్రముద్రితమహీమండలమునకు దేవేరివగుదు వని యాజ్ఞసేనికిఁ బ్రదక్షిణనమస్కార మొనర్చి శ్రీకృష్ణరథం బారోహించెఁ బుండరీకాక్షుండు పాండవేయుల వీడ్కొని ప్రియాసమేతముగా ద్వారవతికేగె మార్కండేయుండు నిజాశ్రమమున కేగెను బాండవులు ద్వైతవనంబు చేరుటయు నంత. 264

పాండవుల వనవాసమునకు ధృతరాష్ట్రుండు చింతించుట.

సీ. హస్తినాపురమున నయ్యాంబికేయుఁడు, పాండవేయులు ఘోరవనమునందు
నిక్కట్టులం బొందు టెఱిఁగి మనంబులో, నిట్లని చింతించె నెంతయేని
నక్కటక్కట నీమఁ దైవముర్యోధను, వలనఁ బార్థుల కెట్లు వచ్చె నకట
నలువురు సోదరుల్ గొలువ వైభవమున, సకలరాజులు దన్ను సన్నుతింప

తే. ధారణీచక్ర మేలెడుధర్మసుతుఁడు, ఘోరకాంతారములలోనఁ గ్రూరమృగస
మూహములలోన నివసించి దేహసౌఖ్యములను విడనాడి కష్టముల్ పొందుచుండె.

తే. అతులితపరాక్రముఁడు శతక్రతుసుతుండు, పార్థుఁడేక్రియ శౌర్యము వదలెనొక్కొ
బాహుబలయుతుఁడగువాఁడు వాయుతనయుఁ, డెట్లు వేగించుచుండెనో యెఱుఁగనకట.

క. సుకుమారదేహులును గవ, లకలంకులు రణనిపుణులు నతులితబాహా
ప్రకటితసత్వులు, నగుమా, ద్రికుమారకు లెట్లు లుంద్రో తెలియదు కట్టా. 267

తే. ఎండకన్నను వానక న్నెఱుఁగకుండ, నంతిపురిఁ బరిచారిక లనుదినంబు
గొలువ ఘనవైభవము నొందుకోమలాంగి, ద్రుపదసుత యెట్టులున్నదో విపినమందు
సీ. అర్జునుండు తపించి యమరుల మెప్పించి, దివ్యాస్త్రములఁ గొనెఁ దేజ మలర
నజ్ఞాతవాసవర్షానంతరమున, శ్వేతవాహనిలప్రేరిత మయి
భీమసేనదవాగ్ని పెచ్చుపెరిఁగి కర్ణ, సౌబల ముఖ్యవృక్షములతోడఁ
గౌరవారణ్యముఁ గాల్చక యుండునా, కురుకులం బెల్లను గూలిపోవఁ
తే. గాలమాసన్నమయ్యె నిక్కముగ నింక, భీముఁ దలఁచిన గుండెలో భీతి గలుఁగు
నర్జునాస్త్రలాభము విన్న నగు భయంబు, దైవనిర్మాణమెట్టిదో తప్పదకట. 269
క. దీనికి నేనే మూల, మ్మానాఁడు దురోదరమ్మ నాఁగక పోక
నేను వలదన్న మానరె, నేనే దుర్వ్యాప్తిఁ గొంటి నిశ్చయ మకటా. 270
వ. అని విచారించుచుండునంత దుర్యోధనుండు కర్ణసౌబలాదులతో నాలోచించి పాం
డవులం జంపఁ దలఁచి ధృతరాష్ట్రుంగాంచి యిట్లనియె. 271

—ఘోషయాత్ర.—

సీ. ద్వైతవనమునందువజలుగోవులఁ గావ, దుష్టమృగంబులఁదునుమ వలయు
నానతిమ్మనుటయు నయ్యంబికేయుఁడు, వల్లె యటంచును బలికినంత
దుర్యోధనుఁడు కర్ణుతోడ సౌబలుతోడ, సోదరశతముతో మోద మలర
ద్వైతవనము సేరి తత్సమీపమునఁ గ్రీడాగారము లొనర్ప నాజ్ఞఁజేసె
ఆ. సేవకాళి యట్లు సేయుచునుండ గంధర్వు లరిగి రటకుఁ ద్వరితగతుల
ధార్తరాష్ట్రులంత ధూర్తులై వారితో, రణమునకు గలఁగిరి రభసమునను. 272
సీ. కౌరవు లచ్చట గంధర్వులను గూడి, పోరుచునుండిరి ఘోరముగను
నంత గంధర్వేశుఁ డగుచిత్రసేనుఁడు, దుర్యోధనుం బట్టి శౌర్యమడర
విగతరథుం జేసి వెసఁ గేశపాశముల్, పట్టి యీడ్చుచు నేలఁ బడఁగ వైచి
తనరథంబునఁ బెట్టికొని పోవుచుండెను, దుశ్శాసనాదులు దురము విడిచి
తే. పరుగులిడుచుండి రప్పుడు కురుసమూహ, మందు కొందఱు ధైర్యాత్ములైనవారు
ద్వైతవనమునఁ బాండురాట్తనయు లున్న, వార లసి పోయి తెల్పిరి వారికెల్ల.
క. శరణు శరణంచుఁ బల్కిన, కురుసైన్యము గాంచి పలికెఁ గుంతీసుతుఁడా
పరమూర్తి భీముఁ డౌరా పరమానందమ్ముగూర్చు పలుకులు వింటే .274
వ. మేము చేయఁదలఁచినది గంధర్వులే చేసి రని భీమసేనుండును, నాదురాత్ములకట్లు
కావలెనని నకులసహదేవార్జునులును బలికిన శాంతస్వరూపుం డగు నజాతశత్రుం
డు తమ్ములతో నిట్లనియె. 275

చ. వినుతపరాక్రమక్రమములు పేరులు మత్పతులైన పాండునం
దను లతివేగ వచ్చెదరు తాల్మి వసింపుము కొంతకాల మో
జనవర పాద్యముం గొనుము సాహస మిచ్చట నించుకం బక్కనా
వనరుహచాపలోచనకుఁ బల్కె జయద్రథుఁ డప్డు లీల్గఁగన్. 285

మ. అరవిందానన నిన్నుఁ గాంచునెడ మోహావేశముం బొందితిన్
మరుబాధం భరియింపఁ జాల నను సామ్రాజ్యాధిపుం గూడి నా
పురిలో రాజ్యసుఖంబులన్ సతతమున్ బొందంగదే దేవివై
తరుణీరత్నమ పాండురాజసుతులన్ దైన్యాత్ముల న్వీడుచున్. 286

ఆ. తరుణి నిన్నుఁ గాంచి ధన్యుండ నైతిని, నిన్నుఁ బోలుసతిని నేను జూడ
నైతి నీదుమోహనాకారమును జూచి, యలరువిల్తుబారి కగ్గ మైతి. 287

సీ. ప్రాజ్యరాజ్యము గోలుపోయి కాంతారవాసము సేయుచున్నట్టి జడమతులను
బాండవేయులఁ గూడియుండి సౌఖ్యం బేమి, పడుచున్న దానవు భాసురాంగి
ననుఁ గోర్కె వరియించి నాసింధురాజ్యము, నేలుకొనంగదే యిందువదన
యిదియె రథం బెక్కు మిపుడె నాపురికిని, బోవుద మనవుడు ముదిత పలికె

తే. అకట దుస్సలభర్త వైనట్టి నీవు, నాకు నగ్రజుండవు గావె న్యాయమునఁ బ
తివ్రతలఁ గోర వచ్చునే తెలివిలేక, నీదుశిరము వ్రక్కలు గాదె నిమిషమందు. 288

క. బలవంతులైనపార్థుల, బల మెఱుఁగనివాఁడవొక్కొ పాపాత్ముఁడ వో
ఖలుఁడ చను నీదుదారిని, బలుకకు దుర్భాష లింక పశువుం బోలెన్. 289

తే. పాండవులు వచ్చిరేని నిన్ బాపచిత్త, భస్మమును జేయుదురు గాన వచ్చినట్లు
పోవు మోరి నీదారినిఁ బోవు మనఁగ, సైంధవుం డిట్లు పలికెను సకియతోడ. 290

వ. పాంచాలీ! నీభర్తలపరాక్రమమునకు నేను వెఱువను నినుఁ గూడక మాన నని ద్రౌపదిని బలవంతముగాఁ దనరథమ్ముమీఁదఁ గూర్చుండఁ బెట్టుకొని పోవుచు ధౌమ్యులు వానిని వల దని వారించిన వాఁడు విన కుండె నంతఁ బాండవు లేతెంచి యావృత్తాంతము విని కోపోద్దీపితులై జయద్రథునిసైన్యమును గలిసి వారి నంతకు నింటి కతిథులుగాఁ జేసిరి సౌవీరకుమారుల నర్జునుండు దునుమాడె సైంధవుండు ద్రౌపదిని విడిచి పాఱిపోవ భీమార్జునులు వానిం దెచ్చి యవమానపఱచి పంపించిన నతండు గంగాతీరమ్మున కేగి యీశ్వరునిఁ గూర్చి ఘోరతపం బాచరించుచుండె.

తే. శంకరునిఁగూర్చి తపియించి సైంధవుండు, పాండవులలోన నొక్కనిఁ బార్థు విడిచి
నల్వురను గూడఁ దా నొక్కనాఁటియుద్ధ, మందుఁ జంపఁగ వరమును బొందె నతఁడు

వ. తీర్థసేవను సేసి దేశాంతర సేవ మరలఁ బాండవులదరికి మార్కండేయమహాముని యేతెంచిన ధర్మజుండు రామాయణకథఁ జెప్పు మని కోరుటయు మార్కండేయుం డిట్లు చెప్పఁ దొడంగె. 293

## శ్రీరామచరిత్రము.

మ. సరయూతీరమునందుఁ గోసల మనంగా సస్యాదిసంపూర్ణమై
పరఁగున్ దేశమునం దయోధ్యయనఁగా భాసిల్లుప్రోలందు భా
స్కరవంశాగ్రణి కీర్తిఁ జెందె దశరథాఖ్యాకుండు భూపాలుండు త
ద్వారదేశంబును బ్రోచుచుండెను మహావైదుష్య మేపారఁగన్. 294

క. ధరణీపతి దశరథునకు, సరసీరుహలోచన లగుసతుల గలరు ము
వ్వురు కౌసల్యాకైకలు, పరఁగ సుమిత్రయు ననంగఁ బరఁగెడువారల్. 295

వ. అఱువదివేలయబ్దంబులు సుతులకై మహాతపం బొనర్చి పెద్దకాలమునకు దశరథధ రానాథుండు మువ్వురుసతులందు శ్రీహరియంశమున శ్రీరామభరతలక్ష్మణశత్రుఘ్ను లనుసుతుల నల్వురం గాంచె నాబాలురు దినదినప్రవర్ధమానులై రంత. 296

చ. పొనరు విదర్భదేశమునఁ బొల్చినయమ్మిథిలాపురంబులో
జనకుఁ డనంగఁ బొల్పెసఁగు క్ష్మారమణుండు ప్రజానురాగియై
ఘనముగ రాజ్యమేలుచును గ్రాలుచునుండి కులాభివృద్ధికిన్
దనయులు లేరటంచు మది దైన్యముతోడఁ జరించె నవ్వలన్. 297

మ. ఘనయాగంబు నొకండు సేయ మది సంకల్పించియు న్నించి య
జ్జనకక్ష్మావరుఁ డంత భూమి నొకచో జానొంద దున్నించుచో
మును దైత్యేంద్రుఁడు వీడుస్వర్ణమయమై పొల్పొందునమ్మందస
మ్మునుఁ గాంచెన్ ధరణీతలంబున నటన్ మోదంబు సంధిల్లఁగన్. 298

క. ఆమందసమ్ము దెఱచిన, హేమవిభూషలు ధరించి యిందుకళలతోఁ
బ్రేమం గూర్చుచు నుండెడు, భూమిసుతం గాంచె జనకభూవిభుఁ డంతన్. 299

వ. అనేకవిధమ్ముల నమ్ముద్దులపట్టిని ముద్దాడి కన్నులు మిఱుమిట్లు గొలుపుదాని సుంద రరూపమ్మున కచ్చెరు వొంది దాని నయోనిజ గా నెంచి పుత్రికావాత్సల్యమునఁ బెంచుచుండి సీత యనుపే రొసంగె నంత. 300

తే. శివునివిల్లు సీత చిన్నకాలమునుండి, మోయఁ గలిగి యుండెఁ బ్రేయ, మలరఁ
దరుణి మించినట్టివరున కిచ్చెద నని, ప్రతిన నుండె జనకపార్థివుండు. 301

వ. ఇందిరాంశసంభవ యగుసీతాదేవి పరిణయోచితయావన యయ్యె నయోధ్యలో శ్రీరామభరతలక్ష్మణశత్రుఘ్ను లల్లారుముద్దుగాఁ బెఱుఁగుచు నస్త్రశస్త్రాదివిద్యా

కుశలులై రంత గాధిపుత్రుఁడు విశ్వామిత్రుండు దశరథుం గాన వచ్చి యి ట్లనియె.

ఆ. దశరథేశ నీదుతనయుని రాముని, నా కొసంగుమయ్య నయముతోడఁ
గ్రతు వొనర్చువాఁడ గ్రతురక్షణ మొనర్చి, దనుజులను వధించి తరలివచ్చు. 303

వ. దశరథుం డట్టకేలకు సమ్మతించి శ్రీరామలక్ష్మణులను గాధేయునితోఁ బంపించె నంత శ్రీరాముఁడు. 304

క. తాటక యనియెడుదుష్టను, శాటినిఁ గుటిలను మదేభసత్వ వనాటిన్
దీటుగ దివ్యాస్త్రంబున, మాటికిఁ గూలంగ నేసె మానియనుష్టన్. 305

వ. సహస్రగజజవసత్వముగల తాటకను సంహరించిన శ్రీరాముని ముద్దాడి గాధేయుండు తనయస్త్రశస్త్రము లెల్ల నతనికొసఁగె. మారీచసుబాహులపీఁచ మడఁచిన రామచంద్రుం బ్రశంసించి మునిచంద్రుండు మిథిలలో శివధనస్సుఁ జూపఁ గొనిపోవుచు.

మ. కనుమా రాఘవ గౌతమాశ్రమ మిదే కన్పాడుజె యొప్పెడున్
విను మాగౌతమమౌనికాంత జగతీవిఖ్యాతయై యొప్పు నా
వనితారత్నము భర్తృశాపవశతం బాషాణమై యుచ్చటన్
గని సద్యో భవదీయపాదరజముం గ్రోలంగ నున్నది. 307

వ. అని రాఘవేంద్రు నాశిలయొద్దకుఁ గొనిపోయిన నహల్య రామపాదరజంబు సోఁకి శాపవిమోచితయై గౌతమునితో నాశ్రమమున కేగె రామలక్ష్మణులు విశ్వామిత్రునితో మిథిల కేగిన జనకుండు రాఘవునకు శివధనస్సుం జూపినంత శ్రీరాముండును.

మ. ఘనకోదండము చేతఁ బూనియు మహాకౌతూహలం జేర్పడన్
ముని నాకౌశికుఁ గొల్చి యాజనకునిన్ బూజించి యుత్సాహియై
ధనువుం గూలఁగ నేసినన్ బెళపెళధ్వానంబులై యొప్ప నా
జనకక్ష్మాపరముఖ్యు లెల్లమునులున్ సంతోషముం బొందఁగన్. 309

వ. దశరథు రప్పించి శ్రీరామునకు సీతను లక్ష్మణున కూర్మిళను భరతునకు మాండవిని శత్రుఘ్నునకు శ్రుతకీర్తిని సమర్పించి వివాహ మొనర్చి జనకుండు వారి నయోధ్యకుఁ బంపించెఁ ద్రోవలో శ్రీరాముఁడు పరశురామగర్వభంగ మొనర్పఁగా నంత నెల్ల రయోధ్య కేగిరి దశరథుండు. 310

మ. అవనీజాతమనోహరున్ ఘనునిఁ [illegible]త్మున్ మహాబాహునిన్
భువనాఖ్యాతునిఁ దాటకాంతకు జగత్పూజ్యున్ జగన్నాథునిన్
ధవళాబ్జాక్షుని సుందరాంగు ననఘున్ దైత్యారినిన్ రామునిన్
సువిచారాత్ముని రాజుఁ జేయ మదిలో సూచించె మోదంబునన్. 311

వ. ఆసమయమ్మునఁ బాపాయత్తచిత్తయు మందరాదుర్బోధితయు ధర్మవిరహితచిత్తయు నగు కైకేయి పూర్వవాగ్దానప్రకారమున వరద్వయ మిమ్మని దశరథుం గోరు కొనుటయు. 312

మ. మనుజేంద్రుం డనెఁ గాంత నీవరములన్ మానొందఁ గైకొమ్మనన్
వనితారత్నము గోరెఁ బుత్రు భరతుం బట్టాభిషిక్తుండు గా
మునియై రాముఁడు ఘోరకాననమునం బోవంగఁ దాఁ గోరినన్
విని రాజేంద్రుఁడు మూర్ఛఁ బ్రుంగి పలికెన్ వీఁకన్ సరోజాస్యతోన్. 313

ఉ. దుర్మతి వైననీ విప్రుడు తోయజమిత్రకులావతంసునిన్
ధర్మవిచారునిన్ సుగుణతత్పరు శ్రీరఘురామచంద్రునిన్
దుర్మృగకాననంబులకుఁ దోయలిత్రో నెటు పోవుమందు నీ
మర్మపుమాటలెల్ల నిఁక మానుము రామునిఁ బ్రోవుమా దయన్. 314

వ. అనిన రాజవాక్యములను విశ్వసింపని కైకేయిని నిందించి సీతారామలక్ష్మణుల నరణ్యమునకుఁ బంపించి పుత్రవియోగమున దశరథుండు మృతిఁ గాంచె నంత మాతుల నగరమునుండి భరతుం డేతెంచి తల్లి ననేకవిధముల నిందించి రాముఁడే రాజ్యార్హుండు నేను గా నని చిత్రకూటమున కేగి శ్రీరాముం గాంచి తత్పాదారవిందముల కెఱఁగి రాజ్యమునకు రమ్మన రామచంద్రుఁడు సత్యహానిఁ గావించి రాఁ జాల నన నాభరతుండు శ్రీరామునిపాదుకలు దెచ్చి రాముని పేరిట నందిగ్రామపురంబులో రాజ్య మేలుచుండె రాముండు సజాయానుజుండై యత్రిమహామునియాశ్రమమున కేగె నంత ననసూయ సీత కంగరాగార్పణ మొనరించుటయు నామువ్వురు దండకారణ్యము చేరి రంత. 315

సీ. దండకాటవిలోనఁ దగవిరాధు వధించి, చుప్పనాతికి రూపు సురుగఁ జేసి
ఖరదూషణాదుల దురమున నురుమాడి, పంచవటీతీరభాగమందుఁ
బర్ణశాల రచించి పడఁతి జానకితోడ, లక్ష్మణుతోడను లలిఁ జెలంగ
శ్రీరామచంద్రుఁడు చెలువార నివసించి, సుఖియించుచుండెను సుచిరముగ
తే. అంత దనుజుఁడు రావణుఁ డనెడువాఁడు, జనకరాజకుమారికచక్కఁదనము
వినియు జానకిఁ గొనిపోవ వేడ్కఁ బలఁచి, నీచుఁ డగుమారసమంత్రి మారీచుఁ గాంచి.

క. జనకజఁ బోలినసుందరిఁ, గనుఁగొన శక్యంబు గాదు కాపున నాకున్
ఘనసాహాయ్య మొనర్పుము, జనకజఁ గొనివచ్చువాఁడఁ జాయామణిగన్ 317

క. అనిననె మారీచుం డి, ట్లను శ్రీరాముఁడు మహాత్ముఁ డగువిష్ణుఁడు గా
వున వానివనిని దైత్యేశ్వర, యసురేశ్వర నీకుఁ జగమునఁ దెలుపుము మదిలోన్. 318

వ. అనిన తనవాక్యములు విశ్వసింపని రావణునాజ్ఞ వలన మారీచుండు సువర్ణాకార
ముగా మాయాకురంగమై పర్ణశాలయందు నాట్యముచేయ జానకీదేవి దానియపూర్వ
సౌందర్యమున కచ్చెరువొంది దాని దెచ్చి యిమ్మని హృదయేశ్వరునిఁ గోరుటయు.

క. వైదేహీకోరుకోరిక, మోదముతోఁ దీర్పఁ దెంచి భూమీశుఁ డిదే
నేఁ దెచ్చువాఁడ ననుచును, దాఁ దమ్ముని నిలిపి పోయెఁ దనసతిరక్షకై. 320

తే. మాయలేడినిఁ బట్టంగ మనుజవిభుఁడు, ఘనుఁడు ఘటియించి పోయియు దనుజమాయ
వలన బహుదూరమున కేగి వనటఁ జెందె, కనకమృగమును గానక కాననలోన.

వ. మాయామృగము రామస్వరమున సీతా! లక్ష్మణా! యని యార్చిన జనకరాజపుత్రి
ప్రాణనాథున కాపద కల్గెనని లక్ష్మణుని శ్రీరామునిసహాయమునకుఁ బంపించె నంత
సమయము చూచి రావణుఁడు భిక్షుకవేషమున నరుదెంచి భిక్షఁ గొని సీతాచరి
త్రము విని తత్సౌందర్యము గాంచి కామపీడితుండై. 322

క. నీదుచరిత్రము దెలియుట, మోదము జనియించె నాకు మోహనరూపా
నాదగుచరిత్రఁ దెలిపెద, వైదేహీ విను మటంచు వచియించె రహిన్. 323

చ. దనుజులలోన మేటి యగుదైత్యవరుండఁ బులస్త్యపుత్రుఁడన్
దనరెడులంక యన్పురి ముదంబున నేలెడు రావణాఖ్యుఁడన్
వనరుహనేత్ర లెందఱినో పత్నులుగాఁ బడయంగఁ గల్గితిన్
జనకజ నిన్నుఁ గోరితిని జయ్యనఁ గైకొనిపోవ వచ్చితిన్. 324

క. అని దశశిరములు చూపఁగ, జనకజ మూర్ఛిల్లి పడె నిశాచరుఁ డంతన్
వనిత సరథంబుపై నిడి, కొని చనియెను గగనవీథిఁ గుత్సితమతియై. 325

వ. అంతఁ గొంతవడికి మూర్ఛఁ దేరి జానకీదేవి రావణుఁడు తన్నపహరించు టెఱిఁగి
మహావిచారమగ్నయై. 326

సీ. హా రామ హా రామ హా దీనమందార, హా సూర్యకులదీప హా శుభాంగ
హా లక్ష్మణాగ్రజా హా సరసిజనేత్ర, హా ధర్మసువిచార హా మహాత్మ
హా జగన్మోహన హా కీర్తివిస్తార, హా దశరథపుత్ర హా సుహాస
హా యజ్ఞరక్షక హా దానవాంతక, హా నీలఘనగాత్ర హా సుశీల

ఆ. దనుజవరుఁడు నన్నుఁ గొనిపోవుచున్నాఁడు; నన్నుఁ గావు రామ నన్నుఁ గావు
నిష్ఠురంబు లెల్ల నిన్నుఁ నేఁ బలికితి, నన్ను గావు లక్ష్మణా రయమున. 327

క. అని విలపించుచుఁ బోవుచు, జనకజ యొకచోటఁ గపుల సరవిం గనియున్
తనవీటిఁ గొంతె చింపియుఁ, దనభూషణముల నొకట గట్టి ధరకిని వైచెన్. 328

వ. అంత జటాయువు వెదుర్కొని సీతకొఱకై దశాస్యునితోఁ బోరి యోడిన రావణాసురుం డా సాధ్వీమణిని లంకాపురికిఁ గొనిపోయి శింశుపావృక్షముక్రింద నామె నుంచి కావలియుంచె నిట శ్రీరాముఁ డరణ్యములో సీత నొంటి విడిచివచ్చిన తమ్ముని మందలించి యిద్దఱు పర్ణశాల కేతెంచి ధరణీజాతను దనుజు లపహరించిరని యెఱిఁగి దక్షిణాభిముఖులై పోవుచు మార్గములో జటాయువుం గాంచి సీతావృత్తాంతము విని శబరీకల్పోపాయన మారగించి సుగ్రీవునితో సఖ్య మొనర్చి వాలిని సంహరించి తద్రాజ్యము సుగ్రీవున కొసఁగి హనుమంతునిచే సీతకు నానవాలిచ్చి పంపించె నంత. 229

క. పొంగుచు నక్కపివీరుఁడు, నింగికిఁ దా నెగసి పోవునెడ మైనాక
మ్మ్ముం గని సింహిక యనుదా, నిం గనియు నతిక్రమించి నిశ్చల మతిమై. 330

మ. దనుజాధీశ్వరపాలితంబు నయి వింతై సుందరాకారమై
ఘనరత్నంబుల సౌధసౌధముల లోకాతీతనిర్మాణమై
వనరాజీ వరభటాళితో సిరులతోఁ దట్రెల్లు లంకాపురిం
గనియెన్ మారుతిజానకిం గన మహాకౌతూహలం బేర్పడన్. 231

వ. సూక్ష్మగాత్రుండై హనుమానుండు లంకాపట్టణమెల్ల వెదకి యశోకారామమ్మున కేగి యొక్కతరువుపైఁ గూర్చుండి జానకీవిలాప మాలించుచుండెనంత. 232

శా. మాయామేయకురంగముం గనియు రామా నిన్నుఁ దేఁ బంచితిన్
నాయం దెంతయు నల్కఁ బొందితివొకో నాస్వామి నన్బ్రోవవే
శ్రేయం బే యిటు లూరకుండుటకు రాజేంద్రా సదా నామదిన్
శ్రీయుష్మచ్చరణంబు నమ్మితి దయం జెన్నొందవే వల్లభా. 233

చ. దనుజు లొనర్చు బాధలకుఁ దాళఁగఁ జాల నరేంద్రచంద్రమా
యనుజునితోడ వచ్చి దురితాత్ముని రావణు సంహరించి వే
ననుఁ జెఱనుండి బాపు నళినాయతపత్రవిశాలనేత్రి యం
చును మది రామసంస్మరణఁ జొప్పడఁ జేయుచునుండె నయ్యెడన్. 234

వ. ఆసమయంబున దశకంఠుండు సమస్తభూషణాలంకృతుండై జనకనందినిపై విరాళిఁ గొని యామెను దర్శించి తనమోహము దీర్పు మని ప్రార్థింప నానిశాచరునకు సీత యి ట్లనియె. 235

క. పరమాత్ముని శ్రీరాముని, శరణని నన్నొసఁగుమా నిశాచరనాథా
శరణంబుఁ బొందవేనిన్, దురమున రాఘవుఁడు నిన్నుఁ గసుమాడుఁ జుమీ. 236

ఉ. రాముఁడు పుణ్యగణ్యుఁడు విరాధఖరాదుల కంతకుండు సు
గ్రీవమలసన్నిభాంగుఁడు ఘరావరసంధ్యు డతండు సద్గుణా
ఢ్యుఁడు లోకసుందరుఁడు తామరసాయతపత్త్రనేత్రుఁ డా
రాము మహోన్నతు న్విడిచి రాక్షస నిన్నుఁ దలంప నెప్పుడున్. 237

వ. తనకు వశ్యురాలు కానిసీతను రావణుఁడు వధింపఁ బోవఁ గొంద ఱడ్డువచ్చిన శాంతించి మరలి పోయె నంత నాంజనేయుండు తెరువుదిగి రామునంగుళీయకంబు నొసంగిన నద్దేవి దాని నక్కునఁ జేర్చి ముద్దాడి తనచూడామణిని రామునకుఁ బంపించె వాయుజుఁడు శ్రీరామునితో సీతావృత్తాంతము దెలిపిన నతండు సమస్తవానరులతో సుగ్రీవలక్ష్మణసమేతముగా లంకకుఁ బోయి సేతువు గట్టించి శరణు గోరిన విభీషణున కభయ మొసఁగి దనుజులఁ బెక్కండ్రు వధించినంత రావణాసురుండు సంగ్రామరంగమున కేగి. 238

క. బలగంబెల్లను గూడక,ఖలుఁ డగురావణుఁడు పోరెఁ గాకుత్స్థునితో
నల రెడు బ్రహ్మాస్త్రంబున,నిలఁ గూల్చె నిశాచరేంద్రు నినకులుఁ డంతన్. 239

వ. ఆసమయమ్మున సర్వదేవతలు సంతసించి శ్రీరామునిపైఁ బుష్పవృష్టి గురిసి యనేకవిధంబుల సన్నుతించి రంత విభీషణాభిషేకానంతరమున సుగుణకల్యాణసమేత యగు సీతం దెచ్చి విభీషణుఁడు రామునకు సమర్పించిన నాభాసురగాత్రితోఁ గౌసల్యానందనుఁ డి ట్లనియె. 240

క. సతిఁ జెఱఁ గొనినని శాచరు,క్షితిఁ జంపితిఁ గీర్తిఁ గంటిఁ జెఱ నివ్విశిపం
చితినిఁ గృతార్థుఁడ నైతిని,క్షితిసుత నీయిచ్చఁ జనుము చెలి ని న్నొల్లన్. 241

క. ఘనతరసౌందర్యముఁ గల,నినుఁ జూచి నిశాచరుండు నీరజనయనా
మనమున నిశ్చలుఁ డగునా, వనితా నీయిచ్చవచ్చువానిం గొనుమా. 242

క. అని శ్రీరాముఁడు పలికిన,జనకక్ష్మాపాలతనయ జానికి మూర్ఛ
ల్లెను శీతలోపచారము,లను జేసిన మూర్ఛఁ దేరి లలితాంగి యనున్. 243

క. రామా రామా యని శ్రీ,రాముని మదిలోఁ దలంచురమణిని న న్నీ
రాముం డిట్లనఁ జొచ్చె నిఁ,కేమందును నాదుపాప మేమందు నోకో. 244

గీ. దుష్టకల్మషమతి నయి దుష్టచరితుఁ,డైన రావణుఁ గోరినదాన నేని
యగ్ని నను భస్మ మొనరించు నమలమతిని,నైన నన్ను రక్షించును బ్రాణనాథ.

వ. అయ్యవసరంబున ధాత్రీపుత్రి యెల్లవారు చూచుచుండ శ్రీరామునకుఁ బ్రదక్షిణ నమస్కార మొనర్చి మేటియనలంబునఁ జొచ్చుటయు. 246

తే. లోకపావని యగుసీత పాతివ్రత్యమున, నగ్నిలోఁ జొచ్చినంతనే యగ్ని శీత
లుండునై సీత రక్షించి యుండె యప్పుడు, మనుజరూపున వచ్చి రామునకుఁ బలికె.
క. భూవల్లభ శ్రీరాఘవ, నీవల్లభ సీతఁ జూడు నిర్మలచరితా
భూవనితానందనతను, పావని యగుదానిఁ బ్రోవు భానుకులేంద్రా. 248
తే. లోకపావని సీత శోకమునను, వచ్చునే కళంకం బది వసుమతీశ
యనుచు సీత నర్పించి యయ్యనలుఁ డపుడు, వీడుకొనిపోయె రాముని విమలచరితు.
వ. అంత దశరథనందనుండు నమందానందకందళితహృదయారవిందుండై సుందరమంద
హాసవదనారవింద యగు జనకనందన నభినందించి యి ట్లనియె. 250
తే. సీత పావని నని మది నే నెఱింగి, ప్రజలయపవాదఁ బాపంగ వలసి యిట్టు
లగ్నిఁ జొరఁజేసినాఁడ వి న్నమలచరిత, పరమసాధ్వీశిరోమణి ధరణి నీవె. 251
వ. అని సమాదరించి రాఘవుండు సజాయానుజుండై వానరరాక్షసులతోఁ బుష్పక
విమానారూఢుండై యయోధ్య కేగిన శ్రీరామునకుఁ బాదుకలు సమర్పించి
భరతుం డిట్లనియె. 252

చ. జనకునిసత్యవాక్యమును సమ్మతితో నెఱవేర్ప నెంచి య
వ్వనములలోఁ జరించి పలుబాములఁ బొంది సతీసమేతుఁడై
నను దయఁ బ్రోవవచ్చితివి నాదగు ప్రార్థన లాలకించుచున్
ఘన మగురాజ్యలక్ష్మి నిదె కైకొను మన్నమహీశుఁ డయ్యెడన్. 253
ఉ. తమ్ముల నాదరించితనతల్లుల కెల్లను భక్తి మ్రొక్కి తా
నెమ్మెయి నాయయోధ్యపురి కేగి స్వరాజ్యము పట్టభద్రుఁడై
కొమ్మను గూడి సౌఖ్యములు కోర్కుల నెల్లను బొందుచుండి తా
నిమ్ముగ ధారుణీతలము నేలుచు నుండెఁ బ్రజానురంజనన్. 254
వ. పట్టాభిరాముం డగుశ్రీరాముఁడు ధరిత్రీచక్ర మకవ్రవిక్రమంబునఁ బాలించుచు
నశ్వమేధాదియాగములు చేసి కీర్తికాముఁడై పదునొకండుసహస్రవర్షములు పరి
పాలించె. 255

ఆ. రామచంద్రుఁ బోలె రారాజ నీవును, శత్రువధ మొనర్చి శాంతిఁ బొంది
ద్రుపదరాజపుత్రితోఁ బూజ్యరాజ్యపట్టాభిషిక్తు డగుదు వని వచించె. 256
వ. అని రామాయణము చెప్పినమార్కండేయమహామునిని బ్రశంసించి యుధిష్ఠిరుండు
సీతారాములను వినుతించి సావిత్రీచరితము చెప్పుమని కోరిన నమ్మునీంద్రుం
డమ్మనుజేంద్రున కి ట్లనియె. 257

సావిత్రీసత్యవంతులవృత్తాంతము

తే. మద్రదేశమునందున మహితయశుఁడు,వసుల నశ్వపతి యనంగఁ బార్థివేంద్రుఁ
డతనితనయ సావిత్రినా యతివ తనరుఁ, బరమసాధ్వీమహాత్మ్యవిధాన యగుచు. 258
తే. యౌవనోపేత యైనయాపూవుఁబోఁడిఁ,బరిణయ మొనర్ప మది నెంచి పార్థివుండు
తనయగుణరూపములకును దగినవరుఁడు, డెవఁడు నుండునో యని యోచుచుండె.
వ. జగదేకసుందరియగుసావిత్రి సాళ్వరాజపుత్రుఁడగుసత్యవంతుండు శీల
గుణవయోరూపంబులకుఁ దనకుఁ దగినవాఁడని తలంచి తనయభిప్రాయ మేరికిఁ
దెలుపకుండె నయ్యెడ. 260
ఉ. నారదమౌని యంత నరనాథునిఁ జూడఁగ నేగుదెంచి స
త్కారము బొంది యశ్వపతిఁ గాంచి వచించె నరేంద్రచంద్ర నీ
కూరిమిపుత్రికిం గుసుమకోమలగాత్రికిఁ బెండ్లి సేయ కి
ట్లూరక యుంటివే మనుమ నొయ్యన భూపతి కూఁతు కిట్లనున్. 261
తే. అమ్మ నీరూపశీలగుణమ్ములకును,దగినరాజకుమారునిఁ దడయకుండఁ
గోరికొమ్మని పల్కె నాకూర్మితనయ,పల్కె సావిత్రి యిట్లు భూవరునితోడ. 262
చ. అనఘుఁడు సాళ్వభూమివరుఁ డాతనిపుత్రుని సత్యవంతునిన్
వనరుహచారులోచనుని భాస్వరతేజునిఁ గోమలాంగుని
న్ననవిలుకానిసన్నిభు ననంతగుణాకరు నప్రమేయునిన్
ఘనుని వరించియుంటి జనకా నను గూర్పుము వాని కిమ్మహిన్. 263
క. తనయ వచించినపలుకులు,విని నరనాథుఁ డంత విజ్ఞానముతో
మునిఁ గాంచి యిట్టు లను నో,యనఘా యాతని చరిత్ర మంతయుఁ జెపుమా. 264
సీ. అనుడు నారదుఁ డిట్టు లనె మహీజానితో,సత్యవంతుచరిత్ర సరగ వినుము
దైవయోగమున నాతనితండ్రి రాజ్యముఁ,గోల్పోయి యంధుఁడై ఘోరమైన
కాంతారమందునఁ గాంతాసుతులతోడ,జరియించుచుండెను నరవరేణ్య
సత్యవంతుఁడు భక్తి జననీజనకులకు, సపరిచర్యలు సలుపుచుండె
తే. అతఁడు సత్యశీలుఁడు సుగుణాన్వితుండు,దేవబ్రాహ్మణభక్తుండు పూవిలుతున
మానుఁడును విజ్ఞుఁడును మతిమంతుఁ డతఁడు,దమశమాన్వితుఁ డధికసుందరుఁడు ఘనుఁడు.
వ. వేయేల నతనిఁ బోలువా రుండు టరిది కాని పరిణయం బయిన సంవత్సరములో
నతనికి మరణము సమీపించు ననిన నశ్వపతి సావిత్రి దిక్కు మొగంబై. 266
తే. తల్లి సావిత్రి వింటివే తపసివరుని,వాక్య మిది యమోఘము గాన స్వాంతమందు
సత్యవంతుని విడనాడి చంద్రవదన,ధారుణీశు వేఱొక్కనిఁ గోరుకొనుము. 267

చ. తనయుఁడు సత్యవంతుఁ [illegible]లైనను నయ్యెడుఁగాక తండ్రి నా
మనమునఁ గోరినట్టి సుకుమారుని నాతని వీడ నన్న న
మ్మునివరుఁ డప్పు డిట్లనియె భూవర నీసుత వాని కిమ్ము నీ
తనయ మహాప్రభావమునఁ దప్పక నాతఁడు గాంచు నాయువున్. 268

క. అని విన్నవించి ముని చనె. జనపతి సావిత్రితోడ సైన్యముతోడన్
వనములకును బోయి సాళ్వావనినాథునితోడ నిట్లు పలికెన్ గడఁకన్. 269

తే. నాకుమారిక నైనయీ నళిననేత్రఁ, గోడలుగఁ జేకొనుము కువలయేశ
సత్యవంతునకుం దగుసాధ్వి యీమె, సత్యవంతుఁడు నీమెకుఁ దగు సాళ్వరాజ. 270

వ. అనిన ద్యుమత్సేనుండు రాజరాజకుమారిక యగుసావిత్రి మాతో నడవుల నిడుమల
బడలే దని నిరాకరించి యెట్టకేల కంగీకరించె నశ్వపతి సావిత్రీసత్యవంతులకు
వివాహ మొనర్చి కానుక లొసంగి మద్రపురి కేగె సావిత్రీదేవి రాజభూషాదులు
విసర్జించి యత్తమామలకుఁ బతికి శుశ్రూష లొనర్చుచుఁ బతియాయువు లెక్కఁ
జూచుచుఁ గాలము గడుపుచు నిఁక నాలుగుదినములు గడవు గల దని యెఱింగి. 271

తే. పరమనిష్ఠాగరిష్ఠయై గరిత మిన్న, చేసె నామె త్రిరాత్రోపవాస మంతఁ
బతికి నవసానకాలము వచ్చె ననుచు, శోకసంతప్తచిత్తయై సుందరాంగి.

సీ. అంత నాల్గవదిన మమ్మద్రరాట్పుత్రి, పతిమరణదినమ్ము వచ్చె ననుచు
నిత్యకృత్యంబులన్ దీర్చి విభునకు, బరిచర్య లొనరించి భక్తితోడ
నత్తకు మామకు నతిభక్తితో మ్రొక్కి, వృద్ధమానులకు సంప్రీతి మ్రొక్కి
దీవన లొందె నాతిఁగబోఁడినిఁ బిల్చి, మామ యిట్లని పల్కెఁ బ్రేమతోడ

తే. నల్పితివి తల్లి యుపవాసనక్తశతంబు, దప్పితివి భోజన మొనర్పఁ దగు నటన్న
సంజ పడుదాకఁ గుడువను జనవరేణ్య, నాకు నియమము మిది యని పల్కె నళిననయన.

వ. అంత సత్యవంతుఁడు సమిత్కుశఫలాదులం గొనితే వనంబున కేగఁ బోవ సావిత్రి
మనోవల్లభుం జేరి నీతో వనంబున కరుదెంతుఁ గొనిపొమ్మన నతం డుపవాసంబున
బడలి యున్నదానవు నీవు రావల దన నమ్మహాసాధ్వి యిట్లనియె. 274

ఆ. ఉపవాసశ్రమ లేదు, విపినంబును జూడ నాకు వేడుక యగు ని
న్నిపు డిది నే వాంఛించితి, నృపవర కొనిపొమ్ము వనికి నీతో నన్నున్. 275

తే. తరుసమూహములును బుష్పితలతలును, గలుగువనరమణీయముగనుల జూడఁ
గౌతుకము జనించెను నాకు భూమిపాల, వనికి గొనిపోఁగదే నన్నుఁ బ్రాణనాథ. 276

వ. సత్యవంతుం డత్యంతానురాగమగ్నమైనసావిత్రిం దనతోఁ గొంపోవనంగీకరించిన
నద్దేవి యత్తమామల కభివందనము చేసి దీవన లొంది ప్రాణవల్లభునితో నరణ్య

మ్మున కేగి లోఁ గల విచారమ్ముఁ బైకిఁ దెలియ సేయక చిఱునవ్వు నవ్వుచు కెలు
గేలం గీలించి ప్రియునిచిత్తం బిగురొత్త నడచుచుండె నతండు వనవిశేషము లత్త
లోదరి కెఱిఁగించుచుండె. 277

సీ. తదనంతరంబ యాధరణీశసూనుండు, ఫలములఁ గోయుచుఁ బత్నిఁ గాంచి
వశము గాకున్నది వనిత నాదేహము, తల బ్రద్ద లగునట్లు గలిఁగె నొప్పు
నిలువ నోర్వఁగ జాల నింతుక శ్రీమదిచ్చ, శయనించువాఁడ నీస్థానమునందు
ననినఁ దత్తరమున వనజాక్షితనయంక, తలము విభున కుపధానముగను

తే. సలుపునెడ సత్యవంతుండు నిలువ లేక, వ్రాలి నిశ్చేష్టనుం డైనపగిది నుండె
నతని మరణకాలము వచ్చె నని యెఱింగి, చెలువ యెంతయు సంతాపచిత్తయయ్యె.

తే. అంత నాతనిఁ గొనిపోవ నంతకుండు, వచ్చి యాతని గదియ నాఁ డమసాధ్వి
కాలుతో నిట్లు పలికెను గేలుమోడ్చి, యయ్య మీ రెవ్వ రను నెడ నాతఁ డనియె.

ఆ. కాలుఁ డగుదు నేను వాలుగంటీ నీదు, పతినిఁ గైకొనంగ వచ్చినాఁడ
నమలమూర్తి యగుట నతని కేవచ్చితి, గరితవగుట నన్నుఁ గాంచి తీవు. 280

వ. అంత నయ్యంతకుండు సత్యవంతునిజీవనంబులు పాశంబునం గట్టి లాఁగికొనిపోవునెడ
సావిత్రీదేవి పతిశరీరము నొక్కయెడ సురక్షితము గావించి శోకసాగరనిమగ్నయై పతిఁ
గొనిపోవుకృతాంతుని వెనువెంట నడచుచుండ నతం డక్కాంతం గాంచి మరలి పొ
మ్మన నాకొమ్మ యిట్లనియె. 281

సీ. పతు లెందు బోయిన సతు లందుఁ బోవలె, నీప్రసాదము గొన్న నెలఁత నాకు
నరుగరానిది లేనియట్టి చోటను నీదు, వెనువెంట వచ్చెద విభునకుండ
ధర్మమార్గంబుఁ బ్రధానము సజ్జన, సందర్శనము వృథా జరుగ దెపుడు
సజ్జనుఁ డైననీ సందర్శనముననుఁ, బరమశుభంబులు వడయకుండ

తే. నూర కెట్లు పోవుదుఁ జెప్పుమోకృతాంత, యనుడు సంతోషమునఁ బల్కె నంతకుండు
మెచ్చు వచ్చె వరంబు నీ కిచ్చువాఁడ, విభునిజీవితమును దక్కఁ గోరు మొకటి.

వ. అనిన మద్రరాజపుత్త్రి సూర్యపుత్త్రున కభివందన మొనర్చి నామామ ద్యుమత్సే
నుండు లబ్ధచక్షుండు కావలె నన నతం డట్లయ్యెడు బొమ్మన నామె యాతనిపిఱుం
దం జని వెండియు నిట్లనియె. 283

తే. ఈ వెలుంగనిధర్మ మిం దెందుఁ గాదు, ధర్మదేవత వైన యీశాసనమున
సముఁడ వెందున నైనను శమనుఁ డౌదు, వనిన నాపెకు నతి కరుణమున నుల్ల. 284

క. నీవాక్యములకు మెచ్చితి, నీపతిజీవితము గాక యిక నొకవరముం
జేకొని పోవమ్మనఁ, బానతి సావిత్రి యిట్లు పలికెన్ సుదతీ. 285

క. దేవా పోయినరాజ్యము, భూవరుఁ డగుసాళ్వపతినిఁ బొందఁగ వలె నా
జీవరమొసఁగు మనునెడ, వైవస్వతుఁ డిచ్చితి నని పలికెఁ బతికిన్. 286

వ. మరల నాతనివెనువెంటఁ బోవుచున్న రాణిఁ జూచి యతండు వారించినను వచ్చు
చున్న మచ్చెకంటి ధైర్యమునకు కచ్చెరువొంది ధర్మదేవత పతిజీవితము గాక
వేఱొండు వరము గోరు కొమ్మన సావిత్రి తండ్రికిఁ బుత్రశతలాభము గోరిన నతం
డిచ్చితిఁ బొమ్మన వినక మఱియు వానివెంట నేగుచున్న సన్నుతాంగిం గాలుం
డిట్లనియె. 287

క. నడువంగఁ జాల వియ్యెడఁ, గడుడస్సినదాన వీవు కావున నిఁక నో
పడఁతీ వెనుకకుఁ బొమ్మను, నెడఁ గాలున కిట్లు పలికె నెసకం బెసఁగన్. 288

సీ. పతియనుగమనము సతులకు నెందును, దప్పి నొప్పియు నీదు ధర్మరాజ
యేడుమాటలు పల్కి నెట్టివా రైనను, నార్యులకును బంధులని యెఱుఁగవె
యేడుమాటలకన్న నెక్కువ మాటాడి, నే నేగుదెంచితి నీదువెనుక
నకుఁ జుట్టమ నైతి నేఁ జెప్పఁగా నేల, నీ వెఱుంగుదు వయ్య దేవవర్య

తే. మిత్రకార్యము దీర్చుటె మేల టండ్రు, చిత్తగింపుము మ్రొక్కెదఁ జేతులొగ్గి
యనిన ముదితుఁ డైనకృతాంతుఁ డనె నభీష్టవరము గోరుకొ మ్మిచ్చెద భాసురాంగి.

వ. నావుడు సావిత్రి ప్రీతచిత్తయై సమవర్తిం గాంచి మున్నుఁ బతిజీవితము దప్ప వరము
గోరుకొమ్మని యిపు డభీష్టవర మిత్తు నంటివి కాన. 290

సీ. పతి లేనినాతిజీవితము వ్యర్థం బది, లోకదూషిత మగు నో కృతాంత
సర్వమంగళవిశేషములహీనత గాన, నేఁ గోరువర మిమ్ము నెమ్మితోడ
నామనోనాథుండు నాజీవితేశ్వరుఁ, డతులితకీర్తిసమన్వితుండు
సుగుణవంతుఁడు మహాసుందరాకారుఁడు, సాళ్వరాజసుతుండు శౌర్యధనుఁడు

తే. అనఘుఁ డసమానప్రజ్ఞాసమన్వితుండు, సత్యవంతుండు ఘనుఁడు విజ్ఞానయశుఁడు
జీవములఁ బొందునట్లు గాఁ జేయవలయు, నని కృతాంతునకును మ్రొక్కె వనజగంధి.

వ. సావిత్రివాక్యములకు సంతసించి యమధర్మరాజు సత్యవంతుని విగతపాశుం జేసి
సాధ్వీ నీపరమపతివ్రతామాహాత్మ్యంబున నీపతి జీవించె నిదె వీనిం గొనిపొ మ్మి
వీఁడు చతుశ్శతాబ్దములు జీవించి నూర్వురు సుతులం గాంచు నశ్వమేధాదియాగము
లొనర్చు నని ధర్మరా జదృశ్యుఁ డైనంత సావిత్రి విభునిసమీపించి యాతనితలఁ దన
తొడపై నుంచుకొనఁ గొంతసడి కాచి తాత్స్వాంతుఁ డేల్కని సావిత్రి కిట్లనియె. 291

సీ. నిద్రఁ బోయితి నన్ను నీ వేల లేపవు, కలఁగంటి నొక్కటి తెలుపువాఁడ
బలిమిఁ [illegible] నన్నుఁ బట్టి [illegible]

యెడ నిజంబై తోఁచె ననవుడు సతి యిట్లు,పలికె రేపటివేళఁ, దెలుపుదాన
నని రేయి నాయిర్వు రాశ్రమంబునకును నడచి పోయిరి కడుంగడుం బడలిక

తే. సాళ్వపతి కన్నులను గాంచె సర్వదిశలుఁ,జూచి కనువచ్చెనిద యేమొకో యద్య మనుచుఁ
బుత్రుఁ డింక రాఁడే యని పొక్కుచుండె, నూఱడించిరి యచ్చట నున్నవారు. 293

వ. అంత సావిత్రీసహితుండై సత్యవంతుండు చేరంజనిన జననీజనకులు వానిం గ్రుచ్చి
కౌఁగిలించి వారు మసలినకారణం బడుగ సావిత్రీదేవి ద్యుమత్సేనున కిట్లనియె.

తే. ఇతనిమరణ మాదిన మిది యే నెఱింగి,యని వెనువెంటఁ బోయితి విపినమునకుఁ
బడియె నచ్చట నీతఁడు కడు బడలికఁ,గాలుఁ డేతెంచె యంతట గదిసె నతని 295

తే. నీనిజీవముల్ గొనిపోవువాని వెంటఁ,జేను జని వరంబులఁ గొంటి నింపు రెండు
నీకుఁ గనులు చేకూరుట నీదు రాజ్య,మెల్ల చేకూరు నదయు మహీతలేశ. 296

వ. మఱియొకవరము నాతండ్రికిఁ బుత్రశతలాభం బగునట్లుగను వేఱొకవరము సత్య
వంతుఁడు లబ్ధజీవితుఁడగునట్లుగను గోరితి నతం డిచ్చె నన ద్యుమత్సేనుండు కోడలిం
గాంచి తల్లీ! నీవలన మాకులం బుద్ధరింపఁ బడె నని యామె నభినందించె మును
లెల్లఁ బ్రశంసించి రంతఁ గొన్నిదినంబులకు సాళ్వరాజాప్తమంత్రులు భద్రగజ
ముం దెచ్చి ద్యుమత్సేనమహారాజా! నీవైరులు హతు లైరి భద్రగజారోహణ
మొనర్చి సాళ్వపురికి విచ్చేయు మనఁ బ్రహృష్టహృదయుండై ద్యుమత్సేనుండు
సావిత్రీసత్యవంతులతో సతీసమేతుండై నిజపురి కేగి సర్వమహారాజ్యము నేలుచుఁ
జిత్రాశ్వునకు యావరాజ్యాభిషేక మొనర్చె. 297

చ. తనపతి నత్తమామలను దన్నును దల్లిని దండ్రి నేసతీ
జనసుత మద్రరాజసుత సర్వకులంబుల నుద్ధరించు న
ట్లను వలరార మిమ్ము ద్రుపదాత్మజ మీయఖిలాన్వయంబులన్
దనదుసతీమహత్త్వమునఁ దప్పకఁ బ్రోచెడు నోయుధిష్ఠిరా. 298

క. అని యామార్కండేయుఁడు,వినుత యశులఁ బాండుసుతుల వీడ్కొని యంతన్
దనయాశ్రమమునకును జనె,ననుపమతేజోవిశేషుఁ డాతఁడు తలఁపన్. 299

—♦ప్రభాకరుఁడు కర్ణునకు దర్శనమిచ్చుట♦—

సీ. ఆదిత్యుఁ డొక్కనాఁ డాత్మజుఁ డగుకర్ణునకు మేలుఁ గూర్ప మనమునఁ దలఁచి
తనయ నీ కేను హితముఁ గూర్ప వచ్చితి,యేఁ బ్రభాకరుఁడ నన్నెఱుఁగ వొక్క
భూసురవేషానఁ బురుహూతుఁ డేతెంచి,కవచకుండలములఁ గాంక్ష నేయు
[illegible]

తే. ఆకవచకుండలము లున్న ననఘ చరిత, యీత్రిలోకమునందున నెవరు గాని
నన్ను గెలువంగఁ జాలరు కన్నకొడుక, నాదునుపదేశవాక్యముల్ నమ్మ యుండు. 300
వ. అనిన. 301
క. సూతసుతుం డంతటఁ బ్రద్యోతనునకు భక్తి మ్రొక్కి యోనాతండ్రీ
యేతెంచె నేనియింద్రుఁడు, భూతలమునధన్యుఁ డైతి మ్రొక్కులరాయా. 302
సీ. ధారుణీసుర వేద కోరిన దాని నే, నిచ్చెద నని దీక్ష నెసఁగు చుంటి
సంతతి దేవేంద్రుఁ డతఁడు బ్రాహ్మణవేష, ధారియై వచ్చి నన్ గోరెనేని
నాదుకవచకుండలాదు లీయ నటంచు, నే నెట్లు పలుకుదు నీరజాప్త
జన్మవ్రతము విడఁ జాల నె నెప్పుడు, విప్రు లడుగుదాని వెస నొసఁగుట
తే. శరణు గోరినవారల సాకుటయును, శత్రువులవధించుటయును సమరమందు
దీనజనుల కాపదలను మాన్పుటయు, దనమును మదీయగుణములై తండ్రి వింటె.
తే. నీవు చెప్పినకరణిని దేవనాథుఁ, డగుచుఁ జిరమునఁ దిపు వచ్చి యడుగెనేని
యీయ నఁగఁ జాలనయ్యా నే నిచ్చువాఁడ, నాదుకవచకుండలముల నాదరమున. 304
వ. అనినభాస్కరుండు రాధేయుం గాంచి కుమారా! సవింద్రునియొద్దఁ గలశక్తి గైకొని
కవచకుండలము లిమ్మని యంతర్ధానం బయ్యె. 305
సీ. అంతఁ గొంతటిలోన నాశచికాంతుఁడు, బ్రాహ్మణవేషము బైచికొనియుఁ
గర్ణునిదరి కేగి కవచకుండలముల, నర్థించె నంతట నర్థిఁ బోలె
కర్ణుఁ డాతని కనేకప్రశస్తము లగు, నాభరణము లిత్తు నని పలికిన
నమరాధినాయకుం డది యొడఁబడకున్న, నును దివాకరుఁ డప్ప తనకుఁ దెల్పెఁ
తే. గాన దేవేంద్రు భూసురుఁగా దలఁచక, యీపృత్రిలోక్యనాథుఁ డౌనింద్రుఁ డోకా
భూసురుఁడ విప్రు కావయ్య ఘాసురాంగ, తెలుపు నీచరిత్ర మటంచుఁ బలికె నంత.
తే. నే మహేంద్రుఁడ నగుదును నిక్కముగను, నీదుకవచకుండలముల నేను గోరి
వచ్చితిని దేవహితము దీర్పంగ నీకు, జాగు సేయంగ వచ్చునా జనవరేణ్య. 307
క. అనుటయుఁ గర్ణుం డిట్లని, మెను నీవగుశక్తి నిచ్చి యిదె నా కవచం
బును గుండలములు గొను మని, యనునెడ దేవేంద్రుఁ డట్లె యాఁ గాకనుచున్.
వ. రాధేయా! యీశక్తివలన నొక్కమహావీరుని మనుమాడఁ గల వని శక్తి నిచ్చిన
గర్ణుండు కవచకుండలములఁ గోసి యింద్రునికిచ్చె నతం డదృశ్యుం డయ్యెఁ గర్ణుం
డీశక్తివలన నర్జును సంహారింప వచ్చుఁ గదా యని సంతసించెఁ గర్ణునిశరీరం బించుక
తేజోహీనం బయ్యె. 309

ఆరణేయపర్వము.

ఆ. పాండురాజసుతులు ద్వైతవనమునందు, నను వసించినప్పు డవనిసురుఁ డొ
కండు వచ్చి పలికెఁ బాండవులార నా, యరణి తప్పిపోయె నక్కటకట. 310

వ. దానిం దెచ్చి నానిత్యవిధికి లోపము గాకుండఁ జేయుం డన యుధిష్ఠిరుండు తమ్ము లతో నది పోయిన మార్గమ్మునం బోయి దానిం గానరాకుండుటకు విచారించి యేవురుఁ దప్పిఁ గొని తరుచ్ఛాయను విశ్రమించిరంతఁ గొంతేయాగ్రజుండు మాద్రే యాగ్రజుం గాంచి యిట్లనియె. 311

ఆ. అనుజ నీదుభ్రాత లతిపిపాసితు లైరి, యిమ్మహీరుహమ్ము నెక్కి నీవు
సరసుఁ గలుఁగుమార్గ మరయు మటన్న మా, ద్రేయుఁ డొక్క చెట్టుమీఁది కెక్కి.

వ. అల్లదె సరోవరం బొండు కానవచ్చె నన యుధిష్ఠిరుండు నకులా! నీ వట కేఁగి దప్పిఁ దీర్చుకొని మాకు నీరు దెమ్మని పలికిన నతం డాకమలాకరంబున కేఁగి నీరుఁ ద్రాగఁ బోవ నొకయశరీరభూతం బి ట్లనియె. 313

తే. ఈతటాకము నాయది భూతలేశ, యీజలంబునుఁ ద్రాఁగ నీ వెంతు వేని
నాయడిగినప్రశ్నల కీవు ప్రియ మలర, నుత్తరం బిచ్చి త్రాఁగ నా నోయి నీవు.

వ. అనిన నకులుండు దాని ననాదరముచేసి యానీరుఁ ద్రావి నిశ్చేతనుండై పడియె నకు లుండు మసలె నని ధర్మజుండు సహదేవుం బంపిన నతండు సరోవరమున కేఁగి పడి యున్నయన్నం గాంచి విచారించి నీరము ద్రావఁ బోవఁగా నశరీరభూతం బాతని కిట్లనియె. 315

తే. నాసరోవర మియ్యది భాసురంబు, నాదుప్రశ్న కుత్తర మిచ్చి నరవరేణ్య
నీవు గ్రోలుము నీ రన సహదేవుఁ డాత్మ, దాని నిర్లక్ష్య మొనరించి త్రావె జలము.

వ. సహదేవుం డానీరు ద్రావి విష మెక్కినట్లు నేలం గూలె నంత నజాతశత్రుఁ డింద్ర పుత్రుం జీరి యర్జునా! తమ్ము లిర్వురును రాక తడ వయ్యె నీవు పోయి చూచి రమ్మన శతక్రతుపుత్రుం డట కేఁగి పడినపిన్నతమ్ములం జూచి పరమవిషాదమాన సుండై నీరుం ద్రావఁ బోవ నయ్యశరీరం బి ట్లనియె. 317

ఆ. పాండురాజతనయ పార్థివేశ్వర నాదు, ప్రశ్నలకును దగుజవాబుఁ జెప్పి
నీరు ద్రావు మనఁగ నిరసించి కవ్వడి, నీరు గ్రోలి వేగ నేలఁ బడియె. 318

వ. అంత ధర్మనందనుండు వృకోదరు బంపిన నతండు పడియున్ననకులసహదేవార్జు నులం గాంచి శోకించి నీరు ద్రావఁ బోవుచుండఁగా నెప్పటియ ట్లశరీరభూతం బిట్లనియె. 319

తే. నాకుఁ గపటాకారంబు గిది మేదినీశ, నా ప్రశ్నల కుత్తర మిచ్చి న్యాయ మలర
జలముఁ ద్రావు మనఁగ నిరసన మొనర్చి, త్రాగి పడియెను భీముఁడు ధరణిమీఁద.

వ. అంత యుధిష్ఠిరుండు తమ్ములజాడ నరయ నేగుఁదెంచి శవంబులం బోలెఁబడియున్న వారిం గాంచి మిక్కుటంబుగా విలపించి దప్పిఁ దీర్చుకొనుటకై యానదిలోఁ దిగి నీరు ద్రాగఁ బోవుచుండ వెనుకటివలె నశరీరభూత మాతని కిట్లనియె. 321

ఆ. ధర్మరాజతనయ త్రాగకుమీరు నా, ప్రశ్న కుత్తరమును బలుకు మంతఁ
ద్రాఁగ వచ్చు ననుడు ధర్మరాజి ట్లనె, శరీరభూతమునకు మాఱు పలికె. 322

వ. అశరీరభూతమా! నీప్రశ్నల కుత్తరువు చెప్పెద నాభ్రాత లేల వీరిట్లు పడియున్న వారో తెలుపు మన నశరీర భూతం బి ట్లనియె. నో యీ యుధిష్ఠిరా! యీ సరోవరము నాయది నేను వల దని వారించిన వినక నీతమ్ము లీనీరుఁ ద్రావి యిట్లయిరి నీవు వివేకివై నుడువు మని వారించితి నాయనుమతి లేక యీనీరుఁ గ్రోలువా రిట్లు చత్తు రనఁ గౌంతేయాగ్రజుం డి ట్లనియె. 323

ఆ. దివ్యరూపధరుండ తెలియ నీ వెవ్వరో, నాకుఁ దెలుపు మిపు డనంగ ననియెఁ
గారవేంద్ర బకము గాను యక్షుండ నా, ప్రశ్నలకు జవాబు బలుకు మయ్య. 324

వ. అని యక్షుండు ప్రశ్నంబుల వైచిన ధర్మజుం డన్నింటికిని దగు బత్యుత్తరంబు చెప్పిన యక్షుండు మోదాయత్తచిత్తుండై నీతమ్ములలో నొకనిం బ్రదికింతు గోరు కొమ్మనఁ బాండవజ్యేష్ఠుండు నకులుం బ్రదికింపు మని కోరుటయు నయ్యక్షుండు ధర్మజునిధర్మబుద్ధికి సంతసించి నలువురు తమ్ములం బునర్జీవితులం జేసి యుధిష్ఠిరా! నే నంతకుండ నీశాంతిని నిన్ను బరీక్షింపఁ గోరి యిట్లు చేసితి నని తప్పిపోయిన విప్రునియరణి నిచ్చి యజ్ఞాతవాసమ్మున మీరు పరులెఱుంగ కుండ వర్తింపఁ గల రవ్వల పదునాల్గవయేట మేటియుద్ధమున గెల్చి నీవు రాజ్యపట్టాభిషిక్తుండ వగుదు వని వరం బిచ్చి యదృశ్య మయ్యెఁ గొంతవడికి సోదరులు లేచిన ధర్మజుండు వారి నాలింగన మొనర్చికొని యరణిని భూసురున కొసంగి వా రెల్లరు నిజాశ్రమమున కేగి రని వైశంపాయనుండు చెప్పిన జనమేజయుం డవ్వలివృత్తాంత మడుగుటయు.

ఆశ్వాసాంతము.

మ. కరుణాకార మునీంద్రసేవిత జగత్కల్యాణమూర్తీ ప్రభూ
పరమానందమయస్వరూప సుమనోభావా! యుమావల్లభా
పరిశుద్ధం బగునీకృతిం గరిమ నీపాదంబులం దుంచితిన్
బరమేశా యిది నీకుఁ బ్రీతి కైకొని దయన్ బాలింపవే మ్రొక్కెదన్ 326

గద్యము—ఇది కవిరాజ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారి పుత్రికయును, కల్లూరి వేంకట సుబ్బరాయఁడుగారి పత్నియును, రాజ్యలక్ష్మీపరిణయాది గ్రంథకర్త్రియు నగు విశాలాక్షమ్మచే రచియింపఁబడిన భారతకథామృతమునం దాదిపర్వము.

శ్రీ పరమేశ్వరార్పణ మస్తు. శ్రీ. శ్రీ. శ్రీ.

శ్రీ

# భారతకథామృతము.

## విరాటపర్వము.

క. శ్రీకల్యాణగుణాకర,లోకేశ్వర లోకపాల లోకారాధ్యా
శ్రీకాంతాప్రియవల్లభ,నీకు నమస్కృతు లొనర్తు నిఖిలస్తుత్యా! 1

వ. జనమేజయభూవల్లభునకు వైశంపాయనమునివల్లభుం డిట్లు చెప్పఁ దొడంగె బాండవు లరణ్యావాసము పూర్తి గావించి పదమూఁడవయేఁ డజ్ఞాతవాస మొనర్ప నెంచి భూసురాదులం బంపి విచారించుధర్మతనూభవుని ధౌమ్యులు దమ్ములు గొమ్మయు నూఱార్చిన నూఱడిల్లి పాండవాగ్రజుండు గాండీవి కిట్లనియె. 2

—పాండవులు వృత్తులేర్పర్చుకొనుట.—

తే. ఏపురము మన మింక నియ్యిందువదన,తోడ నెచటికిఁ బోదుమో తోఁపదయ్యె
పాండవులు వీ రటంచు నెవ్వార లైన,నెఱుఁగ కుందురె దుఃఖ మిట్లేల వచ్చె. 3

తే. అనుడు నర్జునుఁ డిట్లనె నన్నతోడ,ధర్మదేవతవరమును దప్పకుండ
నెందు మన మున్న నెవ్వార లెఱుఁగ లేరు,కానఁ జింతను బో నాడు కౌరవేంద్ర. 4

చ. అనవుడు ధర్మపుత్రుఁ డనె నర్జున నిక్కము తద్వరంబునన్
మన మతిగూఢమై తనరుమార్గమునందున నున్న నెవ్వరున్
మనల నెఱుంగ రెప్పటికి మత్స్యనరేంద్రునిపాలనంబునన్
మనము చరించి యుండఁ దగు మాననితోనొకవత్సరంబుగన్. 5

క. మన మెవ్వ రెవ్వ రేయే,పనులందున నుండఁ దగునొ పార్థా నాకున్
వినిపింపు మన్న నర్జునుఁ,డనె గన్నుల నీరు నించి యగ్రజుతోడన్. 6

సీ. సకలావనీశులు చరణదాసులుగా ధ,రాచక్రి మేలిన రాజ వీవు
ధర్మాన నినుఁ బోలుధరణీధవులు లేరు,శాంతమూర్తివి నీవు జనవరేణ్య
యవనీతలమునఁ బ్రఖ్యాతిఁ గాంచిననీవు, వివిధభోగంబులు విడిచి వైచి
విరటుభూపాలు నెవ్విధమునఁ గొలుతువో,యని విచారించెడునర్జునునకు

తే. ననియె ధర్మజుఁ డోయింద్రతనయ వినుము,నేను సన్న్యాసివేషము బూని విరట
రాజు సేవించుచుందుఁ బురాణములను,జెప్పుచుందును వానికి మెప్పు గాఁగ. 7

తే. మోదమున కే నతనితోడ జూద మాడు,వాఁడఁ గంకుభ ట్టనుపేరఁ బరఁగువాఁడ
నతఁడు నాపూర్వవృత్తాంత మడిగె నేని,ధర్మరాజహితుఁడ నని తగ వచింతు. 8

సీ. అని ధర్మరాజు ధౌమ్యునిఁ గాంచి యిట్లనె, భీమసేనుఁడు మహాభీమబలుఁడు

యక్షులను జయించి యమలసౌగంధిక,పుష్పములను దెచ్చి పొలఁతి కొసఁగె
కిమ్మీరదనుజుని నెమ్మెయిని వధించి,తాపసకష్టముల్ పాపివైచె
నిల బకాసురుఁ జంపి యేకచక్రపురాధి,వాసుల నానందపరులఁ జేసె
తే. మనలఁ బ్రోచె జటాసురుఁ దునిమి వైచె,నిల జనించినదాదిగా బలపరాక్ర
మములతోడ వర్ధిల్లిన మాన్యయశుఁడు,భీముఁ డేరీతిఁ విరటు సేవింపఁ గలఁడొ. 9
సీ. ఖాండవవనమును ఖ్యాతిమైని దహించి,మత్స్యయంత్రము నేసె మహితకీర్తి
యీశుని మెప్పించి పాశుపతాస్త్రము,గైకొనినట్టిలోకైకవినుతుఁ
డమరాధినాథుని యరగద్దెపైన సు,ఖాసీనుఁ డైనట్టియనఘమూర్తి
వైరిదుర్జయుఁ డగుపాకారితనయుండు,విరటు నెవ్విధము సేవింపఁ గలఁడొ
తే. ముఖవిజితశీతకరుఁ డతిసుఖసమన్వి,తుండు నకులుఁ డచ్చోట నెట్లుండఁ గలఁడొ
ప్రాజ్ఞజనసత్తముఁ డగుసహదేవుఁ డకట,యెట్లు విరటు సేవించునో యెఱుఁగ నకట.
తే. కటకటా! యాజ్ఞసేనుమఖాగ్నినందు,జన్మ మొందినయది మహాసాధ్వి యాజ్ఞ
సేని పరుల కూడిగముఁ దా నొనర్చి,బ్రదుకు టెట్లొకో యనుచునుఁ బలికె నంత.
వ. అజాతశత్రుండు నావలనఁ గదా మీ కిట్లు వచ్చె నని విచారించుచుండ భీముఁ
డి ట్లనియె. 12
సీ. మత్స్యావనీశునిమన్ననఁ గాంచుచు,వంటల నొనరింతు వలలుఁ డనెడు
పేర నాతనిని సేవించుచుండెద నని,వాయుసూనుం డనఁ బార్థుఁ డనియె
నూర్వశి నాఁడు నా కొసఁగె శాపము దాన,బేడితనముదాల్చి విరటుపురిని
నే బృహన్నలపేర నెసఁగి రాసుతలకు,నృత్యగీతాదుల నేర్పువాఁడ
తే. నరిగ నకులుఁడు నే నశ్వశిక్షణ మొనర్చి,దామగంధి పేరిటను భూధవునిఁ గొలుతుఁ
దంత్రిపాలునిపేర భూధవునిఁ జేరి,గోవులనుఁ బ్రోతు నని సహదేవుఁ డనియె. 13
చ. విరటునిధర్మపత్ని యరవిందనిభాస్య సుదేష్ణఁ జేరి నే
నిరతము పూలదండలను నేర్పునఁ గ్రుచ్చుచు సేవ సల్పుచుఁ
బరఁగెద మాలినీనామమున వర్ష మొకండు గ సంచు ద్రౌపదీ
తరుణి వచించె నంతటను ధర్మతనూభవుతోడ నిచ్చమై. 14
ఇట్లు తమతమవృత్తుల నేర్పఱచి,విరటుపురి కేగ నెంచిరి వినుతయశులు
అపుడు వారలతోడ మహానుభావుఁ,డైనధౌమ్యుఁ డి ట్లనె వారి ననునయించి. 15

—♦ధౌమ్యులు పాండవులకు ధర్మము లెఱిఁగించుట♦—

సీ. సమయాసమయములు క్రమమునఁ గనిపెట్టి,పార్థివేంద్రునిఁ గొల్వ వలయు మీరు

జనవరేణ్యునియొద్దఁ జనువుగ నేనుంటి,నని గర్వ మొందరా దనఘులార
యెవ రైన నేకార్య మేనిఁ జేయుదు మని,పలికిన మీఁదట వారి నడ్డు
పెట్టి భారము తైన వేసికొనఁగ రాదు,నేఁ జేయుదు ననుచు నృపతి యొద్ద
తే. జనవరుండు తా నడుగఁ బ్రశ్నముల కెల్ల,నుత్తరువొసంగుటయునట్టులొసఁగునపుడు
పలుకఁ దగ దనవసర భాషలుకులెల్ల,మిగుల మౌనముతోడను మెలఁగ వలయు.
తే. నగరులోనిరహస్యముల్ నలువురకును,జెప్పఁగా రాదు రాణివాస ముఖస్థ లంబులను
నంతిపురిస్త్రీలతో మైత్రి పూనిఁ దెచ్చు,బరులతోడఁ బ్రసంగముల్ పలుక రాదు.17
తే. నృపతి సన్మాన మొనరించె నేని దాని,కాత్మ సంతోషమును బొంది యుండ రాదు
ఆతఁ డవమాన మొనరింప నయ్యె నేని,దానికిని గిన్క లేకుంట ధన్యతమము. 18
వ. అని యనేకసేవాధర్మములం దెలిపిన ధౌమ్యులకు ధర్మజుం డనుజులతో నభివందన
మొనర్చె ధౌమ్యుఁడు పాండవుల నాశీర్వదించి వీడ్కొనియె. 19

—విరాటనగరంబునఁ బాండవులు తమవృత్తులతో నుండుట—

సీ. భారతాభరణులు పాండుతనూజులు,ధౌమ్యులవలనను దమ రొనర్చు
సేవావిధానముల్ చెలఁగ నాలించియుఁ,దమతమయస్త్రముల్ దాము దీసి
యివి యున్నయెడలఁ ద మ్మెఱుఁగుదు రనుచును,వాని దాఁపఁ దలంచి వార లెల్ల
వాని నన్నిటిని శవాకారముగఁ గట్టఁ,గట్టిరి యొకచోటఁ బెట్ట దలఁచి
తే. చనిరి యట శమీవృక్షరాజంబుపైన,గట్టినట్టికట్టను బెట్టి చెట్టునకును
జెలఁగ ముమ్మారు ప్రదక్షిణాల్ చేసి వారు,మత్స్యనగరము చేరిరి మహితయశులు.20
చ. విరటుపురంబుఁ జేరి తమవృత్తులతోడను మత్స్యభూవిభుం
గర మనురక్తితోఁ గొలిచి గౌరవ మొందుచు నుండి రచ్చటం
గురుకులవంశభూషణులు గొంతికుమారులు వారిఁ గాంచి యా
నరవరుఁ డెంతయేనియు మనంబునఁ బ్రేముడితోడ నొప్పెడుం. 21
సీ. విరటుపురంబున వీరులు పాండవుల్, మాఱునామంబుల మసలుచుండ్రు
వంటఁ జేయు నొకండు పౌరోహితుఁ డొకండు,పశువుఁ గాచు నొకండు విశదముగను
నాట్యశాల నొకండు నాట్యములను నేర్పు,నశ్వశిక్ష యొనర్చు నట్టిఁ డొకఁడు
రాజాధిరాజులై ప్రతిభఁ గాంచెడునట్టి,పాండవులకు నిట్లు వచ్చె నకట
గీ. విరటుసతి సుదేష్ణ యనంగ వెలయు దాని,వద్దమాలిని పేర సేవఁ బొనర్చు
చుండెఁ బాంచాలి పాండవు లుండి రట్లు,దైవకృతమును దప్పింపఁ దరము గాదు.22
తే. విరటుసతివద్ద బాంచాలి వినయమలరఁ,దాను సైరంధ్రిపేరను దాసి యయ్యు

నెట్టెటో గాలము గడవ నీడుచుండెఁ, బరమపావని కటువంటిపాట్లుఁ గలిగె. 23

క. యమసుతుఁడు విరాటమహీ,రమణుని మెప్పులనుఁ గాంచి కాసులుచునుండెన్
గ్రీమముగ నృపతి యొసంగిన, విమలాంబరముల నొసంగు వెసఁ దమ్ములకున్, 24

ఆ. వాయునందనుండు వంటకు మిగిలిన,వస్తువుల నొసంగు భ్రాతలకును
నర్జునునకుఁ గల్గునమలభూషణములు,సోదరుల కొసంగు మోద మలర. 25

తే. నకులునకు గల్గుధనము లన్నల కొసంగు,దేవసన్నిభుఁ డాసహదేవుఁ డెలమి
గోరసాదు లన్నలకును గూర్మి నొసఁగు,నట్లు గడపుచుఁ ద్రోవది నరయు చుండ. 26

క. తన్నరసి తిరుగుపతులన్,గన్నారం గాంచి ద్రుపదకన్యామణి తా
నున్నతి నలరెడుఁ బార్థులు,సన్నుతులం గొనిరి సకలజనములవలనన్. 27

వ. సర్వజనస్తోత్రపాత్రు లగుపాండవేయులు పాంచాలితో నిట్లు కాలము గడుపుచుండిరి భీముఁడు మల్లురతో యుద్ధము చేసి వారి నోడించి మత్స్యావనీశున కుత్సాహముఁ గలిగించి వానివలనఁ గానుకలొందుచుండు నంతనొకనాఁడు విరాటుమఱంది కీచకుం డుసుధేష్ణం గాన వచ్చి. 28

—కీచకుఁడు ద్రౌపదిం జూచి మోహించుట—

క. అంతటను సుధేష్ణానుజుఁ,డెంతయు దుష్టాత్ముఁ డగుచు నీపాంచాలిన్
గాంతాశిరోమణిం గని,స్వాంతంబున మోహ మందెఁ జపలాత్ముం డై. 29

ఉ. అత్తఱిఁ గీచకుండు మహిమాన్విత ద్రౌపదిఁ గాంచి యెంచునీ
చిత్తరిసుందరంబుఁ బృథివీస్థలి నెందున లే దటంచుఁ దాఁ
జిత్తజుబారిఁ జిక్కి కొని శీఘ్రము పోయి సుధేష్ణదేవితో
నిత్తరుణీశిరోమణి యిదెవ్వరొ చెప్పవె నాకు సోదరీ. 30

ఉ. మారవికార మొంది యటు మాటికిఁ బల్కిన కీచకాఖ్యుఁ డా
క్రూరునితో సుధేష్ణ సతి కొంచెము నేనియు మాఱుపల్కఁ గా
నేరక యున్నఁ గీచకుఁడు నీచుఁడు వేఁ జని ద్రౌపదీసతిన్
మారమనోజ్ఞసుందరిని మంగళమూర్తినిఁ గాంచి యి ట్లనున్. 31

చ. అతనుశితాస్త్రపాతముల కగ్గల మైతినిఁ దాళఁ జాల నో
యతివ మదీయతాపము దయామతిఁ దీర్పుము నీదుకోర్కు లీ
క్షితి నవి యెన్నియుండినను జెచ్చెర దీర్చెర నాదుపత్ని వై
యతులితరాజ్యవైభవము నందఁగదే జలజాయతేక్షణా. 32

క. ఎందుం జూచిన నినుఁ బోల్,మందగమనఁ గాంచి యెఱుఁగ మానిని నన్నున్

బొందుము సకలైశ్వర్యము,లందుము యశాడిగ మొనర్ప నగునే నీకున్. 33

సీ. కనులతో నను జూచి కమలాయతేక్షణా,నాకోర్కి దీర్పుము ప్రాకటముగ
భువనైకమోహిని వగునిన్నుఁ గాంచితి, మరుబాధ బొందితి సరసిజాస్య
నినుఁ బోలుసుందరి నిఖిలలోకంబుల, నేఁ జూచి యెఱుఁగను రాజవదన
యంతఃపురంబుల సంతతము వసించి,సుఖియింపఁ గాఁ దగుసకియ వీవు

తే. మాసుధేష్ణ కూడిగములఁ జేసి యిట్లు,కష్టములఁ బొందఁగా నేల కనకగాత్రి
జనపతిని నన్నుఁ బొందుముఁ సాటిలేని,వివిధభూషణాదుల నిత్తు వేడ్క నీకు. 34

చ. మనసిజరాజ్యలక్ష్మి వను మాడ్కిఁ జెలంగినదాన వయ్యు నో
వనరుహచారునేత్రి పెరవారల కూడిగము ల్పొనర్పఁగాఁ
గనినను దుఃఖమయ్యెడును గావున వేగము రమ్ము నిన్ను నేఁ
గొని చని పెండ్లియాడెదనుఁ గోర్కులఁ దీర్చెదఁ దోయజాననా. 35

వ. అని కేలుఁ గేలం గీలింపం బోవునెడ మదనావేశవశుం డగుసింహబలుం గాంచి పాంచాలి తదీయమోహంబునకు వగచి వాని నెమ్మదిగా మందలింపఁ దలఁచి యిట్లనియె. 36

తే. పరసతీసంగమము ఘోరపాపులకును,నాయురారోగ్యసంపద లంతరించు
వానివంశము నశియించు వాఁడు తుదిని, ఘోరనరకమునందునఁ గూలుఁ గాదె. 37

తే. పూతచరిత భూతనయను సీతఁ గోరి,రావణుఁడు గొన్నకష్టము లీవెఱుఁగవె
నలునిసతి దమయంతిఁ గాననములోనఁ, గోరినట్టికిరాతుండు కూల లేదె, 38

ఉ. ఏను మహాపతివ్రతను నీ విటు కోరఁ గ నీకు న్యాయమా
మానవనాథ యప్పనికి మానుము సోదరి యట్టిదాన నేఁ
గానను గోరఁగాఁ దగదు కావున వేఁ జను నీదుకోరికన్
నీనళినాక్షులందునను నెమ్మినిఁ దీర్చుకొనంగ నొప్పెడున్. 39

క. పరకాంతాసంగమమున, దురితంబులుఁ గలుఁగుఁ దనదుతొయ్యలియందే
పరితృప్తుఁ డైనవాఁ డిహ,పరములలో సౌఖ్య మొందు వసుధాధీశా. 40

ఉ. హీనకులంబునందు జనియించినదానిఁ గురూపి నైనయీ
బానిసదాని నేవ మగువల్వ ధరించినదాని సాధ్వియా
దానిని నన్నుఁ గోరుటదిఁ దద్దయు నాదురదృష్ట మయ్యెడున్
మానవనాథ హా మ్మనుచు మానవతీమణి వాని కిట్లనున్. 41

తే. ఈఁడుతోఁబుట్టువుల్ గలవాఁడ వైన, నన్ను నీ విట్లు పల్కుట న్యాయ మటవె

మనసిజాయత్త మైననీమానసమును, వృజినమునుండి మరలింపు పృథివినాథ. 42

వ. అంతం గీచకుండు మోహానలమగ్నుండై పాండవభాగ్యలక్ష్మి కిట్లనియె. 43

తే. పరసతీసంగమమున నేపాపమునకు, నోర్వఁ గాఁగల వాఁడ నో యువతిమిన్న
మదనతాపభరమునకు నూత్రి మోర్వఁ, గాన నేఁ జాల ననియె నక్కాంతతోడ.

సీ. పాంచాలి కోపము పట్టఁ గాఁ జాలక, పలికె నిట్లనుచు నప్పాపునకును
నిర్వక్రవిక్రముల్ నిఖిలవిద్యానిధుల్, సంగరకేళీవిశారదులును
బతు లేవురు సుందరగీర్వాణాకృతుల్ నాకు, వారు తలంచిన నోరిచెడుగ
త్రుటిలోన నినుఁ గూల్చి పటుబాహుశక్తులఁ, బాపువారలు జముపట్టునకును

తే. అనుచుఁ బాంచాలాంగన లేచి యచటనుండి, పోవునెడఁ జింతతోడను బొగిలిపొగిలి
చనియెఁ దనసోదరి సుదేష్ణ కనియె నిట్లు,నీచమానసుఁ డైనయాకీచకుండు. 45

చ. మరుశరసన్నిభం బయినమానినిఁ జూచినదాదినుండి యే
మరులు పొసంగె నాకు సుకుమారిని దానిని గూర్ప కున్నెడన్
గరితరొ నీదుసన్నిధినిఁ గక్కునఁ బ్రాణమువీడు వాఁడ నా
తరుణినిఁ గూర్చి ప్రాణమును దానము చేయఁ గదే సహోదరీ. 46

వ. అనుటయు వానిదుశ్చేష్టితములకు వగచి సుధేష్ణ యిట్లని మందలించె. 47

తే. తమ్ముఁడా రతిదేవి నాఁ దనరుచుండు, నువిద లెందఱో నీయింట నుండఁ గాను
నీచవంశసంజాత నీవెలఁతఁ గోరు,టధికహీన మటంచుఁ దా ననియె నిట్లు. 48

తే. పరసతినిఁ గోర నాయువు తరిఁగిపోవు,ముక్తికిని దూర మయ్యెడుపురుషునకును
బరిహసింతురు విని లేని బంధుజనులు,పత్ని వినెనేని విడనాడు బ్రాణములను. 49

క. ఆవనితకు బలవిక్రము,లేవురు పతు లున్న వార లెఱుఁగించితి నేఁ
గావున నావెనఁ బోకుము,నావుడు కీచకుఁడు పలికె నారీమణితోన్. 50

సీ. దానిభర్తలఁ గాంచి నేను భీతిల్లను,మదనతాపంబున గ్రుగ్గుచుంటి
నాసతి నన్నైన నంగీకరింపఁ గాఁ,జేసి నన్నాడందఁ జేయు మమ్మ
యటుఁ చేయనందువా త్రుటిలోనఁ బ్రాణముల్,విడనాడు వాఁడ నో విమలచరిత
యని సుదేష్ణపదంబులను బడి యేడ్వ నా,సుదతి యిట్లని పల్కె సోదరునకుఁ

తే. దమ్ముఁడా! విచారింపకు తలిరుబోఁడి,మాయఁ బన్ని పంపింతు నీమందిరమున
కామెతోడ సుఖింపు నీ వని వచింపఁ,గీచకుఁడు వేడ్కఁ జనె నిజగేహమునకు. 51

వ. అంత సింహబలుండు నిజమందిరమున కేగి వెన్నెలరాకకుఁ బ్రతీక్షించుచకోరంబు
మాడ్కిఁ బాంచాలియాగమనముం గోరి మనోజవికారమగ్నుఁడై. 52

సీ. భూషణాదులు లేక భువనైకసుందరి, రాజతేజంబునఁ బ్రబలుచుండె
భూషణాదులఁ దాల్చి పూబోఁడి మఱియెంతొ, సుందరాకారము చెందు నొక్కొ
సంపంగితావికి సరిపోలి యొప్పెడు, తరళలోచనమేనితావి యహహ
సాటి లేనట్టియాబోఁటిసృష్టించుట, స్రష్ట యనెడువాఁడు గ్రొత్తకలన
తే. అట్టిసైరంధ్రిఁ గాంచినదాదినుండి, మదనమోహానలంబున మ్రగ్గుచుంటి
సుగుణములదొంతి యలివేణి సుందరాంగి, దానిఁ గూడక నే నెట్లు తాళువాఁడ. 53

ఆ. నాదురాజ్యలక్ష్మి నాదుభాగ్యమునకు, నాదు సంపదలకు నాబలమున
కాలతాంగి యున్న మేలుగ నుండును, బసిఁడి తావిఁ గలిఁగి పొసఁగునట్లు. 54

వ. అనుచు మనసిజపరతంత్రుండై కీచకాధముండు పాంచాలిం గాంచి పలవించుచుఁ దదాగమనవాంఛితుండై యుండ సుధేష్ణాదేవి ద్రోవదిని రావించి తమ్మునిమందిరమున కామెం బంపఁ దలంచి కృష్ణ కిట్లనియె. 55

చ. తరుణి మదీయసోదరుఁడు దాహము నాకును దీర్ప నెంచి నేఁ
డరయగ మద్య మిత్తు నని నాతనియింటికిఁ బోయి నీవు చె
చ్చెర మదిరారసంబుఁ గొని చేడెరొ కృష్ణను దీర్పు నా కనన్
సరసిజనేత్రి కృష్ణ మదిఁ జాల విచారముతోడ ని ట్లనున్. 56

ఆ. నన్నుఁ బంప వలదు నళినాయతాక్షి నీ, వొండ్ల నటకుఁ బుచ్చు మొప్పమీఱ
నేను సాధ్వి నైనదాన నా కాముకు, నింటి కనుప నీకు నెట్లు తగును. 57

ఆ. అన సుధేష్ణ కోపమునఁ బల్కె నక్కట, కృష్ణ నీవు వినుమ వెఱువ నిన్నుఁ
గోరిపంపుచుండ నీకిట్టి బల్కి హీనంబు జేయ నగునె నన్ను నీవు. 58

వ. పాండవేయవల్లభవాక్యములు మత్స్యమహీవల్లభువల్లభ నిరసించినఁ దెఱు వేమియు గానక భయకంపితాంగియై పాంచాలి బంగరు కలశంబుఁగొని కీచకుని మందిరమున కేగుటయు. 59

క. వచ్చినపాండవసతికిన్, జెచ్చెరఁ గీచకుఁడు పలికెఁ జెలి వచ్చితివా
మచ్చిక వరింపు మన్నన, నచ్చపులేకుణ వచించె నాదుష్టమనస్కుఁ. 60

తే. వచ్చితిని సుధేష్ణాదేవిపంపువలన, మధురసమ్మును గోరె నామంజువాణి
వేగఁ దాని నొసంగుము వెడలి దేవి, కృష్ణఁ దీర్చెద ననుచు నాకృష్ణపలికె. 61

వ. పరమదురితాత్ముం డగుకీచకుం డవ్వరవర్ణిని కి ట్లనియె. 62

ఆ. భగినికృష్ణఁ దీర్ప నగుమధురరసంబు, నొరులచేతఁ బనుతు నోలతాంగి
నాదుకృష్ణఁ దీర్చి ననుఁ బ్రోవు మని పల్కె, యాజ్ఞసేని పలికె నతనితోడ. 63

తే. పరమసాధ్వీశిరోమణి పావని యగు,సతిని న న్నిటు లాఁకంగఁ జనదు నీకు
సతులఁ జెఱపంగఁ జూచిన జడమతులకు,నిహపరంబులు గల్గునే యోంచి చూడ. 64

తే. నీచ నన్నిటు పల్కిన నీదుశిరము, పేలి వ్రక్కలై భూమిని ద్రెళ్ళఁ గాన
నట్టిదుర్బుద్ధి విడనాడుమనుచుఁ బలుక,సింహమధ్యతో నిట్లను సింహబలుఁడు. 65

సీ. నీతనూలతగాంతి నీదులావణ్యము,మఱవఁ గాఁ జాల నోసరసిజాక్షి
నీదు లేనవ్వులు నీయొయ్యారమ్ములు, మదిఁ గలంచుచు నుండె సదమలాంగి
నీమకరధ్వజాంకపు నీసుందరతఁ గాంచి, నే నెట్లు తాళుదు నీలవేణి
నీదుదాసుఁడ నేను నీ వేలుకొని ప్రోవు,రాజ్య మిచ్చెద నీకు రాజవదన

తే. నాదుకాంతలచేతను నళిననేత్ర,నీకు సేవలఁ జేయింతు నిక్కముగను
మొలల కూడిగము లొనర్చి యుండ నేల,పుష్పబాణుతాపము దీర్చి ప్రోవు నన్ను.

వ. అనిన నాదుర్జనునకు యాజ్ఞసేని యి ట్లనియె. 67

క. సతులను జెఱచెదుదుష్ట,వ్రతమున నున్నట్టిపీదుపాపంబున మ
త్పతు లేవురు వధియింతురు, మతి నెఱుఁగుము నాదుమాట మనుజాధముఁడా. 68

తే. మధురరస మిచ్చి నను బంపు మాట లేల,పరమసాధ్వి ని ట్లాడుట పాడిగాదు
తత్ఫలము గాంచు వాఁడవు త్వరిత మనఁగ,క్రోధసంతృప్తుఁడై కీచకుండు పలికె.69

చ. వనితరో కాఱు లిట్లుగను బల్కఁగఁ జొచ్చితె దుష్టబుద్ధివై
ఘనుఁడను శౌర్యవంతుఁడ సఖండరమావిభవుండ నైనన
న్నని కడుబల్మి గాఁగ నళినాక్షికరంబును బట్టి లాఁగె న
వ్వనరుహనేత్రి కష్టమున వాని విదల్చుచు వచ్చెఁ జెచ్చెర౯. 70

సీ. ద్రుపదజ వెనువెంట దుష్టకీచకుఁ డేగి,మోహానలంబునఁ బొగిలి పొగిలి
జనులఁ గాంచియు లజ్జ గొని వెనుకకుఁ బోయె,ద్రౌపది యేడ్చుచు రయముగాను
మత్స్యేశ్వరునిసభామందిరంబున కేగి,కలిగినదానినిఁ దెలిపె నంత
విరటభూనాథుండు మఱఁది నేమన లేక,నూరార్చె నాయమ నుచితభంగి

తే. భీముఁ డాకీచకు వధింప వెసఁ దలంప,వాని వారించి ధర్మరాట్సూనుఁ డంత
సతినిఁ గాంచి వారాంగనగతిని నీవు,నృపతిసభ కేగుఁదెంచుట నీచ మనియె. 71

వ. అనిన నత్యంతదుఃఖాక్రాంతచిత్త యగునయ్యాజ్ఞసేని విరాటవల్లభ దరి కేగి రోదనము
నఁ దనపరిభవం బెఱింగించిన నారాజపత్ని సోదరునిదుష్టతకు విచారించి పాంచా
లి నుచితవచనంబుల నూఱడించె నంత నామె తనపరిభవము గరువలిసూనున కె
ఱింగింప నెంచి నడురేయిని పాకశాలకుం బోయి నిద్రించు భీముని లేపి దుఃఖితాత్మ
యగుచు ని ట్లనియె. 72

—ద్రౌపది భీమునితోఁ దనపరిభవ మెఱిఁగించుట—

సీ. ఆద్రుపదాత్మజ నై పృథివీస్థలిఁ,గుంతీమహాదేవికోడల నయి
పాండవులకు మీకుఁ బత్నినై పడరాని,పాట్లఁ బడుచునుంటిఁ బార్థివేంద్ర
కౌరవసభలోనఁ గ్రూరదుశ్శాసను,చేఁ బరిభవమును జెందితిఁ గదె
యారణ్యవాసమునందు సైంధవునిచే,హీనత్వ మొందితి నెఱుఁగుదు గదె
తే. పేరు రూపము మాఱంగ వీరివద్ద,దాసిగా నుండి యే నేను దైవగతులఁ
గీచకుఁడు నాఁగఁ బరఁగిననీచుచేతఁ,బరిభవింపంగఁ బడితి నో ప్రాణనాథ. 73
క. నాథులఁ గలిఁగిన నేను న,నాథవలెన్ దుఃఖ మొంద నైతిని గంటే
యీధర్మజుజూదంబున,నాథా యి ట్లయ్యెఁ గాదె నాకుం జూడన్. 74
సీ. సభలోన నాఁడు దుశ్శాసనుచేతఁ గాం,తారమందున జయద్రథునిచేతఁ
బడితి నేను బరాభవము దానికన్న నా,కీనాఁడు సభ్యు లీ రెల్లఁ జూడ
ఖలుఁ డగునీసింహబలుఁ డొనరించిన,దాని కుల్లమ్మది దహన మయ్యె
నాసమయంబున నాసభ నీ వుండి,యూరకుండఁగ నేల యొప్పు నీకుఁ
తే. బవనజునిఁ గాంచి పల్కి యప్పద్మగంధి,యశ్రుధారలు కాల్వలై నట్టు లేడ్వ
నామె నోదార్చి భీముఁడు కోమలాంగి,చంపెదను గీచకాధము శాంతి నొందు. 75
తే. రాజుకొల్వుకూటమునకు రమణి నిన్నుఁ, దరిమి వచ్చినకీచకుఁ దర్ప మడఁపఁ
దలఁచి నాఁడ ధర్మజుఁడు వద్దనియెఁ గాన,నూఱకుంటి వానినిఁ జంప కుబ్జ్వలాంగి.
వ. అనినంత. 77
క. వాయుతనూజున కిట్లనెఁ, దోయజదళచారునేత్ర ద్రుపదజ యంతన్
మీయభ్యుదయము గోరుచు,నాయాపదఁ దీర్పఁ బోరు నాథా మెడఁదన్. 78
ఆ. వేయిపలుకు లేల రేయి నైనను,సింహబలువధంబుఁ జేయ వేని
నీవు చూచుచుండ నిమిషములోనను,విషము ద్రాఁగి యేని విడుతు మేను. 79
క. ఏవురు బలవిక్రము లగునావరు లున్నా రటంచు నాథా నేనున్
నావిరి వానికిఁ జెప్పితిఁ, గావున వధియింప వలయు ఖలు నీ రేయిన్. 80
వ. అనిన భీముం డాకోమలాంగిం గాంచి రేపటిరాత్రి దురాత్ముం డగు గీచకుం
బట్టి చిత్రవధ మొనర్చెదం గాని ధార్తరాష్ట్రకదళీకాంతారవిచ్ఛేదనము గావిం
చినఁ గానిఁ నాకు మనశ్శాంతి యుండదు వారలకుఁ గాలము చేకూరె నజ్ఞాతవాస
మిఁక మాసము దినములే కలదు పిమ్మటనీ వమితసౌఖ్య మనుభవింపఁ గలవు. 81
ఆ. సింహబలునికడకు చేరి నామాటలు, చెప్ప సందియంబుఁ జెంద వలదు

నన్నుఁ గూడరమ్ము నర్తనశాలకు, నీదుకోర్కెఁ దీర్తు మోద మలర. 82
చ. అని వచియింపు మోవనరుహానన యాతఁడు నిన్నుఁ గూడ న
ర్తనమున కేగుఁ దెంచెడును రాతిరి వేళను నేను నీవలెన్
దనరెడువేషమున్ వయిచి తప్పకఁ గీచకుఁ జంపువాఁడ వేఁ
జనుమన ద్రౌపదీరమణి చయ్యనఁ బోయె సుదేష్ణపాలికిన్. 83
ఉ. అంతటఁ గీచకుండు విరహానలవేదన సైఁప లేక య
క్కాంతను బాంచవాంగనను గ్రమ్మరఁ జూడ సుధేష్ణదేవిదా
నంతిపురంబుఁ జేరి ద్రుపదాత్మజ కిట్లనె దుర్మదాంధుఁడై
కంతునికేళిఁ గూడి ననుఁ గావు పయోరుహపత్రలోచనా. 84

—కీచకుఁడు ద్రౌపదితో సంభాషించుట—

క. అరవిందగంధి నీపై, విరహము క్షీణింపఁ జేసె వెస ననుఁ గంటే
కరుణామతివై నాపై, మరు లందఁగ రాదె సుమసమానశరీరా. 85
క. లోలాక్షి నన్నుఁ బతిగా, నేలుచు సౌఖ్యంబు లొందవేలా యిచటన్
బేలవలె నుండు టేలా, జాలిఁ గలిఁగె నిన్నుఁ జూడఁ జంద్రనిభాస్యా. 86
ఆ. నాదుకాంతలెల్ల నీకు సేవాదులు, చేయునట్లు గాఁగఁ జేయువాఁడఁ
బూజ్యరాజ్యలక్ష్మి పొలఁతి నీ కిచ్చెద, నన్నుఁ బెండ్లియాడు సన్నుతాంగి. 87
క. అచ్చగునీరూపముఁ గన, ముచ్చటఁ గలిగించె నాకు మోహనగాత్రీ
మచ్చిక నన్ను వరింపుము, పచ్చవిలుతుః గెల్వఁ జాల వారిజనేత్రా. 88
సీ. మద్బాహుసుపరాక్రమము నీ వెఱుంగవు, రాజవరుల గెల్తు నాజిలోన
నస్మదీయపరాక్రమాతిశయంబున, విరటురాజ్యం బిట్లు వృద్ధిఁ బొందె
నా కెవ్వ రెదిరించి వాకొన నేరరు, నాకు సముఁడు లేఁడు లోకమందు
మొన్న నీతోడ నే వెన్నంటి వచ్చిన, విరటుసభాస్థలి వీరవరులు
తే. నాకు మాటాడ గలఁగిరే నళిననేత్రి, పతులు గల రేవు రని నీవు పలికినావు
వార లే మైరి యానాఁడు వారిశౌర్య, మెందుఁ బోయెనో తెల్పు మోయిందువదన.
క. అనునెడఁ గోపం బడచుక, వనజానన వాయుజుండు పలికినటుల ని
ట్లనె నర్తనశాలకు రాత్రిని రాఁ దగు నీదుకోర్కెఁ దీఱుతు నచటన్. 90
వ. అని పలికి ద్రౌపది కీచకు నభీష్టము దీర్చుదానివలె నటించిన నాకీచకుండు కృతా
ర్థుఁడ నైతి నని తలంచి తనమందిరమున కేగె ద్రౌపది వృకోదరున కావృత్తాం
తముం దెలిపె నంత. 91

—♦కీచకవధ♦—

ఆ. వాయునందనుండు వంటశాలను బనుల్,సత్వరముగ నలిపి సంజ యెపుడు
పడెడు నొక్కొ సింహబలు వధియించుట,యెప్పుడో యటంచు నెంచుచుండె. 92

ఉ. రాతిరి యెప్డు వచ్చు నని రాజకుమారుఁడు భీముఁ డయ్యెడన్
రాతిరిఁ గోరుచుండిన ధరాతల మెల్ల దమంబుఁ బర్వెఁ బ్ర
ద్యోతనుఁ డస్తమించునెడ నొయ్యన గీచకుని న్వధింపఁగా
నాతఁడు నాట్యశాలఁ జని యందుఁ బరుండె ముసుంగు వెట్టుచున్. 93

ఆ. ద్రుపదసూతిఁ బోలె నపుడు వాయుసుతుండు,వేషమును ధరించి వెలయ నాట్య
శాలలోఁ బరుండి జడమతి యఁగుగీచ,కాగమనముఁ గోరె నంతలోన. 94

వ. మణిమయకాంచనాద్యలంకారాలంకృతుండై చీనిచీనాంబరధారియై చందనగంధము
మేన నలంది ద్రౌపదిం గూడుకోర్కితోఁ గీచకుండు నర్తనాగారము ప్రవేశించి
యామె యెందున్నదో యని కామాతురుండై నలుదిక్కులు చూచుచుండె. 95

ఉత్సాహము. దిక్కు లెల్లఁ జూచి యతఁడు తెలుపఁ గాన లేక యం
దొక్కమూల ముసుఁగు బెట్టి యున్న భీముఁ గాంచి వాఁ
డక్కమలదళాక్షి యంచు నాత్మలోన నెంచి యా
చక్కిఁ బోయి పలుకుఁ గామశరవిలోలుఁ డయ్యెడన్. 96

తరళము. వనజలోచన కీచకుండను వచ్చియుంటిని నన్ను నీ
కనులతోడను జూచి యిప్డు కౌఁగిటం దనియింపు మీ
వనిన యట్టులు నాట్యశాలకు వచ్చినా నని భీముపైఁ
దనకరంబును వైచి లె మ్మని దాను నిద్దుర లేపఁగన్. 97

వ. భీముఁడు వానిపలుకుల కసహ్యము నొంది సైఁప లేక. 98

తే. ముసుగుఁ దీసివైచి ముందట నుండిన,సింహబలునిఁ గాంచి చెలఁగి కినుక
మల్లయుద్ధమునకు మార్కొని కీచకుఁ,జిత్రవధ మొనర్చె శీఘ్రముగను. 99

తే. నాట్యశాల భీముఁడు విడనాడి వేగ,పాకశాలకు నేగి ద్రౌపదినిఁ గాంచి
సింహబలువధియించితిఁజెలువయనిన,స్వాంతమున మోదమందెఁ బాంచాలతనయ.

సీ. సైరంధ్రిఁ గూడఁగాఁ గోరి సింహబలుండు,నాట్యశాలకుఁ బోయి నాఁటిరేయి
నచ్చటఁ బ్రాణము లాతఁడు విడె నని, కలకలము జనించె గ్రామమందు
సత్వరంబుగ నాట్యశాల కేగితదీయు,లుపకీచకు దుఃఖముప్పతిల్ల
నాకీచకుం గాంచి శోకించుచుండిరి,భ్రాత పోయె నటంచు వార లెల్ల

తే. అపుడు నర్తనశాలలో నగున దేమొ,చూత మని యెంచి పాండవసుందరాంగి
దూరమందున నిలుచుండి వారి నెల్లఁ,జూచుచుండిన దాయుపకీచకులను. 101

వ. ఉపకీచకులు ద్రుపదసుతం గాంచి యీమెవలన నే తమయన్న మరణించె నని
యామెం బట్టి కీచకశవంబుతోఁ గట్టి దహింప శ్మశానమునకు గొంపోయిరి. 102

ఆ. ద్రుపదరాజతనయ యుపకీచకు లొనర్చు,దారుణమున కేడ్చి తనదుపతులఁ
బిలుచుచుండె నట్టి కలకలము స్వని,ప్రజలు చెప్పుకొనెడుపలుకులు విని. 103

వ. భీమసేనుండు మహోగ్రాకారుండై కడువేగమున శ్మశానమున కేగినంతలో నుపకీచ
కులు కీచకునితోఁ బాటు ద్రౌపదిని చితం బెట్టఁ గ్రిందకు డింపి రామె మహారోద
న మొనర్చుచుండె నంత. 104

సీ. భీముఁ డయ్యది విని వేవేగ నచ్చట, వృక్షము నొకదానిఁ బెఱికికొంచు
రౌద్రత్వ మంది దురాత్ముల వారల, వధియించె నల్వుర బలముకలిమి
భయమంది మిగిలినవారు పర్విడి పోవ,భీముఁడు వారల వెనుకఁ బోయి
నూటయేవురు నగునుపకీచకులఁ జంపి,సింహబలుశవంబుఁ జేర వచ్చి

తే. ద్రౌపదిని విడిపించెను దక్షిణమునఁ,బాకశాలకుఁ బోయె నవ్వాయుసుతుఁడు
శ్వసనసుతుశౌర్యబలముల సన్నుతించి,కృష్ణ వేవేగఁ జనియె సుధేష్ణదరికి. 105

వ. విరాటుండు సకీచకోపకీచకులు చచ్చి రని విచారించి శోకాయత్తచిత్త యగు
సుధేష్ణ నూఱడించి సైరంధ్రివలన నే వీ రెల్లరు సమసిరి తత్పతు లగుగంధర్వులే
యిట్లొనర్చి రని నిశ్చయించి సుధేష్ణ కిట్లనియె. 106

సీ. సౌందర్యనిధి యైనసైరంధ్రి యిట నుండి,పాసి పొమ్మని పల్కవలయు నీవు
పురుషు లే రైన నాతెరువునఁ బోయిన,హాని వచ్చుచునుండు నలరుబోఁడి
యామెసోయగ మది యతిమనోహర మగుఁ,బురుషు లెందున భోగమూర్తులు గదె
మారుం డొనర్చెడుక్రూరత లెక్కింప,శక్య మెవ్వరి కగు జగతిలోన

తే. నువిద యిటువంటిసతి మనయొద్ద నుంట,భీతి కలుగుచునుండెను వెలఁది నాకు
నేను జెప్పంగఁ జాల నానెలఁతతోడ,సతులు సతులకుఁ జెప్పుటే చాల మేలు. 107

వ. సుధేష్ణ విరటువాక్యములకు సమ్మతించి పాంచాలిం బిలిచి యొండుచోటునకు
బొమ్మనన నయ్యండజయాన యి ట్లనియె. 108

తే. ఇంకఁ బదుమూఁడుదినము లే యిచట నుందు,నాపతులవలన విరాటనాథునకును
జాలశుభములుఁ గల్గెడు సాధ్వి నిన్నుఁ,గోరితి నొకింతమాత్రము గారవమున. 109

వ. అనిన విరాటమహీవల్లభ పాండవవల్లభపలుకులకు సమ్మతించి యప్లేయుండు
మనియె నయ్యవసరమ్మున. 110

—కౌరవులు పాండవులజాడ లరయఁ గోరుట—

సీ. దుర్యోధనుం డతిదుర్మార్గుఁ డగుఁ గానఁ, బాండవాజ్ఞాతము భంగపరుప
వార్తవాహుల నెల్లఁ బాండవేయులఁ జూడఁ,బంపించె నెన్నియో పట్టణములు
బాండునందను లెందు నుండిరో వారలు,కనుఁగొనఁ గా లేకఁ గరిపురికిని
జని సుయోధనునకు వినిపించి రంతయు, నతఁడు భీష్మాదుల కనియె నిట్లు
తే. పాండురాజతనూజు లెందుండు వారొ,మీర లూహింపవలయు మామేలు గోరి
యనుచు రారాజు పలికిన నబ్జమిత్రి,సూనుఁ డిట్లని పల్కెను వానితోడ. 111
తే. మాఱువేషములం బూని చారులెల్ల,సకలదేశముల్ వెదకినఁ జాలమేలు
పాండవులు గానఁబడుదురు వారలకును, మనప్రయత్నము సఫలమౌ మానవేంద్ర
వ. అంత దుశ్శాసనుండు దుర్యోధనుం గాంచి పాండవు లీవర కరణ్యములోనే నశిం
తురు కాని నిష్కంటముగా రాజ్య మేలు మన ద్రోణుం డి ట్లనియె. 113
క. దైవము వారల నెప్పుడు, కావఁగ నుండెడును గానఁ గౌంతేయుల కి
శ్లేవిధ మగునాపదలును,రావు నిజము నాదుమాట రాజవరేణ్యా. 114
వ. అనుటయు నమ్మందాకినీనందనుండు భారద్వాజనందనువాక్యముల కలరి ధృతరా
ష్ట్రాగ్రనందనునితో ని ట్లనియె. 115
సీ. కౌరవాధీశ్వర కౌంతేయులును నీవు, నాకు సమాను లీలోకమందు
నైన వారలఁజాడ నడిగితి గావునఁ,దెలుపుచుంటి న్వీను దెలియు నంత
ధర్మతనూజుండు తనరుదేశంబునఁ, బ్రజల కెల్లను దైవభక్తిఁ గలుఁగు
సత్యభాషణమును సాధుపోషణమును, విప్రసేవయుభక్తి వెలయుచుండు
తే. శాంతి కృప నీతి మొదలుగా సద్గుణములు,గలుఁగుగోక్షీర మధికముగలుఁగుచుండు
వలయునప్పుడు కలుగును వర్షములును, సస్యములు చక్కఁగాఁ బండు జనవరేణ్య.
తే. కాన నట్లున్న దేశముఁ గాంచి యట్టి,దేశమునఁ బాండుపుత్రులు తిరుగుచుండ్రు
వారి నరయంగ వలయును గోరి తీవు,కావునను నీకుఁ జెప్పితిఁ గౌరవేంద్ర. 117
సీ. భీష్మునిపల్కులు విని సుయోధనుఁ డను, నచటివారలతోడ నప్పు డిట్లు
భాగీరథీసూతిపల్కినతీరున, విరటునిరాజ్యము వెలయుచుండె
నదికాక యట నొకసుదతికారణమున, గంధర్వు లాదుర్మదాంధుఁ డైన
సింహబలువధంబుఁ జేసినవా రని, వార్తవాహులు విన్నవారు గాన

తే. కీచకునిఁ గూల్చుబల మేరికిని గలుగదు, మత్స్యరాజేంద్రుకొల్వున మారిపులును
మాఱువేషముతోడ నున్నా రటంచుఁ, దెలియ మిక్కిలినమ్మిక గలిఁగెనాకు· 118
క· మానినివలనను గాదా, ప్రాణంబులఁ బాసె సింహబలు డచ్చోటన్
మానిని ద్రౌపది యాతని, ప్రాణంబులఁ గొన్నవాఁడు వాయుసుతుఁ డగున్· 119
క· కావున మన మిప్పట్టునఁ, బోవుద మావిరటరాజుప్రోలున కచటన్
గోవులను బట్టవలె నటు, కావించిన మనకుఁ మేలుఁ గలుఁగుట నిజమౌ. 120
సీ. మత్స్యావనీశుండు మనతోడఁ బోరంగఁ, బాండవులం గూడి వచ్చుఁ గాన
నాసమయంబున నప్పార్థులం గాంచి, వారలయజ్ఞాతవాసమునకు
భంగ మైనదటంచుఁ బలికి వారలతోడ, మరల పండ్రెండేండ్లు మానకుండ
వనవాస మొనరింపఁ బంపించెద నటంచుఁ, బల్కిన నలరిరి భ్రాతలెల్ల
తే. సకలసైన్యములను గూడి సత్వరమున, విరటుగోగ్రహణ మొనర్ప వెడలు మనుచు
నాజ్ఞ యిడె సుశర్మకుఁ గౌరవాధిపుండు, పాండవులకీడు గోరుచు భావమందు. 121

—♦దక్షిణగోగ్రహణము♦—

సీ. ఆసుశర్మ సుయోధనాజ్ఞానుసారి యై, సర్వసైన్యావళీసహితుఁ డగుచు
విరటరాజేంద్రునగరుఁ జేరి యచ్చట, గోబృందములఁ గాఁచుగోపకులను
గొట్టి గోచయమును బట్టుక మరలెను, గొట్టఁబడినయట్టి గోపకులును
విరటుసన్నిధి కేగి వినిపించి రీవార్త, విరటుఁ డీవార్తను వినిన వెనుక
తే. క్రోధవశుఁ డయి గోవుల గొన్నయాసు, శర్మతోఁ బోరునకుఁ బోవసకలసైన్య
ములను సిద్ధము జేయించి భూవరుండు, పోవుచుండ వానికి ధర్మపుత్రుఁ డనియె.•122
తే, వలలుఁ దామగంధినిఁ దంత్రిపాలుఁ గూడఁ, బోరునకుఁ గొనిపొమ్మని కోరునంత
విరటుఁ డది సమ్మతించి యవ్వీరులకును, నస్త్రశస్త్రాదుల నొసంగె ననువుమీఱ.123
చ. విరటమహీతలేశ్వరుఁడు వేగ సుశర్మను దాఁకె నాతఁ డ
వ్విరటునిఁ దాఁకె నిర్వురును వీరవరేణ్యులు బాహువిక్రముల్
బోరిపోరి రెండుసైన్యములు పోరి యొనర్చెఁ బ్రచండభండనం
బరయ సుశర్మ మత్స్యనగరాధిపు సారథిఁ గూల్చె నవ్వలన్. 124
తే. హయములవధించి రథముల నవల విఱిచి, విగతరథుఁ జేసి మత్స్యపృథ్వీనరేంద్రుఁ
దనరథము పైన బెట్టుక తనదుబలము, లెల్లఁ గొలువ రయంబున నేగుచుండె. 125
వ. సుశర్మం విరటు గైకొని పోవుటం గాంచి ధర్మజుండు భీమార్జుననకులసహదేవుల
సుశర్మ నోడించి విరటుని విడిపింపుఁ డని యాజ్ఞాపించిన నామువ్వురు సుశర్మం

దాఁకి విగతరథుం జేసి కట్టికొట్టి విరాటుని విడిపించి ధర్మనందనుకడ కేతెంచిన మత్స్యేంద్రుఁడు ధర్మజున కిట్లనియె. 126

ఉ. నీకరుణాకటాక్షమున నే నిటు లుంటినిఁ బ్రోచి తీవె నన్
గైకొను మత్స్యదేశమును గాన్కగ నిచ్చెద నీవె యేలు మా
నీ కిది యే నొసంగి ధరణీవరుఁ జేసి సదా భజింతు నా
వాకులు సమ్మతింపు మన భారతవంశవిభూషణుం డనున్. 127

క. నాయందలి ప్రేమంబున,ధీయుత యిట్లంటి వీవు తెలియఁగ నీకే
జేయునది యేమి యున్నది,నాయుల్లము పల్లవించెనిది నీ వనుటన్. 128

సీ. ధర్మరాజానుమతమున సుశర్మను,విడిచె విరాటపృథ్వీవరుండు
తను విడిపించిన ధైర్యసంపన్నుని, భీమసేనునిఁ జాల వినుతిఁ జేసి
సంగరవిజయంబుఁ జాటించుచుండంగ, మంగళవాద్యముల్ రంగుమీఱ
సర్వసేనాపరిచారయుక్తంబు గా,నగరు ప్రవేశించి నరవరుండు

తే. బంధుమిత్రులు పరిజనుల్ బలసి కొలువఁ,నధికవిశ్రాంతిఁ గొనియుండె నలరుచుండె
వత్సరంబగు నజ్ఞాతవాసవ్రతము,తీరె నని పాండవులు వేడ్కఁ దేజరిలిరి. 129

వ. సుశర్మ దక్షిణగోగ్రహణానంతరము భీష్మద్రోణకృపాశ్వత్థామాదు లుత్తరగోగ్రహణ మొనర్ప నెంచి మత్స్యనగరము చేరి కొంచెము దూరముగా విరాటునిగోబృందముఁ బట్టిరంత. 130

—♦ఉత్తరగోగ్రహణము♦—

సీ. గోపాలుఁ రది గాంచి కోలాహల మొనర్చి,పరుగుపరుఁగుమీఁదఁ బురము సొచ్చి
రాజేంద్రునింటికి రయమున నేతెంచి,యంతఃపురంబున కరిఁగి వారు
రాజపుత్రుం డుత్తరకుమారకునితోడఁ,గురుసమూహము వచ్చి గోసమూహ
మును బట్టె ననువార్త వినిపించిన న్వాని, యిట్లనె నుత్తరుం డెల్లరకును

తే. సంగరం బెప్డు వచ్చునో శౌర్య మలర, వైరవీరులతోడను బోరు టెపుడొ
యనుచుఁ దలపోయుచుంటి మదాత్మలోన,నేఁటి కయ్యది యరుదెంచె నిశ్చయముగ.

వ. తగుసారథ్యము చేయువాఁడు లే దనివిచారించి. 132

సీ. సారథి యుండిన క్షణమాత్రమందునఁ, బోరఁగల్గుదునంచు వారితోడ
కౌరవసైన్యము గనుఁగొని నన్నుఁ వీఁ, డర్జునుఁడా యనునట్లుఁ గాఁగ
రణమాచరించి యారథికుల నోడించి, గోవుల మరలించి కొందుఁ గాదె
యని పల్కుటలు పాండవాజ్ఞాకాంక్షి తా విని, యింద్రసూనునికడ కేగి వేగ

తే. వానివాక్యముల్ తెలుప భీభత్సుఁ డనియె, సకియ యజ్ఞాతవాసదీక్షయు నిఁక నొక
దినముమాత్రమె యున్నది గనుక నీవు,యుత్తరునితోడ నిట్లను ముజ్జ్వలాంగి. 133

వ. ఖాండవదాహమం దర్జునునకు బృహన్నలయే సారథ్య మొనరించెను గావున నీ
వాతని సారథిఁ గాఁ జేకొమ్మనిపల్కుమన ద్రౌపదియుత్తరరాజకుమారుని దరి కేగి
యి ట్లనియె. 134

సీ. అవనీశపుత్ర బృహన్నల సారథ్యమున నతిసామర్థ్యము గలవాఁడు
ఖాండవదహనము గావించునప్పు డర్జునునకు సాది యయ్యె నతఁడు
వాని సారథిఁ జేయవలె నీవు కురుసేన నిమిషాన గెలుతువు నిశ్చయముగ
సారథి లేమి విచారించితివి గానఁ దెలిసినదానను దెలిపియుంటి

తే. అనుడు నుత్తరుఁ డిట్లనె నామెతోడ, భుజబలసముద్రు లగుకురుముఖ్యులైన
ధార్తరాష్ట్రులు నాతోడఁ దార్కొనంగ, వారి నెదురుకోఁ దలఁచినవాఁడ నేను.

తే. పేడి యగువాని నెన్నడు చూడ ననుచు నాకు వ్రత ముండినది బృహన్నలను నేను
సారథిగ నియమించుట సాఁగ దనిన ద్రౌపదీదేవి యిట్టు లుత్తరున కనియె. 136

సీ. కౌరవసైన్యమే కాదు చతుర్దశభువనము లొకపెట్ట మూఁగివచ్చి
దండెత్తి నను గాని ఖండనం బొనరించి, గెలుచుబృహన్నల సలలితముగ
విధికతన నతండు పేడిరూపము దాల్చె, వానినిఁ బోల రెవ్వారుఁ గాని
యనుచుఁ బాంచాలి పల్కిన విని వైరాటి, తనదుసోదరిని నుత్తరను బిలిచి

తే. పార్థునకు వర్తమానము పంపి వాని నటకు రప్పించి యుత్తరుం డనియె నో బృ
హన్నలా నాకు సారథి వగు మటన్న, నల్లె యని సంతసించెను ఫాల్గుణుండు, 137

వ. వారిం గాంచి యుత్తర కురుసైన్యము గెల్చి వారి శిరోవేష్టముల బొమ్మపొత్తికల
కుగాఁ దెమ్మన బృహన్నల యంగీకరించె నంతట వైరాటి కిరీటిని సారథిఁ జేసి
సమరంబున కేగె. 138

క. వైరాటియును గిరీటియుఁ గౌరవసైన్యంబుఁ జేరఁగా నేగిరి భా
గీరథిపుత్రప్రముఖులు వారలఁ గని యుత్తరుండు పార్థున కనియెన్. 139

మ. కురుసైన్యం బన నేమిరో యనుచు నన్గొంటిం గదే యాత్మలోఁ
గురుసైన్యంబును గెల్వఁ జాల నిఁక చేకూరెన్ భయం బియ్యెడన్
బురికిం బోదము తేరు వేగమటులై పో నిమ్ము నావాక్యమున్
పరిపాలింపు మటంచుఁ బల్కెనెడ నప్పార్థుండు తా నిట్లనున్. 140

సీ. ఈతుచ్ఛులను మహాఘాతుకు లగుధార్తరాష్ట్రులతోఁ బోరి రణమునందు
గోబృందమును మరల్చికొని పోవలయుఁ గాని, యూరీతిఁ బెల్కుట లేమి నీవు
గోవుల మరలించి కొని వత్తు నని కదా, యంతిపురంబులో న[illegible]వుల
సమరమందుఁ బరాక్రమము చూపనగదా, కలుఁగుచుండును గీర్తి చెలువుమీఱ

తే. వైరిసైన్యముఁ గనిభీతిఁ బడుదు వేల, నిట్లు పారిపోయిన నెవ్వ రెల్లజనులు
నవ్వరా నినుఁ గని నరనాథతనయ, చిత్తమున భీతి విడనాడు ముత్తరుండ. 141

ఉ. ఇంతయె కాక మీపసుల నెల్లను బట్టిరి క్రూరకౌరవుల్
స్వాంతమునందు దాసకిని సైచి యెటుండెడువాఁడ నోయి భూ
కాంతతనూభవా భయము గ్రందు ధైర్యము పూని యుండు నే
నంతయుఁ జక్కఁజేయుదును నాహవకేళికి రమ్ము చెచ్చెరన్. 142

వ. కౌరవసైన్యము భీతిఁ బొందునట్లు రణం బొనర్తు మనుధనంజయుపల్కులు నిరసించి భూమింజయుండు రథంబు డిగ్గి వేవేగఁ బరుగిడి పోవుచుండ నాఖండలనందనుండు వానిం బట్టికొని. 143

తే. భండనం బొనర్పంగ భయపడెద వేల, నీకు భయముఁ గల్గినయెడ నాకు నీవు
సారథివి గమ్ము సమరము సలుపువాఁడ, ననిన భూమింజయుఁడు వల్లె యనె నతనికి.

వ. కిరీటి వైరాటి నొడంబరచి రథం బెక్క నుత్తరుండు సారథియై రథమును దోలుచుండెఁ బాండవులు వనవాసానంతరమున శమీవృక్షమున నాయుధము లుంచిరి కాన నావృక్షముకడ రథము నిలిపి దానిపై నున్నగాండీవము దెమ్మని గాండీవి యుత్తరునకు నియమింపఁగా నతం డావృక్షము నెక్కి శవాకారముగా నున్నది దీని ముట్ట వచ్చునే యనినఁ బార్థుం డది శవము కాదు పాండవు లట్లుకట్టి రన భూమింజయుండు గాండీవ మర్జునున కొసంగి పాండవులం దలఁచి శోకించె. 145

సీ. అక్కటక్కట పాండవాధీశనందను, లెందున్నవారలో యెఱుఁగ మకట
రాజాధిరాజవిరాజమానుం డగు, ధర్మజుం డేరీతిఁ దనరునొక్కొ
శాత్రవకులవీతిహోత్రుండు నాఁ దగు, వాయుసూనుం డెట్లు వఱలునొక్కొ
విక్రమక్రముఁ డరివీరదుర్జయుఁ డగు, పార్థుండు గవ లెట్లు పరఁగువారొ

తే. ద్రుపదరాజేంద్రపుత్రిక దొడ్డసాధ్వి, ద్రౌపదీదేవి యెట్లు కాంతారవాస
మందు నజ్ఞాతవాసమునందుఁ గూడఁ, బాట్లు పడుచున్నదో నెత్తి వ్రాఁత నకట. 146

వ. అంత నమరేంద్రసూతి విరాటసూతి నూఱడించి యి ట్లనియె. 147

సీ. మత్స్యావనీశునిమందిరంబున నున్న, కంకుడే ధర్మభూకాంతుఁ డగును

వలలుఁడనెడువాఁడు వంటలోన ప్రౌఢుఁ,డాతఁడు భీముండు నృపాలతనయ
దామగ్రంథి యనంగఁ దనరెడు నకులుఁడు తంత్రిపాలుం డనఁ దనరు చుండె
గోవుల నాసహదేవు డేలుచు నుండె, రాజపత్నిని గొల్చు రాజవదన
తే. మాలినిసమాఖ్య నెసఁగెడు మాన్యచరిత్ర,ద్రౌపదీదేవి సుమ్మి యుత్తరకుమార
దాఁగఁగానేల నేనె పృథాతనూజుఁ,డైనయర్జునుఁడఁ బరాక్రమాన్వితుండ. 158
తే. వననివాసము నొనరించి వచ్చి మేము,సల్పి యుంటి మజ్ఞాతవాసవ్రతంబు
మారువేషములఁ దాల్చి మహితయశుఁడు, మత్స్యరాజేంద్రు కొలువున మానవేంద్ర.
వ. అనవుత్తరుండు విశ్వసింపక నీ వర్జునుఁడ వేని యతని దశనామంబులఁ బేర్కొను
మన గాండీవి యిట్లనియె. 150
సీ. అర్జునవర్ణుండ నర్జునుం డైతిఁ బృథాపుత్త్రుఁడను గాన ధరణిలోనఁ
బార్థుఁడ నైతిని బార్థివేంద్రులఁ గెల్చి,ధనమును దెత్తు నందునను నే ధ
నంజయుం డైతిని నరనాథసుత యొందు, విజయంబుఁ గొనుటచే విజయుఁ డైతి
రెండుహస్తంబుల గాండీవము న్వాడు, శక్తి యుండుట సవ్యసాచి నైతి
తే. భండనమునఁ జేత ధరింతుఁ గాండివంబు,గాన గాండీవి నైతి నాఖండలుండు
నా కొసఁగు గిరీటముఁ దాల్చినాడఁ గాన, నన్నిలఁ గిరీటి యందురు నరవరేణ్య.
తే. ఫల్గునిం జనియించిన వాఁడ నౌట,ఫాల్గునుఁ డనఁ బరఁగితిఁ బగతురకును
భయముఁ గల్గఁ జేయుటను బీభత్సుఁ డైతి,ననిమిషులఁ గెల్చుటను జిష్ణుఁ డైన వాఁడ.
వ. మఱియు శ్వేతాశ్వములుఁ గల రథారోహణ మొనర్చి సమర మొనర్తుఁ గాన శ్వేతవాహనుఁడ నైతి నన నర్జును పల్కుల నాలకించి యుత్తరుం డతని పదంబులకు మ్రొక్కిన నతం డక్కుమారుని లేవనెత్తి కౌఁగిలించుకొని సమరాంగణమున కేఁగె.
సీ. గాండీవి చండమార్తాండుని పగిదని, భండనంబున కేగి దండిమీఱ
నిజరూపమును దాల్చి విజయంబునుం గోరి, కౌరవసైన్యముఁ గదియ వచ్చి
దేవదత్తంబును దిక్కులు మ్రోయంగఁ,బూరించుచుండెను పూర్ణశక్తి
నా శబ్దము న్విని యావులఁ బట్టిన,కౌరవహృదయంబుఁ గలఁగి పోయె
తే. ఘటజుఁ డంత దుర్యోధనుఁ గాంచిపలికె, దేవదత్తరవం బిది నీవు వింటె
పార్థుఁడు రణార్థియై యిట వచ్చుచుండె, గోవులను గాచికొనుమయ్య కురువరేణ్య.
తే. ఇతఁడు మాటల తోడుత నేగు వాఁడు, గాఁడు రణకుతూహలి యైన వాఁడు కానఁ
బసులకడ సుయోధనునుంచి పోఁగఁగొంత,సైన్యమునుముందునుంచుట సాధనంబు.
వ. ఆ ముందు వన ముంటి మేని పార్థుండు రారాజుం డాఁక లేడని గురుండు పితా

మహోద్రేకంబుతోఁ బల్కిన సుయోధనునకు ద్రోణుం డిట్లనియె. 156

సీ. పాండుపుత్రులు ద్యూతపణమున నోడి, వారలు గావున వారు మున్ను
ద్వాదశాబ్దంబులు వనవాస మొనరించి, వర్ష మొం డజ్ఞాతవాసవ్రతము
సలుపువార మటంచుఁ బలికిరి యానాఁడు, వారి జాడల గన వలసి కావె
పసులఁ బట్టితి మిప్డు పదమూఁడు వర్షముల్, పూర్తి కాలేదన పోలఁదోచె
తే. అర్జునుండు దన్నెఱిఁగింప నయ్యె నేని, ద్వాదశాబ్దముల్ వనవాస వ్రతము సేయ
వలయు నిక నాతఁ డెదిరించి వచ్చె నేని, దేవపతి వచ్చినను వెనుదీయ మింక. 157

తే. సమరవిషయంబునుం గూర్చి చాలఁ గురుఁడ నీ, వడుగ రాదు పాండవపక్షమతిఁడు పలుకు
నింత సైన్యంబు నా పక్షఁ జేరి యుంటను, యుద్ధసన్నద్ధులై మీర లుండుఁ డింక. 158

వ. అంత నశ్వత్థామ సుయోధనను నిక్కుమొగంబై యిట్లనియె. 159

సీ. మాయజూదము నన్న మాయకావు నీవు, పాండుకుమారుల భవ్యమగు
రాజ్యము గొంటివి ఘోరాటవులకుఁ బంపి, మఱలు వారికి నీవు మతిఁ దలఁతువ
పదమూఁడు వర్షముల్ పడిన కష్టంబులు, తీర్చుకొనఁగఁ గురుదీపకుండు
ప్రళయరుద్రునిఁ బోలె భండనం బొనరింప, వచ్చుచు నుండెను బార్థుఁ డిపుడు
తే. శకుని వాక్యప్రకారము సలిపి పాండు, తనయులకుఁ గీడొనర్పంగఁ దలఁతు వెపుడు
సౌబలుని తోడ నా సవ్యసాచి పోరు, దుష్టుఁడవు గాన ద్రోణుని దూఱి తీవు. 160

చ. సురల కజేయుఁడైన పరిశుద్ధచరిత్రుని శ్వేతవాహనుం
భరతకులప్రదీపకుని బార్థు నెదుర్కొని పోర నేరికిం
తరమది కాదనీ విపుడు దర్పము మీరఁ బ్రగల్భ మాడితీ
గురు నిటు దూఱ నంతటనె కూర్చుఁడ ద్రోణుని కేమి లోపమా. 161

వ. మజ్జనకుండు రణం బొనర్చిన నొనర్పుఁ గాని నేను మాత్ర మొనర్పఁ జాల నన
రాధేయుండు క్రోధవివశీకృతమనస్కుండై యోధవరుతో నిట్లనియె. 162

సీ. ఆవుల బట్టంగ నర్జునుం డేతెంచె, భయమేల నో యోధవర్యులార
రారాజు భీతి చేకూరంగఁ జేయుట, మీకు మంచిదిగాదు మీకు భయము
యున్నెడ మీ రెల్ల నూఱకుండం దగు, నే నొక్కరుండ నయ్యింద్రసుతుని
రణమునఁ గెల్చెద రాజు మెప్పించెద, నని వారితో మాట లాడు వేళ
తే. శాంతనవుఁ డిట్టు లనె మహీజాని తోడ, వారి యజ్ఞాతవాససద్వ్రతము నిన్న
దినముతోఁ దీరిపోయెను గనుక మనల, నెదురుకొన నాతఁ డేతెంచె నిభపురీశ. 163

వ. ధర్మపాశబద్ధులగు వారలికఁ దూరకుండరు మీ ప్రయత్నము మీ రొనర్చు కొనుఁ డనుటయు. 164

సీ. అంత రాజేంద్రుఁడు గొంత సైన్యము తోడ, నాలకు వెనుభాగ మలరు చుండ
నతని ముందున ఘనులైన భీష్మాదులు,కర్ణాది వీరులు కాచి యుండ్రి
విజయుని రాకకు వీక్షించునెడ ధనంజయుఁ డంత నుత్తర సహితుఁ డగుచు
దేవదత్తంబును దివిరి యొత్తుచు వచ్చి,కుంభసంభవుఁ గాంచి కోర్కు లలర
తే. నతని పదముల దిక్కున నమ్ము నట్లు విడిచె రెండు బాణములను వినయ మలర
నతఁడు శిష్యవాత్సల్యతకు నాత్మ మెచ్చె, శాంతనవుఁ డంతరంగము సంతసించె. 165

తే. అర్జునుఁడు కురుసేనలో దుర్జనుఁ డగు,ధార్తరాష్ట్రాగ్రజుఁడు లేమి తలఁచి తేరు
పోవ నిచ్చెను వేవేగ గోవు లున్న,వెనకు శౌర్యసమేతుఁడై పోనఁగ నతఁడు. 166

వ. భీష్మాదులు దుర్యోధన సహాయార్థముగాఁ బోవు చుండ సంక్రందననందనుండు గోవులకడ నున్న యల్ప బలంబును బెదరఁ గొట్టి గోవుల విడిపించి గోపాలురతోఁ మత్స్యనగరమునకుఁ దోలించె. 167

తే. గోసమూహముతోఁ గూడి గోపకులును,వేగ వేగమ పోయిరి విరటుపురికి
ధైర్యసాహసుఁడైన పృథాతనూజు, నలవియే వినుతింపంగ నలువకైన. 168

తే. అట్లు గోవుల విడిపించి యర్జునుండు, కౌరవుల సేన నడుమను గౌతుకమున
దాను విహరించు చుండి యుద్ధంబొనర్చె,శరములను గురిపించెను వర్షమట్లు, 169

వ. అంతఁ గురునందనుండు మిత్రనందనుం గాంచి యి ట్లనియె. 170

ఆ. ఇంద్రసూతి నిచట యే నొక్కరుండ నేఁ,దునుము వాఁడ ననుచుఁ దొడరి నీవు
పలికితివి ప్రగల్భవాక్యము లయ్యవి, యేమిచేసి తిప్పు డినతనూజ. 171

క. శౌర్యం బిపు డెం దేగెను, గార్యము వెన వాఁడ వీవు కాకుంటివి యో
యర్యమతనూజ యిఁక గాం,భీర్యమ్మునఁ బోరవేల భీభత్సునితోన్. 172

వ. అశ్వత్థామ వచనములకు క్రోధావేశపరవశుండై మార్తాండనందనుండు గాండీవితోఁ భండనం బొనరింప నెదుర్కొనియె. 173

——కురువీరు లర్జునునితోఁ బోరుట——

చ. ఇరువురు కొంతసే పటుల హెచ్చుగఁ బోరిరి శౌర్య మేర్పడన్
భరతకులప్రదీపకుఁడు పార్థుఁడు మైచుచు నుండి నట్టి యా
శరముల వేడిమిన్ సయిపఁ జాలక గర్వము వీడి భీతుఁడై
దురమును వీడిపోయె నట తోయజమిత్రసుతుండు చెచ్చెరన్. 174

వ. అంత ద్రోణుం డర్జునుం దాకిన నతండు మ్రొక్కి గురున కిట్లనియె. 175

మ. కపటద్యూతము నందు రాజ్య మది పోఁగాఁ గ్లేశముం బొంది యీ
విపినావాస మొనర్చి గూఢ మదియుం బేర్వేర నివర్తించినా
మిపు డీశిష్యునిఁ జేరఁ జూచి మునుముం దీర న్త్రముల్ వేయుఁడీ
యపు డే వేయుదు ముందు వేయ ననఘా యాచార్యచూడామణీ. 176

వ. అంత నస్త్రగురుండు శిష్యవాత్సల్యము వినుతించి పార్థునిపై నస్త్రము వైచె. 177

ఉ. ద్రోణుఁడు వైచు బాణములఁ దుత్తునియల్ పొనరించెఁ బాండురా
ట్సూనుఁడు ద్రోణుఁ డంతటను శూరుని బార్థుని గెల్వ లేక నే
తా నరిగెం గృపుం డతని దాక్కొని పోరెను బార్థుఁ డోడఁ గా
వానిని గెల్వఁ జాలకఁ గృపాఖ్యుఁడు సయ్యము వీడి పోయినన్. 178

వ. అంత నశ్వత్థామయు భాగీరథీపుత్త్రుండు నిందద్రపుత్త్రునితోఁ బోరి యోడిన సుయో
ధనుం డర్జునుం దాకి యోడెఁగవ్వడి మోహనాస్త్రము ప్రయోగించి కురుసేనను
మూర్ఛఁ బుచ్చె నంత. 179

తే. కౌరవులు మూర్ఛఁ బడియున్న కాలమందు, ధార్తరాష్ట్రాదివీరుల తలల నున్న
పుట్టములఁ దీసి యుత్తర బొమ్మలకును, గొని రథ మెక్కి పార్థుఁడు చనియె నంత. 180

వ. దుర్యోధనుండు మూర్ఛఁ దేరి కౌంతేయుని వెన్నాడఁ దలంచిన శాంతనవుండు
వాని వారించె నతండు పరాభవోపేతుండై కరిపురి కేగె నంత. 181

—విరటుండు ధర్మజునితోఁ బాచికలాడుట—

సీ. విరటభూపాలుండు మురిపెంపుఁ దనయుఁ డుత్తరుఁ డింక రాకుండఁ దక్కె ననుచు
గరము విచారింపఁ గంకుఁ డిట్లని పల్కె, జననాథ నామాట వినఁగ దయ్య
యుత్తరుండు జయంబు నొందియే యిటవచ్చు, మనకు సందియ మేల నని వచింప
నంతలో గోపాలు రరుదెంచి వైరాటి, విజయము చెప్పిరి విభుని తోడఁ

తే. దనయు విజయవార్తను విని జనవరుండు, పట్టరాని సంతసమున బట్టణంబు
నకు నలంకార మొనరింప నాన తిచ్చెఁ, దనయు కెదు రేఁగఁ బంపెఁ గొందఱను వేగ.

వ. మహదానందపరవశుండై విరాటుండు కంకునితో జూద మాడఁ దలంచి సైరంధ్రిం
గాంచి సారెలఁ దెమ్మన నయ్యువిద రాజాజ్ఞ నవి తెచ్చి యిచ్చిన మత్స్యేంద్రుండు
జూద మాడుచు ధర్మనందనున కిట్లనియె. 183

తే. నా కుమారుం డనంగ లోకైకసుతుఁడు, శౌర్యధనుఁడు పరాక్రమశాలి గాన
గౌరవేంద్రులఁ గెల్చెను గంకుభట్టు, యుత్తరుని విజయము సాటి నొప్పఁ గాదె. 184

వ. మత్స్యేంద్రునకు గోంకేశ్వరాగ్రజుం డిట్లనియె. 185

తే. మన బృహన్నల కతమున మానవేంద్ర, యుత్తరునకు జయముగల్గెనోనరనాథ బృ
హన్నలావిజయము చాటు నాజ్ఞ నిడు మటంచు బల్కె నిజమెఱింగి నట్టి వేళ.

వ. నావుడు భూవరుఁ డాగ్రహముతోఁ గంకుని సారెఁ గొని శిరంబుపై గొట్టె నంత.

తే. ద్రౌపదీదేవి ధర్మజు తలను గారు, నెత్తురును బైట చెఱఁగున నొత్తుచుండ
నిట్లు సేయఁ గతంబు నీ కేటి కనుచు, విరటుఁ డడిగె సైరంధ్రి వింతఁ గాఁగ. 188

వ. భూసుర రక్తము నేలఁ బడిన కీడగునని యిట్లొనర్చితి నని యామె వచియించె.

సీ. ఆసమయంబున నర్జునుం డుత్తరు, తోడుత నేతెంచె వేడు కలర
భంజనంబును గూర్చి బహువిధంబులు గాగ, ముచ్చటించుచు నుండి రచ్చ టవుడు
పరిచారకులు లోని కరిగి విరటు తోడఁ దనయుఁ గాకను జెప్పె ధరణివిభుఁడు
సంతసంబున ముద్ది నత్వరంబున లోన, జనుదెమ్మని వచించెఁ దనకుమారు

తే. నంత సైరంధ్రి దాసున కనియె నోయి, యుత్తరకుమారు నిచటకు నొక్కరుఁడను
బంపుమా బృహన్నలఁ బంపవలదు సుమ్మి, యనుఁడు వాడట్లు లోగాకయనుచు బోయె.

వ. ద్రౌపదీవాక్యానుసారముగా నుత్తరుండులోని కేతెంచి జనకునకు మ్రొక్కిన
నతం డక్కుమారుఁ గ్రుచ్చి కౌఁగిలించుకొని సమరప్రకారం బడుగుటయు వైరా
టి బృహన్నలకతంబున జయంబు చేకూరె నని చెప్పగా విరాటుండు బృహన్నలను
రావించి పారితోషిక మొసంగి పంపించె వైరాటిం గాంచి కిరీటితన నిజవృత్తాం
తము తెలుప వలదనిపలికి నాట్యశాల కేగి కురువీరుల శిరోవేష్టములు నుత్తరకు
బొమ్మల పాత్రికలుగా నొసంగె నయ్యవసరమ్మున. 191

ఉ. భారతవంశభూషణులు వాయుజుఁ డింద్రజుఁ డన్న గాంచి యో
కౌరవనాథ యేటి కిటు కల్గెను నీశిర మందు మచ్చనా
వారి కజాతశత్రుఁ డనెఁ బార్థివశేఖరు డీవిరాటుఁడే
సారె గ్రహించి కొట్టె నను స్వాంతము నందునఁ గోపభావుడై. 192

ఆ. ఉత్తరుండు జయము నొందె బృహన్నల, వలన ననుచు నేను బలికి యుంటి
దాని కాగ్రహించి దారుణీనాథుండు, కోప మలర నన్నుఁ గొట్టె నిట్లు. 193

వ. అనిన విని భీమార్జును లాగ్రహావేశులై మండిపడి యిట్లనిరి. 194

చ. ధరణివరేణ్యు లెల్లరును దన్ను భజింపఁగ రాజ్యమేలు నీ
పరమదయానమేతునిఁ బ్రభాకరతేజు నజాతశాత్రవు
విరటుఁడు కొట్టినాఁ డకట వీరుల మే మిదిచూచి-సైతుమా

దుగ మొనరించి మత్స్యపతి ద్రుంతుము దోర్బలసాహసంబునన్. 195

క. అని కోపంబునఁ బలికెడు, తనతమ్ములతోడ నిట్లు ధర్మతనూజుం
డను నాదు తమ్ములారా, జనపతిపైఁ గోపపడకు సమయ మ్మిదియా. 196

వ. అని వారిని వారించి శాంతిను గల్గించె నొక దినంబునఁ బాండవు లేవురు విరా
టునకుఁ దమ్మెఱిగింపఁ దలఁచి ప్రచ్ఛన్నవేషములఁ దీసి రాజభూషణాంబరాలం
కృతులై విరాటుని కొల్వుకూటమున కేతెంచి. 197

—పాండవులు విరాటునకు దమ్మెఱిగించుట—

సీ. ధర్మతనూజుండు ద్రౌపదీసహితుఁడై, రాజభూషలు దాల్చి తేజ మలర
మత్స్యభూపాలుని మహనీయమయి మగు, సింహాసనము నధిష్ఠించుటయును
నలువురు తమ్ములు చెలువార నాతని, సేవించుచుండిరి శ్రేయ మలర
భూలోక మందలి పురుహూతునిం బోలి, విలసిల్లుచుండెనా విమలమూర్తి

తే. అంత విరటుఁడు కొల్వున కరుగు దెంచి, తనదు సింహాసనంబున వనరు చున్న
పాండవాగ్రజుఁ గాంచి కోపంబు తోడఁ, గంకుఁడనుచు దూషించెభూకాంతుఁడపుడు.

వ. అర్జునుం డంత మత్స్యేంద్రు నవలోకించి యిట్లనియె. 199

సీ. కువలయాధీశ్వర కోపంబు విడుము, భరతభూషణుఁడ యీ భవ్యమూర్తి
పాండునృపాలుని వరపుత్రుఁ డీతఁడు, ధర్మనందనుఁడైన ధర్మరాజు
సకలదిగ్విజయంబు సలిపినాఁ డీతండు, రాజసూయ మొనర్చె రాజరాజు
నిత్యసత్యవ్రతనిరతుండు కౌరవ వ్యాలంకారుఁ డగు నకలంకమూర్తి

తే. ఇంద్రసింహాసనం బైన నెక్కుటకును, నర్హుఁ డైనట్టి వాఁడు విఖ్యాతయశుఁడు
నీదు గద్దియ యన నెంత నీ వదెంత, యీ చిఱుతగద్దె నెక్కుట కితఁడు తగఁడె.

తే. బకహిడింబకిమ్మీరులఁ బట్టి చంపి, నట్టి జగజెట్టి యైన యీ యమలమూర్తి
నేఁటి వఱకు వంట లొనర్చె నీగృహమున, వలలుఁ డను పేర నీతఁడే వాయుసుతుఁడు.

వ. కీచకుల ద్రౌపదికై యీభీముఁడే వధించె నని నకులుం జూపి యిట్లనియె. 202

తే. తామ్రగంధి యనెడు పేరఁ దనరి నీదు, వారువమ్ముల నరసిన వాఁ డితండు
నకులు నీతనిఁ జూచితే నరవరేణ్య, యనుచు సహదేవుఁ జూపి యిట్లనియె మఱియు.

ఆ. తంత్రిపాలుఁ డనఁగ ధరణీశ నీయింట, గోవుల నరసెడు సహదేవుఁ డీతఁ
డితనిఁ జూచి యుండె యతులితతేజుండు, గొంతిఁగూర్చుముద్దుకొమరుఁ డితఁడు.

చ. ఘనమగు యజ్ఞవేదికను ఖ్యాతి జనించి, మహీతలేశుఁడై

పొసఁగెడు నట్టి యాద్రుపదపుత్రిక నైమహిమానమానయై
ఘనులగుఁ బంచపాండవులు గాంతులు,గా వరియించి సాధ్వియై
తనరెడు ద్రౌపదీరమణి దాసినిఁ బోలె, సుధేష్ణఁ గొల్చెగా. 205

తే. ద్వాదశాబ్దములును వనవాసయాత్ర, సలిపి యజ్ఞాతవాసము సలుప నెంచి
సేవకాకృత్తులను నీకు సేవఁ జేసి, మారువేషాల నుంటిమి మానవేంద్ర. 206

వ. అంత విరాటుండు సంతోషాంబుధి మునింగి యజాతశత్రు నాలింగన మొనర్చి
మీలో నర్జునుం డెవ్వ రన భీముండు సుత్రామసుతుం జూపె. 207

తే. ఖండవూహము తోడఁ బ్రచ్ఛన్ను డగుచు, నీ సుతకు నృత్యవాద్యముల్ నేర్పినట్టి
యీబృహన్నల యర్జునుం డితనిఁ గాంచు,సకలలోకైకవీరుని జనవరేణ్య. 208

తే. విరటుఁ డెదనంతసంబున నేగ లేచి,భారతాన్వయాభరణుని పాదములకు
మ్రొక్కి నాతప్పు లెల్లను బ్రోవుమయ్య,ధర్మరాజేంద్ర యనుచుఁ బ్రార్థన మొనర్చె.

వ విరాటుండు పాండవులతో హాయిగా వినోదించుచు సుధేష్ణాదేవి కీశుభవార్త
నెఱింగించి పాంచాలరాజతనయుం దగువిధంబున గారవింప నాజ్ఞ నిడె నంత. 210

చ. భరతకులైకభూషణులఁ బాండుతనూజుల గారవించి యా
విరటమహామహీశ్వరుఁడు వేడుక తోడుతఁ బాండవాగ్రజా
నిరతము సేవజేయుచును నెమ్మిఁ జెలంగెను గూఢమైన వ
త్సర మిది పూర్తి యయ్యె నని సంతస మందుచు నుండ్రి పాండవుల్. 211

వ. అంత నొక్క దినంబున విరాటుండు. 212

సీ. తనకూర్మికూఁతు నుత్తరను శృంగారించి, వారి వద్దకు దెచ్చి పలికె నిట్లు
పాండవాగ్రజ నాదు వాక్యముల్ వినవయ్య, మ్రొక్కెద నాతప్పుఁ బ్రోవ నీకు
నాకోర్కి యొక్కటి నీకెఱింగించెద, నాయందు దయఁజూడు నరవరేణ్య
తరుణి నాపుత్రి నుత్తరఁ బార్థున కొసంగి,వైవాహిక మొనర్ప వలయు ననుచుఁ

తే. దలఁచుచుంటినిఁ గావున దాని కీవు,సమ్మతింపంగ వలయును స్వాంత మందు
నాదు కులమును వగ పావనమ్ము చేయు,మనినఁ బార్థుండు విరటున కనియెనిట్లు.

క. గురుభావంబున నే నుత్తరకును విద్యలను జెప్పి తనరితి గానఁ
గురుఁడను వరింపఁ దగునా,పరికింపఁగ నదియధర్మపథ మగు రాజా. 214

క. హరిమేనల్లుండును సత్త్వోరుతేజుఁడు శౌర్యధనుఁడు తోయజనేత్రుం
డరయఁగ మదీయసుతుఁ డుత్తరను వరించెదును గాక ధరణీనాథా. 215

క. ఋభురాజ్యాత్ముం డగు నా, యభిమన్యుఁడు లోకవీరుఁ డతిసుందరుఁ డీ
యిభరాజగమన నుత్తర, విభవంబునఁ బెండ్లియాడుఁ బృథ్వీరమణా. 216

తే. విరటుఁ డవ్వాక్యముల కెద వేడ్కఁ జెంది, ధర్మజుఁడు సంతసంబొంది తా నవలను
వాసుదేవున కీశుభవార్తఁ దెలుపఁ, బంపె నొక్కని ద్వారక కింపెసంగ. 217

సీ. ద్వారకావాసుండు పాంచజన్యధరుండు, శ్రీకృష్ణుఁ డెంతయుఁ జెలువు మీఱ
నభిమన్యుతో సుభద్రాబ్జాక్షిఁ దోడ్కొని, బలభద్రసాత్యకిప్రముఖు లెల్ల
వెనువెంట రాఁగను విరటుపురికిఁ బోయె, ధర్మజుండును మత్స్యధరణిపతియు
వారి రాక న్విని వారల కెదు రేగి, చైకొని వచ్చిలోకైకవినుత

తే. దివ్యభవనమ్మునందున దేవదేవు, మొదలుగా నెల్ల వారల ముదముతోఁ బ్ర
వేశపెట్టి విరాటుండు వివిధగతుల, వారి సత్కార మొనరించె గౌరవమున. 218

వ. పాండవు లాకృష్ణునకు మ్రొక్కిన నతం డెల్లర నాలింగన మొనర్చి యజ్ఞాతవాస పూర్తికి సంతసించె నర్జునుం డభిమన్యుం గౌఁగిలించి ముద్దాడె నక్కుమారుండు తండ్రుల కెల్ల దండప్రణామము లాచరించె వా రక్కుమారుం గౌఁగిలించుకొని హర్షించిరి ద్రౌపదియు సుభద్రం గాంచి హర్షించె నంత. 219

సీ. మత్స్యేశ్వరుం డంత మానవేంద్రులకును, శుభ లేఖలను బంపె విభవ మలర
నర్జునాత్మజు వివాహమహోత్సవము చూడ, వచ్చేసి రెల్ల పృథ్వీవరులును
అంతట శుభలగ్న మందున వివిధమం, గళవాద్యరవములు చెలఁగు చుండ
నఖిలభూమీసురు లాశీర్వదింపంగ, నమరులు పుష్పవర్షమును గురియ

తే. నర్జునాత్మజుఁ డభిమన్యుఁ డమలచరితుఁ, డస్త్రశస్త్రవిద్యానిధి యమితతేజుఁ
డాతఁడు విరాటపుత్రిక నబ్జనేత్ర, నుత్తరను బెండ్లియాడె మహోత్సవమున. 220

క. సౌభద్రుం డుత్తర నతి, వైభవమునఁ బెండ్లియాడఁ బార్థివు లెల్లన్
శోభిల్లు కాన్క లొసఁగిరి, శ్రీధరుఁ డొసఁగెన్ మహీవిశేషము లెల్లన్. 221

వ. విరాటుండు సర్వోర్వీపతుల సబహుమానంబుగా వీడ్కొలిపి యభిమన్యున కనేక సహస్రదాసదాసీజనులను గోతురగరథాదులను జీనిచీనాంబరములను గాంచనమణీ భూషణములను గానుక లొసంగి పాండవేయులకుఁ దగు కాన్క లొసఁగి కృష్ణుం గౌరవించి సుభద్రాద్రౌపదుల సత్కరించె నెల్లరు విరాటనగరంబునసకలసౌఖ్యంబుల ననుభవించుచుండి రని చెప్పిన వైశంపాయనుం గాంచి జనమేజయుం డవ్వలి వృత్తాంతము చెప్పు మని కోరుటయు. 222

ఆశ్వాసాంతము.

శా. లోపాలోపములన్ క్షమించి కృతి త్రైలోక్యాధినాథా యిదే
నీపాదంబులఁ జేర్చి నన్నుదయతో నీవేలవే మ్రొక్కెదన్
నా పూర్వార్జితదోషముల్ సయిపుమో నానామునీంద్రస్తుతా
శ్రీపద్మాహృదయాధినాథవినుతా శ్రీచంద్రమౌళీశ్వరా. 223

గద్యము.

ఇది శ్రీకవిరాజ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారి
పుత్రికయును, కల్లూరి వేంకటసుబ్బరాయుఁడుగారి
పత్నియును, రాజ్యలక్ష్మీపరిణయాది గ్రంథకర్త్రి
యును అగు విశాలాక్షమ్మచే
రచియింపఁబడిన భారత
కథామృతమునందు
విరాటపర్వము.
శ్రీపరమేశ్వరార్పణమస్తు.
శ్రీ. శ్రీ. శ్రీ.



# భారతకథామృతము

—♦ఉద్యోగపర్వము♦—

క. శ్రీవిజ్ఞానమయాత్మక, దేవేశ్వర దేవవినుత దివ్యాకారా
సేవితసకలమునీశ్వర, సేవించి భజింతు నిన్ను శ్రీపరమేశా.

వ. అభిమన్యుని వివాహానంతరమున మత్పితామహు లెట్లు వర్తించి రను జనమేజయ
మనుజేంద్రునకు వైశంపాయనమునీంద్రుం డవ్వలవృత్తాంత మిట్లు చెప్పందొడంగె.

క. అభిమన్యునివైవాహిక,విభవానంతరమునందు విమలుఁడు ధర్మ
ప్రభవుఁడు విరాటుకొల్వున, సభికులతోఁ బలికె నిట్లు స్వాంతము లలరన్. 3

మ. మునుజూదంబున రాజ్యసంపద లొగిన్ బోనాడి దుఃఖార్తులై
వనవాసంబున ద్వాదశాబ్దములెటో వర్తించి మత్స్యేంద్రుపొం
దున నజ్ఞాతచరితంబు సల్పియభిమన్యుం బెండ్లిగావించి నా
యనుజుల్ నే నిటులున్నవార మిఁక నెట్లానో కదా మీఁదటన్. 4

క. అని యా ధర్మప్రోద్భవు,డనునెడ దామోదరుండు యమసుతు వారిం
చెను వారితోడఁ దా నిట్లనెఁ బాండవపక్షపాతియై విలసిలుచున్. 5

శా. మాయాద్యూతమునందు సౌబలునిచే ధర్మాత్ము లీపాండవుల్
శ్రీయున్ సంపదఁబోవ సత్యనిరతిన్ జెల్వొందువా రౌటచేఁ
గాయక్లేశము లోర్చి శౌర్యనిధులై కాంతారవాసవ్రతం
బీయజ్ఞాతచరితంబు సల్పి రిక వీ రెంతేని మేలొందనౌ. 6

క. మీరీ ధర్మజుగుణములుఁ, గౌరవులగుణంబు లెఱుఁగగల రైనను గాం
ధారేయులుఁ బాండవులున్, గూరిమితోనుంట నాకుఁ గోరిక గల్గెన్. 7

వ. వారలువీరలు క్షీరనీరన్యాయమున నన్యోన్యమును మెలంగున ట్లొనర్పవలయుఁ గౌ
రవు లిందుల కొప్పరేని యుద్ధము సిద్ధాంతము. 8

ఉ. కౌరవచిత్తవృత్తులను గన్గొనఁగా నగుఁగాన నిప్డు గాం
ధారికుమారుపాలికిని దంతిపురంబున కర్ధరాజ్యమున్
వీరికిఁ గోరిపల్కనొక విజ్ఞు వివేకునిఁ గార్యసిద్ధికై
చారునిఁ బంపు టెంతయును సమ్మత మయ్యెడు నాకు నిమ్మెడన్. 9

ఉ. కౌరవు లర్ధరాజ్యమును గైకొనఁ బార్థులకిచ్చిరేని చే
కూరెడుమేలు కీర్తియును గొప్పదనంబును రాజ్యవృద్ధి యీ

భారతవంశ మెంతయును బావనమయ్యెడు సట్లుగానిచో
ఘోరరణంబు గల్గెడును గూలుదు రెల్లరు ధార్తరాష్ట్రులున్. 10

క. జలజోదరుండు పల్కిన, పలుకులకును సమ్మతించె బలరాముం డం
దలివారు మెచ్చి కృష్ణుని, జలజాక్షున కధికభక్తి సలిపిరి సేవల్. 11

తరళము. కమలనాభుని వాక్యముల్ వినఁ గానె సాత్యకి యిట్లనెన్
గుమతిపాలికి దూతఁ బంపుట కూడదెప్పుడు వారలన్
సమరమందున గెల్వఁగావలె సర్వరాజ్యము సంపదల్
క్రమముమీఱఁగ స్వీకరించుట గౌరవంబగు నియ్యెడన్. 12

వ. ఆసమయంబున. 13

సీ. పాంచాలనాథుండు వారితో నిట్లను,సగఁబా లొసఁగుటకు స్వాంతమందు
సమ్మతింపఁడు కురుజననాథుఁ డాసుయో,ధనుఁడతిదుర్మార్గతత్పరుఁ డగు
నబ్జనాభుఁ డు పల్కినట్లు దూతను బంపి,వారిచిత్త మెఱుంగ వలయు మనము
నాపురోహితుఁ గరినగరికిఁ బంపినఁ,జక్కఁ జేయు నతండు సభ్యులార

తే. అనుచుఁ బాంచాలుఁడనఁగఁ గృష్ణాది ముఖ్యు,లెల్ల విప్రునిఁ బంపంగఁ నెంచియుండ
దుృపదరాజవరేణ్యుఁడు విపులకీర్తి, ధనుఁడు భూసురేంద్రునితోడ ననియె నిట్లు. 14

సీ. మాహితుండవు నీవు మాగురుండవు గాన,నీసహాయ మొనర్పు మిపుడు మాకుఁ
బాండవార్థము గరిపట్టణమున కేగి,యాంబికేయునిఁ గాంచు మయ్య నీవు
ధర్మజుగుణము గాంధారేయుగుణమును, నీ కెఱుకయ గదె లోకవినుత
కౌంతేయులకు నగుఁగష్టము లాగురు,భీష్మాదులకు దెల్పు విప్రవర్య

తే. యాంబికేయుండుతనదు ప్రేమానురక్తిఁ, బాండవుల రాజ్యలక్ష్మిని వారి కొసగు
నట్టు లొడఁబడఁగాఁ జేయు మట్లుకాని,యెడలఁ గార్య మాలోచింపఁగడఁగనగును.

వ. అనినంత భూసురశ్రేష్ఠుండుదుృపదరాజాజ్ఞానుసారముగాధర్మరాజాదులయనుమతిపై హాస్తిపురి కేగె శ్రీకృష్ణాదియాదవులెల్ల ద్వారక కేగిరి సకలావనీశులు దమతమ రాష్ట్రములకేగిరి. 16

—దుర్యోధనార్జునులు శ్రీకృష్ణ సహాయము గోరుట—

సీ. అంతట నొక్కనాఁ డాసుయోధనుఁడు ము,రారిసాహాయ్యము గోరఁ దలఁచి
ద్వారకాపురి కేగె వాసుదేవుం డప్డు, శయనించెఁ బూవులశయ్యమీఁద
నాసమయంబున నాఖండలసుతుండు, హరిసహాయముఁ గోర నరుగుదెంచె
తలయంపియందున గలయాసనంబునఁ, గూర్చుండెనప్పుడు కురువరుండు

తే. పార్థుఁ డంతటఁ జేమోడ్చి పాదపద్మ,ములసమీపమునందున నిలిచియుండె
నంతఁ గృష్ణుండు మేల్కని యర్జునుఁ గని, వెనుక ధార్తరాష్ట్రాగ్రజుఁ గనియె వేడ్క.

క. శౌరి చిఱునవ్వుతోడను, వారలయాగమనమడుగఁ బల్కెను నా గాం
ధారేయాగ్రజుఁ డిట్లని,ద్వారావతినాథునకును దైత్యారికినిన్. 18

క. కయ్య మొనర్చెడు వగతో, నిమ్మెడ కరుఁదెంచినార మిపు డిర్వుర మో
యయ్య కురుపాండవేయులు, నెయ్యురు సమముగనునీకు నీరజనాభా. 19

వ. కావున నీసాహాయ్యముం గోరి వచ్చితిమి ముం దే నరుదెంచితి నవ్వలఁ గవ్వడి యేతెంచె ముందు నేఁ గోరెద నాకు సమరసాహాయ్యం బొనర్పు మనుదుర్యోధను నకు గోవిందుం డి ట్లనియె. 20

తే. నీవు మున్నరుదెంచుట నిక్కమగును, బార్థుఁ దొలదొల్త గాంచితిఁ బార్థివేంద్ర
ముందు కవ్వడి కోరుట ముఖ్యమగును, గోరుకొనుము నీవవ్వలఁ గౌరవేంద్ర. 21

వ. పదివేలమంది గోపాలురొక్కవైపున నే నొక్కఁడ నొక్కవైపున నుందుము నే నెం దున్నను సమర మొనర్పఁ జాలఁ గౌంతేయా కోరుకొమ్మన జిష్ణుండు కృష్ణుం గోరికొనియె సుయోధనుండు సంతసించి పదివేలగోపాలురం గోరుకొని బలరాముని సదనంబున కేగిసాహాయ్యము గోర నాతం డెవ్వరికి సాహాయ్య మొనర్ప ననిన సమ్మతించి దుర్యోధనుండు హస్తిపురి కేగె నంత హృషీకేశుండు గుడాకేశున కి ట్లనియె. 22

తే. సమరమున నిరాయుధుఁడ నోసవ్యసాచి, నన్నుఁ గోరుకొంటివి నీకు నావలనను
నేప్రయోజనముండు నా కెఱుఁగఁ జేయు, మనిన సంక్రందనాత్మజుం డనియె నిట్లు.

తే. వినయపూర్వకముగ మ్రొక్కి విశ్వనాథ, యెచట నీవువసింతువో యచట జయము
ధాత కును నిన్నెదుర్కొనఁ దరముగాదు,యాల మొనరింతువనుచు నిన్నడుగ లేదు.

క. దుర మొనరెంచెడుచో న్యాయరదంబును నడుపు మనుచు నాశించితి నీ
గరుణామతివై నాకు,దురమున సారథివి గమ్ము తోయజనాభా. 25

వ. అనిన వాసుదేవుండు సంతసించి ధనంజయునకు రథము నడుప సమ్మతించె నంతఁ బాండవులు మాద్రీసహోదరుం డగు మద్రేశ్వరుని శల్యుని సాహాయ్యము గోరి దూతం బంపించిన నాశల్యుండు సంతసించి పాండవులదరికి దినదినప్రయాణంబుల వచ్చుచుండె నంత. 26

—శల్యాగమనము—

సీ. ఆసుయోధనుఁ డంత నీసంగతి న్విని, మద్రేశుఁ డేతెంచు మార్గమందుఁ
జలువపందిరులను జెలువారు చంద్రకాం,తశిలాదివేదికల్ తగ నొనర్చి

చిత్రవిచిత్రముల్ చేసి తా నందున, విహరించు చుండెను విశదముగను
శల్యబలములకు సదుపాయము లొనర్పఁ, బరిచారకుల నేలు పఱచె నతఁడు
తే. మార్గమం దలసటఁ జెందు మానవులకు, నలసటలు దీర్త రచ్చట నలరువారు
దినదినప్రయాణమున మద్రదేశ్వరుండు,పాండవేయుల వద్దకు వచ్చుచుండె. 27
వ. శల్యుండు దుర్యోధననిర్మాణమగు నాపందిరులఁ బ్రవేశించి తత్సౌందర్యాదుల కచ్చెరు
వొంది యందలి పరిచారకులతో ని ట్లనియె. 28
తే. అహాహ యేమి యీనిర్మాణ మలరుచుండె, నిట్టివెన్నఁడు నేఁ జూచి యెఱుఁగ నైతి
నిట్లు చేయించు నట్టివా రేమడిగినఁ,దప్పకుండంగ నే నీయఁ దలఁచియుంటి. 29
చ. అనవుఁడు కౌరవేంద్రుఁ డపు డానమయంబున నందుఁ జొచ్చి యి
ట్లనియెను నీప్రయత్నముల నన్నిటి నే నొనరించి నాఁడ నా
జనవరుఁ గౌఁగిలించుకొని శల్యుఁడు కోరికఁ గోరుమన్న నీ
రణమున నీ సహాయము దిరంబుగ గోరితి శల్యభూవరా. 30
క. అనవుఁడు శల్యుం డట్లే,యని సమ్మతితోడ నప్పు డాపాండవులకా
గనుఁగొనఁగ నుపప్లావ్యం,బున కతివేగమున నరిగె ముదితాత్ముండై. 31
వ. మద్రపతిరాక విని పాండుపుత్రులు ద్రౌపదీసుభద్రాభిమన్యాదికుమారసమేతులై
యెదురేగి శల్యుం దోడుతెచ్చి యుచితాసనాసీనుం జేసిన శల్యుండు దుర్యోధనుండు
కోరినకోర్కెఁ దెలిపిన విని ధర్మనందనుం డి ట్లనియె. 32
ఉ. ఆతని మేలుఁ గూర్పఁగ మహాత్మ తలంచిరి దాన నేను సం
ప్రీతుఁడ నైతి మీ రతని ప్రీతి నొనర్చుట మీగుణంబు లీ
భూతలమం దెసంగెడు ప్రభూత్తమ యాశ్రితపక్షపాతివో
భూతలనాథ ని న్నెవరుఁ బోలఁడు వారలు లేరు మాతులా. 33
సీ. నీసహాయ మొకండు నేఁ గోరుచుంటిని, నాయందుఁ గరుణింపు నరవరేణ్య
గోపాలదేవుండు మాపార్థు సారథ్య,మును బొనరించెడు ననఘచరిత
కర్ణార్జునుల కగు ఘన సమరమువేళ, దేవకీసుతు నట్లు తేరు నడుప
సామర్థ్యమది నీకుఁ జాలఁగనున్నది, య ట్లెవ్వరికిని లే దవనిలోనఁ
తే. గర్ణసారథ్య మది మీకుఁ గలుఁగునేమొ, కర్ణుచిత్తము మీరలు గలచి వైచి
శౌర్యధైర్యముల్ దొలఁగించి సవ్యసాచి,మీరు కాపాడవలయును గోరుచుంటి. 34
వ. అనిన నట్లేయని యంగీకరించి శల్యుండు పాండవానుమతుండై హాస్తిపురికి దుర్యో
ధనుపాలి కేగె నాసమయంబున. 35

తే. సోమకుఁడు పంపినట్టి భూసురవరుండు, హస్తినాపురమున కేగి యనుదినంబు
సురనది సుతాది గృహముల కరుగు చుండి,చేయుచుండెవారిఁ బ్రసన్నచిత్తులుగను.

క. ధృతరాష్ట్రుఁడు కొలువున నున్నతఱిని విప్రుఁ డట కేగి నయ మలరఁగ భూ
పతిచేతఁ బూజలం గొని, యతనంబున నచటివారి కనె ని ట్లనుచున్. 37

సీ. భుజబలసాగరుల్ భువనైకవినుతులు,పాండుభూరమణుని వరతనయులు
రాజ్యము నేలు టోర్వఁగ లేక కౌరవుల్,కడగిజూదం బాడి క్రౌర్యమునక
వారి రాజ్యమును సంపదలను హరియించి,కానపాల్చేసి రక్కారణమ్ము
మీర లెఱింగియున్నారు చెప్పఁగ నేల,వంశపావను లగువరసుతులను

తే. ఇక్కటులపాలుసేయుట కక్కటకట,యూంబికేయుఁ డొడంబడినట్టిఁ డయ్యెఁ
గ్రూరచిత్తు నీతనినేమి దూరవచ్చుఁ,గౌరవులధర్మమంతయుఁ గాలిపోయె. 38

సీ. అలనాఁడు సభలోన న్ద్రుపదాత్మజ,వలువల నొలిచినపాపమతుల
సైరించి కాంతారసంచార మొనరించి,వచ్చిన వార లాపాండు తనయు
లర్ధరాజ్యము వార లర్థించి రప్పుడు వారిరాజ్యం బీయ వచ్చు గావె
ధార్తరాష్ట్రులబుద్ధి ధర్మపుత్రునిబుద్ధి,పరికించి మీర లెల్లరును గూడ

తే. బుద్ధిఁ జెప్పుడు ధృతరాష్ట్రభూవరునకు,ధర్మపరులు పాండుమహీశతనయులెల్ల
భూప్రజానాశనం బగుపోరు సల్పు,నాత్మ నిష్టమొందరు వార లనఘులార. 39

వ. మఱియునొకవేళ సంగ్రామము గలిఁగిన. 40

సీ. భండనంబందుఁ బ్రచండభైరవుఁ డట్లు,దండిమగఁడు గదాదండమూని
నిల్చెడువాయుజు గెల్చు వాఁడెవ్వఁడొ,యతని మార్కొనువార లవని లేరు
యర్జునువిక్రమ మది మీఱెఱుఁగుదురు,గాండీవధారి యాఖండలజుఁడు
పోర నిల్చెడువేళ వైరిసమూహము,వెన్నిచ్చి త్రుటిలోన వెడలిపోవు

తే. దేవదేవుఁ డౌనావసుదేవసుతుఁడు,వారిపక్షమును వహించె వారలకును
గెలుఁగ దేయుపాయంబును గాన మీరు,వారు గలసి యుండినను జేకూరు మేలు. 41

వ. అనవుఁడునయ్యాంబికేయుండు భూసురుం గాంచి భూసురశిఖామణీ మేము నీతిశా
స్త్రవిశారదుం డగునొకని పాండవులకడకు రాయబారిగాఁ బంపుదుము నీవు వేం
చేయు మన నావిప్రుండు వారి వీడ్కొని పాండవులయొద్ద కేగె నంత. 42

—సంజయుని రాయబారము—

తే. అంత సంజయుఁ బిల్చి యయ్యాంబికేయుఁ,డనియెఁ సంజయ పాండునితనయు లెల్ల
వచ్చి రంట యుపప్లావ్యపరపురమున,కీవు నాపంపున నటకుఁ బోవలయును. 43

సీ. వారి విచారము బాయుటెట్లగు నట్లు,వచియింపఁ గాఁ దగు వత్స నీవు
మునుమున్న వారలఁ గని పల్కు మీతండ్రి,కుశల మడిగె మిమ్ము విశదముగను
వనవాస మొనరించి వచ్చినదానికి,సంతస మందె మీజనకుఁ డనుమి
యవల సభ్యులతోడ నను మిట్లు దుర్యోధ,నుం డవివేకియై యుండెఁ గాన
తే. కార్యకార్యజ్ఞుఁ డాతఁడు గాడుగాన,గౌరవులకుఁ బాండవులకుఁ గలిఁగె నిట్లు
నిత్యసత్యవ్రతాచార నిపుణు లైన,పాండుసూనులందున దోష ముండఁ బోదు. 44
వ. అని పలుకు మని మఱియు సంజయునితో ని ట్లనియె. 45
సీ. ధర్మమూర్తులు నీతితత్పరుల్ పాండవుల్,నిర్దోషులును మహానిర్మలులును
వారిపైతృకమును వా రేలకుండన,య్యడవుల నిడుమలఁ బడుచునుండ్రి
వారలు మనమును క్షీరనీరము లట్లు,కలసి యుండిన మేలుఁ గలుగుఁ గాదె
వారిభాగంబును వారి కీకుండినఁ,గంగసారి రథమును గడపుచుండ
తే. సమరమున కేగుఁ దెంచి యాసవ్యసాచి, గాండీవమున జగద్ధానిఁ గలుగఁ జేయు
భండనమున మహాగదాదండ మూను,వాయుసూనుని గెల్చెడు వార లెవరు. 46
సీ. అతనికోపంబును మతిఁ దలంచినయెడ,హృదయకంపంబునఁ బొదలుచుండు
మరియు మాద్రేయుల శరములనిపుణత,వర్ణింప నేరికి వశముగాదు
సామాన్యుఁ డొక్కొ పాంచాలాధినాథుండు, వానికుమారుఁ డయోనిజనితుఁ
డెనఁగుధృష్టద్యుమ్ను నెదురుకొని గెలువ,నెవ్వారితర మగు నివ్వసుధను
తే. మత్స్యభూమీశ్వరుండు సామాన్యుఁడొక్కొ,యపరిమితపరాక్రమము గలట్టివాఁడు
సాత్యకియు యుద్ధమున శూలిసముఁడు కాడె,వీర లెందఱో యుండిరి వారి వైపు. 47
తే. వారిపక్ష మనేకు లున్నారు మఱియు,యమసుతుఁడు కొంచె మేనియు నలిఁగె నేని
యీచతుర్దభువనము లేకముగను, సంహరింపంగఁ జాలు నోసంజయుండ. 48
సీ. గాంగేయు ననుమతి ఘటజు ననుమతిని,సంజయుఁ డంబికాసంభవుండు
పాండవులను జూడఁ బంపించె నాతఁ డు,పప్లావ్యమున కేగెఁ బ్రౌఢి మెరయ
నలువురు సోదరుల్ గొలువ శ్రీకృష్ణసమేతు, డౌనాధర్మసూతిఁ గాంచి
కుశలవాక్యంబులఁ గొంతప్రొద్దును బుచ్చి, వినయపూర్వకముగా ననియె నిట్లు
తే. అంబికేయానుమతమున ననఘ నిన్ను, నేను దర్శింప వచ్చితిఁ గాన నాదు
పలుకుపలుకు లాలింపుము లలితమూర్తి, ధర్మసంవర్ధనుఁడ వగు ధర్మరాజ. 49
సీ. మసిగుడ్డలోఁ గల మాణిక్యమును బోలె, మిగులగౌరవమగు మీకులమున
నాసుయోధను కతమై కదా దుష్కీర్తి,జనియించు చున్నది జనవరేణ్య

దానిని బాపంగధారుణీనాయక, నీవె సమర్థుఁడె నిశ్చయముగ
సంగ్రామమందున జయ మపజయము నైన, వాఁడెప మనఁగ నదే యనఘవర్య
**తే.** అని నిఖిలజనక్షయమున కగు మహాత్మ్య, దేవ నీపక్ష మగు వాసుదేవమ్రోద
సాత్యకివిరాటముఖ్యులు సమరమునకుఁ, దలఁపడిన జగంబులుఁ గూడ దగ్ధమగును.
**తే** సవ్యసాచిశౌర్యం బెన్నఁ జాల రెవరు, వాయుజనిపరాక్రమ మెన్నవశ మెవరికి
స్వామిమాద్రేయు లనికివిశారదు లగువారి వర్ణింప నేరికి వశము గాదు. 51

**వ.** మఱియుఁ గౌరవపక్షపాతు లగు గాంగేయకుంభసంభవసోమదత్త భూరిశ్రవఃకర్ణజయద్రథాశ్వత్థామకృపబాహ్లికాదుల నెదుర్కొని గెల్వ నెవ్వారికిని శక్యము కాదు కావున శాంతించి సమరోద్యోగ మాపుటయే సర్వప్రశస్తమని సంజయునకు ధర్మజుండి ట్లనియె. 52

**సీ.** సంజయా నీదువచనములచొప్పున, సమరము గాకుండఁ గ్రమము మీఱ
మారాజ్యభాగము మా కొసంగిర యేని, సంతోష మయ్యెడు సదమలాత్మ
మాతండ్రి యంబికాసూతి మాయందప్పు, వక్రచిత్తముతోడఁ బరఁగి యిపుడు
నీతులు చెప్పంగ నిన్నుఁ బంపించె నా, సంతసించితిని నాస్వాంతమందుఁ
**తే.** గపటమగుజూదమందు మావిపులరాజ్య, సంపదల సంహరించియు జాలి లేక
యడవులకు మమ్ముఁ బంపినయట్టివారి, చరిత నీకు నాకును గ్రొత్తచరిత కాదు. 53

**చ.** అలఘుఁడు ధర్మచిత్తుఁడు మహామహుఁ డావిదురుండు జూదమున్
వల దని యెన్ని చెప్పినను వానినుడు ల్వినఁ డాంబికేయుఁ డా
తులువలు కర్ణసౌబలులు దుర్వచనంబులు నాలకించి యే
సలిపెను మాకుఁ గష్టములు సంజయ యీవిధ మీవెఱుంగవో. 54

**తే.** ఇప్పుడైన నాధృతరాష్ట్రుఁ డించుకేని, ధర్మపథము నూహింపఁడు తనమనమున
మాకుఁ గీడొనర్పుటకుఁ దామతిఁ దలంచుఁ, నతనిహృదయమే నెఱుఁగనా యనఘచరిత.

**వ.** మఱియు దుర్యోధనుండు వాసుదేవుని సరకుగొనక యర్జునునితోఁ బోరుటకు భుజబలశౌర్యయుం డగు రాధేయుం డుండె నని సదా గర్వించుచుండును. 56

**ఉత్సాహము.** ముందుముందు నీవు మమ్ముఁ బొగడి యావలన్ సదీ
నందనాదులను గెలువఁగ నాకసాధ్య మంటి వే
నిర్ధులకును సమ్మతింప నీవు పక్షపాతి వీ
చందమున వచించుటకును సంజయుండ యొప్పవే. 57

ఉ. భీముఁడు శౌర్యమూర్తి యరిభీకరుఁ డై తఁగునింద్రసూనుఁ డు
ద్దామబలాఢ్యు లాకవలు ధైర్యహిమాద్రులు వార లెల్ల సం
గ్రామమునందు నిల్చినను రాజధరుండును గెల్వఁ జాలు నే
యీమనుజాధముల్ గురుకుతేశ్వరు లెంతటివారు సంజయా. 58

తే. కౌరవుల గెల్వ లే మని కలను గాని,నీవు దలపంగఁ బోకుము నిశ్చయముగ
వాసుదేవుఁడు మాయందుఁ బక్షపాతి,యయ్యెఁ గావున మాకగు నయ్య జయము.

క. మే మేకీడుఁ దలంపము, భూమీశుఁడు బంధుమిత్రపుత్రులతోడన్
సేమమున నుండఁ దలఁచిన, ప్రేమను మాభాగ మిచ్చి వేయుట మేలౌ. 60

వ. ధృతరాష్ట్రుండు కొడుకులకు బుద్ధిఁ జెప్పి యింద్రప్రస్థ మైనను లేక దేని నైనను మా కిమ్మని చెప్పు మన ధర్మజుం గాంచి సంజయుం డిట్లనియె. 61

క. దేవా నే వచియించిన,యీవాక్యములందు దోష మెయ్యది యున్నన్
భావమున శాంతిఁ గొని నన్, బ్రోవుము నీపాదములకు మ్రొక్కుచునుంటిన్. 62

సీ. నీదుచరిత్రము నిఖిలలోకంబులఁ బావనం బై నది పార్థివేంద్ర
చెడఁ దలంచినకురుక్షితిపతిసుతులు మీ,భాగ మీయ మటంచుఁ బల్కు రేని
నీనడవడికి నన్ని జేసి రుధిరాన్న,మును భుజించుటకంటె భూవరేణ్య
బిక్షాన్న మే నీకుఁ బ్రియ మని తలఁచెదఁ, గారణ మేమని కోరి తేని

తే. రాజసూయాధ్వరంబులఁ బ్రబలఁ జేసి, భూసురులఁ దృప్తిఁ జేసినపుణ్యనిధిని
నీదుకీర్తివల్లి జగాన నెఱివహింప,నీవు జ్ఞాతివధ మొనర్ప నింద్య మగును. 63

వ. అంత ధర్మనందనుం డాసంజయున కిట్లుపత్యుత్తర మిచ్చె. 64

తే. వంశదూషకులను మహాపాపమతులఁ, గ్రూరులను వధించుట సదాచార మగును
సంగరం బిది ధర్మమౌ క్షత్రియులకు, మఱియు నెఱఁగించు నీకునీ మాధవుండు. 65

వ. అనుటయు దేవకీనందనుండు సంజయున కిట్లనియె. 66

సీ. పాండవశుభము గూర్పఁ దలంచి వైచిత్ర్య,వీర్యుండు నినుఁ బంపె వేడు కలర
కౌంతేయుఁ డీతఁడు శాంతిఁ బొందెడునట్లు, చెప్పియుంటివి నీవు చిత్రముగను
శమనతనూజుండు సంధిగావింపఁడు, వీరికి సగపాలు వారొసఁగక
శాంతముల్ పలికిన సంతసింపఁగఁ బోవ,రవమానమును బొంది యనద లట్లు

తే. వీర లూరకుండుటకన్న వీరసమర,మును బొనర్చుట శ్రేష్ఠమౌ తనరువిూఱు
సంగరం బొనరించుట క్షత్రియులకుఁ, బరమధర్మము గావునఁ బలికితినిటు. 67

తే. పాండవులయందు దోష మావంత యేని, గానుపింపదు నా కెందు నేనిఁ జూడఁ

గన్ను మిన్నును గానకఁ గౌరవులును, వీరలకుఁ గీడొనర్పంగ వెసఁ దలఁతురు.68

సీ. ఆనాఁడు ద్రౌపది కాసభాస్థలమున, జరిగినయట్టియాపరిభవంబు
వారింప నేరనివైచిత్ర్యవీర్యుండు, వీరి సేమము వినఁ గోరె నెట్టు
లట్లవమానము నందిశాంతులు గానఁ, బాండవు లూరకయుండి రకట
యొరు లెవ్వరైన నిట్లూరకయుందురా, యప్పుడు కమలాప్తునాత్మజుండు

తే. గరితఁ ద్రోవదిఁ గాంచి నీవరులు నిన్ను, విడిచియుండిరి కావున బిసరుహాక్షి
కౌరవులలోన నొక్కనిఁ గోరు మనియె, దానవిజయుని హృదయము దహన మయ్యె.

తే. దుస్ససేనుండు వీరల దూరెఁ గాదె, వీరుపౌరుషహీను లైనారటంచు
వాని నన్నిటి నిప్పుడు పలుకుటేల, సంధి పొసఁగున నెడుమాట సందియమ్ము. 70

వ. అయినను సంధివిషయము నే నాంబికేయుసదరి కేతెంచి మాటాడువాఁడ నని భగ
వానుండును విన్నవించిన సంజయుండు సంతసించి ధర్మజున కిట్లనియె. 71

సీ. మానవాధీశ్వర నే నరుదెంచిన కార్యము సమకూరెఁ గౌరవేంద్ర
దీనరక్షకుఁ డగుదేవకీసూనుండు, సంధికార్యము భుజస్కంధమందు
స్వయముగా వహియించి వైచిత్ర్యవీరుని, గనుఁగొనఁ గా వత్తు ననియెఁ గాన
సంధి పొసంగును సందియం బింక నేల, పోయివత్తు ననుజ్ఞ నీయుమయ్య

తే. యనుడు సంజయుతో ధర్మతనయుఁ డనియెఁ, గౌరవులపక్షమందలిఘనులు బాహు
బలపరాక్రము లెందఱుఁ గలిగియున్న, వారు మము గెలువఁగలేరు పోరిలోన. 72

తే. ధర్మదేవత మముఁ గాచుఁ దప్పకుండ, త్రిజగములఁ బూజితుఁడు వసుదేవసుతుఁడు
మాకుఁ బెట్టనికోటయే నాకుఁ గలహ, వాంఛ లే దెన్నఁటికి లేదు బల్కితి విను.73

ఆ. వారికైనపాలు వారలు గైకొని, మాకునైనపాలు మాకొసంగి
వారు మేము గూడ క్షీరనీరములట్లు, కలసియుంటఁ గోర్కెఁ గలదు నాకు. 74

వ. అట్లుకాదేని, 75

తే. ఖాండవప్రస్థపురము మాకందియును గుశస్థలపురము మఱియు వృకస్థలంబు
వారణావత మీమైదుపట్టణములు, నేవురకు నివి యొసఁగిన నింతె చాలు. 76

వ. అనంతర మర్జునాదులవాక్యములను విని యివి యన్నియుఁ గౌరవేంద్రునకు విన్న
వింతు నని సంజయుండు హస్తినాపురి కేగె నంత. 77

తే. సంజయుఁడు పాండవుల వీడి సత్వరముగఁ, గరిపురంబున కేతెంచి కురువరునకు
ధర్మనందనాదులనుడుల్ దాను దెలుప, విదురు రావించి ధృతరాష్ట్రవిభుఁడు వేగ.78

వ. సంజయవాక్యములఁ దెలిపిన ధర్మాధర్మవిమర్శనుం డగునవ్విదురుండు వైచిత్రవీర్యున కిట్లనియె. 79

సీ. సర్వరాజ్యంబును సమకూరిన దె యన్న, వారిరాజ్యంబును వారి కిడక
యపహరింపంగ నీయాత్మఁ దలఁచితివి, సుతు లాచరించుదుష్కృతుల కెల్లఁ
దలయూఁచుచుంటివి తగదు నీ కియ్యెడ, కర్ణునిప్రోత్సాహకతమువలన
కయ్యంబునకు సుతుల్ గాలుద్రవ్వుచునుండ్రు, నీతియు శాంతియు నీకు లేదు
తే. పాండుపతిభంగి నీయందు భక్తితోడ, నెసఁగుధర్మరాజాదుల నిట్లొనర్పఁ
దలఁచి తెంతయో దోసముఁ గలుఁగు నీకు, ధర్మపథము నాలోచించు ధారుణీశ. 80
తే. ధర్మగుణగరిష్ఠుం డగుధర్మజుండు, నీదుసుతు లాచరించిననీచములను
శాంతము వహించి యాతండు సైచియుండె, నధికభక్తి నీయం దుండినట్టిఁ జాడ. 81
వ. భీమార్జును లగ్రజుశాంతవాక్యపాశబద్ధులై యూరకయుండిరి. 82
క. గారాబంబున పూర్వము, వారలఁ బెంచితివి కాదె పరమదయాళూ
భారతవంశాభరణా, వారల నిపు డిట్లు చేయవచ్చునె నీకున్. 83
సీ. కులదూషకుం డగుకొమరుని విడుచుట, ధర్మ మటంచు బెద్దలు వచింతు
రీమాట లన్నిటి నేఁ జెప్పితిని జూడ, మాడకపూర్వమే యవనినాథ
రోగికిఁ బథ్యము రుచియింపనట్లు నా, పలుకు నీచెవులకు ములికి యయ్యె
నిపు డైనఁ గాని మహీతలనాయకా, ధర్మహీనులు భవత్తనయు లగుట
తే. వారిపలుకుల నిరసించి పాండుసుతుల, భరతవంశభూషణులను బావనులను
నాదరింపుము లేకున్న నపల నీదు, సుతులు పడుపాటులను నీవు చూడఁగలవు. 84
వ. అనిన విదురునకు ధృ రాష్ట్రుం డి ట్లనియె. 85
ఆ. ధర్మహీను లైనఁ దనయుల విడఁజాలఁ, బాండవులను దెచ్చి వారితోడ
సంధినిం బొనర్ప సరఁగఁ బ్రియత్నింతు, ననుఁడువిదురుఁ డనియెనన్నతోడ. 86
తే. ఆసుయోధను నోడఁబుచ్చి యవనినాథ, పాండవేయులకుం గొన్నిపల్లె లైన
జీవనోపాధి కొసఁగుట శ్రేష్ఠ మనుచు, వివిధధర్మానుసారుఁడు విదురుఁ డనియె. 87
తే. నిండుపేరోలగంబున నుండి యంబి, కాసుతుఁడు సంజయుం బిల్చి కంసవైరి
యైనవసుదేవసూనుఁ డే మనెను దాని, విశదముగ సంజయా నాకు విన్నవింపు. 88
వ. అంత సంజయుం డాభూకాంతున కి ట్లనియె. 89
సీ. దేవ నే నిన్నటిదివసము శ్రీకృష్ణుని, పలుకులఁ జెప్పగాఁ దలఁచియుండి
యాగ్రహం బగు నేమొ యనుచుఁ జెప్పకపోతి, వినుఁడు చెప్పెదఁ గృష్ణుఁ డనియె నిట్లు

ధనధాన్యముల నెల్ల ధారుణీసురులకు, దాన మీయుము మటుచుఁ దగ వచింపు
మాశ్రితులకు బాంధవాదిముఖ్యులకును, సత్కార్యములఁ జాల సలుపు మనుము
తే. సర్వభోగములఁ బొంది విస్తారముగను, నాలుబిడ్డలఁ బ్రియమున నాదరించి
యెవ్వరికి దేనియందున నిష్టమగునొ, వానినన్నిటి ననుభవింపఁగవలయు. 90
తే. పిదపఁ బ్రాణము లఱచేతఁ బెట్టుకొనుఁడు, సంగరమ్మున కేతెంచు శౌర్యమలర
కొలువులోఁ బరిభవముచు గోమలాంగి, పొందె వానిఫలము మీరు పొందవలయు. 91
వ. నాఁడు ద్రుపదరాజతనయ నన్నుఁ గావు మని మొఱవెట్టుకొనిన వాక్యములు నాహృ
దయము భేదించుచుండె ననియె నని కృష్ణవాక్యములఁ జెప్పిన నప్పుడా భూమీంద్రుం
డిందాత్మజుం డే మనియె నన సంజయుం డిట్లనియె. 92
సీ. మాయర్ధరాజ్యము మా కొసంగు మటంచు, నే మడుగుటయు మీ రేమఱకుంట
యొంతయు మదిలోన సంతస మయ్యెడు, మీరు మును జేసినక్రూరములకు
నిది మెఱుంగను బెట్టినదిగాఁ దనకైన, యుద్ధములోన సుయోధనుండు
ధరణిఁ బడినఁ గాని ధర్మతనూజుండు, వనవాసమునఁ బడిన ఘోర
తే. శ్రమము దీరదు కావున శమనసూనుఁ, డడవిఁ బడుదవాగ్నిఁ బోలె నాలమూడు
గౌరవులసేనపైఁ బడి పోరునెడలఁ, గాని సరకుఁగొనరు మీరు వాని నను. 93
తే. ప్రళయకాలరుద్రునిబోలె వాయుసుతుఁడు, భండనంబున దనగదాదండ మూని
యొసఁగ వైరులఁగూల్చు దుర్యోధనుండు, మాదు రాజ్యభాగంబును మా కొసంగు. 94
తే. ఆఁకలిం గొన్నవ్యాఘ్రములట్లుగాఁగ, నకులసహదేవసాభద్రప్రకటయశులు
రణములోన మీసైన్యము నణఁచునపుడు, మీరు మాసఖ్యమునుగోరువా రగుదురు.
సీ. ద్రుపదవిరాటులు విపుల బాణాసన, తూణీరులై మహోత్తుంగయశులు
భండనంబున మిమ్ముఁ బరిమార్చునప్డు మీ, యలుక తీరెడుఁ గాక యవల మఱియు
సంగరకేళీవిశారదుండైన ధృష్టద్యుమ్నుఁ డాకుంభసంభవు నటఁ
దాఁకునప్పుడె మీరు మాకు వెఱవవచ్చు, శ్వేతవాహనములఁ జేర్చినట్టి
తే. యరదమున నేను దనరార మురరిపుండు, సారథిత్వము నాకును సలుపుచుండ
ధ్వజముపై హనుమానుండు తనరు మీఱ, రథికుఁడై నేను జనుదెంతు రణమునకును.
తే. దేవదత్తము మ్రోయించి దిక్కు లగల, గాండివమును జేత ధరించి భండనమున
రిపుజనముమధ్య విహరించునపుడు నన్నుఁ, గరుణతోడ మీ రెల్ల రరయఁగలరు. 97
వ. సుయోధనుండు లీలామానుషవిగ్రహుండగు కృష్ణునే సరకుఁగొనఁ డట్టిచో మ
మ్మెట్లు సరకుఁగొనును. 98

ఆ. కురుపితామహునకు గురునకు మది మ్రొక్కి, రాజ్యభాగమునకు రణ మొనర్చు
వార మగుటవలన వాసుదేవుండు మా,పొందు నుండె జయము బొందఁగలము. 99
వ. ధృతరాష్ట్రమహారాజా యర్జునుం డీవిధముగాఁ బల్కె నని సంజయుం డెల్లరు వినఁ
బల్కిన నంత మందాకినీనందనుండు ధృతరాష్ట్రాగ్రనందనునితో ని ట్లనియె. 100

—భీష్మాదులు ధృతరాష్ట్రునకు నీతి దెల్పుట—

ఆ. కౌరవేంద్ర మున్ను సారసగర్భుండు,నిండుకొలువులోన నుండువేళ
దివ్యమూర్తు లగుచుఁ దేజంబు మీఱెడు, పురుషు లిర్వు రటకు నరుఁగుదేర. 101
వ. అప్పుడు బృహస్పతి పితామహుం గాంచి యీపురుషు లెవ్వ రన నలినగర్భుండు
వారి కి ట్లనియె. 102

తే. తపము పెంపును బలశౌర్యదర్పములును,గలిగి లోకహితార్థము చెలఁగువీరు
నరుఁడు నారాయణుం డనఁ బరఁగునీవు,రాణపురుషులఁ బొగడంగ నేను జాల. 103
వ. మఱియు వీరధర్మసంగ్రామంబున కేతెంచి ధర్మపరులకు జయం బొడఁగూర్తు రని
పలికె నరనారాయణులే కృష్ణార్జునులై జన్మించిరి కావున. 104
సీ. ఆఖండలాత్మజుఁ డాహిరణ్యపురి ని,వాతకవచులను వధ మొనర్చె
నది లోకవిదితమే యాదవాధీశుని,బలపరాక్రమములఁ దలఁప వశమె
నరకాసురు వధించి మురుని వధించెను,గంసుని వధియించె గాదె యతఁడు
వారిర్వురును గూడి పోరొనర్చెడువేళ,వారి గెల్వఁగ మనవశము గాదు
తే. పురహరున కైన శక్యమై పోసఁగ దెపుడు,కృష్ణమూర్తి సారథి యయి క్రీడి రథికుఁ
డై సమరమున కేతెంచునట్టివేళ,నీవె తెలిసికొనఁగవచ్చు భూవరేణ్య. 105
సీ. నామాట లాంలిప నీమది యెప్పుడు,దుష్టకార్యంబులే తోఁచు నీకు
నీహితంబును గోరి నేఁ జెప్పువాక్యముల్, వినవైతివేని భండనమునందు
వీరలు పడి రని వారలు పడి రని,చింతించుచుండు వీ వెంతయేని
దుష్టకర్ణశకునిదుశ్శాసనాదుల,చెనటివాక్యంబులే వినెద వీవు
తే. మంచివాక్యము లెన్నఁడు పొంచి వినవు,నీదుకర్మ మె ట్లున్నదో నే నెఱుంగ
ననిన గాంగేయుమాటలు కలిగి దుష్టుఁ,డగుసుయోధనుఁ డి ట్లని మగిడి పలికె. 106
ఆ. పాండవేయులందుఁ బక్షపాతముతోడ,నిట్లు మాటలాడ నేల నీకు
నీ విటులు వచింప నే నేమి చేసితి,ననుచు నూఱకుండ నంతలోన. 107
వ. ఆపగానందనుండు విచిత్రవీర్యనందనున కి ట్లనియె. 108

క. భండనమందు నెదుర్కొను, దండిమగని లోక వీరు ధైర్యహిమాద్రిన్
గాండీవధారి యగునా, ఖండలనందనుని గెల్వఁగా నేరి కగున్. 109

సీ. ఈకర్ణుఁ డెప్పుడు లోకైకనుతులఁ బాం, డవులఁ జంపుదు నంచుఁ దా వచించి
ప్రోత్సాహపఱచు నీపుత్రుల కెల్లను, వానిని నమ్మి నీసూను లప్పు
డవమాన మొనరించి రాపాండుపుత్త్రుల, వార లెల్లను మహాబాహుబలులు
పోరు సల్పుటలోన నారితేరినవారు, వారల గెల్వ నెవ్వారివశము

తే. కర్ణుఁ డాఘోషయాత్ర నీకన్నసుతుల, నప్పగించె గంధర్వున కట్టివేళ
నితనిశౌర్యబలాదు ల వెం దడంగె, నీతఁ డతిదుర్జయవిచారుఁ డిభపురీశ. 110

ఆ. నీతిదూరుఁ డైనయీశకునిపలుకులు, నమ్ముచుండ్రు నీదునందనులును
వీని నెల్ల నీవు వినుచుండెదవు మహో, త్సాహ మలరఁగాను ధారుణీశ. 111

వ. అని గంగోద్భవుండు పలికిన ఘటోద్భవుం డి ట్లనియె. 112

సీ. గాంగేయువాక్యముల్ కడుహితంబులు గాన, ధృతరాష్ట్ర వీని సమ్మతిని వినుము.
ధర్మనందనుతో నధర్మసంగరమును, సలుపుట దోష మోజనవరేణ్య
మనసైన్యమునఁ గాక యనిమిషేశ్వరసుతుఁ, బోకార్చువీరుఁ డీపుడమిలోన
మూఁడులోకంబుల లేఁ డనఁగావచ్చు, నని హితంబులు పల్కునట్టివేళ

తే. నీతివాక్యముల్ విన మది నిచ్చ లేక, ద్రోణభీష్మాదిఘనులకుఁ దాను మాఱు
పలుకకుండ సంజయుఁ బిల్చి పార్థివుండు, పలికె నాతనితో నిట్లు గలఁక దేఱి. 113

మ. అనఘుం డాయమనందనుండు జగదేకారాధ్యుఁ డోసంజయా
మన సైన్యంబిటు చేరె నంచు వినెనా మామీఁది కెవ్వారిఁ గై
కొని యేతెంచును సేనఁ గూర్పఁ బడె నా ఘోరాజిలోఁ బోరఁగా
ననఁగా సంజయుఁ డాలకించి యనె నిట్లా భూతలాధీశుతోన్. 114

క. ధృతరాష్ట్రచక్రవర్తి, యతి జడుఁడవు కాన నిట్టు లంటివి పాండు
క్షితివరవరనందనులకు, యతనము గాకుండు నొక్క యక్షౌహిణులున్. 115

సీ. బకుని జంపి హిడింబు వధియించి కీచకుఁ, జంపినట్టేఁడు బలశౌర్యమూర్తి
భీమవిక్రముఁ డగుభీమసేనుండును, నని మహేశ్వరుఁ గెల్చినట్టివాఁడు
ఖాండవదహనము గావించినట్టివాఁ, డర్జునుండు పరాక్రమార్జితుండు
రణమున సింగము లన నొప్పి వైరులఁ జెండాడఁగాఁ దగుదండిమగలు

తే. కవలు నాద్రౌపదేయులు గలరు మఱియు, భుజబలమున నర్జునునకుఁ బోలువాఁడు
వైరినిర్మూలుఁ డైనసౌభద్రుఁ డలరు, నట్టివా రెందఱో గల రనఘ వింటె. 116

తే. సమరకేళీవిలాసుండు సాత్యకియును, శౌర్యమూర్తి యౌ ద్రుపదభూజాని మహిత
బలసమేతుండు మత్స్యభూవల్లభుండు, ననుజతమ్ములు పుత్రమిత్రసుతులు గలరు. 117

సీ. శిశుపాలసుతుండును జేకితానుండును, జరాసంధ నిజాత్మజుండు
కేకయాధీశులు ప్రకటయశులు ధర్మజునకుఁ దోడుగా రాఁ దలంచి
రక్షులదేశాధీశు లనికి నేతెంతురు, భీమసేనసుతుండు భీమబలుఁడు
కలఁడు ఘటోత్కచుం డలఘుఁ డౌ నాతండు, జనకునికంటెను శౌర్యమూర్తి

తే. అతఁడు మాయాబలంబున నరిసమూహ, మెల్లఁ జీకాకుఁ బఱచెను నిది యటుండఁ
ద్రిభువనము లఱచేతికిఁ దెచ్చువాఁడు, వాసుదేవుఁ డుండెను వారిపక్షమందు. 118

వ. అనిన సంజయవాక్యములకు భీతిల్లి యాంబికేయుం డిట్లనియె. 119

తే. సంజయా నీవు చెప్పినశౌర్యనిధులు, నందఱును బ్రబలులె లేదు సందియమ్ము
వారలందఱు నొకయెత్తు వాయుసూనుఁ డాతఁ డొకయెత్తుగా నాజి నలరుచుండు.

సీ. భీమునినామము వినఁ దలంచిన నాకు, రాత్రులందున నిద్ర రాదు సుమ్ము
యతని మాఱ్కొనఁజాలునట్టివీరుఁడు లేఁడు, మనసైన్యమందు నెందునను గాన
కాలదండసమము గద బూని యాతండు, నరికదంబములలోఁ దిరుగునప్పు
డాసురాసురు లైన నతని గెల్వఁగలేరు, చంపె జరాసంధు క్షణములోన

తే. కౌరవసమూహమును గూడి పోరెనేని, వాని గెల్వఁజాలరు మనవారెవరును
జిచ్చునకు గాడ్పు సాయము చేయునట్లు, వాయుజునకుఁ దోడుపడును ఫల్గునుండు.

వ. భీమసేనశౌర్యధైర్యసాహసవారిధి దాట గాంధారేయులకు వశంబు గా దని
తోఁచుచుండె. 122

సీ. గాండీవధారియై గాండీవి యేతెంచు, నాతనిఁ బోలువాఁ డవని లేఁడు
చెప్పినంతటిదానిఁ జేయుచుండెను గాని, యన్యతంబు బల్కువాఁ డతఁడు కాఁడు
తో డయ్యె నతనికి దోయజనాభుండు, గాండీవమందునఁ గలుఁగుమంట
కురుసేనను దహించు ఘోరాజియందున, నిట్లువచ్చిన దీక నేమి సేతు

తే. సవ్యసాచివాయుసుతులశౌర్యబలము, కుంభసంభవుకన్నను గురునికన్న
నధికముగ నెవ్వ రెఱుఁగుదు రవనిలోన, నేమి సేయుదు సంజయా యింక నేను. 123

తే. ఆపగాసూనునకుఁ బౌత్రులైరి వారు, చెలఁగ నస్త్రగురునకును శిష్యులైరి
ఘనులు వారికి మనయందుఁ గలుఁగుఁ బ్రేమ, పాండవేయులందునఁ గూడ నుండుఁ గాదె.

క. ఇది మొదటినుండియును మా, విదురుండు వచించినట్టివిధముగ నదియే
యుద్ధమునన జరుగుచునుండెను, మది నాలోచింపనెడల మఱి సంజయుండా. 125

ఉ. దానవయోధపరుం డయిన ఫల్గుని నాఘవృత్తిలోఁ గాఁగా
బూనుట యగ్నివి స్మరుత ...ంచి ఘనంబుఁ దలంచినట్టిదే
యూ నీక వారితోడుతను నాల మొనర్పఁ గులక్షయం బగుఁగా
గాన మదీయనందనుఁడు కయ్యము మానుక సంధిఁ జేయు నే. 126

వ. ఎట్లైన సుయోధను నొప్పించి సంధిప్రయత్న మొనర్తు నని ధృతరాష్ట్రుండు దుర్యోధనుని రావించి పాండవులయర్ధరాజ్యము వారి కిచ్చి సంధి చేయు మన నాతం డిట్లనియె. 127

సీ. అడవులయందున నచలంబులందున, వసియించి యుండి యిప్పటికిఁ బిరికి
వచ్చినవార లాపాండవేయులు మమ్ము, గెలుచుటఁ గలలోనఁ గలుగువార్త
కురుపితామహుఁ డగుసురనదీసూనుండు, సామాన్యుఁ డగునె యీజగతిలోనఁ
బరశురాముని గాని సరకుఁ గొనని యాతఁ, డలిగినఁ బాండవుల్ నిలువఁ గలరె
తే. కృపుఁడు ద్రోణుఁడు ద్రోణిజుల్ విపులబలులు, దురమునందున వారలఁ బరిహరించు
గెలువలే రింకఁ బాండవుల్ గెలుచుటైన, వీర లెంత తని తలఁచితో ధారుణీశ. 128

తే. సహజకవచకుండలుఁడును స్వర్ణవర్ణుఁ, డైనకర్ణునితోఁ బోరునట్టియాతఁ
డెవఁడు కలఁడు ధర్మజుపాల నెంచి చూడ, భయము విడనాడు మింక నీభావమందు.

వ. మఱియు బాహ్లీక సోమదత్త భూరిశ్రవశ్శల్య సైంధవాదివీరాగ్రేసరులు వివిధదేశాధీశులు నాపక్షమున నుండఁ బాండవులు కన్నెత్తి చూడలేరు. 130

సీ. భీమసేనుని నీవు పెద్దఁ జేసి నుతించి, భీతిల్లు చుంటివి భీరునివలె
వాయునందనుఁడు గదాయుద్ధచుండైన, నను దాకి వజ్రబాణంబు లైన
నచలంబుఁ గూలినయట్లు నేలకుఁ గూలు, వారిపక్షమున నిం కేమి గలదు
కర్ణునిశక్తిచే గాండీవి కూలును, నెక్కుడువక్కుడ లెంచఁగ వీవు.
తే. వారు బలవంతు లనుచును బెదరు టేల, సంగరాంగణమున మేము జయము గాంచ
గనులఁ గాంచెద వనియె సుతనయుఁ జూచి, యావిచిత్రవీర్యాత్మజుం డనియె నిట్లు.

ఉత్సాహ. వత్స పలుకుచుంటి నాదువాక్యముల్ వినంగదే
కుత్సితుం డగుఁ గర్ణుఁడును శకునియుఁ జివ్వఁ జేయ నిన్
బ్రోత్సహించుచుండ్రు నీవు మోదమొంది పోరికై
యుత్సహించుచున్నవాఁడ వోకుమారశేఖరా. 13

సీ. పాండునందనులతోడ వైరంబు మనుఁగునే, నాకుఁ దోఁచిన దయ్య నాకుమార
శమనతనూజుండు శాంతిసుధానిధి, కావున మనచేయుద్రోహ్యములను

సహియించి యాతండు సంధి కిచ్చుచు నుండును, వారి రాజ్యముపాలు వారి కిమ్ము
దాన మే లయ్యెడు గాని వారలతోడఁ, గలహింపఁగా రాదు కలను గాని.

గీ. కలహ మొందుట గాంగేయకలశజులకు, సమ్మతము లేక యున్నది సంగరమున
వాయుజుఁడు కేల గదఁ బూని వైరివరుల, నురుమునట్టి నావాక్యముల్ వినవె నీవు.

వ. వారల యమేంద్రవాయ్వశ్విని దేవతలు సర్వదా రక్షించుచుందురు వారల
కపజయము చేకూరదు కావున సంధి చేయుటయే యుక్తమని తోఁచెడు ననిన
విని కనలి దుర్యోధనుండు తనతండ్రి కిట్లని ప్రత్యుత్తరమిచ్చె. 135

చ. కలశజుఁడు న్నదీసుతుఁడు కయ్య మొనర్పక యుండ రేని యీ
యలఘులు కర్ణసౌబలులు నర్ణవభీకరు లైనతమ్ములున్
గలిగిరి యింక నే న్వారుఁగాదనఁ డయ్య మఱియు రాజ్యము
దలరఁగ సూది మోపుటకు నైన ధరిత్రియు నీయ వారికిన్. 136

ఉ. వీరినహాయభాగ్యమున భీకర మైనమహాద్భుతయుద్ధములోఁ
గ్రూరులఁ బాండవేయులను గూల్చెదఁ జంపెను బొందఁ బోకు నే
నేరుతు న్నిల శాస్త్రములు నేర్చితి యుద్ధమునందు మాయలన్
వైరులఁ గూల్చి రాజ్యమును బాలనఁ జేయుదుఁ గౌరవేశ్వరా. 137

క. నానావిధమంత్రమ్ముల, నే నేరిచి యుంటిఁ గాన నే నలిఁగిన నా
దీను లగుపాండుభూపతి, సూనుల రక్షింప లేరు సురలం దెవరున్. 138

తే. పాండవులును ధృష్టద్యుమ్నప్రముఖవరులు, సాత్యకి విరాట చేది పాంచాలవరులు
నస్మదీయబాణాగ్నిలో నాహుతులుగ, నేను సల్పెద నామాట నిక్క మనఘ. 139

వ. ఆసమయంబున మార్తాండసూతి విచిత్రవీర్యసూతి కిట్లనియె. 140

సీ. దేవ నావాక్యముల్ తెలిపెద వినుమయ్య, గురునికోపంబునఁ గొంత నాకు
బాణమందున శక్తి బలముతగ్గె నటంచు, జనులు పల్కుట లసత్య మగును
నమ్ముగీశ్వరుని నే నారాధన మొనర్చి, తచ్ఛక్తిఁ గాంచితి ధారుణీశ
యస్త్రశస్త్రంబుల నధికసంపదఁ గల్గు, నన్ను గెలువ లేరు నరవరేణ్య.

తే. నీసమీపమునందున నిలిచి యుండి, కలశభవశాంతనవులు నన్ గనుఁగొనంగ
ఘోరసమరము నొనరించి వైరు లైన, పాండవుల సంహరించెదఁ బార్థివేంద్ర 141

వ. కర్ణవాక్యము లాకర్ణించి క్రోధమనస్కుండై భాగీరథీనందనుఁ డిట్లనియె. 142

సీ. కాలునిప్రేరణఁ గానఁ బ్రేలితి విట్లు, సూతనందన నీదు చేత వలనఁ
బాండుకుమారులు భంజనమందుదురఁ, గూలెద రని యనుకొంటి వేమొ

శైలశాసనుఁ డున్నశక్తి వారలు లేరు. పేరుఁ జాలును నేను జెప్పుచుంటి
వాసుదేవునిచేత పరిపూర్ణ సహాయ్యము గలదు. కావునఁ దప్పక సంధి కనుట.

తే. పాండవులు దివ్యమంత్ర [illegible] ప్రౌఢిఁ గొల్చుట గలుగు ననుచుఁ
బలికి యాంగేయునితోడఁ బలికె [illegible], [illegible] నందనుం డప్పు డేపు మీఱ. 143

మ. ధరణీచక్రి మనక్రితక్రియనుగాఁ దా [illegible] నెంచి యీ
దురితాత్ముల్ భవదీయసూను లిప్పు డెంతో మోహము బొంది రా
సురరాణ్ణందను గెల్వఁ జాల రెవరున్ జూడంగ నే వారితో
ధరణీనాయక సంధిఁజేయుట మహాధర్మంబుగా నొప్పెడున్. 144

వ. అని భీష్ముండు వచించిన వాక్యంబులను సంధిఁజేయుట పరమోత్తమ మనిన వైచి
త్ర్యవీర్యుండు నిజాత్మజున కి ట్లనియె. 145

తే. నీహితమ్ముఁ గోరి యిప్పుడు నైరిబా, క్షకభీష్మముఖ్యు లిట్టు లనిరి
వీరివచనములను విని పాండవులతోడ, సంధిఁ జేయు మయ్య చక్కనయ్య. 146

క. విరటునిగోఁబ్బంధంబున, మఱలుచుటకు ఫల్గునుండు మనపైకిని దా
నరుఁదెంచి యేమి చేసెనొ, మఱచితివె యాకర్ణిఁ దప్పఁ జేమి యొనర్చెన్. 147

వ. అని సూర్యసూనుం గాంచి యి ట్లనియె. 148

సీ. కృష్ణుఁడు సారధి జిష్ణుండు రథికుఁడై, భీమసేనాదులు వెంట రాఁగ
గాండీవసహితుఁడై ఖండనం బొనరించు, విష్వచ్చు గెలువంగ నెవ్వరి కగు
నీపలుకులు విని నాపుత్రు లెల్లరు, యుద్ధము చేయ సంసిద్ధు లైరి
రారాజుమరణంబు కోరి యుపాధి నీవు, యనుచుఁ దోఁచుచు నుండె నని వచింప.

తే. నొండు పలుకక యంత మార్తాండసూతి, యస్త్రసన్న్యాస మొనరించె నట్టియెడల
సురనదీనందనుఁడు నవ్వి కురుకుమారుఁ, డైనదుర్యోధనునితోడ ననియె నిట్లు. 149

వ. ఆతం డలిగినందులకు సందియంబు పొందకుము నేను సంగరమ్మున వైరివీర సహ
స్రాదుల బొలియింతు నాతరువాత రాధేయునిరణమ్ము చూడు మన సుయోధనుం
డి ట్లనియె. 150

తే. పాండవులె గెల్తు రని మీరు పలుకుచుండ్రి, నిన్ను నాచార్యు బాహ్లీకు నేను నమ్మి
కయ్య మొనరింప నెంచుట కష్ట మగును, గర్ణదుశ్శాసనులు నాకుఁ గలిగియుండ్రి.

వ. వార లుండ నా కొరులేల నాకు విజయలక్ష్మి నిక్కముగాఁ జేరును ధర్మ మైన న
ధర్మ మైనను సంగ్రామము తప్పదు. 152

క. అనవుఁడు తనయునిపలుకులు, విని దుఃఖానలముతోడ పృథ్వీశుండున్
దనయునకుఁ జెను నిరాసక్తితో, నిరసిఁ గాను జని నిష్టిప్రిత్త్వాంతంబున్. 153

సహియించి యాతంపు సంధి కిష్టపడ వేడవు, వారిరాజ్యమువారు వారి కిమ్ము
దాన మే లయ్యెడు కాని వారలతోడ, కలహించఁగా రాదు కలను గాని.
గీ. కలహ మొందుట గాంగేయకలశజులకు, సమ్మతము లేక యున్నది సంగరమున
వాయుజుఁడు కేల గదఁ బూని వైరిజనుల, నడచునుగ్రుఁడు నావాక్యముల్ వినవె వీవు.
వ. వారల యమేంద్రవాయ్వశ్వినీదేవతలు సర్వదా రక్షించుచుందురు వారల కపజయము చేకూరదు కావున సంధి చేయుటయే యుత్తమ మని తోఁచెడు ననిన విని కనలి దుర్యోధనుండు తనతండ్రి కిట్లని ప్రత్యుత్తరమిచ్చె. 135
చ. కలశజుఁడున్న దీసుతుఁడు కయ్య మొనర్పక యుండిరేని యీ
యలఘులు కర్ణసౌబలులు నర్జనభీకరు లైనతమ్ములున్
గలిగిరి యింక నే నవనిఁ గావఁగ నయ్య మదీయరాజ్యము
దలరఁగ సూది మోపుటకు నైన ధరిత్రియు నీయ వారికిన్. 136
ఉ. వీరసహాయభాగ్యమున భీకర మైనమహార్ణవంబులోఁ
గ్రూరులఁ బాండవేయులను గూల్చెదఁ జింతను బొందఁ బోకు నే
నేరుతు నెల్లశాస్త్రములు నేర్చితి యుద్ధమునందు మాయలన్
వైరులఁ గూల్చి రాజ్యమును బాలనఁ జేయుదుఁ గౌరవేశ్వరా. 137
క. నానావిధమంత్రమ్ముల, నే నేరిచి యుంటిఁ గాన నే నలిఁగిన నా
దీను లగుపాండుభూపతి, సూనుల రక్షింప లేరు సురలం దెవరున్. 138
తే. పాండవులును ధృష్టద్యుమ్నప్రముఖవరులు, సాత్యకి విరాట చేది పాంచాలవరులు
నస్మదీయబాణాగ్నిలో నాహుతులుగ, నేను సల్పెద నామాట నిక్క మధిప. 139
వ. ఆసమయంబున మార్తాండసూతి విచిత్రవీర్యసూతి కిట్లనియె. 140
సీ. దేవ నావాక్యముల్ తెలిపెద వినుమయ్య, గురునికోపంబునఁ గొంత నాకు
బాణమందున శక్తి బలము తగ్గె నటంచు, జనులు పల్కుట లసత్య మగును
నమ్మునీశ్వరుని నే నారాధన మొనర్చి, తచ్ఛక్తిఁ గాంచితి ధారుణీశ
యస్త్రశస్త్రంబుల నధికసంపదఁ గల్గు, నన్ను గెలువ లేరు నరవరేణ్య.
తే. నీసమీపమునందున నిలిచి యుండి, కలశభవశాంతనవులు నన్ గనుఁగొనంగ
ఘోరసమరము నొనరించి వైరు లైన, పాండవుల సంహరించెదఁ బార్థివేంద్ర. 141
వ. కర్ణవాక్యము లాకర్ణించి క్రోధమనస్కుండై భాగీరథీనందనుఁ డిట్లనియె. 142
సీ. కాలునిప్రేరణఁ గానఁ ద్రెళ్లితి విల్లు, సూతనందన నీదు చేత వలనఁ
బాండుకుమారులు ఖండనమందునఁ, గూలెద రని యనుకొంటి వేమొ

శైలశాసనుఁ డిచ్చుశక్తి వారలు చేసి, చేయఁ జాలరు నేను చెప్పుచుంటి
వాసుదేవునిచేత వర్తిల్లు లక్ష్మియు గన. నేటికి వచ్చిన స్థితి కనుట.

తే. పాండవులు దివ్యమంత్రము లనుఁ గలిగి యున్నవారు చేయఁ జాల్పుట గలుగు ననుచుఁ
బలికె గాంధారేయునితోడ బలికె నతఁడు, సమరాంగణము వచ్చు దేవు మీరు. 143

మ. ధరణీచక్రమునకు వికృతియగుటను సాహసంబున నెంచి యీ
దురితాత్ముల్ భవదీయసూనుల్ విపుల చింతో మోహమును బొంది తా
సురరాణ్ణందను గెల్వఁ జాల రెవరు సూడుము నీ వారితో
ధరణీనాయక సంధిఁ జేయుట మహాధర్మంబుగా నొప్పెడున్. 144

వ. అని భీష్ముండు వచించిన బాహ్లీకుండును సంధిఁ జేయుట పరమోత్తమ మనిన వైచి
త్ర్యవీర్యుండు నిజాత్మజున్నకు ట్లనియె. 145

తే. నీహితమ్ముఁ గోరి నిమ్ముగాఁ బైన బాహ్లీకభీష్మముఖ్యు లిట్టు లనిరి
వీరివచనములను విని పాండవులతోడ, సంధిఁ జేయు మయ్య చక్కనయ్య. 146

క. విరటునిగోగ్రహణంబున, మరలుచుటకు ఫల్గునుండు మనసైకినిఁ దా
నరుఁ దెంచి యేమి చేసెనో, యెఱుఁగవె యరాతిఁ గ్నఁ దప్పఁ జేమి యొనర్చెన్. 147

వ. అని సూర్యసూనుం గాంచి యి ట్లనియె. 148

సీ. కృష్ణుఁడు సారథి జిష్ణుండు రథికుఁడై, భీమసేనాదులు వెంట రాఁగ
గాండీవసహితుఁడై భండనం బొనరించు, విష్వచ్చుగెలువంగ నెవ్వరి కగు
నీపలుకులు విని నాపుత్రు లెల్లను, యుద్ధము చేయ సంసిద్ధు లైరి
రారాజుమరణంబు కోరి యుండితివి నీవె, యనుచుఁ దోఁచుచు నుండె నని వచింప.

తే. నొండు పలుకక యంత మార్తాండసూతి, యస్త్రసన్న్యాస మొనరించె నట్టియెడల
సురనదీనందనుఁడు నవ్వి కురుకుమారుఁ, డైనదుర్యోధనునితోడ ననియె నిట్లు. 149

వ. ఆతం డలిగినందులకు సందియంబు పొందకుము నేను సంగరమ్మున వైరివీర సహ
స్రములఁ బొలియింతు నాతరువాత రాధేయునిరణమ్ము చూడు మన సుయోధనుం
డి ట్లనియె. 150

తే. పాండవులె గెల్తు రని మీరు పలుకుచుండ్రి, నిన్ను నాచార్యు బాహ్లీకు నేను నమ్మి
కయ్య మొనరింప నెంచుట కష్ట మగును, గర్ణదుశ్శాసనులు నాకుఁ గలిగియుండ్రి.

వ. వార లుండ నా కౌరవేల నాకు విజయలక్ష్మి నిక్కముగాఁ జేరును ధర్మ మైన న
ధర్మ మైనను సంగ్రామము తప్పదు. 152

క. అనవుడు తనయునిపల్కులు, విని దుఃఖానలముతోడ వృద్ధీశుండున్
దనయునుఁ జూడు విదురునితో, వినిపించెను జరిగినట్టివృత్తాంతంబుల్. 153

సహియించి యాతండు సంధి కిచ్చను గాని, వారిరాజ్యపుపాలు వారి కిమ్ము
దాన మే లయ్యెడు కాని వారలతోడఁ, గలహింపఁగా రాదు నేను గాని.
గీ. **కలహ** మొందుట గాంగేయకలశజులకు, సమ్మతము లేక యున్నది సంగరమున
వాయుజుఁడు కేల గదఁ బూని వైరివరుల, హనుమునన్స్ట్ర నావాక్యముల్ వినవ వీవు.
వ. వారల యమేంద్రవాయ్వశ్వినీదేవతలు సర్వదా రక్షించుచుందురు వారల కపజయము చేకూరదు కావున సంధి చేయుటయే యుక్తమని తోఁచెడు ననిన విని కనలి దుర్యోధనుండు తనతండ్రి కిట్లని ప్రత్యుత్తరమిచ్చె. 135
చ. కలశజుఁడు న్నదీసుతుఁడు కయ్య మొనర్పక యుండిరేని యీ
యలఘులు కర్ణసౌబలులు నర్ణవభీకరు లైనతమ్ములుం
గలిగిరి యింక నే న్వెఱవఁగాదగు నయ్య మహీయు రాజ్యముం
దలఁగఁగ సూది మోపుటకు నైన ధరిత్రియు నీయ వారికిన్. 136
ఉ. వీరినహాయభాగ్యమున భీకర మైనమహార్ణవంబులోఁ
గ్రూరులఁ బాండవేయులను గూల్చెదఁ జింతను బొందఁ బోకు నే
నేరుతు నెల్ల శాస్త్రములు నేర్చితి యుద్ధమునందు మాయలన్
వైరులఁ గూల్చి రాజ్యమును బాలనఁ జేయుదుఁ గౌరవేశ్వరా. 137
క. నానావిధమంత్రమ్ముల, నే నేరిచి యుంటిఁ గాన నే నలిఁగిన నా
దీన లగుపాండుభూపతి, సూనుల రక్షింప లేరు సురలుం బెనఁగన్. 138
తే. పాండవులును ధృష్టద్యుమ్నప్రముఖవరులు, సాత్యకి విరాట చేది పాంచాలవరులు
నస్మదీయబాణాగ్నిలో నాహుతులుగ, నేను సల్పెద నామాట నిక్క మనఘ. 139
వ. ఆసమయంబున మార్తాండసూతి విచిత్రవీర్యసూతి కిట్లనియె. 140
సీ. దేవ నావాక్యముల్ తెలిపెద వినుమయ్య, గురునికోపంబునఁ గొంత నాకు
బాణమందున శక్తి బలముతగ్గె నటంచు, జనులు పల్కుట లపసవ్య మగును
నమ్మహేశ్వరుని నే నారాధన మొనర్చి, తచ్ఛక్తిఁ గాంచితి ధారుణీశ
యస్త్రశస్త్రంబుల నధికసంపదఁ గల్గు, నన్ను గెలువ లేరు నరవరేణ్య.
తే. నీసమీపమునందున నిలిచి యుండి, కలశభవశాంతనవులు నన్ గనుఁగొనంగ
ఘోరసమరము నొనరించి వైరు లైన, పాండవుల సంహరించెదఁ బార్థివేంద్ర. 141
వ. కర్ణవాక్యము లాకర్ణించి క్రోధమనస్కుండై భాగీరథీనందనుఁ డిట్లనియె. 142
సీ. కాలునిప్రేరణఁ గానఁ బ్రేలితి విట్లు, సూతనందన నీదు చేత వలనఁ
బాండుకుమారులు భంగమొందుదురఁ, గూలెద రని యనుకొంటి వేమొ

శైలశాసనుఁ డిచ్చుశక్తి వారల నేమి, చేయఁ జాలదు నేను జెప్పుచుంటి
వాసుదేవునిచేత వశ్రియ్యు లయ్యోఘ నది, నోటికి వచ్చిన క్లోటి కనుట.

తే. పాండవులు రణమందున బాహుబలిమి, కౌరవుల నోఁ గూల్చుట గలుగు ననుచుఁ
బలికి యాంబికేయునితోడఁ బల్కె నిట్లు, గాంగనందనుం డపు డేపు మీఱ. 143

మ. ధరణీచక్రి మవక్రవిక్రమముగాఁ దా నేలఁ గా నెంచి యీ
దురితాత్ముల్ భవదీయసూను లిపు డెంతో మోహముం బొంది రా
సురరాణ్ణందను గెల్వఁ జాల రెవరుఁ జూడంగ నే వారితో
ధరణీనాయక సంధిఁ జేయుట మహాధర్మంబుగా నొప్పెడున్. 144

వ. అని భీష్ముండు వచించిన బాహ్లీకుండును సంధిఁ జేయుట పరమోత్తమ మనిన వైచిత్ర్యవీర్యుండు నిజాత్మజున్మన కి ట్లనియె. 145

తే. నీహితమ్ముఁ గోరి నిమ్మిత్రాఁ డైన బా, హ్లీకభీష్మముఖ్యు లిట్టు లనిరి
వీరివచనములను విని పాండవులతోడ, సంధిఁ జేయు మయ్య చక్కనయ్య. 146

క. విరటునిగోబ్బృందంబున, మఱలుచుటకు ఫల్గునుండు మన పైకిని దా
నరుఁదెంచి యేమి చేసెనొ, యెఱుఁగవె యీకర్ణుఁ డప్పుఁ డేమి యొనర్చెన్. 147

వ. అని సూర్యసూనుం గాంచి యి ట్లనియె. 148

సీ. కృష్ణుఁడు సారథి జిష్ణుండు రథికుడై, భీమసేనాదులు వెంట రాగ
గాండీవసహితుఁడై భండనం బొనరించు, వివ్వచ్చు గెలువంగ నెవ్వరి కగు
నీపలుకులు విని నాపుత్రు లెల్లరు, యుద్ధము చేయ సంసిద్ధు లైరి
రారాజుమరణంబు కోరి యుంటివి నీవె, యనుచుఁ దోఁచుచు నుండె నని వచింప.

తే. నొండు పలుకక యంత మార్తాండసూతి, యస్త్రసన్న్యాస మొనరించె నట్టియెడల
సురనదీనందనుఁడు నవ్వి కురుకుమారుఁ, డైనదుర్యోధనునితోడ ననియె నిట్లు. 149

వ. ఆతం డలిగినందులకు సందియంబు పొందకుము నేను సంగరమ్మున వైరివీర సహస్రాదుల బొలియింతు నాతరువాత రాధేయునిరణమ్ము చూడు మన సుయోధనుండి ట్లనియె. 150

తే. పాండవులె గెల్తు రని మీరు పలుకుచుండ్రి, నిన్ను నాచార్యు బాహ్లీకు నేను నమ్మి
కయ్య మొనరింప నెంచుట కష్ట మగును, గర్ణదుశ్శాసనులు నాకుఁ గలిగియుండ్రి.

వ. వార లుండ నా కొరులేల నాకు విజయలక్ష్మి నిక్కముగాఁ జేరును ధర్మ మైన నధర్మ మైనను సంగ్రామము తప్పదు. 152

క. అనవుఁడు తనయునిపల్కులు, విని దుఃఖానలముతోడ పృథ్వీశుండున్
దనయుని గుఱించి నిగ్గుపుట్టఁగ, పెనుచింత నెంతొ జిగి గిన్నట్టి పృష్ట్వాంతంబున్. 153

—పాండవులు శ్రీకృష్ణుని రాయబారిగాఁ బంపుట—

వ. అంత ధర్మనందనుండు జనార్దనునిహస్తినాపురికి రాయబారిగాఁ బంపఁ దలంచి తమ్ములతో నమ్మహాత్మునిదరి కేగి మ్రొక్కి యి ట్లనియె. 154

సీ. దేవకీనందనా దీనరక్షాపరా,శ్రీకృష్ణ పరమేశ లోకవినుత
మాజన్మమునకును మాకష్టములకును,నిను శరణముఁ జూపి జనవరుండు
పాండుఁడు పోయెను బరమపదమునకుఁ,గష్టము లేమియుఁ గలుఁగకుండఁ
జేయుచు శుభములఁ జేకూర్చి మముఁ బ్రోచు,భారము నీయది నీరజాక్ష
తే. నాదువిన్నపము న్వినుం నలిననాభ,మాకుఁ జేయవలయు నొండు ప్రాకటముగ
నీదయావిశేషమున దామోదరుండ,కయ్యమును మాని సుఖముగ నుండఁ గలము మేము.

వ. అని పలికి శ్రీకృష్ణుని రాయబారిగా హస్తిపురికిఁ బోవ సన్మతిపరచి కౌంతేయా గ్రజుండు మధుసూదనునితో ని ట్లనియె. 156

సీ. అచ్యుతా మాతండ్రి యాంబికేయునియాజ్ఞ,సంజయుఁడు వచించె స్వామి వింటె
వారలయాజ్ఞాప్రకారము దుష్కర,వనవాస మజ్ఞాతవాసవ్రతము
సలిపి వచ్చితి మేము సగము రాజ్యంబును,మాభాగ మగుదాని మా కొసంగరు
దుర్యోధనునియందు దుర్గుణజాలంబు,తండ్రి మాన్పఁగ లేడు ధరణిలోన
తే. సర్వబంధుమిత్రాదులు సంతసింపఁ,గౌరవులు శాంతచిత్తులు గా నొనర్చి
యందఱము నెయ్య మేర్పడ సలరునట్టి,మార్గ మేదియొ యోచింపుమా యనంత.
ఆ. అయిదు పల్లె లిడిన నది చాలు నంటి సు,యోధనుండు దాని కొప్ప డేమొ
వారు మేము గలసి పరఁగుట శ్రేయము,సంపదలకు వారిఁ జంప నేల. 158

సీ. వంశనాశన మాట వల దెన్నఁటికిఁ గూడ,సమరమందు జయాపజయము లెన్న
దైవనిర్మితి గాన ధార్తరాష్ట్రులతోడఁ, బగ యడఁగించుకో నగును మనకు
బగరచే నిర్జింపఁ బడుట చావునకంటె, దారుణంబగుఁ గదే నీరజాక్ష
మాధవా నీ విప్డు మాయందుఁ బక్షపాతము మాని ధర్మము దలఁపవలయు
తే. జాహ్నవీ నందనుఁడు ఘటజన్మ విదుర,ప్రముఖులకు హిత మగునట్లుపలుకవలయు
నెల్లవరితోడఁ బలుక నౌ నట్లు పలికి,సంధిపొసఁగుమార్గము చూడు జలజనాభ. 159

వ. ధృతరాష్ట్ర వాక్యములు దుర్యోధనుండు వినకున్న నంతమాత్ర సంధికాదని తొందర పడియేతెరకు మీవెల్లె ట్లు పలుక వలయు నట్ల ట్లు పలికి మాహృద యతాపము దీర్పుము పోయిరమ్మని యిట్లనియె. 160

ఉ. నీరజనాభ ముందుగనె నిన్నటు పొమ్మని పల్కియుంటి నా

కౌరవు లెల్ల దుర్మతులు గావున నీనుడు లెల్ల విందురో
వారనిచింత గల్గెడిని వారలు కీడు దలంతు రేమొకో
కూరిర సుయోధనుండును ముకుంద మహాత్మ తలంచునో కదా. 161

తే. నలిన నాభ నిన్నటు పంప నాయనంబు, సమ్మతింప కున్నది నిన్ను సంకటముల
పాలొనర్చి నే సమరేంద్ర పదవి నైన, నొల్ల నను ధర్మజునికనె నల్లనయ్య. 162

తే. నన్ను వా రేమి చేయరు నరవరేణ్య, వారు దుర్మార్గులైనను వారివలనఁ
గీడు కల్గదు నాకట్లు కూడెనేని, నన్ను గెల్చువాఁడెచ్చోటనున్న వాఁడె. 163

వ. కావున శంక నీడి నన్నుఁబంపు మని ధర్మజు సమ్మతిలఁ జేసి యిట్లనియె. 164

సీ. ధర్మమందున నుండె ధరణీశ నీమది, వైరంబు విడువదు కౌరవులును
గురుపితామహప్రముఖులు గలరని వాండ్రు, విఱ్ఱవీగుచు నుండ్రు వివిధ గతుల
వారధర్మమునకుఁ బాల్పడి సభలోన, నవమాన మొనరించి రపుడు మీకు
గట్టి కూర్రులఁ జూచి యేరు కోపింప రా, కూరిమి యేల యాకూళ లందు

తే. బంధుభావము త్యజియింప వలయుఁ గాదె, వారు మిమ్మర ణ్యముకుఁ బంపువేళ
నవ్వి యున్నారు వారలా నవ్వుఫలము, శీఘ్ర కాలములోననుఁ జెంద వలయు.

తే. పౌరు లెల్ల రయ్యంధన్నృపాలు నపుడు, దూరి రాపాండురాజపుత్రులు మహాత్ము
లని పరాక్రమశాలురు నమల మూర్తు, లనుచు మిమ్ముల వినుతించి రవనినాథ.

వ. మీరు పరాక్రమశాలురైనను ధర్మపరాయణు లగుటచే ధార్తరాష్ట్రులచేతఁ లకు
సైంచి యుండిరని పలికి 167

తే. పాములను జంపునట్లుగాఁ బాపమతులఁ బట్టివధియింప వలయును బాపమనక
సమరనదిసూనునందు నయ్యాంబికేయు, నందు భక్తిఁ జూపం దగు నిందుకులజ. 168

క. హితులును జుట్టంబులు భూ, పతులును వినుచుండగఁ గురుపతిసభలోనన్
క్షితివర నీధర్మము నీ, యతులితసుగుణంబు లచట నభివర్ణింతున్. 169

తే. నాదుశక్తి వియోగించి నరవరేణ్య, సాధ్య మైనంతవఱకును సంధికొఱకు
సలిపెదను బ్రయత్నంబు నాపలుకు లాసు, యోధనుఁడు వినకుండిన నో మహాత్మ.

వ. అవల సమరము చేకూరు నీకు విజయ మొడ గూర్తు ననిన సమరసన్నాహ మొనర్చు
చుండె నీకృష్ణుం డని తలంచి భీమార్జునులు ముకుళితకరకమలులై భక్తవత్సలుండగు
వాసుదేవున కిట్లనిరి. 171

క. కౌరవులతోడ సమరము, గోరుట లే దెపుడు మేము గోవిందహరీ
వారలు మేమును గూడుక, కూరిమితో నుండు నట్లు కోరిక మాకున్, 172

కురుకులాంగనకిట్టి పరిభవ మగునంత, నోపిక చూచుట యుచితమొకొ!

తే. దుష్కృతాదు లన్నింటికిఁ దొడఁగువారు, ధార్తరాష్ట్రులు సంధికిఁ దగని
వీరు వారల సంధినిఁ గోరు టేల, నాకు యోజించి చెప్పుము నళిననాభ.

వ. అని ద్రౌపది తన శిరోజము లచ్యుతునకుఁ జూపి యిట్లనియె

తే. ధార్తరాష్ట్రుని వ్రేళ్లకుఁ దగిలె నివియె, దుస్ససేనుఁ డీడ్చినదాక తోయజాక్ష
డెంద మానంద మొందదు నందతనయ, నిన్నుఁ బ్రార్థించుచుంటిని నెమ్మనమున.

ఉ. నీవు సుభద్రకంటెఁ గడు నెయ్యముతో ననుఁ జూతు వెప్పుడున్
నీవె మదీయదుఃఖమును నెమ్మిని దీర్చినవాఁడవున్
గావున ధార్తరాష్ట్రులను గయ్యములోఁ బరిమార్పఁ జేసి యో
దేవ భవత్కటాక్షమునఁ దేలిచి మమ్ము ననుగ్రహింపవే. 186

వ. అని కన్నీరు మున్నీరుగా విలపించు కృష్ణ నూరడించి శ్రీకృష్ణుం డా పాండవాంగన
కిట్లనియె. 187

సీ. నీవు దుఃఖింపకు నే నుండ భయమేల, గౌరవుల్ సంధికిఁ గడఁగఁ బోరు
నాసహాయము ధర్మనందను పంపున, భీమార్జునులును సంగ్రామమందు
శత్రుక్షయంబును సలిపి మే ల్గూర్తురు, కౌరవాంగనలశోకములఁ గాంచి
కల కల నవ్వెదు కాలము సుమ్మిది, జయము చేకూరు నీప్రియులకెల్లఁ

తే. గష్టకాలము నీకెల్ల గడచిపోయె, సర్వసౌఖ్యముల్ గలిగెడు సమయ మయ్యె
ముజ్జగంబులఁ గీర్తిని బొంది తీవు, తల్లి నీవింకఁ జింతను దక్కియుండు. 188

వ. నీవు చతుస్సముద్రముద్రిత మహీవలయంబునకుఁ బట్టమహిషి వగుదు వని యామె
నూరార్చి దామోదరుండు సాత్యకీసమేతుండై రథారోహణ మొనర్చి హస్తిపురి కేగె.

శ్రీకృష్ణరాయబారము

క. కరిపురమునకుం గృష్ణుం, డరయఁగ నేతెంచుచుండె నని విని కురుభూ
వరుఁ డా ధృతరాష్ట్రుండును, బరమానందమును బొందెఁ బరికింపంగన్. 190

సీ. పురము శృంగారముఁ బొనరింపఁ జేసెను, విడుదల నేర్పర్చె విశదముగను
హస్తినానగర మయ్యమరేంద్ర పురిబోలెఁ, గడు రమ్యతరమయి గ్రాలుచుండె
రాజీవనేత్రుని రాక సూచించుచు, మంగళవాద్యముల్ మఱియుఁ జెలఁగె
మురమర్దనుఁడు గరిపురమున కేతెంచె, సాత్యకి ముఖమిత్ర సహితుఁ డగుచు.

తే. కురుకుమారశతంబును గుంభసంభ, వుండు మందాకినీనందనుండు విదురుఁ
డెల్ల రయ్యాదవేంద్రున కెదురుపోయి, నగరునకుఁ దోడితెచ్చి రానందసుతుని. 191

తే. కౌరవకులక్షయమునకుఁ గారణంబు, దుష్టుఁడగు సుయోధనుఁ డని దూఱు చుందు
రతని కావాడుఁ బోఁగొట్టి యబ్జనాభ, సంధికొఱకుఁ బ్రియత్నము సల్పుమయ్య
వ. అనిన వాయునందనునకు దేవకీనందనుం డిట్లనియె. 174

తే. ఎడ్డ పిరికితనంబు వహింప కీవు, సంధి చేయు మటంచు నీసమయమందు
పలికినా వేమియో భీమ భండనంబు, నకుఁ బలెనే మొ యని భీతిఁ గలిగె నీకు.

వ. అని పరిహాసమొనర్చిన వాసుదేవునకు వృకోదరుం డిట్లనియె. 176

ఉ. పోరు నొనర్పఁగా భయము బొంది వచింపఁగ లేదు నిక్కమా
కౌరవవంశనాశనము గాఁ గలదంచు వచించినాఁడ నా
పౌరుష మీవెఱింగి యిటుపల్కుట పాడియె మూఁడు లోకముల్
పోరిన గెల్వఁగాఁ దగినపోటరి నౌదును నందనందనా. 177

వ. వాయునందనుని వాక్యములకు దేవకీనందనుం డమందానందకందళితహృదయార విందుం డై నంత పాంచాలనందను లావసు దేవనందనున కిట్లనిరి. 178

ఉ. ధారుణినాయకుం డయినధర్మతనూజుఁడు వాని తమ్ములున్
గోరిరి సంధికార్యమును గోరిరి వారలతోడ నెయ్యమున్
వారలతోడిసఖ్య మది పాములతో నొనరించునట్టిదే
వారిజ నాభ నీవిఁకను భండనముం బొనరింపఁ జేయుమా. 179

ఆ. కురుసభాస్థలమునఁ బరమపతివ్రతన్, బట్టి వలువలూడ్చు పాపమతులఁ
దగిన శిక్షఁ జేయఁ దలఁపక వీరలు, సంధి కోరినారు జలజనాభ. 180

వ. దేవా! సకలలోకేశ్వరుండ వగు నీ వెఱుంగని దేమియు లేదు నీసమ్మతి మెట్లో యట్లే చేయుము దుర్యోధనుండు తమ్ములతోఁ గూలినప్పుడు కాని మనశ్శాంతిఁబొందఁ జాల మనఁ బాంచాల రాజతనయ పాంచజన్యధరుం గాంచి సమీపించి చేతులు జోడించి యిట్లనియె. 181

శా. శ్రీనారాయణ లోకపూజిత ప్రభూ శ్రీవాసు దేవా హరీ
దీనత్రాణపరాయణా మురహరా దేవా జగన్నాయకా
నానాధుల్ సతులట్లు పల్కుదురు హా న్యాయం బి దెట్లయ్యెఁబో
యానాఁడా సభలోఁ బరాభవము నీవాలింపవే కేశవా. 182

సీ. కురుసభామధ్య నెల్లరుఁ జూచుచుండంగ, దుశ్శాసనుఁడు మహాదుశ్చరితుఁడు
తలఁబట్టియీడ్చి నావలువలనొలిచెను, భీమార్జునులు జగద్వీరు లయ్యు
చిత్రప్రతిమలట్లు చూచుచు నుండ్రి, వారింప నేరరి యెవ్వారు వాని

కురుకులాంగనకిట్టి పరిభవ మగుచుండ, నూఱక చూచుట యుచితమొకొ?
తే. దుష్కృతాదు లన్నింటికిఁదొడఁగు వారు, ధార్తరాష్ట్రులు సంధికిఁ దగని
వీరు వారల సంధినిఁ గోరు టేల, నాకుయోజించి చెప్పుము నళిననాభ.
వ. అని ద్రౌపది తన శిరోజము లచ్యుతునకుఁ జూపి యిట్లనియె
తే. ధార్తరాష్ట్రుని వ్రేళ్ళకుఁ దగిలె నివియె, దుస్ససేనుఁ డీడ్చినదాక తోయజాక్ష
డెంద మానంద మొందదు నందతనయ, నిన్నుఁ బ్రార్థించుచుంటిని నెమ్మనమున.
ఉ. నీవు సుభద్రకంటెఁ గడునెయ్యముతో ననుఁ జూతు వెప్పుడున్
నీవె మదీయదుఃఖమును నెమ్మిని దీర్చివైచు వాఁడవున్
గావున ధార్తరాష్ట్రులను గయ్యములోఁ బరిమార్పఁ జేసి యో
దేవ భవత్కటాక్షమునఁ దేలిచి మమ్ము ననుగ్రహింపవే. 186
వ. అని కన్నీరు మున్నీరుగా విలపించు కృష్ణ నూఱడించి శ్రీకృష్ణుం డాపాండవాంగన
కిట్లనియె. 187
సీ. నీవు దుఃఖింపకు నే నుండ భయమేల, కౌరవుల్ సంధికిఁ గడఁగఁ బోరు
నాసహాయముధర్మనందను ఁపంపున, భీమార్జునులును సంగ్రామమందు
శత్రుక్షయంబును సలిపి మే ల్గూర్తురు, కౌరవాంగనలశోకములఁ గాంచి
కల కల నవ్వెదు కాలము సుమ్మిది, జయము చేకూరు నీప్రియులకెల్లఁ
తే. గష్ట కాలము నీకెల్ల గడచిపోయె, సర్వ సౌఖ్యముల్ గలిగెడు సమయ మయ్యె
ముజ్జగంబులఁ గీర్తిని బొందితీవు, తల్లి నీవింకఁ జింతను దక్కియుండు. 188
వ. నీవుచతుస్సముద్రముద్రిత మహీవలయంబునకుఁ బట్టమహిషి వగుదు వని యామె
నూఱార్చి దామోదరుండు సాత్యకిసమేతుండై రథారోహణ మొనర్చి హస్తిపురికేగె.

శ్రీకృష్ణరాయబారము

క. కరిపురమునకుం గృష్ణుం, డరయఁగ నేతెంచుచుండె నని విని కురుభూ
వరుఁ డాధృతరాష్ట్రుఁడును, బరమానందమును బొందెఁ బరికింపంగన్. 190
సీ. పురము శృంగారముఁ బొనరింపఁజేసెను, విదురుడనేర్పర్చె విశదముగను
హస్తినానగర మయ్యమరేంద్ర పురిబోలెఁ, గడురమ్యతరమయి గ్రాలు చుండె
రాజీవనేత్రుని రాక సూచించుచు, మంగళవాద్యముల్ మఱియుఁ జెలఁగె
మురమర్దనుఁడు గరిపురమున కేతెంచె, సాత్యకి ముఖమిత్ర సహితుఁ డగుచు.
తే. కురుకుమారశతంబును గుంభసంభ, వుండు మందాకినీనందనుండు విదురుఁ
డెల్ల రయ్యాదవేంద్రున కెదురుపోయి, నగరునకుఁ దోడితెచ్చి రానందసుతుని. 191

రాష్ట్రుని మందిరమునఁ గృష్ణుండు కుశలవాక్యముతోఁ గొంత ప్రొద్దు పుచ్చి కౌరవకులధురునిసదనంబున కేగి నంతఁ గుంతీదేవి యప్పరమేశుం గాంచి యపారసంతోష రతనికాశగర నిమగ్నయై యాకృష్ణుం గౌఁగిలించుకొని పాండవుల వనవాసాదులం దలఁచి ఆనిస కేఖించి యి ట్లనియె. 192

ఎత్తి. కుత్రికాంతసుతులఁ గాంచిన దానికిఁ, జేయఁదగిన సమయ మాయె నిప్పు డ ట్లొనర్ప లేని యపని జనులు మిమ్ముఁ, బురుషు లనఁగఁ బోరు పుత్రులార. 193

వ. అని నామాటగా భీమార్జునుల కెఱింగింపు మన శ్రీకృష్ణుం డామె నూఱడించి యి ట్లనియె. 194

తే. అతివ చింతలఁ బోకు నీసుతులు వారు, సౌఖ్యమొందెదు కాల మాసన్నమయ్యె నని పృథాదేవి వీడ్కొని యచ్యుతుండు, చనియె నంత దుర్యోధను సౌధమునకు.

వ. సుయోధనుం డాతని నతిగౌరవంబునఁ దన మందిరమునకుఁ గొంపోయి రత్నపీఠ మున నాసీనుం జేసి విం దారగింపు మని కోరిన నిందగాసుందరుం డి ట్లనియె. 196

సీ. పగవారి యింటిలోపలను భుజించిన, నమ్మాతతుల్యంబగు సట్టి దైన హాలాహలం బస యనుమాన మగును నాప్రాణసమానులు పాండుసుతులు వారికి మీకును వైర మున్నది కదా, పాండవ దూతనై వచ్చినాఁడ కార్యము సంసిద్ధి కలిగిన మీఁదట, మర్యాద లొనరింప మంచి దగును

తే. విదురునింట భోజనము సంప్రీతికరము, నందియం బందఁ బోకు నీస్వాంతమందు ననుచు నాతని యనుమతి వనభజనాభుఁ, డరిగె సంతటఁ విదురు మందిరమునకును.

ఉ. యదుపతి యేఁగుదెంచె నని యాత్మను సంతస ముప్పతిల్ల న వ్విదురుఁడు భక్తితోడ సరవింద దళాక్షునిఁ బూజ సల్పియుఁ సదమలశాకపాకముల శౌరికి విందు నొనర్చె నయ్యెడన్ బొదలెడు కమ్మతావులను బొల్పగు వీడెము సేయ నిచ్చెసన్. 198

క. విదురుఁ డొనర్చు సపర్యకు, మదిలో సంతోష మొంది మధుసూదనుఁ డా విదురుని వినుతి యొనర్చెను, యదువంశ్యుఁడు లోకనాథుఁ డతఁ డవ్వేళన్. 199

వ. అనంతర మయ్యనంతుండు హంసతూలికాతల్పమున రమ్యశయ్యపై శయనించిన విదురుం డాతని పాదారవింద సమీపమున నాసీనుండై యి ట్లనియె. 200

సీ. శ్రీకృష్ణ పరమేశ లోకైకరక్షకా, పాండవపక్ష యోవాసుదేవ సంధి చేయుటకును సమ్మతింపఁగఁ బోఁడు దుర్యోధనుఁ డితండు తోయజాక్ష

కౌరవపక్షముగా నరుదెంచిన,సేనఁ గాంచి యితండు చిత్తమందు
నానందవారిధి నలరారు చున్నాఁడు,కర్ణుఁడు జయమును గల్గఁజేయు
ననుచుధైర్యముతో నుండె నాత్మ లోన నీవు మహనీయమూర్తివై దేవదేవ
చపలులను సంధిఁ గోరఁగా నిపుడు వచ్చి,నాఁడ వాశ్చర్య మాయెను నందతనయ
తే. వారు నీకుఁ గీడొనరింపఁ గోరువార్లు,వారిదరికి నీ వింకఁ బోవల దటంచు
నేను నినుఁ గోరుచుంటిని నీరజాక్ష,యనుఁడు శ్రీకృష్ణుఁ డతనితో ననియె నిట్లు.2
సీ. ధృతరాష్ట్రనందనుం డతిపాపకర్ముండు,సంధి చేయుఁ డటంచు సరవి నెఱిఁగి
వచ్చితిఁ గౌరవుల్ పాండవుల్ సము లగు,బందుగులే నాకు వార లెల్లఁ
గూరిమితో నుంటఁ గోరి యేతెంచితి,నిప్పు డీకార్యము నొప్పు మీఱ
నే వహింపక యున్న నెల్ల రి ట్లందురు,కౌరవపాండవుల్ పోరు చుండ
తే. నూరకుండెఁ గృష్ణుఁడటంచు దూఱఁ గలరు,కాన ని ట్లేగుదెంచితిఁ గత మెఱింగి
శక్తి నెల్ల ధారనుబోసి సంధికొఱకు.నేఁ బ్రయత్న మొనర్చెద నెంతయేని.
వ. కౌరవులు దీని కొడఁబడకున్న వా రచిరకాలములోనే ఫలం బనుభవింతు రన
రుండు సంతసించి కృష్ణానుమతి నిదురింపఁ బోయె నవ్యాసుదేవుండును నిద్రించె
ఉ. అంతఁ బ్రభాతకాలమున యాదవభూషణుఁ డైన రుక్మిణీ
కాంతుఁడు కాల్యకృత్యములు గ్రక్కునఁ దీర్చి యాంబికేయున
భ్యంతరమందిరంబునకు నప్పుడు సాత్యకితోడఁ బోవ భూ
కాంతుఁడు గౌరవించి నను గంజదళేక్షణుఁ డప్పు డిట్లనున్.
క. కురువంశశేఖరా విను,ధరలో నీ వెఱుఁగనట్టిధర్మము లున్నే
భరతకులాభ్యుదయంబున్, బరగెడు నీమేలుఁ గోరి వచ్చితి నిటకున్.
క. ధృతరాష్ట్రభూవరా నీ,సుతులును బాండువసుధేశసుతులుం గూర్మిన్
సతముఁ గలసి యుంటకు నేహిత ముపదేశింప నైతి నిచ్చటి కనఘా.
తే. క్షీరనీరములట్లుగా వారు మీరు, కలసి యుండిన క్షేమ మ్మాఁ గౌరవేంద్ర
పాండుసుతు లితరులవంటి వారు కారు,భరతవంశవిభూషణుల్ వార లధిప.
తే. సత్యధర్మగుణములక్ష్మ శాంతమునకు, భరతవంశముతో సాటివచ్చుకులము
భూతలమ్మున లే దని ఖ్యాతిఁ గాంచె, నిప్పు డాకీర్తి పోడనాడఁ నెంచఁబోకు.
సీ. ఈవంశమునకును నీ వాలవాలమ,యిట్టియెడల నిందు నెవ్వరేని
మంచిచెడ్డల నాచరించిన నయ్యది, నీతలపైఁ బడు భూతలేశ
కౌరవపాండవుల్ గలసి యుండిరయేని, జననుతిపాత్రు లై తనరుచుండు

రాల మొనర్చుట కాయితం బగునెన, నాపదల్ గలుఁగు మీాయుందఱకును

ఆ. నీవు నిశ్చయముగ నేకార్య మైనను,జేయఁ దలఁచినట్లు చేయఁ గలవు
భండనంబునందు బంధుక్షయముకన్న, సంధి చేయ మేలు జనవరేణ్య. 210

ఉ. కౌరవు లెల్లఁ జచ్చినను గల్గును దుఃఖము నీకుఁ బాండవుల్
బోరునఁ గూల దుఃఖమును బొందఁ గలాఁడవు గాన నియ్యెడన్
వారలరాజ్యభాగమును వారల కీయుము వార లెల్ల నిన్
జేరి భజించి యుండుటకుఁ జిత్తము నిల్పిరి కౌరవేశ్వరా. 211

తే. పాండవులతండ్రి మరణించుపట్ల వారిఁ,గన్న బిడ్డలకన్నను మిన్న గాఁగఁ
బెంచి విద్యాదు లెల్లఁ జెప్పించినావు,విష్ణుఁ డిట్లు పేర్కొంచు టచేల రాజ. 212

తే. సమరమున రెండుతెగలును జచ్చుకంటె,వారిరాజ్యభాగంబును వారి కొసఁగి
క్షీరనీరములట్లు గా వారు మీారు,కలసిమెలసి సుఖంపుఁడు కౌరవేంద్ర. 213

వ. మీావలన నెన్నిపాట్లు పడినను వారు నీచరణసామీాప్యమున నివసింపఁ దలంచిరి వారిపాలు వారి కొసఁగవేని తప్పక సమరమున కేతెంతు రందు వారికే విజయము సిద్ధాంత మనుకృష్ణునకు ధృతరాష్ట్రుం డిట్లనియె. 214

సీ. నీతిదాయక మగునీదువాక్యంబుల,నేకాగ్రబుద్ధితో నేను వింటి
నీవచించినరీతి నేఁ జేయ నైతిని, జింతించుచుంటి నాస్వాంతమందు
నానందనుండును నే నెన్ని చెప్పిన, వినకుండె నోయరవిందనాభ
సంధి యనంగ నసహ్య మొందుచు నుండె,వానియెదుట నేను బలుకఁ జాల

తె. నీవు కరుణతో వానికి నీతిఁ దెలిపి, భరతవంశము సాఁకుము సరసిజాక్ష
యనిన ధృతరాష్ట్రువాక్యముల్ వినిమహాత్ముఁ,డైనహరిసుయోధనునితో ననియెనిట్లు.

తే. మూఁడులోకములందునఁ బూజ లొందు,భరతవంశమందుజనించువాఁడ వైతి
నీదురాగ్రహ మిందు నీ కేలఁ గలిఁగె,నిరుదెగలమేలుఁ గోరుచు నే వచింతు. 216

[illegible] కావున నావాక్యములు సావధానచిత్తమ్మున నాలకింపుము. 217

తే. పాండవులు నీకు భ్రాతలు వారు నీకు, కీడు సేయఁ దలంపరు కోడెకాఁడ
యట్టివారి నిర్మూలనరింప న్యాయ మగునె, వారు మీాయుఁగలసియుండవలయు నెపుడు.

[illegible] పాలును నీరు పోలికను వారలు మీారును నున్న సర్వభూ
పాలురు మీాకు దాసు లయి వర్తిలుచుందురు పాండవేయులన్
జాలమునం దెదుర్కొనఁగ నన్యులశక్యము గాదు గావు నీ
[illegible] గోరుచుంటి నిది మేదినినొక్క నమ్మతింపవే. 21[illegible]

తే. నీకతంబువలనను ననేకజనులు,నాశనంబును బొందుట న్యాయ మటవె
శాంతనవముఖ్యు లెల్లరు సంధి సేయు,నలయు నని పల్కుచుండిరి తెలియ వింటె.

చ. జనవర పాపకార్యమును సల్పఁగ బోకుము ధర్మ మెంచు నీ
జనకుఁడు చెప్పినట్లుగను సల్పఁగ నుండుము పాండురాజనం
దను లెడ భ్రాతృభావమున దద్దయు సంధి నొనర్చి సౌఖ్యముల్
గను మనువాసుదేవునకుఁ గౌరవనాథుఁడు పల్కె నక్కతోన్. 221

క. గురుభీష్మాదులు నన్నున్, నిరతంబును దూరుచుందురి నీవును నట్లే
పరుషములఁ బల్కుచుంటివె, యరయవు నిజమైనవృత్త మంబుజనాభా. 222

సీ. వననివాసమునకుఁ బంపితి మని కిన్క,వారలే మముఁ జూప వచ్చుచుండ్రు
ధర్మసూనుఁడు మహోత్సాహముతోడను,సుబలాత్మజునితోడ జూవ మాడె
నుర్వీరాజ్యాదుల నోడిపోవఁగ మేము,గరుణ నిచ్చితిమి మాపరమలక్ష్మి
మరల రెండవసారి మఱి జూదమున నోడి,ద్వాదశాబ్దంబులు వనమునందు

తే. నొక్కయేఁట నజ్ఞాతము నొనర సలుప,నలయు నన సమ్మతము బొంది వార లెల్ల
విధివశంబునఁ బోయిరి విపినములకు,నిందు నాదుత ప్పేమున్న దిందిరేశ. 223

ఉ. క్షత్రియవంశమందునను జన్మము నొంది పరాక్రమంబునన్
ధాత్రినిఁ బ్రోవుచుంటి నెటు ధర్మపథంబున నున్నవాఁడ లో
కత్రయ మేలునాకిపుదు కయ్య మనంగను భీతి కల్గునా
శత్రుల నాజిలోఁ దునిమి సర్వమహీతల మేన యేలుదున్. 224

తే. పాండవులశౌర్యమునకును భయముఁ బొంది,సంధి కిచ్చగింపను నేను సమరమందు
శత్రువుల నెల్ల గెలిచెద శౌర్య మలర, నట్లు కాదేని స్వర్గమం దలరువాఁడ. 225

వ. రిపుల నోర్చి సర్వసర్వంసహాపట్టభద్రుండనై నిరంకుశముగా రాజ్య మేలుదు లేకున్న వీరస్వర్గ మలంకరింతు ననుదుర్యోధనునివాక్యముల కాగ్రహపడి వనజాక్షుండు సభ్యుల కిట్లనియె. 226

క. కులనాశముఁ దనవలనన్,గలుఁగు నేనుచుఁ దలఁపకుండఁ గయ్య మొనర్పన్
దలఁచెడు నీదుష్టాత్మునిఁ,గులనాశకు విడుచు నెడలఁ గులవృద్ధి యగున్. 227

తే. దాన దోస మింతైనను గాని లేదు,నీచుఁ డగు కంసుని వధించి నేను మున్ను
శత్రుకులంబు రక్షించితి దాని నెల్ల,నెఱిఁగియుంటిరి నేఁ జెప్ప నేల [illegible] 228

వ. అంత విచిత్రవీర్యాత్మజుండు గాంధారిని రావించి దుర్యోధనునకు హితంబుఁ జెప్పఁ బిలిపించిన నామె చెప్పిన నెల్లవిన్నయెడ్డ.

రాల మొనర్చుట కాయితం బగునెడ, నాపదల్ గలుఁగు మీాయందఱకును
ఆ. నీవు నిశ్చయముగ నేకార్య మైనను,జేయఁ దలఁచినట్లు చేయఁ గలవు
భండనంబునందు బంధుక్షయముకన్న, సంధి చేయ మేలు జనవరేణ్య. 210
ఉ. కౌరవు లెల్లఁ జచ్చినను గల్గును దుఃఖము నీకుఁ బాండవుల్
బోరునఁ గూల దుఃఖమును బొందఁ గలాఁడవు గాన నియ్యెడన్
వారలరాజ్యభాగమును వారల కీయుము వార లెల్ల నిన్
జేరి భజించి యుండుటకుఁ జిత్తము నిల్పిరి కౌరవేశ్వరా. 211
తే. పాండవులతండ్రి మరణించుపట్ల వారిఁ,గన్న బిడ్డలకన్నను మిన్నగాఁగఁ
బెంచి విద్యాదు లెల్లఁ జెప్పించినావె,విప్పుడీ ట్లుపేక్షించు టదేల రాజ. 212
తే. సమరమున రెండుతెగలును జచ్చుకంటె,వారిరాజ్యభాగంబును వారి కొసఁగి
క్షీరనీరములట్లుగా వారు మీారు,కలసిమెలసి సుఖంపుఁడు కౌరవేంద్ర. 213
వ. మీావలన నెన్నిపాట్లు పడినను వారు నీచరణసామీాప్యమున నివసింపఁ దలంచిరి వారిపాలు వారి కొసఁగవేని తప్పక సమరమున కేతెంతు రందు వారికి విజయము సిద్ధాంత మనుకృష్ణునకు ధృతరాష్ట్రుం డి ట్లనియె. 214
సీ. నీతిదాయక మగునీదువాక్యంబుల,నేకాగ్రబుద్ధితో నేను వింటి
నీవచించినరీతి నేఁ జేయ నైతిని, జింతించుచుంటి నాస్వాంతమందు
నానందనుండును నే నెన్ని చెప్పిన, వినకుండె నోయరవిందనాభ
సంధి యనంగ నసహ్య మొందుచు నుండె,వానియెదుట నేను బలుకఁ జాల
తే. నీవు కరుణతో వానికి నీతిఁ దెలిపి, భరతవంశము సాఁకుము సరసిజాక్ష
యనిన ధృతరాష్ట్రువాక్యముల్ వినిమహాత్ముఁ,డైనహరిసుయోధనునితోనని మెనిట్లు.
తే. మూఁడులోకములందునఁ బూజ లొందు,భరతవంశమందుజనించువాఁడ వైతి
వీదురాగ్రహ మిందు నీ కేలఁ గలిఁగె,నిరుదెగలమేలుఁ గోరుచు నే వచింతు. 216
క. కావున నావాక్యములు సావధానచిత్తమ్మున నాలకింపుము. 217
తే. పాండవులు నీకు భ్రాతలు వారు నీకు, కీడు సేయఁ దలంపరు కోడకాఁడ
యట్టివారి ని ట్లొనరింప న్యాయ మగునె, వారు మీారుఁగలసియుండవలయు నెపుడు.
ఉ. పాలును నీరు పోలికను వారలు మీారును నున్న సర్వభూ
పాలురు మీాకు దాసు లయి వర్తిలు చుందురు పాండవేయులన్
ఆలమునం దెదుర్కొనఁగ నన్యులశక్యము గాదు గాన నీ
మేలును గోరుచుంటి నిది మేదినినోయుక నిక్కమింపవే. 21

తే. నీకతంబువలనను ననేకజనులు,నాశనంబును బొందుట న్యాయ మటవె
శాంతనవముఖ్యు లెల్లరు సంధి సేయు,మలయు మని పల్కుచుండిరి తెలియ వింటె.

చ. జనవర పాపకార్యమును సల్పఁగ బోకుము ధర్మ మెంచు నీ
జనకుఁడు చెప్పినట్లుగను సల్పఁగ నుండుము పాండురాజనం
దనులెడ భ్రాతృభావమున దద్దయు సంధి నొనర్చి సౌఖ్యముల్
గను మనువాసుదేవునకుఁ గౌరవనాథుఁడు పల్కె నుగ్రతన్. 221

క. గురుభీష్మాదులు నన్నున్, నిరతంబును దూఱుచుందు రీవును నట్లే
పరుషములఁ బల్కుచుంటివ, యరయవు నిజమైనవృత్త మంబుజనాభా. 222

సీ. వనివాసమునకుఁ బంపితి మని కిన్క,వార లే మనుఁ జూప వచ్చుచుండ్రు
ధర్మసూనుఁడు మహోత్సాహముతోడనుసుబలాత్మజునితోడ జూద మాడె
నుర్వీరాజ్యాదుల నోడిపోవఁగ మేము,గరుణ నిచ్చితిమి మాపరమలక్ష్మి
మరల రెండవసారి మఱి జూదమున నోడి,ద్వాదశాబ్దంబులు వనమునందు

తే. నొక్కయేట నజ్ఞాతము నొనర సలుప,వలయు నన సమ్మతము బొంది వార లెల్ల
విధివశంబునఁ బోయిరి విపినములకు,నిందు నాదుత ప్పేమున్న దిందిరేశ. 223

ఉ. క్షత్త్రియవంశమందునను జన్మము నొంది పరాక్రమంబునన్
ధాత్రినిఁ బ్రోవుచుంటి నెటు ధర్మపథంబున నున్నవాఁడ లో
కత్త్రయ మేలునాకిపుడు కయ్య మనంగను భీతి కల్గునా
శత్రుల నాజిలోఁ దునిమి సర్వమహీతల మేన యేలుదున్. 224

తే. పాండవులశౌర్యమునకును భయముఁ బొంది,సంధి కిచ్ఛగింపను నేను సమరమందు
శత్రువుల నెల్ల గెలిచెద శౌర్య మలర, నట్లు కాదేని స్వర్గమం దలరువాఁడ. 225

వ. రిపుల నోర్చి సర్వసర్వంసహాపట్టభద్రుండనై నిరంకుశముగా రాజ్య మేలుదు లేదేని వీరస్వర్గ మలంకరింతు ననుదుర్యోధనునివాక్యముల కాగ్రహపడి వనజాక్షుఁడు సభ్యుల కి ట్లనియె. 226

క. కులనాశముఁ దనవలనన్,గలుఁగు ననుచుఁ దలఁపకుండఁ గయ్య మొనర్పన్
దలఁచెదు నీదుష్టాత్ముని,గులనాశకు విడుచు నెడలఁ గులవృద్ధి యగున్. 227

తే. దాన దోస మింతైనను గాని లేదు,నీచుఁ డగు కంసుని వధించి నేను మున్ను
దత్కులంబు రక్షించితి దాని నెల్ల,నెఱిఁగియుంటిరి నేఁ జెప్ప నేల నింక. 228

వ. అంత విచిత్రవీర్యాత్మజుండు గాంధారిని రావించి దుర్యోధనునకు హితంబుఁ జెప్పఁ బుత్తెంచిన నామె చెప్పిన నెల్లవమ్మయ్యె. 229

సీ. దుర్యోధనుం డంత దుశ్శాసనాదులఁ దోడ సభాస్థలి వెడలి పోయి
వసుదేవతనయుని బంధించునెడలను, గోరెను నీచ క్రూరసర్ప
ములు వోలెఁ బాండుపుత్రులు చిక్కఁగల రని, తలపోయుచుండిరి ఖలులు నారు
సాత్యకి యారహస్యంబుల గ్రహియించి, వాకిట సైన్యముఁ బదిలపఱచి
తే. ధార్తరాష్ట్రప్రయత్నము చైత్యభంజ, నునకు భీష్మాదులకు నెల్ల వినఁగఁ దెలిపె
నాంబికేయుఁడు భయమున నాత్మజన్ము, నటకు రావించి దూషించె నధికముగను.
వ. అంత శ్రీకృష్ణుండు గేలిసేయుచు దుర్యోధనున కిట్లనియె. 231

—శ్రీకృష్ణుని విశ్వరూపము సాక్షాత్కరించుట—

తే. నేన యొక్కరుఁ డనుకొని నీవు నేఁడు, నన్ను బంధింపఁగా నెంచి యున్నవాఁడ
వరయు మి ట్లెంద ఱుండిరో యరయుమనుచు, విశ్వరూపముచూపించెవిశ్వమయుఁడు.
తే. కురుపితామహముఖ్యులు పరమపురుషు, విశ్వరూపము గనుఁగొని వినుతిఁ జేసె
సంతసంబున మునిఁగిరి సభ్యు లెల్ల, మూర్ఛఁ గనిరి గాంధారేయముఖ్యు లెల్ల. 233
మ. భగవంతుం డగు దేవకీసుతునివిశ్వాకారముం జూడఁ గాఁ
దగుఁ బుణ్యం బొనరించినట్టిఘను లాధన్యాత్ము లైనట్టియా
పగసూనుండును ద్రోణుఁడున్ విదురుఁడున్ వారల్ మహాపావనుల్
జగదాధారునిఁ జూడఁగా నొరులకున్ శక్యంబె ధాత్రీస్థలిన్. 234
క. ఆకలకలము న్విని పృథ్వీకాంతుఁడు విదురుఁ బిల్చి విదురుఁడ చెపుమా
యీకలకల మే మనవుడు, శ్రీకృష్ణునివిశ్వరూపచిత్రం బని యెన్. 235
వ. విశ్వేశ్వరుండు విశ్వరూపముఁ జూపించుచుండె నని విని యాంబికేయుండు ముకుళిత
కరకమలుండై జగదీశ్వరు నిట్లు ప్రస్తుతించె. 236
సీ. ఓజగద్రక్షక రాజీవలోచన, నాయందు దయఁ బూని నళిననాభ
నీవిశ్వరూపము నేఁ జూడఁగా నాకు, లోచనముల్ లొసంగు లోకనాథ
యని వేఁడుకొనుటయు వనజోదరుఁడు దివ్య, దృష్టి ప్రసాదించెఁ దేజ మలర
విశ్వరూపంబును వీక్షించి ధృతరాష్ట్రుఁ, డతిభక్తితోఁ గొనియాడి పలికె
తే. దేవ నీరూపుఁ జూచినదృష్టితోడ, నీచలోకముఁ జూడంగ నేను గోరఁ
గన్ను లెప్పటియట్లుగాఁ గ్రాల వలయు, నని న హరిమాయఁ గను లెప్పటట్టులయ్యె.
తే. విశ్వరూపము హరియించి శాశ్వతుండు, యాంబికేయునాసతిఁ గొని యాపగాత
నూజముఖ్యులు దనుఁ గొల్వఁ దేజ మలరఁ, బోయెఁ గుంతీగృహమునకు శ్రేయముగను.
అంతఁ బుండరీకాక్షుండు కుంతికి నమస్కరించి కౌరవసభావిశేషములఁ దెల్పిన

నాయమ్మ తనపుత్రులకుఁ జెప్పఁ బాండవేయులుఁ దెలిసినంత శ్రీహరి కుంతియను మతినిఁ బాండవులసన్నిధి కేఁగను సాగనంప వచ్చినభీష్మద్రోణవిదురాదుల వెనుకకుఁ బో నియోగించి హస్తినాపురిను జనతోఁ గొంతదూరను రా నియోగించి తనయరథం బెక్కించుకొని రహస్యంబున రాధేయునితో మాధవుం డిట్లనియె. 239

—కృష్ణుఁడు కర్ణునకు హితోపదేశము చేయుట—

ఉ. భానునిదివ్యమంత్రమునఁ బావనమూర్తివి నీవు కుంతికిన్
సూనుఁడవై జనించితివి సూతసుతుండవు గావు పాండురా
జ్సూనులలోఁ బ్రధానుఁడవు సోదరులుం గనఁ గూడ రాఁగ దే
నేను ధరాతలంబునకు నిన్నొనరించెద సార్వభౌముఁ గాన్. 240

తే. చక్రవర్తి వీ వగుదువు సంతసమున ధర్మరాజాదిసోదరుల్ నిర్మలమున
నిన్ను సేవింత్రు పాంచాలి నిశ్చయముగఁ బరిణయంబగు నిన్నార్వపతినిఁ గాఁగ. 24

వ. అనిన శ్రీధరునకు రాధేయుం డిట్లు ప్రత్యుత్తర మిచ్చె. 242

సీ. నే నిది మున్నింటి నిఖిలలోకేశ్వర, కుంతీమహాదేవి కొలనుదరిని
నను గని నీటిలోనను విడనాడెను, సూతునకు దొరకి సూతపత్ని
పాలు ద్రావించి వాడఁ బనినాఁడు కాని, సూతునకే నేను సుతుఁడ నంద్రు
నరగ నే నిప్పుడు చక్రవర్తి నయిన, లోకులు నవ్వరా లోకనాథ

తే. అధిరథాదులు నను బెంచి రట్టివారి, ఋణము నే నెట్లు దీర్తును వనజనాభ
సూతుఁ డనిన న్నసూయతోఁ జూడకుండెఁ, నమ్మనటుచూచెనీసుయోధనుఁడునన్ను

తే. నన్ను నమ్మి యతఁ డనికి సమ్మతించెఁ, గర్ణుఁ డర్జును గెల్చెడుగాక యనుచు
నట్లు నను నమ్మి యుండినయతని విడిచి, నేను వచ్చుట ధర్మమా నీరజాక్ష. 244

సీ. దేవధర్మసుతుండు దీక్షితుం డై యొప్ప, సోమకనందన సోమిదమ్మ
నలుగురుసోదరుల్ చెలఁగ ఋత్విజులును, నీ వుపద్రష్టవై నెఱపు చుండఁ
గురుకుమారశతంబుగూడ పశువులు గాఁగ, యజ్ఞము నెఱపేము యాదవేంద్ర
దాన నత్యతిపవిత్రం బగునీకురు, క్షేత్రమునందునఁ జివ్వ నలిపి

తే. నన్నుఁ బోలువా రెందఱో నాకమునకు, నరుఁగువారలు శ్రీకృష్ణ పరమపురుష
నాదుహితము గోరి పచించువాఁడ వీవ, యట్లుచేయనైతి విచార మయ్యెనాకు. 245

వ. అయ్యవరంబున. 246

తే. మాఱు పల్కంగలేకను మాధవుండు, భానుసుతునకు సెల విచ్చి పంపి వైచె

గూర్చుండఁబెట్టె నయ్యవసరమ్మున లోకశాంతనవపుత్రుఁ గ్రుంకిన నెల్లను సమర మాపి
రంత నజాతశత్రుండు దేవకీపుత్రుని గనలోకించి యిట్లనియె 152

. దూదిపై నగ్ని పడినట్లు తోయజాక్ష, శాంతనవుఁడు రౌద్రావేశ హితుండగుచు
మన బలమున ననేకుల నణఁగించె, నెవ్వనేయుదు దేవ నాకేది తెలుపు. 153

. నాకై వచ్చినవారలు, భూకాంతులు శాంతనవుని భుజబలమునఁ జీ
బోకారనేల కృష్ణా!, లోకేశ్వర తెలుపుమయ్య లోకారాధ్యా. 154

• యుద్ధమునమాని కాంతారములకేగుదును ధర్మనందనునకు నందనందను
డి ట్లనియె. 155

. ధర్మనందన నిరంతరసత్యవ్రతమున, నలరారుచుండెదు నలఘుఁ డీవు
విపులజనపదంబు విఖ్యాతిగాంచిన, ధర్మమూర్తివి నీవు ధారుణీశ
బాహుబలాదిసంపన్నుఁడవగు నీకు, రాజ్యము గూర్చ భారంబునాది
చింతఁబోనాడు నీస్వాంతమునందున, నాభుజంబులనునుంచినాఁడ బరువు
. తెగువతో ధనంజయుండు జోరగకయున్న, శాంతనవుని నేనువధింతు సమరమందు
మీకుఁ గోసియిచ్చెదను నామేనినైన, దీనికిని వగవకు నీవు మానవేంద్ర. 156

గంగాపుత్రువధించెద, సంగరరంగంబునందు శమనతనూజా
మంగళమయ్యెడు నీకుఁ, రంగుగఁ బట్టంబుగట్టు రాజాలెసంగన్. 157
అనిన ధర్మనందనుండు సంతసించి భీష్మునొకనాఁడు వ్యాసఁగోరి గోప్యంగు ననుమతిపై
రహస్యమున గాంగేయునొద్ద కేగి. 158
కేలు ఫాలమందుఁ గీలించి గాంగేయు, పాదపద్మములకు ధర్మసుతుఁడు
వందనం బొనర్చి వానియాజ్ఞానుసారమున నధివసించె వినయముతోడ. 159
అంతఁ బాండవాగ్రజునకు భీష్ముం డి ట్లనియె. 160
వచ్చిన పనియదిఁ యేదో, చెప్పుము నెఱిఁగింపు దానిఁజేయుదు వెంక నీ
కిచ్చెదవరం బనఁగ న్యాసచ్చారిత్రుం డజాతశత్రుండు పలికెన్. 161
అమరనదీకుమార విమలాత్మపితామహ యస్మదీయరా
జ్యము లభియించు టెట్టులొకో సైన్యము చావకయుండు టెట్లనన్
యమసుతుతోడ నిట్లనియె నప్పుడు శాంతనవుండు ధర్మజా
క్రమముగఁ దెల్పెద న్వినుము గౌరవవంశమహోవిభూషణా. 162
నేను రణములోన నిల్చియుండకున్న, సైన్యనాశనంబు జరుగుచుండు

రాజ్యలక్ష్మి మీకు రాఁ జాలు ననుసెక, పనుప్రవతుీన కనిమె యమసుతుాను. 163

ఉ. దేవ మహానుభావ జగదీశ త్రిలోచనుఁడైన యామహా
దేవునిఁ బోలె నుగ్రమునఁ దేజమునన్ ఘనుఁడైనవాఁడవుర్
నీవు రణంబునందునను నిల్చిన గెల్వఁగఁ జాల రెవ్వరుర్
గావున నేను గోరినది కార్యనికత్వముతోడఁ జెప్పవే. 164

తే. నిన్ను మేమెట్టుగెలుతుమోనిశ్చయముగ, దాని మా కెఱిఁగింపుము దయవహించి
యనఁ గృపాంతరంగుండయి యమరవ్రతుఁడు, ధర్మనందను కిట్లని తావదించె. 165

తే. కామినీపూర్వుఁడైన శిఖండితోడ, నేను మార్కొనఁగావున మానవేంద్ర
యతని మీముందునుంచుక యాలమందు, మీరలెల్లరునాతోడఁ బోరవలయు 166

వ. స్త్రీపూర్వునిపై నేను బాణము ప్రయోగింపనని వ్రతంబుగావున మీరప్పుడు సులభ
ముగా నన్నునిర్జింపవచ్చునన సజాతశత్రుాండు శంతనపుత్రుని కాగున్యమున కంతర
గమున సంతసించి శిబిరముచేరె. 16

ఆ. పాండవాగ్రజుండు వాసుదేవునకును, గనదుతమ్ములకును దాతయనిన
పలుకులెల్లఁ జెప్పె ఫల్గుణుం డప్పుడు, పాంచజన్యధరునిఁ గాంచి పలికె. 16

సీ. ఓజగద్బాంధవ రాజీవలోచనా, మందాకినీసుగీనందనుండు
మాపితామహుఁడు సన్మాన్యయశుండును, కరుణాసమేతుండు ఘనుఁడతండు
వంచనానాతనిప్రాణంబుఁగొనుటకుఁ, బుండరీకాక్ష నాబుద్ధిగాదు
యస్మదీయశరీరమందలి బురదను, దనశరీరమునకుఁదగులునట్లు

తే. చిన్నతనముననుండియు నన్నుఁ బెంచె, మాయవస్థలకును దుఃఖమానసుఁడయి
మమ్ముగారాబమునఁ జూచు నమ్మహాత్ము, వధ మొనర్పఁగఁ జాల నోవాసుదేవ. 16

క. ధర్మజుసోదరు లతిదు, ష్కర్ములనెడు నపయశమ్ము గలుఁగఁగ నేలా
ధర్మవిచారుఁ బితామహు, నిర్మలమూర్తిని వధింప నేరను గృష్ణా. 17

వ. అనిన దామోదరుం డనేకవిధములధైర్యము చెప్పి ధనంజయుని భీష్మసంహారమున
కొడంబఱచె నవ్వేల. 17

తే. దశమదివసమునందున విశదముగను, బాండవులబలగం బెల్లఁ బవరమునకు
వచ్చి సరు సేనలుంగూడ హేమ్నుమీఱ, బోరుచుండి రంతటమహాఘోరముగను. 1

తే. ఆయమ్ముందు శిఖండి మఱి దతని వెనుక, సవ్యసాచుఁడు బాణపాణియై యమరవ్రతుని

గాఢస్పందఁ బెట్టె నయ్యవసరమ్మున లోకబాంధవుండు క్రుంకిన నెల్లరు సమర మాపి
రంత నజాతశత్రుండు దేవకీపుత్రుని నవలోకించి యి ట్లనియె 152

దూదిపై నగ్ని ఱేసినట్లు త్రోయుచాక్క, శాంతనవుఁడు రౌద్రావేశసహితుఁ డగుచు
మనబలమున ననేకుల ననివధించె, నేమి సేయుదు దేవ నాకేది తెలుపు. 153

నాకై వచ్చినవారలు, భూకాంతులు శాంతనవుని భుజబలమందున్
బోకారఁ నేల కృష్ణా!, లోకేశ్వర తెలుపుమయ్య లోకారాధ్యా. 154

యుద్ధమునూని కాంతారముల కేగుదుమను ధర్మనందనునకు నందనందనుం
డి ట్లనియె. 155

ధర్మనందన నిరంతరసత్యవ్రతమున, నలరారుచుండెదు నలఘుఁ డీవు
విపులజపతపంబు విఖ్యాతిగాంచిన, ధర్మమూర్తివి నీవు ధారుణీశ
బాహుబలాదిసంపన్నుఁడవగు నీకు, రాజ్యము గూర్చు భారంబునాది
చింతఁబోనాడు నీస్వాంతమునందున, నాభుజంబుననుంచినాఁడ బరువు
తెగువతో ధనంజయుండు జేరగకయున్న, శాంతనవుని నేను వధింతు సమరమందు
మీకుఁ గోసియిచ్చెదను నామేనినైన, దీనికిని వగవకు నీవు మానవేంద్ర. 156

గంగాపుత్రు వధించెద, సంగరరంగంబునందు శమనతనూజా
మంగళమయ్యెడు నీకున్, రంగుగఁ బట్టంబుగట్టు రాజు లెసంగన్. 157

అనిన ధర్మనందనుండు సంతసించి భీష్మునొకసారి దర్శింపఁగోరి గోవిందు ననుమతిపై
రహస్యమున గాంగేయునొద్ద కేగి. 158

కేలు ఫాలమందుఁ గీలించి గాంగేయు, పాదపద్మములకు భక్తితోడ
వందనం బొనర్చి వానియాజ్ఞానుసారమున నధివసించె విమలయశుఁడు. 159

అంతఁ బాండవాగ్రజునకు భీష్ముం డి ట్లనియె. 160

వచ్చిన పనియదిఁ యేదో, చెచ్చెఱ నెఱిఁగింపు దాని జేయుదు నిఁక నీ
కిచ్చెదవరం బనఁగ న్యాసచ్చారిత్రుం డజాతశత్రుండు పలికెన్. 161

అమరనదీకుమార విమలాత్మపితామహ యస్మదీయరా
జ్యము లభియించు టెట్టులొకొ సైన్యము చావకయుండు టెట్లనన్
యమసుతుతోడ నిట్లనియె నవ్వుచు శాంతనవుండు ధర్మజా
క్రమముగఁ దెల్పెద న్వినుము గౌరవవంశమణీవిభూషణా.

నేను రణములోన నిల్చినవఱకును. సైన్యనాశనంబు జరుగుచుండు

గూర్చుండఁబెట్టె నయ్యవసరమ్మున లోకబాంధవుండు క్రుంకిన నెల్లరు సమర మాపి
రంత నజాతశత్రుండు దేవకీపుత్రుని నవలోకించి యి ట్లనియె 152

దూదిపై నగ్ని పడినట్లు తోయజాక్ష, శాంతనవుండు రౌద్రావేశసహితుండగుచు
మనబలమున ననేకుల నని వధించె, నేమి సేయుదు దేవ నాకేది తెఱుగు. 153

నాకై వచ్చినవారలు, భూకాంతులు శాంతనవుని భుజబలమునకున్
బోకారనేల కృష్ణా!, లోకేశ్వర తెలుపుమయ్య లోకారాధ్యా. 154

యుష్టమువాని కాంతారములకేగుదుమను ధర్మనందనునకు నందనందనుం
డి ట్లనియె. 155

ధర్మనందన నిరంతరసత్యవ్రతమున, సురరాజు మెచ్చెడు నలఘుఁడ నీవు
విపులజపతపంబు విఖ్యాతిగాంచిన, ధర్మమూర్తివి నీవు ధారుణీశ
బాహుబలాదిసంపన్నుఁడవగు నీకు, రాజ్యము గూర్చు భారంబు నాది
చింతఁబోనాడు నీస్వాంతమునందున, నాభుజంబుననుంచినాఁడ బరువు
తెగువకు ధనంజయుండు చాలకయున్న, శాంతనవుని నేనువధింతు సమరమందు
మీకుఁ గోసియిచ్చెదను నామేనినైన, దీనికిని వగవకు నీవు మానవేంద్ర. 156

గంగాపుత్రువధించెద, సంగరరంగంబునందు సమసితనూజా
మంగళమయ్యెడు నీకున్, రంగుగఁ బట్టంబుగట్టు రాజులెసంగన్. 157

అనిన ధర్మనందనుండు సంతసించి భీష్మునొకసారి సన్నిధిఁ గోరి గోపనము సనుమతిపై
రహస్యమున గాంగేయునొద్ద కేగి. 158

కేలు ఫాలమందుఁ గీలించి గాంగేయు, పాదపద్మములకు భక్తితోడ
వందనం బొనర్చి వానియాజ్ఞానుసారమున నధివసించె విమలయశుండు. 159
అంతఁ బాండవాగ్రజునకు భీష్ముం డి ట్లనియె. 160

వచ్చిన పనియదిఁ యేమో, చెచ్చెర నెఱిఁగింపు దానిఁ జేయుదు నింక నీ
కిచ్చెదవరం బనఁగ నా, సచ్చారిత్రుం డజాతశత్రుఁడు పలికెన్. 161

అమరనదీకుమార విమలాత్మపితామహ యస్మదీయరా
జ్యము లభియించు టెట్టులొకొ సైన్యము చావకయుండు టెట్లనన్
యమసుతుతోడ నిట్లనియె నప్పుడు శాంతనవుండు ధర్మజా
క్రమముగఁ జెప్పెద న్వినుము కౌరవవంశమణీవిభూషణా. 162

నేను రణములోన నిల్చియుండువఱకును, సైన్యనాశనంబు జరుగుచుండు

రాజ్యలక్ష్మి మీకు రాఁజాలఁ గను నేఁడు, సత్యవ్రతున కనియె యమసుతుండు. 16

ఉ. దేవ మహానుభావ జగదీశ త్రిలోచనుఁడైన యామహా
దేవునిఁ బోలె నుగ్రమునఁ దేజమునన్ ఘనుఁడైనవాఁడవున్
నీవు రణంబునందునను నిల్చిన గెల్వఁగఁ జాల రెవ్వరున్
గావున నేను గోరినది కార్యనికత్వముతోడఁ జెప్పవే. 16

తే. నిన్ను మేమెట్లు గెలుతుమో నిశ్చయముగ, దాని మా కెఱింగింపుము దయవహించి
యనఁ గృపాంతరంగుండయి యమరవ్రతుఁడు, ధర్మనందను కిట్లని తా వచించె. 16

తే. కామినీపూర్వుఁడైన శిఖండితోడ, నేను మార్కొనఁగావున మానవేంద్ర
యతని మీముందునుంచుక యాలమందు, మీరలెల్లరు నాతోడఁ బోరవలయు 16

వ. స్త్రీపూర్వునిపై నేను బాణము ప్రయోగింపనని వ్రతంబుగావున మీరప్పుడు సుల
ముగా నన్ను నిర్జింపవచ్చునన నజాతశత్రుండు శంతనపుత్త్రుని కారుణ్యమున కంత
గమున సంతసించి శిబిరముచేరె. 16

ఆ. పాండవాగ్రజుండు వాసుదేవునకును, దనదు తమ్ములకును దాత యనిన
పలుకు లెల్లఁ జెప్పె ఫల్గునుం డప్పుడు, పాంచజన్యధరునిఁ గాంచి పలికె. 16

సీ. ఓ జగద్బాంధవ రాజీవలోచనా, మందాకినీనందనుండు
మా పితామహుఁడు సన్మాన్యయశుండును, కరుణాసమేతుండు ఘనుఁడు తలఁప
వంచన నాతని ప్రాణంబుఁ గొనుటకుఁ, బుండరీకాక్ష నాబుద్ధి గాదు
యస్మదీయశరీరమందలి పురదను, దనశరీరమునకుఁ దగులునట్లు

తే. చిన్నతనముననుండియు నన్నుఁ బెంచె, మాయవస్థలకును దుఃఖమానసుఁడగు
మమ్ము గారాబమునఁ జూచు నమ్మహాత్ము, వధ యొనర్పఁగఁ జాల నో వాసుదేవ. 16

క. ధర్మజుసోదరు లతిదుష్కర్ము లనెడు నపయశమ్ము గలుగఁగ నేలా
ధర్మవిచారుఁ బితామహు, నిర్మలమూర్తిని వధింప నేరను కృష్ణా. 17

వ. అనిన దామోదరుం డనేకవిధములఁ ధైర్యము చెప్పి ధనంజయుని భీష్మసంహారమ
కొడంబఱచె నవ్వల. 17

తే. దశమదివసమునందున విశదముగను, బాండవులు బలగం బెల్లఁ బవరమునకు
వచ్చి సురసేనలుం గూడ హెచ్చుమీఱఁ, బోరుచుండి రంతట మహాశూరు లగుచు. 17

తే. ఆలమందు శిఖండి ముం దతని వెనుక, నర్జునుఁడు బాణపాణియై యమరవ్రతుని

సరయఁగ నంతదాఁక నను నారసి ప్రోవుఁడు మీర లెల్లరుఁ
గురుకులముఖ్యులార రణకోవిదులార యటంచుఁబల్కినన్. 192

వ. భీష్మాదిత్యుని సంరక్షణమునకై యనేకులు నియమింపఁబడి రంత. 193

తే. దేవవ్రతుఁడు పానీయంబు దెమ్మనుటయు, విమలసలిలము దెచ్చి రవ్వీరవరులు
దాని నైకొనకుండ నాతండు సవ్యసాచి కిట్లని పల్కెను సమ్మతమున. 194

క. శరతల్పగతుఁడ నాకీ, సరములలో నీరుద్రాఁగ సమ్మతి లేదీ
ధరలోననున్న జలముఁ, త్వరితంబుగఁ దెమ్ము నాకు వాసవతనయా. 195

వ. అనిన నర్జునుండు పితామహునకు నమస్కరించి బాణమును బర్జన్యమంత్రాభిమంత్రి
తంబుఁ గావించి వసుంధరపై వయిచి యందలిజలంబును దెచ్చి శాంతనవుని తృష్ణఁ
దీర్చె నంత. 196

తే. విజయుశక్తికి నక్కురువీరులెల్ల, నద్భుతంబును బొంది రాయమరవ్రతుఁడు
రణవిజయుఁడ వీ వగు మని యనుగుఁ బ్రేమ, శ్వేతవాహను దీవించె శ్రేయమలర.

వ. అంత భీష్ముండు దుర్యోధను నుపలక్షించి యిట్లనియె. 198

సీ. అర్జునుం డితఁ డత్యద్భుతచరితుండు, గోపాలదేవుండు ప్రాపి తనికి
వీనిని నిర్జించువీరు లెవ్వరు లేరు, దెగినవారలకును వగవకుండ
నున్నవారలను దుర్యోధన బ్రదికింపఁ, దలఁపు నీ కింతటఁ గలిగె నేని
పాండవులకు రాజ్యభాగ మొసంగుము, సగము రాజ్యంబె చాలఁ దగును నీవు

తే. అనిన మాఱుపల్కకపోయె నాతఁ డపుడు, నంతఁ గౌరవపాండవుల్ శాంతనవుని
యాజ్ఞ నౌదల ధరియించి యచటినుండి, శిబిరములకును బోయిరి శీఘ్రముగను.

వ. అంత శరతల్పగతుండగు దేవవ్రతుని సమీపించి రాధేయుం డిట్లనియె. 200

తే. సూతసుతుఁడఁ గర్ణుండను జూడు నన్ను, నిన్నుఁ గనుఁగొనఁగా వచ్చియున్నవాఁడ
ననిన నాలింగన మొనర్చి యమరవ్రతుఁడు, భానునందనుతోడను బలికె నిట్లు. 201

తే. నీవు రాధేయుఁడవు గావు భూవరేణ్య, కురుకులప్రవీరుండవు గొంతిసుతుఁడ
వీవు పాండునందనుఁడవు గావున నీకుఁ, బార్థులనుగూడు నీనిజభ్రాతృవరుల. 202

వ. కర్ణుం డవ్వాక్యము లంగీకరింపక దుర్యోధనుని విడుచుట పాడిగాదని యాతని సెలవు
గొని శిబిరమున కేగె భీష్ముండు శరతల్పగతుం డయ్యె నని భీష్మపర్వసంగ్రహవృ
త్తాంత మెఱింగించిన వైశంపాయనుని జనమేజయుం డవ్వలివృత్తాంత మడు
గుటయు. 203

ఆ శ్వా సాం త ముఁ

మ. నిరతంబున్ భవదీయపాదయుగళిన్ జిత్తంబులో నిల్పి నీ
వరకళ్యాణచరిత్రముల్ వినుటకై వాంఛింతు నెల్లప్పుడున్
బరమేశా! భరతాన్వయేశులకథల్ బాటించి నీకిచ్చితిన్
గరుణాస్వాంతముతోడఁ గైకొనుమిదే కాత్యాయనీవల్లభా!! 204

గ ద్య ము.

ఇది కవిరాజు శ్రీపాదకృష్ణమూర్తి శాస్త్రిగారి పుత్రికయును,
కల్లూరి వేంకటసుబ్బరాయుడుగారి పత్నియును,
రాజ్యలక్ష్మీపరిణయాది గ్రంథకర్త్రియును, అగు
విశాలాక్షమ్మచే రచియింపఁబడిన
భారతకథామృతమునందు
భీష్మపర్వము
శ్రీపరమేశ్వరార్పణమస్తు.
శ్రీ. శ్రీ. శ్రీ.



శ్రీ

# భారత సారామృతము.

## ద్రోణ పర్వము.

క. శ్రీరంజిల్లెడుభవదా,కారంబును గనులఁ జూడఁ గాంక్షించిననా
కోరిక దీర్పు భవత్పద,నీరేజములను భజింతు నిఖిలోర్వీశా. 1

వ. జనమేజయునకు వైశంపాయనుం డిట్లు చెప్పం దొడంగె. 2

### —ద్రోణాభిషేకము.—

తే. గంగతనయుండు శరతల్పగతుండు నైన,పిదప రారాజు కర్ణాదివీరవరులఁ
గూడి ద్రోణునిదరి కేగి గురునిపాద,పద్మములకును బ్రణమిల్లె భక్తితోడ. 3

తే. అమ్మహాత్మునకును మ్రొక్కి యఖిలసైన్య,ములకు సేనాధిపతి వయి వెలుఁగుమనుచు
వేడికొనె సుయోధనుఁ డపుడు విని యతండు,సర్వసైన్యాధిపతి గాఁగ సమ్మతించె. 4

వ. అంత దుర్యోధనుండు ద్రోణాచార్యుని సేనాధిపతిగా నభిషేకించినంతట నయ్యాచా
ర్యుండు రారాజున కిట్లనియె. 5

క. అనిమిషపతిసూనుజుని,వెనుకను నను గౌరవించి విశ్వాసముగా
నను సేనాపతిఁ జేసితి,మనమున ముద మయ్యె నీదుమన్నన కౌరవా. 6

వ. నీభక్తికి సంతసించితి నీకొకవరం బొసంగెదఁ గోరుకొమ్మన రారా జిట్లనియె. 7

చ. భుజబలసాగరుం డయినపూరుషుఁ డీవఁగుగాన మాకిలన్
విజయముఁ గల్గు నీవలన వీరవరేణ్యుఁడ మానమున ధ
ర్మజు నిటు పట్టితెమ్మనిన మాటను ద్రోణుఁడు సమ్మతించి ధ
ర్మజు నట పట్టి తెచ్చెదను రాకుమారక నీదుకోరికన్. 8

వ. గురునిప్రతిజ్ఞఁ గురురాజబాలకులు చాటించుచుండ ధర్మజుం డాలకించి విచారించు
చుండ నతని కర్జునుం డిట్లనియె. 9

తే. అగ్రజా గురునిప్రతిజ్ఞ కాత్మలోనఁ,జింతఁ బొందవలదు నీకు సుంతయైన
నాయొడలునఁ బ్రాణంబు లున్నంతవఱకు,దేవ నినుఁ బట్ట నెవ్వారి కౌ వశంబు. 10

ఆ. ద్రోణునకును గాదు స్థాణున కైనను, దరము గాదు నిన్నుఁ బరిభవింప
కోరినాఁడు రాజు పేరాసతోడను,నిన్నుఁ బట్టు మనుచు నృపవరేణ్య. 11

ఆ. సకలభువనము లొకసరి యెత్తి వచ్చిన,సంగరమున నీవు భంగపడవు
గాన చింత నీకు మానవేశ్వర యని, ధైర్యవంతుఁ జేసె ధర్మసుతుని. 12

వ. పాండవు లనంతరమున సంగరోత్సాహదోహలులై యుండఁ బాండవసైన్యాధిపతి య
గు ధృష్టద్యుమ్నుండు ద్రోణు నెదుర్కొన సంసిద్ధుఁడై యుండె నంత. 13

తే. అపుడు కపికేతనము ధవళాశ్వములును జక్రిసారథ్యమునఁ గాలచక్రమట్లు
విలసితం బగునట్టియా విజయురథము శత్రువులకు భయము గల్గె సంగరమున. 14

తే. సోదరచయమ్ముతోడ వృకోదరుండు, పుత్రు లగునభిమన్యాదిభుజబలులును
ధర్మజునిఁ బరివేష్టించి తనరుచుండి, రస్త్రగురునిప్రతిజ్ఞ వా రాత్మఁ దలఁచి. 15

వ. ద్రోణపరిపాలితంబగు కౌరవసైన్యము యుద్ధరంగమ్మున కేతెంచె నయ్యవసరమ్మున.

(కౌరవ పాండవయుద్ధము)

సీ. ఉభయబలములందు నొప్పుశంఖభే, రీరవాదులు చాల బోరుకొనియె
సంగరమంగళస్వనములు చెలరేగె, ద్రోణుఁ డప్పుడుమహాస్థాణువట్లు
పాండవసైన్యముపైఁ బడి శరపరంపరలు వైచుచుబెట్టుదుర మొనర్చె
పాండవసేనాధిపతి ద్రుపదసుతుండు, దాఁకె నాచార్యుని వీఁకతోడ

తే. అంత సౌభద్రుఁ డరిసేన నపుడు కదిసె, శల్యుఁ డతని నెదుర్కొనుసమయమందు
వాయుజుం డడ్డుగా వచ్చి వానితోడఁ, బోరి విగతరథుం జేసె బౌరుషమున. 17.

క. భీమార్జునద్రుపదసుతులు, భీమాకారులు ప్రతాపవీరాగ్రణులై
భూమిఁ గలభాను లటు సం, గ్రామంబున నలరుచుండిరి కౌరవు లడలన్. 18

ఆ. కర్ణనందనుండు కౌంతేయసేనపై, నస్త్రలాఘవంబు నపుడు చూపెఁ
బాండురాజసుతులబలశౌర్యములఁ గని, పరుఁగు లిడుచు నుండెఁ గురుబలంబు. 19

వ. అట్లు పారిపోవుసైన్యముఁ గాంచి యాచార్యుం డిట్లనియె. 20

తే. పారిపోకుఁడు మీర లోవీరులార, రండు పౌరుష మలరఁగా భండనమ్ము
సలుపుఁ డని వారి మరలించి చాపగురుఁడు,పౌరుషమున విజృంభించి పోరొనర్చె

వ. ద్రోణుఁ డజాతశత్రుం గాంచి వాడిశరప్రయోగంబొనర్చుచుండెనయ్యవసరమ్మున.

తే. ద్రోణునకుఁ బట్టుపడె ధర్మసూనుఁ డనుచుఁ,గౌరవులసైన్యమందునఁ గలకలంబు
సింహనాదము లెల్లెడఁ జేసి రంత, నాకలకలమాలించె న య్యింద్రసుతుఁడు. 23

వ. అగ్రజునకు మోసము వాటిల్లె నని కడువేగంబున నేతెంచి. 24

క. గోపతిపుత్రుఁడు కవ్వడి, కోపాటోపంబుతోడ గురుసైన్యముపైఁ
జాపాచార్యునిపైనన్, బ్రాపుగఁ దనశితశరముల వైచుచునుండెన్. 25

వ. ధనుర్గుణటంకారంబున దిశలు పగులించుచు నాదిపిజరాజుపట్టికౌరవసైన్యము
చెదరఁ గొట్టెనంత. 26

తే. కఱ్ఱి బాణాంధకారముఁ గలుగఁ జేసె, సంధ్యసమయము చనుదెంచె జలమిత్రుఁ
డస్తమించె నయ్యిరుతెగ లలసి యుంట, నాదినమునకు గయ్యము నాపిరంత. 27

వ. అమ్మఱునాఁడు గాంధారేయాగ్రజుండు సమగ్రసన్నాహ మొనర్చుచుండె నంతఁ
గుంభసంభవుం డిట్లనియె. 28

తే. అర్జునసమీపమున నున్న యమతనూజుఁ, బట్టుటకు నెట్టివారికి వశముగాదు
సవ్యసాచి యందున లేనిసమయమందు, ధర్మజునిఁ బట్టవశ మగు ధారుణీశ. 29

ఆ. ఎవ్వరైనఁ గాని నింద్రతనూజుని, ధర్మరాజువద్దఁ దనరకుండఁ
జేయువార లేని శ్రేయము గల్గును, బట్టఁగల నజాతవైరి నపుడు. 30

వ. అప్పుడు త్రిగర్తేశ్వరుం డగుసుశర్మ సుయోధనున కిట్లనియె. 31

తే. పార్థుఁ డెన్నియోసార్లు నన్ బరిభవించె, నేఁడు సంగ్రామమందున నేను గాని
యర్జునుఁడు గాని విజయము నంద వలయుఁ, గాన నతనిఁ దోడ్కొనిపోవఁగలను నేను.

వ. ద్రోణుం డంతఁ గౌంతేయాగ్రజుఁ బట్టవచ్చు నన గురుకురురాజులు సమ్మతించి
రంతఁ గృపాశ్వత్థామకృతవర్మసోమదత్తబాహ్లీకశకునిశల్యులు పాండవేయుల నెదు
ర్కొనఁ బోయిరి. 33

ఆ. ఆత్రిగర్తు లంత నాపాండవేయులకడకుఁ బోయి విజయు గయ్యమునకుఁ
బిలిచి రన్న యాజ్ఞవలన శ్వేతాశ్వుఁడు, వారితోడ నరిగెఁ బోరొనర్ప. 34

తే. సవ్యసాచి యన్నను బాసి చనియెఁ గానఁ, గౌతుకంబును బొందుచుఁ గౌరవులును
బాండవులసేనపైఁ దలపడిరి కినుక, నిశితశరములఁ బఱపిరి విశదగతుల. 35

వ. ద్రోణుండు పాంచాలురపైఁ గ్రూరనారాచముల వైచుచుండె. 36

తే. సాత్యకినిఁ గృతవర్మ పాంచాలపతిని, బాహ్లికుండు లక్ష్మణుఁడు సుభద్రసుతుని
దుస్ససేనుఁడు సహదేవుతోడ నాశ్వి, ఖండితోడ వికర్ణుఁడు కలియఁబడిరి. 37

క. మరియు ననేకు లనేకులఁ, గురుపాండవసైన్య మెల్ల ఘోరముఁ గాఁగన్
దుర మొనరించుచు నుండిరి, గురుద్రుపదజు లంత మాఱుకొని రయ్యెడలన్. 38

వ. ఇరుబలంబుల ననేకులు వీరులు మడసియుండి రంత. 39

తే. అంతఁ బ్రాగ్జ్యోతిషాధిపుఁ డయినవాఁడు, ఘనుఁడు భగదత్తుఁ డనునరకునిసుతుండు
పరఁగ సుప్రతీకం బనుగరినిఁ బంపి, కలఁచుచుండెను బాండవబలము నెల్ల. 40

క. అరయంగ సుప్రతీకము, గరువలిసుతుపైకిఁ బోవఁ గని మారుతి మేన్
దొరఁగె నని పాండవబలము, పరితాపము నొందుచుండె భండనమందున్. 41

తే. భీమసాత్యకినకులసహదేవాభిమన్యుద్రౌపదేయులు సుప్రతీకముపై శరపరంపరలఁ

గురిపించుచుండె రయ్యవసరమ్మున. 42

క. ఆకోలాహలము విని, పాకారితనూభవుండు పసుదేవసుతుం
డా కృష్ణుఁ గాంచి యిట్లను, నాకలకల మేమి చెప్పు మచ్యుత నాకున్. 43

వ. సంశప్తకుల నురుమాడువానవికి వాసుదేవుం డిట్లనియె. 44

తే. పార్థ ప్రాగ్జ్యోతిషేశుండు భగతు దైసపాండవులసేనఁ గలచెడు వాఁడు గాన
సుప్రతీకముతో వాని త్రోఁచి గూల్ప వలయు నీ విపు డనునెడఁ ఫల్గునుఁడను. 55

తే. తనదుసుప్రతీకముతోడ మసబలంబు, గలచుచుండెను గావున గమలనాభ
వాయుపుత్రాదులకు బోరు భారమగుఁ గుఁగాన మన మేగి సైన్యముఁగావవలయు.

వ. మనరథము భగదత్తునివైపుగాఁ గొనిమ్మన భగవానుం డట్లొనరించె. 47

తే. దేవదత్తము పూరించి దిశలు మ్రోఁగ, గాండీవంబును సారించి కత్తి విడువ
నపుడు భగదత్తుఁ డద్దాని కాగలేక సుప్రతీకసమేతుఁడై త్రోఁణిఁ గూలె. 48

తే. అంత సౌబలుండును దనయనుజసహితుఁ, డగుచు నర్జునుం దాఁకె యమరనాథ
సుతుఁడు శ్వేతవాహనుఁ డతిశూరమూర్తి, సౌబలుని విలోకించుచు నరఁగఁ బలికె

తే. మాయఁ బన్ని రాజ్యముఁ గొని మమ్ము నాఁడు, కాననములకుఁ బంపితి కౌతుకమున
నట్టిద్యూతము గా దిది యని యెఱుఁగుము, సంగరం బిది నాతోడ సలుపుమోరి. 50

వ. అంత శకుని కౌంతేయునితోఁ బోరి యోఁగలేక పాఱిపోవుటయు. 51

క. మారుతనందనుఁ డంతట, కౌరవసైన్యంబు నుగ్గు గావించెడుతఁ
ద్వీరావేశంబునకున్, వైరులు భీతిల్లి వెఱచిపాఱిరి వెనలన్. 52

క. కురుసైన్యంబా యర్జును, శరములవేఁడికిని దాళఁ జాలక వేవేఁ
బరుగిడుచు నుండెఁ గర్ణుఁడు, సురరాజతనూజుఁ గవిసె శూరత్వమునన్. 53

ఆ. భానుఁ డస్తమించె భాసురకాంతి నోఁ దమము పర్వె నెల్లధరణియందు
సంగరంబు నాఁడు చాలించి యోధులు, విడుదలకును జనిరి వేగముగను. 54

వ. పాండవేయులు విజయము చేకూరుననిన సంగరమంగళస్వరంబులఁ బోఁకొల్పు
చుండిరి. 55

తే. అంతటఁ ద్రిగర్తు లరుదెంచి యమరరాజసుతునిఁ గళ్యాణమూర్తిని సురుచిరాంగు
నర్జునునిఁ గొనిపోయిరి యాలమునకు, నగ్రజునియాజ్ఞమైఁ బార్థుఁ డరిఁగె నంత. 56

వ. ఆసమయంబున. 57

—♦ అభిమన్యువధ ♦—

క. యమసుతునిఁ బట్టఁగాఁ దగు, సమయం బిది యని తలంచి చాపాచార్యుం

డమర నతఁడు చిక్కుటకై, కమలవ్యూహంబుఁ బన్నెఁ గడువేడుకతోన్. 58

వ. ఆపద్మవ్యూహంబునఁ బాండవులు చిక్కిన ట్లొనరించె. 59

క. ఆపద్మవ్యూహంబును, బ్రాఘుగ భేదించువిధము పార్థుఁ డెఱుంగున్
గోపాలదేవుఁ డెఱుఁగున్, నాపార్థతనూజుఁ డెఱుఁగు నభిమన్యుఁ డొగిన్. 60

సీ. అపుడు ధర్మతనూజుఁ డతివిచారంబున, వ్యూహము భేదింప నూహఁ జేసి
సంగరకేళివిశారదుం డైన యా, భీభత్సుసుతు నరిభీకరు నల
సౌభద్రుని గని సమ్మతి ని ట్లను, నీకమలవ్యూహ మీవు చించి
నీవారి నెల్లరఁ గావు మీ వీవేళ, నర్జునుం డిందులే డనఘచరిత

తే. యనుఁడు మారుతనందనుం డనియె నిట్లు, మొగ్గరము నీవు చించుము పుత్ర మేము
వైరివీరుల నెల్లర వధ యొనర్తు, మనుఁడు నభిమన్యుఁ డిట్లనె యమసుతునకు. 61

సీ. వైరిసైన్యంబు నాబలపరాక్రమమున, భయ మంది దిశలకుఁ బాఱి పోవ
ద్రోణుండు నాదగుదోర్బలశౌర్యముఁ, గని స్వాంతమందునఁ గడకఁ జెంద
వాసవసుతుఁడు సుభద్రయు నను గన్న, ఫలముఁ గనులఁ గాంచి యలరుచుండ
మాతులుం డైనరమావల్లభుఁడు మెచ్చ, మీకు సంతోషము మెయికొనంగ

తే. నస్మదీయపరాక్రమ మతిశయిల్ల, నేను వ్యూహంబుఁ జొచ్చెద నిశ్చయముగ
వైరివీరులఁ జెండాడు వాఁడ నిఁకఁ, జింత విడనాడుఁడీ మీరు చిత్తమందు. 62

వ. అని సారథిం దేరు దే నియోగించిన నతం డట్లొనరించె నంత నర్జుననందనుం డా
స్యందనారోహణ మొనర్చి విజయోల్లాసియై యరవము ద్రోణానీకంబుపైకిఁ బఱ
పించె నంత. 63

సీ. తన కడ్డపడుచున్న ధారుణీశ్వరులను, గురుకుమారుల నేలఁ గూల్చుచుండి
శాస్త్రవాభేద్య మాచార్యనిర్మిత మగు, మొగ్గరంబును జొచ్చి మోహరించి
మధ్యాహ్నకాలపు మార్తాండు కైవడి, నతిధైర్యగాంభీర్య మెఱయుచుఁడు
[illegible]కృతాంతుఁ బోలె నాకారముం దాల్చి, సింహనాదంబును జేయుచుండి

తే. తనధనుర్గుణటంకారమునను దశలు, బగులఁ జేయుచు రిపులకు భయము గాఁగఁ
గౌరవులరథంబుల నగ్గగా నొనర్చి, సారథులఁ గూల్చి హయములఁ జంపుచుండె.

క. భీభత్సాకారంబున, భీభత్సుతనూభవుఁడు పరాక్రమియై
ప్రాభవమునఁ బోరొనరిచె, సౌభద్రునిముందు నిల్వఁ జాలరు వైరుల్. 65

తే. కౌరవులసేనమధ్య విహారమునకుఁ, జెలఁగి పీనుఁగురాసులఁ జేయుచుండె
[illegible] తేజుఁ డైన, [illegible]తో సరిఁ బోలువా రవనిఁ గలరె. 66

వ. గురుకృపాశ్వత్థామకర్ణాదులు తమసైన్యముఁతో నభిమన్యుం దాఁకి రతండును. 67

తే. దండతాడితోరగ మట్లు మండిపడుచు, సకలబ్రహ్మాండభాండము సదమద మగు
విధమునను బొబ్బ లిడుచును విజయసుతుఁడు, వివిధవిశిఖపరంపరల్ వేయుచుండె. 68

తే. వారిపై సకలాస్త్రముల్ వైచుచుండ, సైన్యమెల్లను జెదరె నాసమయమందు
గురుఁడు సైన్యసమూహమునరయ లేక, విన్నఁబోయిచూచు చునుండె విజయసుతుని.

సీ. పద్మజాండంబులు పగుల నార్చుచు నంత, సౌభద్రుఁ దాఁకె దుశ్శాసనుండు
వానినిఁ గనుఁగొని వాసవిసుతుఁ డను, నలనాఁడు నిండుసభాస్థలమున
మా కొనర్చినయవమానము నకు నీకు, ఫల మందఁ జేసెద ఖలుఁడ యనుచు
బలికి దుశ్శాసనుఁ దలకొని యతనితోఁ, గరలాఘవంబున దుర మొనర్చె

తే. దుస్ససేనుఁడు సౌభద్రుదోర్బలో తత, శరపరంపరలకుఁ నాఁగఁ జాలఁ డయ్యెఁ
బాఱఁ దొడఁగెను వెనుకకు భీరుఁ డగుచు, నర్జునాత్మజు భుజబల మలతి యగునె.

వ. ఆసమయంబున. 71

ఉ. భీముఁ డజాతశాత్రవుఁడు పెంపలు మాద్రితనూజు లంలి సు
త్రామతనూజపుత్త్రునకుఁ దాము సహాయ మొనర్ప నెంచి వా
రామెయి నుగ్గరంబుఁ జొర నప్పుఁడు సైంధవుఁ డడ్డవచ్చి యు
ద్దామశరంబుల న్వేయిచి తద్దయు శౌర్యముఁ జూపె వారికిన్. 72

వ. పాండవులాపద్మవ్యూహంబునఁ బ్రవేశింపలేక పోయి రాయవసరంబున. 73

సీ. కౌరవసైన్యము కౌంతేయులను దాఁకె, నాజలజవ్యూహమందు నున్న
సౌభద్రు నంత దుశ్శాసనుండును దాఁకె, పోరుచుండిరి మహాఘోరముగను
వృషసేనుఁ డనియెడువీరుఁడు కర్ణుని,సుతుఁడు దుర్యోధనసుతునిఁ గూడి
యభిమన్యుఁ దలపడి రావృషసేనుండు, తా మూర్ఛఁ గొనె నరదంబునందు

తే. ధార్తరాష్ట్రాగ్రజునినిజతనయుఁ డైన, లక్ష్మణుఁడు దీర్ఘనిద్రఁ జెలంగె నంత
శౌర్యమున విజృంభించుచు సవ్యసాచి, తనయుఁ డరిసైన్యమంతయుఁ దునుముచుండె.

వ. సౌభద్రుండు కోపాటోపంబున సుయోధనుకడ కేగుచుండె నంత. 75

క. కురువీరు లప్పు డెల్లరు, దురితం బని యెంచకుండ దుర్మతులైయా
యరదముపైఁ బడియును విగతరథుం జేసిరి సుభద్రాతనయుం గట్టా. 76

క. అప్పుడు దుశ్శాససుతుఁడప్పార్థతనూజుఁ పైకి నయ్యెడ గదతోఁ
జప్పున నడికినయెడ వా, రప్పుడు సమరం బొనర్చ రతిశౌర్యముతోన్. 77

చ. ఇరువురునుం గదాయుధు లహీనపరాక్రమ శాలులయ్యెడన్

దురమున కులం దలంచెడిక దోర్బలవిక్రమసాహసంబు న
య్యిరువురయాయుధంబులును నిర్వారకుం దగిలెన్ గ్రమంబుగా
నిరువురు నేలఁగూలి రపు డెంచఁ దరంబెవిధాత్రుచెయ్దముల్. 73

తే. కౌరవేంద్రుని సైన్యము గడకతోడ, సింహనాదము లెల్లెడఁ జేయుచుండెఁ
బాండవేయుల సైన్యంబునఁ బరమదుఃఖ, ధ్వనులె చేసి రాహాకారవంబుల నంత. 79

వ. ధర్మనందనుం డభిమన్యుమరణమునకుఁ దరిఁ గానరాని శోకసాగరమునుమున్గి
యనేకవిధంబులఁ బలవించుచుండె. 80

తే. అంత సంశప్తకుల సైన్య మణఁచినుండు, దునిమి తనశిబిరమునకు వనజనాభు
తోడ నేతెంచుచుండెను దుశ్శకునము, లెన్నొకని వికలాత్ముండై విన్నఁబోయె. 81

క. పాండవశిబిరంబున శోకాకులసుతుఁ డేగు దెంచెఁ గమలేశునితో
బాండవసైన్యం బెల్లను, గాంచివిం గాంచి కనులఁ గార్చిరి జలముల్. 82

సీ. కృష్ణుఁ డప్పాటను గ్రీడిని గూడుక శిబిరము లోనికిఁ జేరఁ జనఁగ
సౌభద్రుమరణము శ్రవణములం బడి, కదళీతరువుఁబోలి కట్ట్రి గూలి
పుత్రునిసుగుణముల్ బుద్ధులు శౌర్యముల్, సౌందర్యమును గూర్చి చాలఁ దలఁచి
ప్రేమఁ దలఁచి బహువిధములుగాఁ గనుఁ, బలవించుచుండెను ఫల్గుణుండు

తే. పుండరీకాక్షునకు మదిఁ బార్థిపార్థి, వచ్చుదుఃఖము నాఁగుచు పార్థుఁ డప్పు
డూరడించె నయ్యెడలఁ దా నుచితభంగి, నెంత చెప్పిన శాంతింప డింద్రసుతుఁడు. 83

వ. అభిమన్యుకథావిధాన మాలించి నిలింపపతినందనుండు చండభానుని కైవడి భీభత్సా
కారుండై సింధుదేశాధీశుని సైంధవు నల్లి సూర్యాస్తమయంబు బగుతజికి వధింతు
ననియు నట్లొనర్పకున్న నగ్నిం జొత్తు ననియుఁ బ్రతిజ్ఞఁ జేసె. 84

క. ఆపార్థుం డపు డంతట, గోపాలుంగాంచి పలికె గోవింద హరీ
యోపురుషోత్తమ కేశవ, కాపాడుము నాప్రతిజ్ఞఁ గడచనకుండన్. 85

తే. పిదపఁ బుత్రశోకార్తిమై వేగుచున్న, యాసుభద్రనోదార్పఁగ నర్జునుండు
వనజనాభునితోడను జనియె నంత, విపులదుఃఖార్తి యగుఁదనప్రియను గాంచె. 86

వ. కృష్ణార్జునులు సుభద్రనూఱడించి యుత్తరనూఱడించిచనిరంత ద్రౌపది యరుదెంచి
యిరువురను త్తరాసుభద్రలనూఱడించి యాలింగన మొనర్చి ఘోరముగా విలపించి
వారినోదార్చి పాండవశిబిరమున కేగె నంత. 87

(సైంధవవధ)

తే. సింధుదేశాధినాథుండు సైంధవుండు, ఫాల్గునుని ప్రతిజ్ఞను విని భయము చెంది
దార్తరాష్ట్రాగ్రజునిఁ జేరి తన్నుఁ బ్రోవు, మనుచు వేడెదత్పాదాబ్జమునను వ్రాలి

వ. దుర్యోధనుండు సైంధవునితో ద్రోణునిదరి కేగి యర్జునుప్రతిజ్ఞం దెలిపి జయద్రథుం
గావు మన నాచార్యుండు సింధురాజున కిట్లనియె.  89

క. నీవా ధనంజయునకుఁ, భావంబున భీతిఁ బొందవలదు మహీశా
నా వెనుక నీవు నిలఁబడు దేవేంద్రుడు గెల్వలేడు తెలియఁగ నిన్నున్  90

తే. ధైర్యవంతుఁడవై కులధర్మమునకు, వెలితి గాకుండ మదిలోన భీతి విడిచి
సమరముం బొనరింపుము సైంధవుండ యనుచు ధైర్యశాలునిఁ జేసెనతనిగురుఁడు.91

సీ. వీరుఁడాచార్యుఁడు కౌరవసైన్యము, సంసిద్ధపరచెను సమరమునకు
దనుశకటవ్యూహ మను మొగ్గరంబును, నియమించి వమంగాన నిలిచి యుండెఁ
బాంచాలతనయుని కరిపాలితం బగు, పాండవసైన్యము దండిమీఱ
సింహనాదంబును జేసె శౌర్యం బేర్చి, కురుబలంబును దాఁక నరుఁగుదెంచె

తే. సైంధవునివధోద్యోగము సలుప నెంచి, యర్జునుఁ డజాతశాత్రవు ననుమతమున
నతనిరక్షణకొఱకు సాత్యకిని నిలిపి, స్యందనారూఢుఁడై వచ్చె సమరమునకు.  92

సీ. కౌరవసేనలో వీరులగుండెలు, బెదరెడునట్లుగా విజయుఁ డంత
దేవదత్తంబును దివిరి పూరించుచు, గాండీవమును దాల్చెఁ గరమునందు
నుభయబలంబులు యుద్ధ మొనర్పఁగ సింహనాదంబులఁ జేయుచుండె
దుర్మర్షనుండు పార్థునితోడఁ దలపడి భండన మొనరించి పాఱిపోయె

తే. దుస్ససేనుఁడు పార్థునితోఁ దలపడె విజయుఁ డాతని పై ననువిశిఖములను
బరపుచుండ సైపగలేక వాఁడు వేగసరదముం దిగి బరువెత్తె గురునిదరికి.  93

వ. పార్థుం డంత సైంధవుం డున్న వెనకుఁ జూపునిలిపి మొగ్గరము ముందునిలిచియున్న
ద్రోణునిఁ గాంచి వారియనును.  94

తే. విజయుఁ డంత సైంధవుఁ డున్న వెనుకదిక్కు నిల్పి మొగ్గరంబునముందు నిలిచియున్న
గురువరేణ్యు ద్రోణునిఁ గాంచి వారియనుమతి వినయపూర్వకముగ మ్రొక్కి యనియె నిట్లు.

చ. గురువర మాకు మేలొనరఁ గూర్పఁ దలంపుడు మీరు మాకు నీ
సరసిజనాభునట్టి రని స్వాంతమునందుఁ దలంచుచుండు వా
పరమదయాకరా సుజనబాంధవ మీకరుణార్ద్రదృష్టి మ
మ్మరయుఁడు మ్రొక్కుచుంటి నని యర్జునుఁ డంతట వేండి యిట్లనెన్.  96

క. మీ యశ్వత్థామను బలె, శ్రేయంబుగ నన్నుఁ బెంచి చెప్పితివిద్యల్
ధీయుత మొగ్గరముం జన, నీయం గదె నాకనుజ్ఞ నీక వోయనఘా.  97

క. చనువుననుజేసి పిశ్రునము, నిను వేడుచునున్నవాఁడ నే సింధుపతిన్
దునుమఁగఁ బ్రతిజ్ఞఁ జేసితి, ననఘా నా ప్రతినఁ దీర్పు నాతిదయతోడన్.  98

వ. అంత ద్రోణుండు కౌంతేయుం గాంచి నన్ను గెలువకుండ సైంధవుని గెల్వఁ జాల
వని పలికె నంత. 99

మ. అరయం బాండుకుమారశేఖరుఁడు తా నాచార్యుతో మార్కొనెన్
సురరాణ్ణందనుఁ డాగురూత్తమునిపై శూరత్వ మేపారఁగాఁ
గురిపించెన్ ఘనబాణవర్షమును జేర్కొ నొప్పఁగా నయ్యెడన్
గురుపీకుల్ భయమంది చూడఁగ నటన్ ఘోరాజిరంగంబునన్. 100

వ. కృతవర్మ యర్జునునితోఁ బోరి మూర్ఛిల్లె. శతాయుధప్రముఖులాతనిం దాఁకి యం
తకు నతిథు లైరి. 101

క. కౌరవసైన్యం బందు వి, హారం బొనరించునట్టియర్జునుఁ గని గాం
ధారేయుఁ డుగ్రగుసననిన్, జేరి వచించె నవినీతి చిత్తము చెందన్. 102

తే. అర్జునుని మొగ్గరములోని కరుఁగ నిచ్చు, వేల తత్పుత్రపాత్రివై తేల నసుచు
నతని దూరిన రారాజు ననియె నిట్లు, ద్రోణుఁ డెంతయు శాంతముఁ దోచునట్లు.

తే. ధర్మజునిఁ బట్ట నేఁబ్రియత్నం బొనర్తు, సవ్యసాచి కీ వడ్డుగాఁ జనుము వేగ
సైంధవునిఁ గాచుచుండుము జనవరేణ్య, యనుచుఁ బంపించె నాతని నస్త్రగురుఁడు.

వ. దుర్యోధనుండు దుశ్శాసనాదులతో నరిగె. ధృష్టద్యుమ్నుండు ద్రోణునితోఁ బోరు
చుండె నంత. 105

సీ. అట్లు శ్వేతాశ్వున కడ్డుపడఁగవచ్చు, దుర్యోధనుం గాంచి తోయజాక్షుఁ
డర్జునుఁ గన్గొని యనియె నో మిత్రమా, సైంధవుకడ కేగుసమయమందు
మన కడ్డపడె నంతకునిఁ బోలెఁ గురురాజు, వచ్చుచున్నాఁడు పార్థ కంటె
యాపదలకుచు మీ కాలవాలము వీఁడు యీబాణములరుచి యెఱుఁగ డితఁడు

తే. కాన నీతనిఁ గూల్చుము కౌరవేంద్ర, చేయుమిట్లైన శౌర్యము చెదరిపోరి
సైంధవుఁడు పారిపోయినఁ జచ్చువాని, తోడు తనుసమానుం డగువాడు సుమ్మి.

వ. అని శౌరి ఫల్గుని సుయోధనుతో మార్కొనఁ బ్రోత్సాహపఱచె. 107

సీ. ఆపల్కు లాలించి యమరేంద్రసూనుండు, దుర్యోధనునితోడ దుర మొనర్చె
విగతరథుం జేసె వృషసేనుఁ డంతట, నెనమండ్రుగురతోడ నింద్రసుతుని
దాఁకెను గాని యాపాకారిసూనుండు, నించుకేనియును జలించకుండ
క్రూరనారాచముల్ వారలపై వైచి, సైంధవునిదెసకుఁ జనుచునుండ

తే. శమనసూనుఁడు గురునితో సమరమునకుఁ, గడఁగ తా నోడిపోయె నక్కాలమందు
నాయలంబుసుఁ డంతట ననిలసుతుని, సుతుఁడు హైడింబుతోఁ బోరి క్షోణిఁ గూలె.

సీ. మొగ్గరంబును జేరఁ బోయినకవ్వడి, దేవదత్తంబును దివిరి యొత్తె
నాధ్వనిని విని యాధర్మసూనుండు భయముతో నిట్లని పలికె నపుడు
సాత్యకివిజయుఁడు సైంధవు నుఱుమాడ, నేగెఁ దా నొక్కఁడుఁ డిప్పు డటకు
నక్కౌరవులచేతఁ జిక్కె నేమో యని, సంశయ మయ్యె నాస్వాంతమందు

తే. పాంచజన్యరవం బది ప్రబలుచుండె, వీరపురుషసహాయము కోరి చేయు
సమయ మియ్యది చనుదెంచె సత్వరమున; పార్థునకు సహాయ మొనర్ప వలయు నీవు.

వ. సంగరంబున బంధుమిత్రసాహాయ్యం బొనర్చుట కడుపుణ్యము. కృపాశ్వత్థామాదులు
జయద్రథుం గాచుటకై విజయుం జేరి యుందురు. 110

తే. ఒంటి నతఁడు రణక్షోణి నున్నవాఁడు, దైవ మెట్టిభావంబు గాండీవియందుఁ
బూనెనో నాకుఁ దెలియదు మున్నతండు, రణము నీసహాయమున గెల్వఁగ నిశ్చితె.

క. హరియును నీవును మాకుం బరమాప్తులు గాన నాదుప్రార్థన విని యా
నరుఁ దెచ్చి రిపుల నోర్చియుఁ బరితాపము దీర్పు నాకు బాహుబలాఢ్యా. 112

వ. అప్పలుకులకు ధర్మజుని వీక్షించి సాత్యకి యిట్లనియె. 113

సీ. భవదీయరక్షకై పార్థుండు నన్నుంచి పోయె నాలమునకు భూవరేణ్య
చక్రిసంరక్షితశౌర్యోజ్జ్వలుం డగు, నతనికి భయ మేమి యమలచరిత
యనిన ధర్మసుతుండు తనమనంబున భీతి సందేహమును విడఁ జాలఁ డయ్యె
సాత్యకి యంతట శమనజప్రీతుఁడై పార్థునొద్దకు నరుగ నెంచి

తే. అడవిలోపలఁ బడియెడు ననల మట్లు కౌరవులసైన్యమును జొచ్చి ఘోరమైన
బాణవర్షముఁ గురిపించె వారిపైన సాత్యకిప్రభావ మెన్నఁగ శక్యమగునె. 114

వ. జలసంధసుదర్శనధరణీపతులు సాత్యకిం దాఁకి యమాలయంబు జేరి రంత. 115

తే. దుస్ససేనుండు పాఱెను ధూర్తుఁ డగుచు వాయుజుఁడు యుధిష్ఠిరుపంపువలన నంత
నర్జునునకు సాహాయ్యమై యరుగుఁదెంచి కౌరవులబల మెల్ల నుగ్గాడుచుండె. 116

తే. ద్రోణుశౌర్య ముడిపి మరుత్సుతుఁ డంత సాత్యకిసుచిత్రసమరము సరవిఁ గాంచి
క్రీడి సేమముతోడ నున్నాడ టంచు హానిరాకకు నెదురుగాఁ దాను జూచె. 117

క. శత్రుంజయాది కౌరవ పుత్రులు వాయుజునితోడఁ బోరిరి వేవే
గాత్రంబుల విడనాడిరి మిత్రసుతుఁడు పోరె నాసమీరసుతునితోన్. 118

సీ. కర్ణుండు భీముని గదిసి బల ముడిపి విగతరథుం జేసి వీఁకతోడఁ
దిండిపోతువు నీవు తిని యుండనేరక ననిసేయ రా నేల యల్పవీర్య
యని యధికంబుగా నాడె నీచోక్తులు కుంతివాక్యంబునఁ గూల్పఁ డయ్యె
మారుతసూనునిసారథి వే రొక్క తేరు సిద్ధము చేసి తెచ్చె నటకు

తే. యరదమందు నాసీనుఁడై యనిలసుతుఁడు విన్నఁబోయినమోముతో విజయుఁ జేరె
సాత్యకియు వేగముగ సవ్యసాచిఁ జేర నంత భూరిశ్రవుండు తా నరుగుఁదెంచె.

వ. ఆభూరిశ్రవుండు సాత్యకిం దాఁకి నేలంగూలె. సూర్యాస్తమయ మయ్యె నని యర్జు
నుని ప్రతిన నెఱవేఱ దని దుర్యోధనుఁడు సంతసించుచుండె. దుర్యోధనదుశ్శాసనవృ
షసేనాదు లర్జునుం దాఁకి రయ్యవసరంబున. 120

తే. ఆతఁ డించుకయేనియు భీతిలేక శిఖిపరంపర వారలఁ జెదరఁ గొట్టె
సైంధవుం డున్న వెసకును జనుచునుండఁ గర్ణుఁ డతనితోఁ బోరె మహార్ణవమున. 121

క. దుర్యోధనాదు లెల్లరు సూర్యసుతుసహాయమునకుఁ జొచ్చిరి వేవే
వీర్యోద్రేకులు వారలు శౌర్యాటోపమునఁ జనిరి సైంధవు దరికిన్. 122

వ. వారెల్లను సంక్రందననందనుని మార్గంబుని సైంధవున కడ్డుగానిల్చి రా యవసరంబున.

ఆ. అర్జునుండు తా జయద్రథు వధియింపదారిఁ గానలేక శౌరిదిక్కు
ప్రొద్దు చూచుచుండఁ బుగహూతపుత్రుని ప్రతినఁ దీర దనుచుఁ బలికి రఘువు.

వ. అర్జును ప్రతిజ్ఞభంగ మయ్యెనని కౌరవులు సింహనాద మొనర్పఁ గృష్ణుండు జిష్ణున
కిట్లనియె. 125

తే. పార్థ యీవిధమున భండనం బొనరింప నేప్రయోజనంబు నిందులేదు
సైంధవునివధించు సమయము చనుచుండె తద్విధం బొనర్పఁ దలఁప వేల. 126

క. ఇనుఁ డపరాంబుధికినిఁ జాఁ జనియెడు సమయంబు వచ్చె సంక్రందననం
దన యొకయుపాయ మిప్పుడు వినిపింతు జయద్రథుండు వేగమ కూలున్. 127

సీ. మరుగుఁ జేసెడువాఁడ మార్తాండమండలం బపుడు సూర్యుఁడు గ్రుంకె నని తలంచి
సైంధవకౌరవుల్ సమరము విడుతురు నీదుప్రతిన దీరు నృపవరేణ్య
యని మాయ తిమిరమునను ప్రభాకరుని వే మరువుగాఁ జేసెను మాధవుండు
అంతఁ గౌరవు లినుఁ డపరాద్రి కేగె నా డని సంతసించిరి మనములందు.

తే. సైంధవుఁడు మోదమున నాకసమును జూచె నంత శ్రీహరి పార్థున కనియె నిట్లు
ప్రొద్దుచూచెడు సైంధవభూరమణుని మస్తకమ్ము దునిమెడు సమయమిదయ్య. 128

వ. అనిన వాసుదేవానుజ్ఞను వాసవి శితశరంబును విడిచి సైంధవశిరంబు హరించె నంతఁ
బాంచజన్యధరుండు పార్థున కిట్లనియె. 129

క. సురరాజనందనా యీ శిరమును నేలఁబడ కుండఁ జేయు మనంగా
శరనైపుణ్యంబున నా శిరమును గందుకము బోలె జిష్ణుఁడు త్రిప్పెన్. 130

వ. అంతనర్జునుండు ముకుందున కిట్లనియె. 131

క. పరమేశ కృష్ణ నే నీశిర మెంతటివరకు నీవిశిఖముల లోనన్
దిరుగాడఁ జేయవలెనన హరి యిట్లని పల్కె నప్పు డర్జునుతోడన్. 132

సీ. వినుము వృద్ధక్షత్రుఁ డనుసింధుదేశాధిపునితపోమహిమ గాచినది వీని
పవలనొక్కదినము నాకాశవాణి యీ సైంధవునిశిరంబు సంగరమున
దునుమాడఁ బడు నన విని సింధునాథుండు తనతపోమహిమము దనరుమీఱ
నెవఁ డీతనితల మహిం బడవేయునో యతనిశిరంబు సహస్రభిన్న

తే. ములుగి నయ్యెడ ననిశోషమును బూసంగి, చేసె సైంధవురాజ్యాభిషిక్తుఁ గాఁగ
నతఁడు వనులఁ దపమొనర్ప నరిగె నవల, పార్థ యాశిరమిల మీఁదఁ బడఁగరాదు.
సీ. అనఘ వృద్ధక్షత్రుఁడ నతిదూరమున శ్యమంతకపంచక మం దతండు
తప మొనర్చుచు నుండె విపులకీర్తిని బూని, కావున నిటు చేయఁ గడఁగు మతని
తొడపైన నీతల పడ నట్లు చేయుము, పాశుపతాస్త్రము వలన నగును
బాణము మఱియొండు పైచినఁ గా దన, నర్జునుఁ డానుడు లాలకించి
తే. పాశుపతమును జేఁ బూని భక్తిఁ బేర్చ, మొక్కి దానిఁ బ్రయోగింప నక్కజముగ
నాశిరమును గొంపోయి యప్పాశుపతము, పడఁగఁ జేసె వృద్ధక్షత్రు తొడలపైన. 135
వ. తపోనిష్ఠ నున్న వృద్ధక్షత్రుఁడు కనులఁ దెఱచి లేచు చుండఁగా సైంధవుని శిరము
నేలఁబడి వృద్ధక్షత్రునిశిరము సహస్రభిన్నము లయ్యె నయ్యవసరమ్మున.
తే. పాండవుల సైన్య మందలివార లెల్ల, సింహనాదము లెల్లెడఁ జేయుచుండి
రాంబికేయుఁ డీవార్తఁ దా నాలకించి, సైంధవుని చావునకును విచార మొందె.
వ. సుయోధనునివలన గులక్షయ మగుచుండె నని పలవించె నంత. 137
సీ. పాంచాలుఁ జంపక బాణము విడనాడ, నని ప్రతిజ్ఞ నొనర్చె నస్త్రగురుఁడు
పాండవేయులతోడ దండిగాఁ బోరెను, నలుదిక్కు లందును గలుఁగువార
లొండొరులతోడఁ గోపోద్రేకమున వారు పోరుచు నుండిరి ఘోరముగను
దుర్మదబాహ్లీక దుర్మర్షణాదులు సనిలలెనుగాఁచే నంత మొంద
తే. కురుసమూహ మెల్లెడలను గూలిపోవ, ధార్తరాష్ట్రాగ్రజుండు రాధాతనూజు
గాంచి వైరులపై విజృంభించు మనుము, నినసుతుం డిట్లుపలికె నా జనవరునకు.
క. పాండవబలంబు నెల్లను, గాండీవిసమేతముఁ గను గౌరవనాథా
ఖండనమున గెల్తు ననఁ గృపుం డిట్లనె నపుడు సూర్యపుత్రుని తోడన్. 139
సీ. ఘోషయాత్రకు మీరు కోరికఁ బోయిన, గంధర్వపతి పట్టి కట్టె నపుడు
పాండుపుత్రులు ధర్మపరు లయి నిన్నును, గురురాజుఁ బ్రోచుట మరచినావో
వారలు నీవును బోరు ఔన్నదునా నేఁజూడ నట్లుంటివి నేఁడు వెడఁగ
తనునెడఁ గానీనుఁ డలిఁగి యి ట్లని పల్కు, చెప్పిన దంతయుఁ జేయువాఁడ
తే. బాహుబలుఁడ నీతో నాకుఁ బనియ లేదు, నయిన సైచితి నిపుడు నీ వనిన దాని
నన్ను మఱి యేమి యనిన నీనాల్కఁ గోసి, సైచెద నటంచుఁ బల్కెనుబౌరుషమున.
సీ. మాతులు దూషించు మార్తాండసుతుపైకి, కుఱికె నశ్వత్థామ పోటిఁ గొనఁగఁ
గౌరవేంద్రుఁడు వాని వారించి మనలోన, మన మిట్లొనర్చు సమయము గాదు

అని ప్రతిమాలిన నాద్రోణి శాంతించి, పాండవసైన్య మప్పగిదిఁ దాఁకి
చీకాకుఁ బఱచెనఁ బోకఁ గ్రొవ్వఁ గొందఱు, ధర్మజాదులు వాని దార్కొనుటయు

తే. సోమదత్తుఁ డంతట మహోద్ధాముఁ డగుచు, సాత్యకినిఁ దాఁకి కాలుని సరస కేగఁ
గృపునితో శిఖండి రణోగ్రకేళి సలిపె, కర్ణదుర్యోధనాదులు కౌర్య మలర.

తే. సాత్యకిసిఁ గూడి పోరఁగ శమనసుతుని, వీరితోఁడు ఘటోత్కచుఁ డరిభీకరముగ
మాయయుద్ధ మొనర్చె రాధేయుతోడఁ, గర్ణుఁ డతిభీతి నొందె యుద్ధార్ణవమున.

వ. కర్ణుండు చావు దప్పించుకొన నింద్రదత్తం బగుశక్తి ఘటోత్కచని పైఁ బ్రయో
గించిన నాహైడింబుఁడు నేలఁ గూలె నంత.

తే. పాండవులసైన్య మాహారవం బొనర్చెఁ, గృష్ణుఁ డటసంతసంబునఁ గ్రీడఁ గాఁగ
సింహనాద మొనర్చె నాశ్రీశుఁ గాంచి, సంతసించితి వేమనె సవ్యసాచి. 144

వ. అర్జునునకు శ్రీనివాసుం డిట్లు ప్రత్యుత్తర మిచ్చె. 145

వ. అనిమిషనాథుఁ డిచ్చినమహామయశక్తినిఁ గాంచెఁ గర్ణుఁ డీ
రణమున నిన్ను నే నెటుల రక్షణఁ జేయుదునో యటంచు నా
మనమునఁ జింతఁ బొందితిని మాన్యచరిత్ర ఘటోత్కచుండు గూ
లెను గదె తత్ప్రయోగమున లేదు భయం బిఁక నీకు నర్జునా. 146

• ఇనసుతుఁడు ఘటోత్కచుపైఁ, దనశక్తిం బరపెఁ గాన దద్భయ మిఁక నీ
కునుఁ గల్గఁ బోవ దెప్పుడు, రణమున నిఁక గెల్వఁ గలవు రాధాతనయున్. 147

• అనినఁ జక్రధరునివాక్యముల నభినందించి సవ్యసాచి యాతని ననేకవిధంబులఁ
బ్రస్తుతించె నయ్యవసరమ్మున. 148

• ఘనుఁడు ద్రోణుఁడు మత్తగజమును బోలెను, పాండవసేనపైఁ బడియె నంత
నా.. నిశి ద్రుపదావనీశుండును, మత్స్యేశ్వరుండును మడిసి చనరి
యర్జునుఁ డంతట నాచార్యు మార్కొని, వివిధాస్త్రశస్త్రముల్ వేయుచుండె
నపుడు ధృష్టద్యుమ్నుఁ డాగురూత్తంసుని, మాద్రేయులం గూడి మార్కొనియెను

• గురుఁడు కాలాంతకునిఁ బోలెఁ గోపమునను, మండిపడి పాండవులసేనఁ జెండనలమె
నలస మార్కొన నెవ్వరికైనఁ గాని వశముగా కుండె నప్పుడా భండనమున. 149

• ప్పుడు హృషీకేశుఁడు గుడాకేశుం గాంచి యిట్లనియె. 150

ద్రోణమరణము.

గురుని వధింపఁగ సురాసురులకు శక్యంబుఁ గాదు చూడఁగ నింద
వ్వరి కేని శక్య మగు నె పరికింపఁగ నాదునుడులు పార్థా వినుమా. 151
కావున నే నుపాయము నొకం డెఱిగించెద నాలకింపుమా
యీ విటు లెంత పోరిన నితని గెల్వఁగ లేవు నిక్కమా

కావునఁ గుంభసంభవుని గాంచి గతించెను ద్రోణి నేఁడనఁ
నావురు బాణము న్వేటు ధనంజయు డాతని నీవు గెల్వనే. 152

వ. అశ్వత్థామ హతుండయ్యె ననిన విని నిశ్చేష్టుండైనఁ గురుని వధింప వచ్చు నీయ
సత్య మాడుమని సచ్చిదానందుండు చెప్పిన భీమార్జునులు సమ్మతించి రజాతశత్రుం
డు మిక్కిలి విచారించుటయు. 153

ఆ. అంత సంగరంబు నందు నశ్వత్థామ, యనెడు కుంజరంబు హతము నొంద
కరువలిసుతుఁ డంత గురున కశ్వత్థామ, హతము నొందె నిప్పు డని వచించె. 154

సీ. ద్రోణుండు తనదుపుత్రుని శౌర్యబలపరాక్రమములఁ దలఁచి యావిమలమూర్తి
యితరులవలనను హతము గాఁ డని యెంచి, పెడచెవిఁ బెట్టెను భీమునుడులు
పాంచాలబలముఁ గలంచుచు వాయుజుపలుకు లగ్రిమ్ముల దలఁచుచుండె
తనయు నిశ్చయవార్త ధర్మజు నడిగిన, నిజము దెలియునని నిశ్చయించి
తే. ధర్మనందను దరి కేగి తనయు నిజము, వార్త దెలుపు మటంచును బలుకు నెడఁ
గమలనాభుండు వేగమ శమనతనయుఁ గాంచి యిట్లని పలికెను గరుణతోడ. 155

చ. గురుఁ డిట పోరుచుండినను గూలెదు నీబల మెల్లఁ గాన భూ
వర మది సంశయింపకుము ప్రాణము రక్షణసేయు వేళలో
దురితము గా దసత్యమును ద్రోణుని తోడను ద్రోణి నేడు తా
ధరణిని గూలినాడనియు దప్పక చెప్పుము పాండవాగ్రజా. 156

వ. అంతఁ బ్రభంజననందనుండు ధర్మనందనున కిట్లనియె. 157

సీ. సరసిజోదరు వల్ల గురుఁడు కూలెడు నుపాయంబు నే నాలించి యనఘచరిత
మాళవాధీశుని మత్తగజం బది కూలె నశ్వత్థామ యాలమందు
నంత నే గురుఁ గాంచి యనఘ యశ్వత్థామ హతుఁ డయ్యె నే ననియన్నవాఁడ
నామాట లాలించి యాచార్యుఁ డట తా నిరాకరించెను సుమ్మి రాజరాజ
తే. సత్యమును నీవలన వినఁ జాపగురుఁడు వచ్చి నిన్నడుగుచునుండెఁ బార్థివేంద్ర
శౌరి పల్కినపల్కుల సమ్మతించి గురునితోడ నశ్వత్థామ కూలె ననుము. 158

తే. ధర్మనందనుఁ డంతట దైత్యదమన యనిలనందను వాక్యము లాలకించి
చాపగురున కశ్వత్థామ చచ్చె ననుచు మఱియు బిగ్గరగాఁ బల్కె మనుజవిభుఁడు.

క. తరువాత నెమ్మదిగ గుంజర మని వచియించె నంత జనపతిపలుకుల్
శరము లటు చెవులసోకిన గురుఁ డాకవృక్షంబుఁ బోలెఁ గూలెను ధరకున్. 160

సీ. ఆయుధంబులు వీడి యాచార్యుఁ డంతటఁ బ్రాత్రుసన్నై చింతఁ బొగులుచుండ
నంత ధృష్టద్యుమ్నుఁ డతనివెనుకనుండి యతని కంఠము దున్మె నంతలోన

వాఁ డట్లొనర్చుట పాడి గా దనియును సాత్యకి దూషించెఁ జాలవఱకు
గౌరవబలము లాహారవంబులతోడఁ బాఱఁ దొడంగెను దూఱముగను

తే. ధార్తరాష్ట్రాదిప్రభువులు సైన్యమునను నేమియుం జేయ జాలక నిటులనటుల
బరుగులెత్తుచునుండిరి వారిఁ గాంచి దాని కత మేమి యనియు ద్రౌణి పలికె.

వ. ద్రోణవధావిధాన మాలించి యశ్వత్థామ విచారించి పాండవులచే నాచార్యున కట్టి
పరాభవ మయ్యె నని రౌద్రావేశపరవశుండై పాండవబలముపై నారాయణాస్త్ర
ము విడువ నయ్యది కార్చిచ్చుఁ బోలెఁ జుట్టుముట్టె నయ్యవసరంబున. 162

తే. అప్పు డాయస్త్రజాలల కాగలేక పాండవుల సైన్య మాహారవం బొనర్చె
వానినందఱఁ గన్గొని శౌరి పలికె తేరులం దుండి దిగుఁడయ్య వీరులార. 163

సీ. అరదములనుడిగి యాయుధంబుల నేలఁ, బెట్టుఁడీ మీర లో వీరులార
యాయుధహీనుల నాయస్త్ర మేమియుఁ, జేయఁగఁ జాలదు చెప్పుచుంటి
ననయోధు లెల్లరు నాయుధములఁ దీసి, పృథ్విపై నుంచిరి వేగముగను
గాని భీముం డట్లు కానొనర్పఁగ లేక, వారలకిట్లనె వీరులార

తే. వాహనములనుండియు దిగవలదు మీరు, మఱియువజ్రాయుధోప సమానమైన
యాయుధమ్ములతోడ గదాయుధమునఁ గలుఁగు వైభవమంతయుఁ దెలుపువాడ.

వ. వైరుల భీతిల్లఁ జేయుదు నని తేరుడిగకయున్న నరనారాయణులు తేరుడిగ్గి యర్జున
వారుణాస్త్రమహిమఁ గాలకయున్న భీమసేనుంగాంచి యి ట్లనిరి. 165

తే. ఇమ్మహాస్త్రంబుఁ గడిమియింపెవ్వరికిని, గెలుఁగఁబో దశక్యముగాన బలికితిమిటు
గాని శక్యంబయిన యెడ దాని కేము, నోడకుండఁగఁ గలమె యీయుర్విలోన. 166

వ. అని బలవంతముగా భీమునిఁ దేరుదింపిన నయ్యస్త్ర మవలఁ బ్రశాంతింబొందె. 167

తే. ధార్తరాష్ట్రాగ్రజుం డంత ద్రౌణిఁ గాంచి, యనిమొ నయ్యస్త్రము మఱల నరులపైన
విడుమనఁగ ద్రౌణి యిట్లనెఁ బృథ్వీపతికి, మరలఁ దీనిఁ బ్రయోగింపమనకుఁ దగదు.

వ. ద్వితీయప్రయోగ మొనర్చిన నట్లొనర్చిన వారినే యీయస్త్రము దహించు నని
యాగ్నేయాస్త్రము ప్రయోగించిన నది యర్జును బ్రహ్మాస్త్రమున సంక్షీణం బగు
టయు.
169

తే. తనకుదివ్యాస్త్రమహిమము దక్కువౌట, సిగ్గులేక యాలము ప్రవేశించితి నని
యాయుధాస్త్రాదు లన్నిటిని చట విడిచి, ద్రౌణియరదము దిగి వేగఁ దరలిపోయె.

వ. అంత నాగ్నేయాస్త్రము సంక్షీణంబైనఁ గిరీటిభ్రాంతకుండును గిరీటియుఁ బాంచ
జన్య దేవదత్తంబులఁ బూరించిరి. పాండవ సైన్యము సింహనాదములొనర్చె. వేదవ్యా

సుం డశ్వత్థామకుఁ గృష్ణార్జునుల మహిమం బెఱింగించె. వేదవ్యాసుం డర్జునునకుఁ బరమేశ్వరమహిమ నెఱింగించె నని చెప్పిన ద్రోణపర్వము విని జనమేజయుం డవ్వలివృత్తాంతము వైశంపాయను నడుగుటయు. 171

ఆశ్వాసాంతము.

శా. కైలాసాచలవాసుఁడైన శివుఁడే కాపాడువాఁ డంచు నీ
భూలోకంబున నెల్లమానవులు నిన్ బూజింపఁగాఁ జూచి నిన్
జోలన్ భక్తిని భారతామృతములోఁ బూజించి నా నిట్లు నిన్
గైలాసాచలవాస దీనిఁ గరుణన్ గైకోవె మృత్యుంజయా. 172

గద్యము.

ఇది కవిరాజు శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రిగారి పుత్రికయును,
కల్లూరి వేంకటసుబ్బరాయఁడుగారి పత్నియును,
రాజ్యలక్ష్మీపరిణయాది గ్రంథకర్త్రియును, అగు
విశాలాక్షమ్మచే రచియింపఁ బడిన
భారతకథామృతంబునందు
ద్రోణపర్వము
శ్రీపరమేశ్వరార్పణమస్తు.
శ్రీ. శ్రీ. శ్రీ.



శ్రీ

# భారతకథామృతము.

## కర్ణపర్వము.

క. శ్రీకాంతాప్రియసేవిత లోకైకనుతప్రభావ లోకాధ్యక్షా
నీకరుణ గోరితిని నను గైకొని గాపాడుమయ్య కరుణించి శివా. 1

వ. వైశంపాయనమునివల్లభుండు జనమేజయ మహీవల్లభునకిట్లు చెప్పఁదొడంగెనట్లు ద్రో
ణవధానంతరమున దుర్యోధనుండు కృపాశ్వత్థామానుమతుండై కర్ణుని సర్వసేనాధి
పతిగా నభిషేకించెనంత. 2

### —కర్ణాదుల యుద్ధము.—

తే. కర్ణసేనాధిపత్యముఁ గలిగినంతఁ గురుబలముసిద్ధమైపోయె మరమునకును
నుభయబలములు రణమునకుత్సహింప సింహనాదములెల్లెడఁ జెలఁగెనంత. 3

తే. భానుతనయుని చేతను పాండుసుతులు తప్పకీల్గెదరని సుయోధనుఁడుతలఁచె
సూతజుని చతురంగ సమేతముగను ఫల్గునుఁడు గూల్చుననియెంచిరి పాండుసుతులు.

తే. కౌరవుల సహాయంబును గోరివచ్చి క్షేమధూర్తి యనుకులూత భూమివిభుఁడు
భీమునిందాఁకి వానియుద్దామవిశిఖ బలమునఁ నేలఁ గూలె నాభండనమున. 5

సీ. రాధేయుఁడంతఁ బరాక్రమోపేతుఁడై పాండవసైన్యముపైనఁ బడియె
నపుడు ధృష్టద్యుమ్నుఁడా సాత్యకినిఁ గూడి పోరుచునుండెను ఘోరముగను
దుశ్శాసనుండంత దోర్బలోపేతుఁడై పాండవసైన్యముపైనఁ బడియె
మాద్రేయుఁడాతని మార్కొని ఘోరమౌ గతిఁ బోరి వాని మూర్ఛితునిఁ జేసె

తే. కర్ణుఁడంతట సహదేవుఁ గాంచి పిలిచి దాఁక నేతెంచు నెడల మాద్రికుమారుఁ
డైన నకులుఁడాతని కడ్డుగానువచ్చి పౌరుషంబున నిట్లనె వానితోడ. 6

ఆ. కరుణఁ బూని నన్నుఁ బరమేశ్వరుండు నాముందుఁ బెట్టె నిన్ను మూర్ఖచిత్త
కౌరవులకుఁ బాండుక్ష్మానాథసుతులకుఁ గయ్యమయ్యె నీదు కారణమున. 7

వ. నిన్నుఁ జూచినదాది నాశరంబులు నీశరీరంబును దాఁక నాతురత పడుచున్న వన
వానికిఁ గర్ణుఁ డిట్లనియె. 8

తే. రాజనీతివిశారదా రాసుతుఁడవు నయమహాస్త్రవిదుండవునైన నీవు
నన్నుఁ దాఁకంగవచ్చునా నకుల రణము లోనఁ బౌరుషమును జూపనౌనుగాని. 9

వ. అని యయ్యవసరంబున. 10

చ. ఇరువురుపోరికిం దొడఁగి రెంతయు శౌర్యబలంబు లొప్పఁగా
సరసిజమిత్రనందనుఁడు శౌర్యధనుండల మాద్రినందనున్

విరథునిఁ జేసి యాతనికి వేఱ యపాయ మొనర్పకుండఁ గాఁ
భూరి నవమానముఁ జలిపి పుచ్చెను గుంతినుతుల్ దలంచు మున్. 11

తే. అవల నంత దృష్టద్యుమ్నుఁ డాక్సపాస్యుఁ దాఁకి విరథుఁడై యోడెనుధర్మసుతుని
దాఁకి దుర్యోధనుండంత వైన్య మొనర విరథుఁడై వెనుకకుఁ బోయె వేగముగను.

వ. అంతఁ బ్రభాకరుండు పశిమాంబుధి గ్రుంకుటయు నెల్లరు సమర మాపి తమతమ శిబిరముల కేగి రంత ద్వితీయదివసంబునఁ గర్ణుండు దుర్యోధను నవలోకించి యి ట్లనియె. 13

సీ. ఏవాని నని లోన నేను గూల్తు నను మ మీరలు నమ్మి యున్నారొ యట్టి
పార్థునితోఁ దలఁపడ వలయును నేఁడు శరలాఘవంబున శౌర్యమందు
సురరాజసుతుఁడు నాసరి రాఁడు పూర్వము విశ్వకర్మ యొసంగె విజయ మనెడు
నస్త్రము వజ్రికి నతఁడు నెయ్యంబున భార్గవున కొసంగె భార్గవుండు

తే. పరమకరుణాతిరేకమువలన నాకు నొసఁగె నాశరాసనము నో యుర్వినాథ
దానివలన సంగ్రామములోన నేఁడు విజయు వధియించి నీ కతిప్రీతిఁ గూర్తు. 14

వ. మఱియొక విశేష మెఱిఁగించెద నాలకింపుము. 15

సీ. కిరీడికి సారథి కృష్ణుండు గావున నది యసాధ్యం బగు నవనినాథ
యతనితో సమముగా నరదము నడుపుట, శల్యుని కొకనికే శక్తి గలదు
నెట్టులైనను శల్యు నీదినంబున నాకు, సారథిగాఁ జేయఁ గోరుచుంటి
నట్లు గావించిన నర్జునునే కాక, బలము నంతయుఁ గూల్చి వచ్చువాఁడ

తే. అనిన దుర్యోధనుఁడు శల్యు నధికభక్తి, సన్నుతించి కర్ణునిమదుల్ విన్నవింప
ముం దసూయభావంబును బొంది యున్న, శల్యుఁ డిట్లనె గౌరవజనపతునకు. 16

వ. కృష్ణునితో సమానముగా నరదము నడపుదు ననుటకు సంతసించితిఁ గర్ణునికిసారథ్య మొనరించెద నని వచించె నంత.

(శల్యునిసారథ్యము)

చ. దురమున కేగుదెంచు మను దోయజమిత్రసుతుండు మద్రభూ
వరుఁ గని శల్యభూరమణ పార్థునివైపుగ మీర లిప్పు డీ
యరదము దోలఁగా వలయు నాతని మార్గాన నుత్సహించితిన్
గురుకులరాజశేఖరునకోరికఁ దీర్చెదఁ బార్థుఁ గూల్చెదన్. 18

వ. దుర్యోధనున కానందము గలుగునట్లు పాండవబలము చెండాడెద నన శల్యుం డ వ్యాక్యముల కలిఁగి కర్ణున కి ట్లనియె. 1

తే. నీవును ధనంజయుండును నృపవరేణ్య, యిదివఱకుఁ బోరియుంట నేనెఱుఁగనొక్కొ
యుద్ధరపరాక్రముండు జగ మెఱుఁగియుండు, ఫల్గుణుండు జగద్విఖ్యాతబాహుబలుఁడు.

వ. నీవు శ్వేతాశ్వుం గూర్చి చాల వతనిపౌరుష మెఱింగింతు వినుము. 21

సీ. పాంచాలపురికి నేతెంచెడువేళ నాయమునాతటంబున నర్జునుండు
నంగారపర్ణుని నాజి గెల్వఁగ లేదె, ఘోషయాత్రకు మీరు కోర్కెఁ జనిన
ధార్తరాష్ట్రాగ్రజు ధర్షించుగంధర్వనాథుం గెల్చె ధనంజయుండు
ఖాండవవనము వేడ్కను దహన మొనర్చి,వజ్రిముఖ్యులవల్ల వరము లొందె

తే. మఱియు మాకూకిరాతు నుమామహేశు,నాలమునన గెలిచి దివ్యాస్త్రములను
గాంచె నట్టిపరాక్రమకలితు నతని,గెలుతు నంటివి కలలోనిపలుకు లనిమొ. 22

తే. చేయఁ జాలనిపనిని నేఁ జేయుదు నని, చెప్పుటది పాడిగా దిటు చెప్పఁ బోకు
కుంభజపితామహాదులఁ గూడి రాజు, విరటుగోబృందముఁ బట్టి విడిచె నతఁడు. 23

వ. ఆతనిబాణములవేడిమి కాగలేక మీరు పాఱివచ్చిన సంగతి జ్ఞప్తికి దెచ్చుకొ
మ్మన నంగభూవిభుం డలిఁగి మద్రభూవిభున కిట్లనియె. 24

తే. అర్జునాస్త్రవిద్యాపాటవాదు లెల్ల,నే నెఱిఁగినంత దానిని నీ వెఱుఁగవు
నర్పమయ మగుదారుణాస్త్రము లెల్ల, సవ్యసాచిపై కేగ నాసక్తి నొందె. 26

సీ. మద్భుజపౌరుషమహితశౌర్యంబులు, తెలియక నీ విట్లు పలికినావు
నేఁడు రణంబునఁ గిరీడికేశవులను, నుక్కడఁగించెద నిక్కముగను
కట్టికపిధ్వజగాండీవపత్రు లవి, పిఱికివారలకును భీతిఁగొలుపు
నన్నుఁ బోలినశూరునకుఁ గొంచెమేనియు, భయము గల్గింపవు పార్థివేంద్ర

తే. వేయునుంది ముకుందులు వేయునుంది, పార్థులును భండనమునకు వచ్చిరేని
సమర మొనరింతు వారితో శౌర్య మలర, శౌర్యహీనుఁడ వగుదువు శల్య నీవు. 26

తే. శౌర్యహీనత నిట్లనఁ జాలి నావొ, పక్షపాతమువలనను బలికినావొ
యిట్టిపిఱికివాక్యము లన నింక నీకుఁ, బ్రాణములు దక్క వని యెంచవలయు నోయి.

సీ. పాపదేశమున నుద్భవము నొందిననీకు, దుర్బుద్ధి కాక సద్బుద్ధి యగునె
మద్రేశ్వరుండు దుర్మార్గుఁడు దుర్బుద్ధి, పరదారలందున వాంఛితుఁడగు
నని జగంబులు చెప్పుకొనియెడుమాటలు, నిజ మయ్యె నిప్పుడు నీచబుద్ధి
భవదీయవంశము వారు ముందుగఁ గల్లు, దరువాతఁ జనుబ్రాలుఁ ద్రావి రేము

తే. పలువురకుఁ బుట్టి కలుద్రావువార లైన, మీకులంబువారలకును మీకుఁ గూడఁ
దెలియ వుచితానుచితములు పలుకు లనుచు, నట్లు దూషించె మద్రేశు నంగవిభుఁడు.

వ. అని కోపవిపరీతుండై కానీనుండు గదాదండమున శల్యుని సంహరింపఁ గోరి కొంత
శాంతించి యూరకుండె నంత మద్రేశుండు మార్తాండసూతి కిట్లనియె. 29

సీ. సూతతనూజ నే నీ తఱుణంబున, హితము నీ కెఱిఁగింప మతిఁ దలంతుఁ
గౌరవాధీశ్వరుకార్యార్థినై నీకు, వరదము నడుపఁగా నరుఁగుదెంచి
హితబోధ నీకు నే నెఱిఁగింపకుండుట, పాడిగా దని యిట్లు పలికినాఁడ
భండనమందు శుభాశుభాదులఁ గూడ, సారథిపలుక నో జనవరేణ్య

తే. నేను నీ కిట్లు చెప్పిన నింతలోన, నాగ్రహంబును బొందిన నంతమాత్ర
మాను నని యెంచితో నేను మానఁ బోను, జిన్నదృష్టాంతము న్నీవు విన్నవింతు.

తే. ఒకపురంబున ధనధాన్యయుతుఁడు నైన, వైశ్యుఁడల రారునొక్కఁడు వానిగృహము
వాయస మొకండు చేరెనువానిసుతులు, కాకి కెంగిళు లనుబెట్టి సాఁకుచుండ్రు. 31

క. కాకము వైశ్యగృహంబున, సాకం బడి తనకుసాటి చర్చింప నిలం
గాకి యొకఁ డుండఁ బోదని, వీఁకను జరియించుచుండెఁ బృథ్వీరమణా. 32

తే. ఒకదినమున వైశ్యునిసుతు లొనరఁ గూడి, సాగరమున మరాళరాజములఁ గాంచి
వాయసమునకుఁ జూపించి వాని గెలువు, మనుచు కాక మప్పలుకుల నాలకించి. 33

వ. ఆయంచలగుంపులో బలమగు హంసం గాంచి నాతోఁ బరతె మ్మని పల్కె-
నయ్యెడ. 34

సీ. కలహంస లెల్లను గాకినిఁ గని నవ్వి, మమ్ము మార్కొన లేవు సుమ్మి, నీవు
హంసలతోడ మహాబ్ధిమధ్యంబునఁ, బఱ తేరఁ గా లేవు వాయసములు
నిష్కారణంబుగా నీవు భంగము నొంద, వలదు సుమ్మిది మానవలయు ననఁగ
వాయస మంత నాపలుకుల నాలించి, పఱతెమ్మటంచు నే పట్టుపట్టె

తే. వాయసము బలవంతమువలన నపుడు, వారి రుపునసాగరముపైఁ బఱచి రవల
వైశ్యునింట నెంగిలిఁ దినువాయసమ్ము, భంగపడియె నా హంసగుణవలన నధిప. 35

తే. వైశ్యునింట నెంగిలిఁ దిన్న వాయసమ్ము, దక్కఁగ పతంగాను లెక్కఁ దలఁప నట్లు
కౌరవులయెంగిళులఁ దిని కర్ణ నీవు, పాండవుల ధిక్కరించెదు వాఁడవైతి. 36

తే. నీవు గర్వాతిరేకివి నీకు నేఁడు కీడు తప్పక గల్గును గ్రీడివలన
వనజనాభగ్రుహుఁ డెదుర్కొనఁ దరంబె, వీరుఁను గూడి పోరుము వారితోడ. 37

వ. అవ్వాక్యములకు రోషకషాయితనేత్రుండై మండిపడుచు మార్తాండనందనుం
డిట్లనియె. 38

సీ. నన్నుఁ గాకము చేసి నరు మరాళము చేసి, కథఁ జెప్పుచుంటివే కలుషచిత్త
గాండీవిభుజపరాక్రమ మెట్టి దనుచును, నేఁ నడుఁగఁగ లేదు నిన్ను శల్య

శత్రుబలంబుల సన్నుతిఁ జేసెదు, దుష్టుఁడ వగు నిన్నుఁ దునుమ వలయు
రారాజు నిను నాకు రథసారథి నొనర్చెఁ, గావునఁ బ్రతికితి వీవు నేఁడు
తే. అనవసరవచనములు నీ వాడ నేల, ఖండనము సేయ మదీయాస్త్రపాటవమునఁ
దనరఁ గృష్ణజిష్ణులనుమార్కొనెదు వాఁడ, ననుచుఁ గోంచెను శాంతించియనియె నిట్లు.
క. నరనారాయణులమహో, పరాక్రమము నే నెఱుఁగనివాఁడను గానో
ధరణీశ యెంత చెప్పిన, దురమును మానంగఁ జాల దోర్బలి నగుటన్. 40

—కర్ణుఁడు తన శాపవృత్తాంతము శల్యునకుఁ జెప్పుట—

తే. నేఁడు రణరంగమందునఁ గ్రీడి యైన, మడియ వలె లేక నే నైన మడియ వలయు
వైరులఁ దలంచి నా కెప్డు భయము లేదు, పరశురామాదివిప్రశాపంబె భయము. 41
వ. తచ్ఛాపంబుఁ దలంచిన నాగుండె లవియు నెఱింగింతు వినుము. 42
సీ. నేనస్త్రవిద్యల నేర్వఁగా మది నెంచి, పరశురామునిఁ గాంచి బ్రాహ్మణుఁడ
నని బొంకి యతనిచే నఖిలాస్త్రవిద్యలు, నేర్చితి నాతండు నెయ్య మలర
సకలాస్త్రముల నా కొసంగి బ్రహ్మాస్త్రము, నాకు నొసంగె నాలోకవినుతుఁ
డాపత్సమయమున నది ప్రయోగింపుమా, యని జామదగ్న్యుఁ డాజ్ఞ నొసంగె
తే. అంత నొక్కదినంబున నతఁడు నాదు, తొడల శిర ముంచి నిద్రించెఁ బడమినందు
వలనఁ బురుగొండు నాతొడఁ దొలుచుచుండె, నల్లఁ గాలువలై పాఱె నచ్చటచట 43
తే. పరశురామునకును నిద్రభంగ మగునో, యనుచు దానిఁ గొట్టఁగఁ జాల నైతి నేను
గొంతవడికి నిద్దుర లేచి గురుఁ డతండు, నాదునూరువులను గారు నల్లఁ గాంచె. 44
వ. దానికారణ మెఱింగి నాసాహసమునకు మెచ్చి పరశురాముఁడు నన్నవలోకించి
యిట్లనియె. 45
తే. విప్రులకుఁ దాల్మి యిట్లుంట వింత గాదె, నీవు బ్రాహ్మణుఁడవు గావు నిజము దెలుపు
మనఁగ నే సూతపుత్రుఁడ నని వచింప, నాగ్రహించె నాపైని నయ్యభృగుమూర్తి.
వ. మదీయకపటకృత్యమున కలిగి సంగ్రామరంగమ్మున బ్రహ్మాస్త్రభార్గవాస్త్రంబులు
జ్ఞప్తికి రాకుండు నట్లు శాపం బొసంగె నవ్వల గల్గు బ్రాహ్మణ శాప మెఱిగింతు
నాలకింపుము. 47
సీ. అభ్యాసమునకు నాయస్త్రము నొకనాఁడు, విల్లెక్కు వెట్టి నే విడుచుచుండ
నొకశరం బది దాఁకె నొకగోవ్రదూడకు, నపు డొకభూసురుం డాగ్రహమున
ననుఁ గాంచి యాతఁ డిట్లని పల్కె నియ్యది, హోమధేనువు వత్స మోరి కూళ
దీనిపై శరమును బూని వైచితిగాన, శాప మిచ్చెద నీకు జ్ఞాన హీన

తే. సంగరంబున నీరథచక్రము లవి, భూమిలోనికిఁ గ్రుంకు నీ వేమహాత్ము
గెలువ నెంచితో యాతని వలన నీకు, సమరరంగమందున చావు సంభవించు. 48

వ. అని తన శాపవిధానం బెఱింగించి రథము సమరాంగణమ్మునకుఁ బోనిమ్మన శల్యుం
డట్లొనరించె. 48

సీ. భానుతనూజుండు పాండవసేనపైఁ గవిసెఁ బరాక్రమకలితుఁ డగుచుఁ
బాంచాలబలములఁ జించి చెండాడెను, బాండవాగ్రజుఁ దాఁకి పౌరుషమున
విశిఖజాలంబుల విడిచి కుంతీవాక్య, బద్ధుఁడు గావున వాని కెట్టి
కీడొనరింపక వీడె ధర్మసుతుండు, నతని బాణాగ్నికి నాఁగ లేక

తే. భండనము వీడి విడిదకుఁ బాఱి పోయె, బాండవబలము లెల్లను భయముతోడఁ
బరుగు లిడె నలుదిశలకుఁ బవనతనయుఁ, డినజు దెసకును బోనిచ్చెఁ దనదు రథము.

వ. దివ్యాస్త్రప్రయోగంబున భీముఁడు కర్ణుని మూర్ఛాపరవశుం జేసె నంత. 51

సీ. రాధేయుఁ డంతట రథము మీఁదను జచ్చి, నట్లు మూర్ఛనుబడె నంతలోన
ధర్మరాజునకు సూతసుతుం డొనర్చిన, పరిభవంబునకును బ్రతియొనర్ప
ననిలతనూజుండు తనతేరు దిగి కర్ణు, రథముపై కుఱికియు రభసమునను
గరవాలమున నాలుకను గోయ నెంచిన, మద్రేశుఁ డిట్లనె మారుతిఁ గని

తే. భూవరేణ్య సూతసుతుండు చావ లేదు, మూర్ఛలో నుండె వెనుకకుఁ బొమ్ము నీవు
నీవు నాల్కను గోసిన నితఁడు చచ్చు, నితనిఁ జంపంగ నర్జును ప్రతిన గాదె. 52

వ. కావున నీవు కర్ణుని వధింప వల దన భీముఁడు సమ్మతించి కురుబలంబుఁ గదిసి ఘో
రముగాఁ బోరుచుండె నంత. 53

తే. సమరమున సుశర్మాదిసంశప్తకులను, నర్జునుఁ రథంబుఁ బడ నతఁడు వారి
రౌద్రమున మఱిఁ గ్రక్కు శరముల విడిచి, దండధరుపురికినిఁ బంపుచుండె నంత.

సీ. పాంచాలబలములపైఁ గృపాచార్యుండు, నిశితశరంబుల నేయుచుండ
నంత శిఖండి తా నతని నెదుర్కొని, పోరుచునుండెను ఘోరముగను
గౌరవపక్షము గోరి వచ్చిన దండధరుఁ డను రాజు వేదండసహితుఁ
డగుచు నంతం బొందె నంతట మలయధ్వజుండు ద్రోణిని దాఁకి ఓడిఁ గూలె

తే. సాత్యకి నకులసహదేవ సమరశాస్త్ర, నిపుణు లెల్లరు గుమి గూడి విపులశక్తిఁ
గౌరవసమూహ మెల్లెడఁ గలఁచుచుండ్రి, సమర మతిఘోరయుతముగా సాఁగుచుండె.

వ. ఆసమయంబున. 56

సీ. భానుతనూజుండు భార్గవాస్త్రంబును, బాండవసైన్యముపైన విడిచె
నంత క్షోభ మయ్యెను శత్రువులకు నది, పాండవు లాహారవము లొనర్ప

నర్జునుం డీవార్త నాలించి యరుదెంచి, మధ్యాహ్నమార్తాండుమాడ్కి దనరు
కర్ణుమోమును గాంచి కంసమర్దనునితో, ననియె ని ట్లతిపీనముగ నతండు
తే. మాధవా నేఁ డిదేమొ యీరాధసుతుఁడు, ఫాలనేత్రాగ్నిసాకారము పగిదిఁ దనరె
వీనివెసఁ జూచుటే నాకుభీతిఁ గలుఁగు, నితనితోఁ గయ్య మొనరింపనేనుజాల. 57
వ. పార్థుం డచ్యుతుని రథంబు శిబిరంబునకుఁ బో నిమ్మనియె నంత ధృష్టద్యుమ్నాదు
లారాధేయు నెదుర్కొనిరి. 58
తే. అంత నాసమయంబున నర్జునుండు ధర్మజుఁడు బలంబులలోనఁ దనరకునికి.
నగ్రజుం డేడి యనుచు నయ్యనిలతనయు, నడుగ నా తఁడి ట్లని పల్కె నర్జునునకు
వ. అగ్రజుండు కర్ణునివలన నొప్పింపఁబడి శిబిరమున కేగె నీవాతనినేమం బరసి
ర మ్మనుటయు. 60
క. అంతట శ్రీకృష్ణార్జును, లెంతయుఁ ద్వరితంబుఁ గాఁగ నేగిరి యచటన్
స్వాంతంబునఁ జింతించెడు, కౌంతేయాగ్రజునిఁ జూడఁ గా నిర్వురున్. 61
వ. కృష్ణార్జునులు శిబిరమున కేగి ధర్మజుం గాంచి నమస్కరించిన నతం డాయిర్వుర
నాలింగన మొనర్చికొని కర్ణుని వధించివచ్చిరను సంతోషంబున నజాతశత్రుం డిం
ద్రపుత్రుం గాంచి యి ట్లనియె. 62

—ధర్మరా జర్జును నభినందించుట—

క. సుర లైనను రాధేయుని, దురమందున బలముతో నెదుర్కొనఁగాఁ జా
లరు పరశురామశిష్యునిఁ, బరికింపఁగ నెటువధించి వచ్చితొ చెపుమా. 63
సీ. అఖిలాస్త్రవిద్యల కాలవాలుండును, ధైర్యగాంభీర్యాదిధన్యమూర్తి
యతనికి సములులే రవనీతలంబున, దేవసమానుని దివ్యమయుని
రాధాతనూజుని రణరంగమందున, నాపద లేకుండ ననఘులార
కడతేర్చితిరి మీరు కడకఁ గల్గెను నాకు, నింతకు ముందు వాఁడే నయితిమి
తే. పార్థతుండు సాత్యకియును వచ్చి చూడ, నతఁడు నాశరీరంబున నఖిలమైన
యస్త్రశస్త్రముల నైవెచె నట్టివేళ, బరిభవమ్ము గలిగెనాకుఁ బార్థవింటె. 64
క. కౌరవబలంబు లంతట, మారుతికోపాగ్నిఁ బరఁగి మఱిమఱిదిశలం
బాఱిపఁ గర్ణుఁడును జనె, నీరీతిని శిబిరమునకు నే వత్తునయో. 65
వ. అని పలికి మఱియు ని ట్లనియె. 66
తే. ద్వాదశవర్షముల్ వనవాసమున నుండి, కర్ణు నెట్లు వధింపఁ గలమొయనుచు
నాహారనిద్రల నన్నిటి విడిచితి, రణమున నాపగాతనయు వఁన

నైనఁ బరిభవము నంది యుండఁగ లేను, కర్ణుఁడు నను బెట్టుకష్టములను
జెప్పుట కేనాకు సిగ్గగు చుండెనా, పరిభవ మెల్లనీవలనఁ దీఱె

తే. బాహువీర్యశౌర్యంబులఁ బ్రౌఢుఁ డయిన, కర్ణు నెట్టు లుక్కడఁగింపఁ గలిగినావొ
యతనిబంధులు మిత్రము లాత్మజన్ము, లెట్టులూరక యుండిరో యెఱుఁగఁ జేయు.

క. నీ వేమియునొవ్వక యే, యావీరుని నేలఁ గూల్చు టాశ్చర్యం బౌ
నావిధ మెఱుంగఁ జెప్పుము, నావినుతవిమతగాఁగ నాయనుజన్మా. 68

తే. సంగరమున నేకోకరుఁడ సవ్యసాచి, గూల్చు నని ప్రగల్భము లాడు కురుపరునకు
సంతసముగూర్చుచుండె ప శౌర్యమూర్తి, కర్ణుఁడాడినపలుకు లేకడకుఁ బోయె. 69
భవదీయభుజబలంబును, బ్రవిమలశౌర్యంబుఁ దేటపడినదొకో భూ
ధవుఁ డగుసుయోధనుసఖు వివరింపఁగ నాకుఁ దెలుపు విజయుఁడ వేగన్. 70

తే. అధికగర్వోన్నతుం డగునతనిశిరము, నతనిబంధుఁలు మిత్రులు నాత్మజులును
గనులనీరు మున్నీరును గాఁగ నేడ్వ, నెట్లు దున్మాడినాడవో యెఱుఁగఁ జెపుము. 71

వ. అంతఁ బాండవాగ్రజుం గాంచి గాండీవి వినయమున నిట్లనియె. 72

తే. నేను సంశప్తకులతోడ నేఁ డచటను, గయ్యమాచరించుచునుండఁ గర్ణుఁ డంతఁ
దనపరాక్రమ మేర్పడ మనబలంబుఁ, గలఁచె మనవారు పోయిరి నలుదెసలకు. 73

తే. అట్టికలకలము న్విని యనఘచరిత, రయము మీజాడ నే తెంచితి రంగమునకు
నీవు నొప్పింపఁ బడుటాది నేను వింటి, వినఁగ వచ్చితి నీసేమమును నరేంద్ర. 74

వ. మహాపురుషా! యిదే కసువేగంబునఁ బోయి భవదీయపరితాపంబుదీఱ రాధేయు వ
ధించి వచ్చెద ననుజ్ఞ నిమ్మన నమ్మనుజేంద్రుండు గాండీవిం గాంచి కర్ణుండు చావ
లే దని యలిఁగి యిట్లనియె. 75

—ధర్మరా జర్జునుని దూషించుట—

సీ. సంగరమందున శత్రులఁ జంపుట, వారిచేఁ జచ్చుటే పౌరుషమ్ము
లివి రెండు వీరుల కెనఁగుగుణంబులు, శత్రులచే నొచ్చి సంగరమ్ము
విడిచి రారా దట్లు విడిచివచ్చితి నేను, జులకనఁగా నైతి శూరులకును
నేఁడు కర్ణునకు నే నోడితి నన నేల, నీ వోడిపోతివి నిశ్చయముగ

తే. భీముఁడును గవ లోడిరి భీతు లగుచు, మఱియు మనతోడ నీకంసమర్దనుండు
నోడె నెల్లర మాతని కోడినాము, కటకటా యెట్లు వచ్చెను గాలమహిమ. 76

వ. మనము రణంబు కేగ నణుమాత్ర ప్రయోజన ముండఁ బోవ దో
యనుజ జటాజినాదు లిపు డందఱమున్ ధరియించి వేగమే

వనములలోఁ జరించను తపం బొనరించెద నస్మదీయు లా
వనమునఁ గాక రాజ్యమున వైభవ మొందుట కష్టమౌదురే. 77

తే. లేనియెడల దుర్యోధను లీలఁ గొలిచి, సాధువృత్తుల నాతని సన్నుతించి
సేవఁ జేయుచు నుండ మీచింత లేల, రాజ్యమేల శౌర్యం బేల రాణ లేల. 78

సీ. అనికి నీ భీతి వెనుదీయుదు వటన్న, సంగతిఁ దెలిసిన శౌర్య ముడిగి
ద్వైతవనమునందె వర్తించుచుందు గదా, గానిమఁ జంపఁగ లేనను నెడ
సంగ్రామమునకును సమ్మతింపక పోదు, రాధాతనూజుని రణమునందు
వధియింతు నన్నప్రతి మెల్లను గూడ, వమ్మయి పోయెను బౌరుషమ్ము

తే. శత్రుమధ్యను రాధాత్మజన్ముఁ డతఁడు, నన్ను నొప్పింప నూఁకక యున్నవాఁడ
నీవు భీతిల్లు దనుచు నే నెఱుఁగ నైతి, సిగ్గువొరపడ హీను నే నౌదుఁ గాన. 79

సీ. అగ్నిదత్తం బైన స్యందనంబును గల్గి, శ్వేతవాహనములు వెలయఁ గాంచి
కపికేతనంబును గాండీవమును గల్గి, శౌరి సారథ్యము సలుపుచుండ
రణరంగమందున రాధాతనయునకు, భీతిల్లి వచ్చితే విజయ నీవు
నిన్ను నే నేమందు నేఁటిదినంబున, నభిమన్యుఁ డైనను నాహవించి

తే. తనయుఁడు ఘటోత్కచుండు నుండినను గాని, నాకుఁ బరిభవ మిట్టిది రాకపోను
గుంతి కీవు పుట్టకయున్నఁ గవలయమున, నాకు నీపాటు లేవియు లేక యుండు. 80

వ. అయినను. 81

తే. కర్ణునెడ నీకు భయ మైన గాండివమును, శౌరి కర్పించి రథికుఁ సలిపి యతని
కీవు సారథి వైనను నీతఁ డైనఁ, గర్ణువధియింపఁ గుందునా దుర్జయుండ. 82

వ. అనుటయు నయ్యవసరమున. 83

తే. ధర్మజుం డాడుచుడులకుఁ దనమనమున, నలిఁగి యర్జునుఁ డాతనితలను నఱక
వాలు బూనినఁ గృష్ణుఁ డాపార్థుఁ గాంచి, యిట్లు పల్కెను ధర్మజుఁ డెఱుఁగకుండ.

సీ. వైరు లెవ్వరు కానరారీస్థలంబున, ఖడ్గము దాల్చితి కరమునందు
నెవ్వరి వధియింప నియ్యది దాల్చితో, కురువీరు లిచట నెవ్వరును లేరు
మన మిచ్చట యుధిష్ఠిరుని సేమ మారయ, వచ్చియుంటిమి కదా పారవేంద్ర
క్రోధ ముడుగు మనుగోవిందుతోడను, బల్కెఁ గోపంబునఁ బార్థుఁ డిట్లు

తే. దేవ గాండీవ మొఱులకు దీని నెవ్వ, రియ్యమందురో వారల నీసుఁ జేసి
తలను నఱకఁ బ్రతిజ్ఞను సలిపినాఁడ, ప్రతిన నెఱవేఱఁ జంపెద వానినిపుడు. 85

తే. ఇందు కీ పేమి యుందువో నందతనయ, నీవు చెప్పినయట్లుగా నే నొనర్తు
ననుచు శ్వేతాశ్వుఁ డడిఁగిన నచ్యుతుండు, విన్నవించెఁ బార్థున కిట్లు విస్ఫుటముగ.

తే. ధర్మనందను వధియింపఁ దలఁచితీవు, దానిమాఱుగా దూఱుమీ మాన వేంద్రుఁ
బ్రాజ్ఞులను నిందఁ జేయుట వధసమాన, మనినసమ్మతించె మహేంద్రతనయుఁడపుడు.
వ. పుండరీకాక్షుననుమతిని గాండీవి పాండవాగ్రజున కి ట్లనియె. 87

—అర్జునుఁ డగ్రజుని నిందించుట.—

సీ. సంగరమందున శాత్రవవీరుల, పీచ మడఁపఁ జాలువీరవరుఁడు
బాహుబలుం డగువాయుతనూజుండు, నన్ను దూషించిన న్యాయ్య మగును
సంగ్రామమందున శత్రులకు జడిసి, పరుఁగిడివచ్చినవిరికి వీవు
న న్నిట్లు పలుకుట న్యాయహీనం బగు, నందు కనర్హుండ వలఁతి వీవు
తే. నాదుశౌర్యవిక్రమములు నాదుబలము, నీ వెఱింగి యిట్లంటివి నీచమతివి
చివ్వయందున నీ వేమి చేయలేని,శౌర్యహీనుఁడ వి ట్లన సాఁగు టేల. 88
తే. శాత్రవచయము నెల్లను సంగరమున, నొక్కమొకఁడ దేఁ జాలినయుగ్రుఁడైన
భుజబలసముద్రు లామాద్రిపుత్రు లిట్లు,దూఱఁ జాలిరె న న్నిట్లు దుస్స్వభావ.
సీ. జూద మాడితివి మున్ మోదముతోడ దా నఁ, గురుకుమారులతోడ దురము కల్గె
నీమూలమున, గదా నిఖిలరాజ్యంబును, నాశ మయ్యెను ధననాశ మయ్యె
దాస్యజీవనము గాంతారవాసము గల్గె, నీమూలమునఁ గదా నిశ్చయముగ
నిట్టికష్టంబుల కెల్ల మూలంబవు,సిగ్గు లే దించుక యొగ్గు లేదు
తే. రణ మొనర్పఁ జాలనినీవు మనము లోన, శాంతిఁగొనియూరకుండకచపలుఁడ వయి
యిట్టివల్లదములు పల్కనేల నీకుఁ,గీడులకు మూల మగునట్టి వాఁడవీవు. 90
తే. నీదుకారణమునఁ గదా నిశ్చయముగ, బాలుఁ డగునభిమన్యుఁడిఁ గోలుపోతి
మాకుఁ గల్గుకష్టములకు మావెతలకు, నీవు కారణ మగుదువు నీచమతివి. 91
తే. ఇట్లు దూషించి శాంతివహించి పార్థుఁ, డగ్రజుని నిందఁ జేసిన యందులకును
దనదుతలఁ గోసికొనఁ బోవ దైత్యదమనుఁ, డడ్డపడి ధనంజయునితో ననియె నిట్లు
వ. సక్రందననందనా ! శాంతింపు మని మఱియు ని ట్లనియె. 93
చ. గురులను నిందఁజేయునెడఁ గోరిక నాత్మవుతిం బొనర్ప నా
దురితము పోసి పోవు నని తొల్లిమహాత్ములు పల్కుచుం డ్రిలన్
మరణముతో సమాన మగు మాన్యుఁడ యాత్మవుతిం బొనర్చినన్
భరతకులాలవాల యటుపల్కవె యాత్మవుతిం బొనర్పవే. 94
వ. హృషీకేశునివాక్యములు గుడాకేశుం డభినందించి యగ్రజు నవలోకించి యి ట్లనియె

—అర్జునుం డాత్మస్తవం బొనర్చుట.

సీ. అగ్రజా జగమున హరుఁడు దక్కఁగ నన్ను, గెలుచువాఁ డెవ్వఁడు గలుఁగఁ బోఁడు
దశదిశలను గెల్చి విశదకీర్తిఁ జెలంగ, రాజసూయమునకుఁ బ్రోదిమీఱు
నంతధనము దెచ్చి యిచ్చియుంటినొ నీవుఁ, దఃఖపుము దానిని ధారణీశ
సంశప్తకులను సుశర్మాదివీరుల, వధియింతు నెందఱో వైరివరుల

తే. నెంతయో కురుసేన నే నిలకుఁ గూల్చి, వాఁడ గౌరవరణమున నాఁడు చేతఁ
గూలి రెందఱో వీరులు కురువరేణ్య, నన్నుఁ బోలువాఁ డొండైన నున్న వాఁడె.

వ. అని పలికి యజాతశత్రునిచరణారవిందములపై వ్రాలి యింద్రనందనుండు వెండియు
ని ట్లనియె. 96

తే. నన్నుఁ గృపతోడఁ జూడుము నరవరేణ్య, దేవ నేను బల్కినదుల్ భావమందు
నుంచకుండ క్షమింపఁ బ్రార్థించుచుంటి, జ్ఞానహీనుఁడ నే నైతి శమనతనయ. 97

సీ. నే ననత్యంబాడఁ బోను నాతనువు ప్రాణంబులు నీయధీనములు సుమ్ము
నాయందుఁ గరుణించి నరనాథ యిప్పుడే, వాయుజుపాలికిఁ బంపు నన్ను
వానిసంగరమును వాపి కౌరవసేనఁ, దునుమాడి కర్ణునిఁ దునిమి వత్తు
ప్రతినఁ జేయుచునుంటి రాధ నీదినమునఁ, బుత్రహీనను జేసి పుచ్చువాఁడ

తే. అట్లు కాదేని నే నైన హతుఁడ నౌదు, నాజ్ఞ యొసఁగి నన్బంపుము యాజమునకు
ననుచు నన్నపాదంబులయందుఁ బడియె, నిఖిలలోకవీరుఁడు శతమఖసుతుండు. 98

వ. అప్పలుకుల కలుక వీడక ధర్మజుం డనుజున కి ట్లనియె. 99

సీ. ఏని యెన్నైన నా కేమి నామూలము, వలనఁ గష్టంబులు వచ్చె నీకుఁ
గులమునకును జేటు కూర్చిననాతల, నఱకవలయు నీవు నఱకు మింక
నఱకకుండఁగ నీవు మఱియు న న్నిప్పుడు, కృపతోడఁ గాచిన విపినములకుఁ
బోయి తపంబును బొనరించుచుండెద, మీరు సౌఖ్యంబున మెలఁగ వచ్చు

తే. వైరులను గెల్చి బలహీనుఁ బట్టభద్రుఁ, జేయఁ దగదు భీముని రాజుఁ జేయ వలయు
ననుచు శయ్యాతలము వీడి యరుగుచుండ, నతని వారించి యిట్లనె నచ్యుతుండు.

తే. బాలభావుఁడు గాడె యీఫాల్గుణుండు, వీనిపైనఁ గోపముఁ బూన నౌనె నీకు
నర్జునుని తప్పు సైపు మోయవనినాథ, యనుచు ధర్మజుఁ బ్రార్థించె నవ్యయుండు.

వ. అనినఁ గృష్ణవాక్యములకుఁ గలఁక దేఱి ప్రసన్నుండైన ధర్మజుననుమతిఁ గృష్ణార్జునులు కర్ణవధానందనిమగ్నులై సమరమున కేగి రంత. 102

—శ్రీకృష్ణభీమపార్థులు సమరమున కేగుట.—

తే. నకులసహదేవసాత్యకుల్ ప్రకటయశులు, పౌరుషమున విజృంభించి కౌరవేంద్ర
సైన్యముఁ గవిసి రంతట శ్వసనసుతుఁడు, కురుకుమారుల నెల్లరఁ గూల్చుచుండె.
వ. అంత దుశ్శాసనుం డతని నెదుర్కొన నతం డతని కిట్లనియె. 104
తే. ప్రతిన నెఱవేర్చు కొనియెదు వాఁడ రమ్ము, యనుచు గంభీరముగఁ బల్కి యతని దాఁకి
ఘోరసంగ్రామ మొనరించి క్రూరు నతనిఁ దనగదాదండమహిమను ధరణిఁ గూల్చె.
క. కరువలితనూజుఁ డాతని, యురమును వ్రక్కలుగఁ జేసి యోహో రండో
కురువీరులార వేగమె, పరికింతురు గాక నా ప్రభావము మీరల్. 106
తే. ధార్తరాష్ట్రకులభ్రష్ట దైన్యచిత్త, యోరి దుర్యోధనా రార యోరి నీచ
నా ప్రతిన నెఱవేర్చుచున్నాఁడ నోరి, యడ్డుపడువార లున్నెడ నరుఁగుదెంచు. 107
వ. అని భీమసేనుండు మహోగ్రాకారుండై దుశ్శాసనుని రక్తము పాన మొనర్చి ద్రౌ
పదీపరిభవముఁ బాపనెంచి. 108

క. ఆతుచ్ఛుని వధియించిన, చేతులతో భీముఁ డపుడు చెచ్చెర సతికిన్
బ్రీతిని వేణి న్ముడువఁగ, నాతతశేఖరణము మోవ మంచెను దానన్. 109
తే. అంత వృషసేనుఁ డినసుతునాత్మజన్ముఁ, డతఁడు శ్వేతాశ్వునిం దాఁకి హతము నొందె
వాని మృతికి విచారించె భానుసూనుఁ, డపుడు ద్రౌణి దుర్యోధను కనియె నిట్లు.
తే. పాండవులతోడ మానుము భండనమును, సంధిఁ జేయుము వారితో జనవరేణ్య
నీదు మేలును గోరి యేనే వచింతు, ననిన వినఁడు సుయోధనుఁ డతనినుడులు.

—కర్ణనిమరణము.—

సీ. వృషసేనుమృతికిని విలపించి కర్ణుండు, గాండీవి వధియింపఁ గాఁ దలంచి
మనమునఁ బొందర మద్రేశ్వరునిఁ గాంచి, రథము సత్వరముగా రాజ నీవు
పార్థుఁడు నివసించు నైపుగాఁ దోలుమ, యనుచు నెడ నా శల్యుఁ డట్లొనర్చెఁ
గర్ణ నే నెవ్వఁడు గవియుదునో యని, యువ్విళులూరుచు నుండెఁ గట్టి
తే. పార్థభానుతనూజులు భండనమున, నొకరి కొకరు దీయక ప్రకటితముగ
ఘోరసమరం బొనర్చిరి వా రిరువురు, సాటిలేని బాహుబలులు శౌర్యధనులు. 112
క. యోధాగ్రేసరుఁడు మహా, క్రోధానలసన్నిభుండు గుంతికిఁ దొలిచూల్
రాధేయుం డాపాండవ, యోధులతోఁ బోరె సంగరోత్సాహమునన్. 113
వ. కర్ణుండు ప్రయోగించిన సర్పముఖవిశిఖములు కిరీటికిరీటంబును నేలం గూల్చె నయ్య
వసరంబున. 114
సీ. కృష్ణానుమతుఁడై నక్రీడి యనేకముల్, విశిఖముల్ కర్ణుపై వేయుచుండె
దుర్యోధనుఁడు యోధులను రాధేయసహాయముగాఁ బంపె నట్టియెడల

పార్థభానుజు లట్లు భండనం బొనరింప, రాధేయు రథముచక్రంబు లపుడు
భూమిలోనికిఁ గ్రుంకి పోయెఁ గర్ణునిపైన, నారాచము ల్వైచె నర్జునుండు

తే. అంత మదని రోష ముడిగి చింతతోడఁ, గర్ణుఁ డపుడు గాండీవినిఁ గాంచి రథము
చక్రములు భూమిలోఁ గ్రుంకె సవ్యసాచి, చక్రియుల నెత్తువఱకును సమర మాపు.

తే. నీవు రథముపై నుంటివి నేను భూమి పైన నుంటి నధర్మంపు భండనంబు
పాడిగాదు నీబోంట్లకుఁ బార్థ సమర మాపు మనుచును బల్కె నయ్యర్జునునకు.

తే. కృష్ణుఁ డవ్వాక్యము విని క్రీడిఁ గాంచి, కర్ణుఁ డొనరించునట్టిదుష్కార్యములను
జెప్పి కర్ణుని శిరమును శీఘ్రముగను, డొల్లసేయు మనుచుఁ జెప్పెఁ నల్లనయ్య. 117

వ. అర్జునుం డంత నొకఘోరశరంబు విడువ నయ్యది కర్ణునిఁ బుడమిం గూల్చె నయ్య
వసరమ్మున. 118

తే. కౌరవు లొనర్చి రప్పు డాహారవములు, సింహనాదముల్ పాండవుల్ చేసిరనుచు
సంజయుండు చెప్పఁగ విని స్వాంతమందు, నాంబికేయుండు దుఃఖించె నధికముగను.

వ. దుర్యోధనుండు కర్ణునిమృతికి మిక్కిలి విలపించుచుండె నంతఁ గృష్ణార్జునులీ వార్త
ను ధర్మనందనున కెఱింగింప శిబిరమున కేగి రజాతశత్రుండు వారి నిర్వురఁ గౌఁగి
లించె శ్రీకృష్ణుండు ధర్మరాజుతో సరససల్లాపము లాడుచుండెఁ బాండవులు కర్ణవధ
వలనఁ బ్రముదితమనస్కులై యుండి రని కర్ణపర్వవృత్తాంత మెఱింగించిన వైశంపా
యనుని జనమేజయుం డవ్వలికథావిధాన మడుగుటయు. 120

ఆశ్వాసాంతము

చ. భరతకులప్రదీపకుల భవ్యచరిత్రము లాలకించినన్
దురితము లెల్లఁ బోవు నని తోఁచుట భారతసత్కథామృతం
బరయఁగ నే రచించితి మహాత్మ భవత్పదపంకజంబులన్
స్థిరముగ నిల్పికోఁ గదవె దేవ పరాత్పర రాజశేఖరా. 121

గద్యము.

ఇది కవిరాజశ్రీపాదకృష్ణమూర్తి శాస్త్రిగారిపుత్రికయును,
కల్లూరివేంకటసుబ్బరాయఁడుగారి పత్నియును,
రాజ్యలక్ష్మీపరిణయాది గ్రంథకర్త్రియును, అగు
విశాలాక్షమ్మచే రచియింపఁ బడిన
భారతకథామృతంబునందుఁ.

కర్ణపర్వము

శ్రీపరమేశ్వరార్పణమస్తు

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

శ్రీరస్తు.

# భారతకథామృతము

## శల్యపర్వము.

క. శ్రీనగజావల్లభ నీనామోచ్చారణమున నిఖిలాఘంబుల్
బోనయి సకలశుభంబులు, జానుగ సమకూరుచుండుఁ జంద్రార్ధధరా. 1

వ. జనమేజయునకు వైశంపాయనుం డిట్లు చెప్పం దొడంగె నట్లు దుశ్శాసనవృషసేన
కర్ణులమరణానంతరమున దుర్యోధనుం డొకరహస్యప్రదేశంబున వార్ధికై విలపించు
చుండఁ గృపాచార్యుం డాతనికడ కేగి హితబోధగా నిట్లనియె. 2

—(కృపాచార్యుఁడు దుర్యోధనునకు హితబోధ చేయుట.)—

సీ. ఓయిసుయోధనా యుద్ధ మొనర్చుట, ధారణీశ్వరులకు ధర్మ మైన
దాని కడ్డంబుగ నే నొకమా టందు, నీమేలుఁ గోరుచు నృపవరేణ్య
సమరవిద్యానిధుల్ శాంతనవుండును, ద్రోణకర్ణులు మహోత్తుంగయశులు
పాండవేయులచేత భండనమందున, మడసిరి వింటివే మాననీయ

తే. బంధుమిత్రాదు లెల్లను వారివలన, గోలుపోయిరి ప్రాణముల్ వేలునేలు
వాసుదేవరక్షితు లగుఁ బాండుసుతులు, చెక్కుఁ జెదరక యుండిరి క్షితితలేంద్ర. 3

మత్తకోకిల. శ్వేతవాహనుఁ డుగ్రుఁడై వడి జివ్వయందున నెందఱో
భూతలేంద్రుల నేలఁ గూల్చెను భూరిశౌర్య మెలర్పఁగా
నీతనూజుల భ్రాతృవర్గ్యుల నేలఁ గూలిచె గాదె యో
భూతలేశ్వర యాజి సల్పెడుబుద్ధి నీ విఁక వీడుమా. 4

తే. వాయుసుతవాయుసాహాయ్యవశమువలన, నర్జునాగ్ని యీకురుసేన నడరి కాల్చె
నోయి నీవు నీతమ్ములున్ యోధవరులు, సైంధవునిఁ గాంచి రాతనిఁ జంపెఁ గట్టె. 5

క. కౌరవులఁ గెల్చి కదె యు, ర్వీరు జయద్రథు వధించె విజయుండు మహా
పౌరుషసమేతుఁ డాతఁడు, ధారణిలో నెవరిసముఁడు ధరణీనాథా. 6

వ. మఱియు నర్జును పరాక్రమ మసామాన్య మని నీ వెఱుంగుదువు. 7

తే. పదియు నేడుదినంబులఁ బవర మయ్యె, నలసి యుండిరి మీయిరువురబలమువారు
పాండవబలముమాత్రము పాకశాస, నాత్మజునిపౌరుషంబున నతిశయిల్లు. 8

తే. నీబలంబున యోధుల నెమ్మొగములు, వేడిలోఁ గలతామరతూడులట్లు
వాడియుండె నిప్పగిది నీబలము గెలువఁ, బార్థునకుఁ జులకన యగుఁ బార్థివేంద్ర. 9

సీ. సాత్యకిభీములసాహాయ్యమును గొని, మనసేనఁ గవియుఁ బాల్గునకు మేము
నందఱ మొక్కఁడయె త్తని నీవెఱుంగుము, పవమానసూనుని ప్రతినలందు
నొక్కటి తీఱె నింకొకటి తీరఁగ నుండె, సంధిఁ జేయఁగ మంచిసమయ మిదియె.
నాపలుకుల కీవు కోపగింపఁగఁ బోకు, సంగర మయ్యె నిష్కారణముగ
తే. జనము చచ్చిరి మెండుగా జనవరేణ్య, క్రోధమును వీడు మింక దీర్ఘకోపునకును
శుభము లెందునఁ గల్గ వోయిభపురీశ, నాదువాక్యము లాలింపు నయము మీఱ.
వ. వైరులచేఁ గూల్పఁబడువేళ సంధిఁగోరుట పరమకర్తవ్యంబనియార్యులు పల్కుదురు.
తే. నాకుఁ గలయోధవర్గము నశమొందెఁ, నాజిభారము నాతలయందుఁ బడియె
నీవు ధర్మజుఁ జూడుము నెమ్మితోడ, గౌరవించు నతఁడు నిన్నుఁ గౌరవేంద్ర. 12
క. అతఁడె నీరాజ్యంబును, బ్రీతిఁ జెలఁగ నీ కొసంగు వినుమనుసుల్
భూతలనాయక నీకుఁ, ఖ్యాతిఁ గలుఁగుచుండు దానఁ గరిపురనాథా. 13
తే. నిదుమేలు గోరినవాఁడ నేను నాదు, మాటలను ద్రోసివేయక పాటిసేయు
చక్రధరుఁడు దీనికి మదినమ్మతించు, మిగతవారు ధర్మజుమాట మీఱ రధిప. 14
వ. అంతఁ గృపాచార్యునకు దుర్యోధనుం డిట్లనియె. 15

—సుయోధనుఁడు కృపుని హితమునిరాకరించుట—

తే. దేవ నాయభివృద్ధిని నీవుఁ గోరి, సెలవొసంగినదానికిఁ జిత్తమందు
మోద మయ్యెను నీనుడు లాదరింప, నిచ్చ లేకుండె నాకు నదేల యనిన. 16
మ. కపటద్యూతము పన్ని రాజ్యము మహాకాపట్యత న్గాంచి యా
ద్రుపదేశాత్మజ చీఱ లొల్చి సభలో దూషించి యప్పట్టునన్
విపినావాస మొనర్చి, జేసియు, గడుఁ విక్లేశముం గూర్చి యే
నిపు డాధర్మజు సంధి గోరు టనఁగా హీనంబు, గాదే గురూ. 17
సీ. నాఁడు పాండవదూత నందతనూజుండు, సంధికార్యంబును సలుప నెంచి
యెన్నిసీతులఁ బల్కె నే విన నైతినే, నప్రియ మాడితి నతనితోడ
నపుడ నేరులు గూడి యభిమన్యునివధింప, నియమించియుంటిని నిశ్చయముగ
రణరంగమున బంధు లను మృత్యుపాలన, బెట్టి గన్నులఁ గాంచి యిట్టులుంటి
తే. వాయుసూనుండు తనగలప్రతిన నొకటి, దుస్ససేను నెడలఁ దీర్చెఁ దొడరఁ గంటిఁ
బాండవులకు నే భీతిల్లి వాఁడ నగుచుఁ సంధిఁ గోరుట యింక నేల సంభవించు. 18
తే. ఇంతియే కాక సకలసుహృత్వగులును, నాకు వారెల్ల నరిగాపు లై కొలువఁగ
నేల నాలుగు చెఱఁగుల [illegible] మండి, యర్థులను బ్రోచి శత్రుల హాతమొనర్తు. 19

వ. చతుస్సముద్రముద్రిత మహీమండలం బవక్రవిక్రమంబునం బరిపాలించు నావాక్యము లాలకింపుఁడు. 20

తే. ఎట్టులైనఁ బాండవులతో నీదినమున, భండనం బొనరించెదు వాఁడ నేను
మీర లిందుల కేమియు మాఱుపల్కక, మంచి సమ్మతించి యనుజ్ఞ నిండు నాకు. 21

వ. అనినఁ గృపుండును వాని కేమియుఁ బల్కక యూఱకుండెనంతఁ గృపాశ్వత్థామశల్యులు సుయోధనున కిట్లనిరి. 22

ఉ. భూతలనాథ మానుషులు పోల్చి వినంగదె మీర లెల్లరీ
రాతిరి యిందున స్మసలు నా దలపార్థులు కర్ణుఁ గూల్చుటల్
ఘాతను మీ కొనర్తు రని గల్గెడు సందియ మింక వేగమే
యీతటి మీఱ లొండుకడ కేఁగుఁగ నౌను రహస్యసంగతిన్. 23

తే. ఇచటినుండియె మనము వేఱెచటి కైన, నరిఁగి బలముల సంసిద్ధపఱచి రేపు
సమరమును బొనరింపఁగ సాఁగుద మన, నాసుయోధనుఁ డది మెచ్చె నాత్మలోన.

వ. అంత దుర్యోధనుండు వారి నెల్లర వెంటఁ బెట్టుకొని సరస్వతీ తీరమ్మున కేగెనంత.

శల్యాభిషేకము.

సీ. గురుకృపాశ్వత్థామవరుల యనుజ్ఞతో, దుర్యోధనుం డప్పు దొరలయందు
శల్యధరానాథు సర్వసైన్యములకు, సేనాపతినిఁ గాఁగఁ జేసి యుండె
సమరమునందునఁ జావనివారల, యుద్ధ మొనర్పఁగ సిద్ధపఱచెఁ
జారులవలనను సర్వవృత్తాంతము, విని ధర్మజుఁడు నందతనయుఁ గాంచి.

తే. శల్యు సైన్యాధిపతిఁ గాఁగ పలిపియుండి, బలముసెల్లను నాయితంపఱచె నంట
నాసుయోధనుఁ డోయిమహానుభావ, నీవు సెలవిచ్చినట్లుగా నే నొనర్తు. 26

వ. కర్తవ్య మెఱిఁగింపు మని ధర్మనందనుండు వసుదేవనందనుం గోర నవ్వరయాత్ముం డిట్లు ప్రత్యుత్తర మొసంగె. 27

తే. శల్యుబలమున నెఱుఁగుదు శమనతనయ. శౌర్యధైర్యములందు న శాంతనవుని
కుంభసంభవు కన్న నెక్కుడగునతఁడు, వానితోఁ బోర నేరికి వశముఁ గాదు. 28

సీ. సేనాపతిగ వానిఁ జేయుటవలనను, మఱియు విజృంభించు మద్రవిభుఁడు
భీమపార్థులును గవిసి యేమివానిని, సాత్యకి నిల్వఁగాఁ జాలఁ డండు
వినుము ధృష్టద్యుమ్నుఁడును జెనకఁగ లేఁడు, శల్యు మారొ్కనఁ గను జాలరెవరు
నీవు చాలుదు గెల్వ నిజము ధర్మదేశ్వరు, నిన్ను మించినవార లున్నవారె

తే. మేనమామను యముచున్ గృపఁ బూవకుండ, రాజధర్మ మనుసరించి రణమునందు.

శల్యుదర్ప మణంచు నోపుదవ రేని, సర్వరాజ్యము నీవశ మగు నవల. 29

తే. ఆపగేయుఁడు ద్రోణుఁ డయ్యర్కసుతుఁడు, మడిసియుండిరి పార్థునిమహిమవలన
మద్రభూమీశ్వరుని నీవు మడియఁ జేయు, మవలఁ దృటిలోనఁ గురునాథుఁ డంత మొందు.

వ. అని నారాయణుండు విన్నవించిన సమ్మతించి పాండవాగ్రజుండు శల్యుని మార్కొన బలములు సమరమునకు సిద్ధ మొనర్చుచుండె నయ్యవసరమ్మున. 31

—(శల్య పాండవుల యుద్ధము.)—

తే. ఉభయబలములు రేఁగెంచె నాయుద్ధమునకు, నిరుబలంబులలో వీరవరులు తమను
బాహుబలశౌర్యములు జూప వైరివీర, వరులతోఁ బోరుచుండిరి పౌరుషమున. 32

వ. అంతఁ గురుపాండవుల పదునెన్మిదవనాఁటి యుద్ధ ప్రారంభ మగుటయు నయ్యెడఁ గర్ణపుత్రులు చిత్రసేనసత్యసుకర్ములు నకులునివలనఁ జచ్చుటయు శల్యభీమసేనుల గదాయుద్ధంబును నయ్యె నంత. 33

ఉ. భీముఁడు శల్యభూవరుని వీఁకఁ జెలంగుచు మూర్ఛఁ బుచ్చఁగా
నామహితాత్ముఁ డాకృపుఁడు నయ్యెడ నయ్యది కాంచి వచ్చి యా
భూవమిరేణ్యు శల్యుఁ గొని పోయెను రంగమునుండి యంత సు
త్రామతనూజు మార్కొనిరి ద్రౌణి కృపాదులువీరు లయ్యెడన్. 34

వ. దుర్యోధనుండు దృష్టద్యుమ్నుని మార్కొనియె నంత. 35

తే. పోరు ఘోరమైయొప్పెను బోరు సెలఁగ, పాండునందను లంతట దండిమీఱ
సింహనాదము లెల్లెడ జేయుచుండి, రిరుతెగలుఁ బోరుచుండె వా రరయ నంత. 36

తే. శల్యధర్మనందను లతిశౌర్య మలర, నొకరికొకరు తీయక వార లొకరినొకరును
వివిధశస్త్రాస్త్రజాతముల్ వేయుచుండి, చూచువారిమదికి భీతిఁ దోచునట్లు. 37

వ. శల్యబాణములకు ధర్మజుండు మూర్ఛితుం డయ్యె నయ్యెడ సురథుం డను పాంచాలకుమారుఁ డశ్వత్థామచేఁ జచ్చె మరల శల్యధర్మపుత్రులు ద్వంద్వయుద్ధ మొనర్చుటయు విరథుండైన శల్యు నశ్వత్థామ తమరథమున నెక్కించికొని పోయె మరల శల్యధర్మరాజులు సమర మొనర్చి రయ్యవసరమ్మున. 38

సీ. ధర్మనందనుఁ డంతఁ దనభుజబలపరాక్రమములతో శల్యుఁ గవిసె నపుడు
మద్రాధినాథునిమహితరథంబును, విరుఁగఁ గొట్టెను ధర్మపృథ్వీవరుఁడు
సారథిఁ జంపి యశ్వముల నేలకు గూల్చి, శక్తి ప్రయోగించె శల్యుమీఁద
విగతజీవుం డయి వెస మద్రభూపతి, భూతలంబునఁ బడి పోయె నతం

తే. శల్యుమరణమునకు బంధుజాల మెల్ల, గోపమున ధర్మసుతు నెదుర్కొనఁగఁ బార్థ
దుప్రదసూనులు వారలఁ దోర్బలమున, సంహరించిరి యప్పు డాసమయమందు. 39

తే. పాండవబలమునందునఁ బలసివిజయసూచనార్థము గాఁగను శుభము గూర్చు
మంగళమృదంగవాద్యముల్ రంగు మీఱ, సింహనాదము లెల్లెడఁ జేయుచుండి.

వ. కౌరవు లాహాకారము లొనర్చుచుండ దుర్యోధనుండు శల్యుని మరణమునకు విల
పించి సాల్వుని పాండవులం దాఁకు మని పలికె నంత. 41

తే. సాల్వుఁడు గజాధిరూఢుఁడై సమరమందుఁ, బాండవులపైన బాణముల్ వైచుచుండె
వైరిసేనలపై నేన్గుఁ బరపుచుండ, వానినేలకుఁ గూల్చెను బార్షతుండు. 42

వ. శకుని సహదేవుని మార్కొని మడిసె హతశేషులు గుడాకేశుని మార్కొని హ
తులై రంత సుయోధనుపార్శ్వంబును కృష్ణార్జునులు పరిసంగించుచుండి రంత
దుర్విషహప్రభృతికుమారులు భీమునిచే నంత మొంది రులూకుండు సహదేవుని
చే మృతుఁ డయ్యెఁ గురుబలంబున గృతకృపాశ్వత్థామసుయోధనులే మిగిలి యుండిరి
రణరంగ మల్ల కల్లోలమై యుండె నంత. 43

చ. కురుకులవంశపాంసనుఁడు క్రూరసుయోధనుఁ డంత మద్రభూ
వరుమరణంబు దా విని బాష్పము లంతటఁ గాఱఁ గన్నులన్
గరముల చాపముల్ ముఖవికాసము సంగరకౌతుకంబునున్
బొఱిపొఱి నొక్కసారి గనె పోయెను నేలకుఁ జారి యయ్యెడన్. 44

—సుయోధనుఁడు ద్వైపాయనమున దాఁగుట—

సీ. అక్కట పదునొకం డక్షౌహిణీసైన్యములకు నధినాథుఁడు కురువిభుండు
నూర్వురతోఁ బుట్టు సర్వమహీశుండు దుర్యోధనవిభుండు దురమునందు
నొంటరిగాఁగఁ దా నుండెఁ గౌరవసైన్యములు వార లెల్లరుఁ గూలి రవని
గృపుఁడు నశ్వత్థామ కృతవర్మలును వారుఁ మువ్వురె జీవించిరా బవరమందు

తే. అపుడు దుర్యోధనుండు తా నాజి విడిచి, గదను ధరియించి యొంటరిఁ గదలిపోయి
పాండవులకునుగనఁబడకుండఁ దాఁగె, నొడయఁడతఁడు ద్వైపాయనమడుగునందు.

వ. ద్వైపాయనంబనుమడుగున జలస్తంభనవిద్యచే దాగినసుయోధనునిపాలికిఁ గృపకృత
వర్మాశ్వత్థామ లేగి యిట్లనిరి. 46

చ. కురువర మాసహాయమున ఘోరరణం బొనరింపు మింకిటన్
దురమున కేగఁ దేరఁ గదె దోర్బలవిక్రమసాహసంబునన్
భరతులఁ బాండునందనులఁ బట్టి వధింపు మటంచుఁ బల్కఁగాఁ
గురుపతి యప్పు డి ట్లనియెఁ గొందలమందుచు వారితోడుతన్. 47

తే. అలసి యుండె నాదు శరీర మార్యులార, మీర లెల్లరు నలసియున్నార లేమొ

యిపుడు విశ్రాంతిఁ గొనవలె నెనఁగ మీరు,సలుపుదము రేపటిదినముసంగరమ్ము.

వ. అనిపల్కు నంతఁ బాండవులు దుర్యోధనుండు ద్వైపాయనమునఁ డాఁగి యుంటఁ జారులవలన విని వానిని వెదకుచు వచ్చుచుండి రంత నశ్వత్థామ దుర్యోధనున కి ట్లనియె. 49

సీ. కౌరవాధీశ్వర కౌంతేయు లేతెంచు,చుండిరి చూడుము భండనమున
వీరితో నిప్పుడు పోరుదమా లేక, యెచ్చటికైనను నేఁగి వారి
వెనుకర మ్మనుచు నాజ్ఞ నొసంగువారమా, యనిన దుర్యోధనుఁ డనియె నిట్లు
సంగర మొనరింప సంతసమే లేదు, యిపుడు మీ రెచ్చోటి కేని యరిగి
తే. రాత్రివేళ నిచ్చోటకు రండు మీర, లమల మగుజలస్తంభవిద్యావిశేష
మునను నే నిందు దాగియుండెదను నన్ను, పాండవేయులు గుర్తించువారు కారు.

వ. అని పలికినఁ గృపాశ్వత్థామకృతవర్మలు దుర్యోధనుని వీడ్కొని పోరి రయ్యవసరంబున. 51

తే. అంతఁ జారులవలన వృత్తాంత మెల్ల, నెఱిఁగి పాండవు లచ్చోటి కేగుదెంచి
యందు ధార్తరాష్ట్రాగ్రజు నరసి వారు, వానిఁ బైకి రప్పింపఁగ వడువు తలఁచి. 52

వ. జలాశయంబునఁ గలసుయోధనుం గూర్చి పెద్దయెలుంగున నజాతశత్రుం డి ట్లనియె.

సీ. కౌరవాధీశ్వర ధారుణీనాయకు, లరికాపులై కొల్వ నవని నెల్ల
నేకఛత్రంబున నేలినవాఁడవు, శత్రుల నిర్జించి సంగరమున
నిన్నటివఱకును నీవు మాతోడను, ఘోరపరాకృతినిఁ బో రొనర్చి
నీకై రణంబున భూకాంతు లెల్లరుఁ, బ్రాణముల్ వీడిరి వారిఁ గాంచి
తే. పిఱికితనమున నిట్లుగా బేల వగుచు, నీరమందున దాఁగుట నీకుఁ దగునె
క్షత్రధర్మముఁ గా దిది జనవరేణ్య, లేచి రమ్ము పై కతివేగ లేచి రమ్ము. 54

ఉ. శూరుఁడ వంచు నీవు మును క్షోణిఁ దనర్చినయట్టివానినిన్
భీరుఁ డటంచు నెల్లరును బిల్వఁగ న్యాయము గాదు కావునన్
వీరులు మెచ్చునట్లు గను వీరరణం బొనరింపు మిట్లుగా
నీరమునందు దాఁగుటలు నీ కుచితం బగునే కురూద్వహా. 55

తే. అంతమంది బాంధవులు నీయాత్మజులును,సఖులు రణరంగమునఁ జావఁ జూచి
యిట్టిపనిఁ జేయ నీమన మెట్టు లొప్పె, మాన మెక్కుడు ప్రాణసమానముగదె.

క. రారాజు కౌరవేంద్రుఁడు, భీరుండై పాండవులకు వెన్నిచ్చెను దా
నీరమున దాఁగి నాఁడని, ధారుణి జనులండ్రు నిన్ను ధరణీనాథా. 57

తే. భయము దూరముగా నీవు బాఱఁ దోలి, రణ మొనర్ప సంసిద్ధుఁడై రమ్ము పైకి
చావొ లేక జయమొ నీకు సంభవించు, జయము నపజయమును దైవసమ్మతములు.
తే. మమ్ము గెలిచితివేని యో మానవేంద్ర, నీవొగి సముద్రముద్రితభూవలయము
శంకలేకఁ బాలింతువు చచ్చితేని, స్వర్గమందునఁ గాంతువు సౌఖ్యములను. 59
వ. అనిన యుధిష్ఠిరవాక్యములకు రోషారుణితనేత్రుండై ధార్తరాష్ట్రాగ్రజుండు పాండ
వాగ్రజున కిట్లనియె. 60
తే. పాండవాగ్రజ మీకును బవరమందు, నె భయమున దాఁగఁగ లేదు నిశ్చయముగ
సమరమందు నాయాసము సంభవించె, బడలికను బాపఁగా నెంచి వచ్చితి నిట.
తే. మీరు సమరము దలసియున్నారు కాన, నేటి కిఁక విశ్రమింపుఁడు నృపవరేణ్య
యవల రణ మొనరింపఁగ నయ్యెడునన, బాండవాగ్రజుఁ డిట్లనె వానితోడ. 62
వ. విశ్రమించిన కాలము చాలు నింక విశ్రమింపవలదు గావున వేవేగ మసుగుచుండి ర
మ్మన దుర్యోధనుండు ధర్మజున కిట్లనియె. 63
సీ. ఎవ్వారికొఱకు నే నీరాజ్యభాగము, నాశించి పోరాట మాడినానొ
యట్టితమ్ములు లక్ష్మణాదికుమారులు, ననిలోన మీచేత హతులైరి
యింక నే నీరాజ్య మెవ్వారికొఱకునై, పోరాడువాఁడను భూతలేశ
మిమ్ము ధృష్టద్యుమ్నప్రముఖాదివీరుల, దర్పహీనులఁ జేయఁ దలఁపె కాని
తే. కురుపితామహ కర్ణుఁడు గురుఁడు లేమి, నాకు సంతోష మొందును లేకపోయె
రాజు సకు బంధుమిత్రులు ప్రబలకున్న, రాజ్య మదియొక రాజ్యమే రాజచంద్ర. 64
క. నీతమ్ములు పరిజనులును, నీతరుణులు సుఖము నుండ్రు నిశ్చింతుఁడవై
ఖ్యాతిమెయిఁ బౌరుషంబున, భూతల మిఁక నేలుకొనుము పూరుకులేంద్రా. 65
తే. ధాత్రిఁ బాలింపు నీ విఁక ధర్మరాజ, సమర మే నొల్ల నింక రాజ్యంబు నొల్ల
రాజ్య మెల్ల నీ కిచ్చి యరణ్యములకుఁ బోయి తాపసవృత్తినిఁ బూనువాఁడ. 66
తే. రథగజతురంగహీన మా రాజ్య మెల్ల నీతలనె గట్టుకొని యేలు భూతలేశ
యన సుయోధను పల్కులకల్కఁ బొంది, ధర్మజుఁడు వానికిట్లు లుత్తరమొసంగె 67
సీ. దాన మందుట రాజధర్మముగాఁ బోదు, నీ విచ్చుభాగ్యము నేను గోర
సమరమందున నిన్ను సంహార మొనరించి, రాజ్యముఁ బాలింతు రాణ లెసఁగ
మము నీవు గెల్చిన మహి యేలుకొనవచ్చు, రాజ్యము మా కిచ్చు రాజ వైన
గురుకులంబున కిట్టి ఘోరముగల్గునా, సంధిఁ గోరఁగ వచ్చు చక్రధరుని
తే. వాసుదేవునితోడను బాండవులకు, సూది మోపఁగఁ జాలినక్షోణి నొసఁగ

ననినమాటలు మరచి యిట్లనుట యేల, వైరులకు రాజ్య మిచ్చెడుప్రభువుగలఁడె.

క. నామాట లాలకింపుము, భూమీశ్వర ధర్మమార్గమును జూడుము సం
గ్రామం బొనర్పఁ దగును,ద్దామబలాఢ్యుండ విట్లు తగునే పలుకన్. 69

వ. అని పలికినఁ గౌంతేయాగ్రజునకు గాంధారేయాగ్రజుండి ట్లనియె. 70

తే. మీరు బంధుమిత్త్రాదిసమేతులరును, నేను యోధవీరాదివిహీనుఁ డగుదు
మీర లొక్కొ రొక్కరు వచ్చి పోరునెడఁ, మిమ్ము నందఱఁ గూల్చెదమిక్కుటముగ.

సీ. ఒకనితో నెల్లరు యుద్ధ మొనర్చుట, ధర్మముఁ గా దని తలఁపవలయు
నట్లు సేయకయున్న నందఱనుం గూడఁ బట్టి వధించెద బలము కలిమి
కృష్ణునకును నీకుఁ గ్రీడికి భీతిల్లి, యిట్లంటివనుచు మీ రెంచవలదు
సమరమునందు ధర్మము మీకుఁ దెలుపఁగా, నిట్లు నే నంటి మహీతలేశ

తే. అనిన ధర్మజుఁ డాతని కనియె నిట్లు, కావలసిన నస్త్రాదుల నేవియైన
నిచ్చువార మాలమునకుఁ జొచ్చి యింక, నెవరితోఁ బోరువాడవో యెఱుఁగఁ జేయు.

వ. అనిన సుయోధనుండు వృకోదరునితో గదాయుద్ధ మొనర్తు నని యాహ్రాదంబు
నుండి వెలువడి వచ్చె నంత భీమసేనుండును సంసిద్ధుం డయ్యె. 73

క. బలరాముఁడు వారిబలాబలములఁ గనుఁగొనఁగ నటకు వచ్చినమీఁదన్
బలరామునకుం గురుపతి,యిలఁ జాగిలి మ్రొక్కె నప్పు డెంతయు భక్తిన్. 74

వ. ధర్మరాజవాసుదేవాదు లతని నాలింగన మొనర్చి రంతరౌహిణేయుండు పాండవా
గ్రజునకుఁ బ్రభాసతీర్థప్రభావమును మంకణమహామునిమాహాత్మ్యాభివర్ణనమును గు
మారస్వామిప్రభావాభివర్ణనమును కుమారస్వామి తారకాసురుం జంపి దేవతలకు
మోదముగూర్చుటయుఁ బ్రభావతి యనుమునికన్యాపరిభావమును గురుక్షేత్రపరిభా
వాభివర్ణనమును దెలిపి క్రమ్మఱ నజాతశత్రునకి ట్లనియె. 75

తే. ధర శమంతపంచక మది దురితహరము. నందుఁ జచ్చిన స్వర్గము నొందఁ గలరు
అచటఁ గయ్యము చేయఁ బుణ్యం బనంగ,సమ్మతించి వా రెల్లను చనిరి యటకు.

వ. బలరామప్రేరితులై వా రందఱు శమంతపంచకము చేరి రయ్యవసరంబున 77

## —దుర్యోధనుఁడు తొడలు విరిగిపడుట.—

తే భీమదుర్యోధను లమహాభీకరముగఁ, దమగదలతోడ నాజికిఁ దలపడుటయుఁ
గృష్ణునుమతి మీఁదను గ్రీడిచేత, నూరువులనప్పళించెను వారుచూడ. 78

వ. భీముం డయ్యది కాంచి దుర్యోధనుని తొడలు విఱుఁగుఁ గొట్టి వానిని వామపా
దంబునఁ దన్నిన బలరాముండు కోపించుటయు నతనికి వాసుదేవుండు తగుసమా
ధానము చెప్పె నయ్యెడ. 79

తే. దుష్టుఁడు సుయోధనుం డంతఁ దోయజాక్షు, సర్వవిధముల నిందించు సమయమందు
నచ్యుతుండు ప్రత్యుత్తర మతని కొసఁగెఁ, బోయె బలభద్రుఁడును నిజపురమునకును.
వ. పాండవులు కృష్ణసాత్యకులతో శిబిరమున కేగి రంత. 81
తే. అగ్నిదత్త మైనయర్జునుని రథంబు, కాలిపోయె నంతఁ గంసవైరి
కరిపురమున కేగి గాంధారి నూఱార్పఁ, దనమనంబులోనఁ దలచుచుండె. 82
వ. అంత శ్రీకృష్ణుండు గాంధారి నూఱార్చి పాండవులదరి కేతెంచె యుద్ధవార్తల ధృ
తరాష్ట్రున కెఱింగించు సంజయుండు దుర్యోధనుం గాంచి విలపించి క్రమ్మఱ నీవార్త
కృపాశ్వత్థామాదుల కెఱింగించి ధృతరాష్ట్రున కెఱింగించె నయ్యాంబికేయుండు
తనకుమారుని దుస్థితికి విలపించె నశ్వత్థామాదులు దుర్యోధనుం గాంచి సంతా
పించి రశ్వత్థామ పాండవుల సంహరింతు నని దుర్యోధనానుమతుండై చనియె
దుర్యోధనుం డేకాకియై సంగరరంగమందుఁ దనగతిం దలంచి విలపించుచుండెఁ
బాండురాజనందనులు విజయలక్ష్మీసమేతులై యుండి రని చెప్పిన విని జనమేజయుం
డవ్వలివృత్తాంతము దెలుపుమని వైశంపాయను నడుగుటయు. 83

ఆశ్వాసాంతము.

ఉ. వ్రాసితి సంగ్రహంబుగను భారతకావ్యము దీనియందునన్
బ్రాసలు వర్ణముల్ యతులు వ్యాకరణంబు గణింప నైతి నా
చేసినతప్పులన్ సయిచి చేకొని ప్రోవుము నాదుకావ్యముఁ
భాసుర మైననీదుపదపద్మయుగంబు భజింతు నీశ్వరా. 84

గద్యము.

ఇది కవిరాజ శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రిగారి పుత్రికయును,
కల్లూరి వేంకటసుబ్బరాయఁడుగారి పత్నియును,
రాజ్యలక్ష్మీపరిణయాది గ్రంథకర్త్రియును, అగు
విశాలాక్షమ్మచే రచియింపఁ బడిన
భారతకథామృతంబునందు.
శల్యపర్వము
శ్రీపరమేశ్వరార్పణమస్తు.
శ్రీ శ్రీ శ్రీ

శ్రీ ర స్తు

# భారతకథామృతము

## సౌప్తికపర్వము

క. శ్రీసర్వేశ్వర శంకర, భాసురసుగుణాలవాల పరమేశ్వర కై
లాసాచలవాస మహో, ల్లాసా మ మ్మేలుమూ లలాటాక్ష శివా. 1

వ. వైశంపాయనుండు జనమేజయున కవ్వలివృత్తాంత మిట్లు చెప్పం దొడంగె న ట్లశ్వ
త్థామ దుర్యోధనానుమతుండై కృపాదులతో నొకవటవృక్షచ్ఛాయను విశ్రమించి
యుండె నయ్యవసరమ్మున. 2

అశ్వత్థామ సుప్తులగు ద్రౌపదేయాదుల సంహరించుట.

చ. తరువున గూబయొం డొక్కెడ తద్దయు నిద్దురఁ బోవు కాకులన్
బొరిపొరిఁ జంపుచుండ గురుపుత్త్రుఁడు కన్గొనె నవ్విధంబు ని
ద్దురఁ గొను శత్రువీరులను దున్ముట మే లగు నంచు నెంచుచున్
గురుసుతుఁ డంత నాకృపునకు న్వచియింపఁ దలంచి యి ట్లనున్. 3

ఉ. మాతుల యుద్ధమందున నమానుషవీరుఁ డొకండు ద్రోణునిన్
ఘాత యొనర్చి నాఁ డతనిఁ గాలునిప్రోలికిఁ బంపునంతకున్
నాతల యెత్తి నే దిరుగ న్యాయముగాఁ గనుపింపఁ దయ్యె నీ
రాత్రి పాండవేయశిబిరంబున నిద్రితుల న్వధించెదన్. 4

సీ. ఈ రేయి పాండవ వీరవరేణ్యుల, నిద్రించువారల నే వధింతుఁ
బాండవవీరశవములఁ బెంట లొనర్చి, భూతాళికెల్లను బ్రీతి సేతు
నీచు ధృష్టద్యుమ్ను వధించి నను గాని, పరిభవమున శాంతిఁ బడఁగ నగునె
శత్రుల నెల్లర సంహార మొనరించి, కృతకృత్యుఁ డయ్యెద క్షితితలమున

తే. ననఁ గృపాచార్యుఁ డిట్లనె నతనితోడ, శత్రువుల సంహరించుట చాల మేలె
యిపుడు తొందరపడ నేల యింతనీవు, డస్సితివి విశ్రమింపగాఁ దగుఁ గుమార. 5

తే. విశ్రమింపుము నేఁటికి వినుతచరిత, రేపు మన మెల్లరము గూడి రిపులఁ గూల్ప
నగును నీకు మేము సహాయమగుచునుండఁ, బాండవుల నీవు వధియింపవచ్చునయ్య.

వ. మనలను మార్కొన దేవేంద్రునకు శక్యము గా దనుకృపాచార్యున కశ్వత్థామ
యి ట్లనియె. 7

సీ. అరుల జయింపంగ నాసక్తిఁ గలవాఁడు, ద్రవ్యము దాసక్తిఁ దనరువాఁడు
నిదురఁ బోరనమాట నీవె యెఱుంగుదు, చంపె నాచార్యుఁ బాంచాలసుతుఁడు

దానినిఁ గన్గొని రేఁచె నిటు లున్నాఁడ, భరియింపఁ జాల నాపరిభవమ్ము
కౌరవేంద్రుండు భగ్నోరుఁడై పడియుండె, శత్రుల నెల్లరఁ జంపకుండ
తే. నిదుర యేలవచ్చును నాకు నిశ్చయముగ, సౌప్తికసమయమునఁ బాండుజనవరేణ్య
సుతులఁ జతురంగబలసమాహితుల నారిఁ, జంపి పిమ్మట నిద్రింతు శౌర్య మడర.
వ. అప్పలుకు లాలకించి కృపుండు ద్రోణాయని కిట్లనియె. 9
సీ. నీచిత్తమందున నిర్మలధర్మము, నూహింపఁ గాఁ దగు నో కుమార
హితులు చెప్పిననీతు లెంచి యాలింపుము, సద్వర్తనంబున సంచరింపు
కోపంబు నీమదిఁ గూడ దెప్పటికిని, నావాక్యము ల్వినుము నయముమీఱ
శస్త్రవిహీనుల శరణుఁ జొచ్చినవారి, విగతరథుల సుప్తినిఁ గలవారి
తే. హత మొనర్చుట నీచమార్గ మండ్రు జనులు, చచ్చినట్టిరు నిద్రకు సాఁగువారు
నొకటియండ్రు శవము లట్టులుండి ధరణిఁ, బడి నిదురఁ జెందు వారిఁ జంపంగరాదు.
తే. మున్న ధర్మ మెఱుంగక యున్నవాఁడ, విప్పుడీపాప మొనరింప నేల నీకు
నీదినము విశ్రమింపవే యెల్లి నీవు, పౌరుషము చూపవచ్చును వైరులందు. 11
వ. అశ్వత్థామ మాతులునివాక్యములు విశ్వసింప నేరకఁ దనపూన్కి స్థిర మొనర్చి ఖ
డ్గాదిసాధనములం బూని పాండవశిబిరమున కేగె నయ్యవసరంబున. 12
తే. అతఁడు శిబిరములోనికి నరుగునెడల, శివుఁడు భూతాకృతిం దాల్చి చెలఁగెముందు
నదియె భూత మటంచు దానస్త్రములను, వైచె గురుసుతుఁ డన్నియు వ్యర్థమయ్యె.
వ. అయ్యవసరంబున. 14
క. మును దానిని భూతము గా, దని శివుని మనమునందు ధ్యానించుచుఁ దాఁ
దన కార్యము నెఱవేఱిన, గని యుపహారంబొసంగఁ గల ననివేఁడెన్. 15
వ. ఆత్మోపహారంబొసంగుదు నని ప్రార్థించిన ద్రోణికిఁ బరమశివుండు ప్రత్యక్షమై వై
రివీరులఁ దున్మాడ నొకమహాయుధం బొసంగి యదృశ్యుఁ డయ్యె నంత. 16
సీ. కుంభసంభవనిజ సంభవుం డంతటఁ, బాండవశిబిరము దండ కరిగె
నందు నిద్రాసక్తుఁ డైనధృష్టద్యుమ్ను, ని శిఖండినిఁ దున్మె విశిఖమహిమ
బాంచాలురెల్లర వధియించి ద్రౌపదీ, తనయపంచకముఁ దునిమి వైచె
నపుడు తాఁ గృతవర్మకృపులవద్దకుఁ బోయి, వృత్తాంత మెల్లను వినఁగఁ దెలిపె
తే. నంత నామువ్వురును గూడి యాసమయము, దొడలు విఱిఁగి ధరిత్రిపైఁ బడినవాని
నాసుయోధను గన్గొన నరిగి రంతఁ, గనుల నీరుఁగార్చుచు గురుతనయుఁ డనియె.
తే. సకలరాజచక్రంబును బ్రికటితముగ, భక్తితో నిన్నుఁ గొలువ నీవసుధ నేలు
చక్రవర్తివి నీ విట్లు సమరభూమి,దిక్కు లేకుండఁ బడితె పృథ్వీవరేణ్య. 18
వ. గదాయుద్ధప్రవీణుం డగుని న్నొకవీరుండు గదాయుద్ధమున నిర్జించెనా యని యి
ట్లనియె. 19

సీ. బలభద్రుఁడును శిష్యవర్గమందున నిన్ను, శౌర్యమూర్తి వటంచు సంతసించి
భీమునకే ధాత విజయంబు గూర్చి యాతనికోర్కి సఫలమ్మై తనరఁ జేసెఁ
గంటిరెప్పయుఁబోలెఁ గాపాడితివి మమ్ము, నీవు మడియుచుండ భూవరేణ్య
మే మీసమయమున నేమిచేయఁగ లేక, యూరకుండినవార మోనరేంద్ర
తే. న్యాయమును దప్పకుండఁగ నాజి సల్పి, యీశమంతపంచకమున నీల్గువలన
స్వర్గలోకము నొందెడు వాఁడ వగుదు, వేము నీతోడ రాకుంటి మిభపురీశ. 20
వ. నాశక్తివంచనములేకుండ శత్రువర్గము నిర్మూలముచేసి నీ కానందముఁ గల్గించుచు
కృత మనుభవించితి. 21
సీ. పాండవశిబిరము పరఁగఁ బ్రవేశించి, సౌప్తిక మయ్యెడుసమయమందు
నీచు ధృష్టద్యుమ్నుని శిఖండిని న్మఱిపాంచాలముఖ్యుల వధ యొనర్చి
ద్రౌపదీసుతులు మొదలుగ నెల్లరఁ జంపి, సకలబలంబులఁ జంపినాఁడ
వాసుదేవసహితపాండుతనూజుల, సాత్యకిప్రముఖుల జాడ లెఱుఁగ
తే. నవిన దుర్యోధనుఁడు తనయాత్మలోన, సంతసించెఁ బాంచాలుర చావునకును
ద్రౌణినిం గాంచి యోమహాత్మ భవత్పరాక్రమంబెన్నఁగా నాకు రాదుసుమ్ము.
వ. భూలోకంబున మీరుసర్వసౌఖ్యము లనుభవించుచుండుఁ డని రారాజగు దుర్యోధ
నుండు ప్రాణంబులు విడిచె నంత. 23

—ధృతరాష్ట్రుఁడు పుత్రమరణమునకు విలపించుట—

సీ. దుర్యోధనప్రభుమర్మరణంబును, సంజయువలనను నరవి నెఱిఁగి
వైచిత్రవీర్యుండు భరియింపఁగా రాని, దుఃఖసాగరమునఁ దొరఁగి తొరఁగి
మొదలునఱకువృక్షమును బోలె ధరణిపైఁ, బడి శోకమగ్నుఁడై యడలు చుండె
గాంధారిదేవి యాగరిత కోడండ్రయుఁ, బరితాప మెఱిఁగింపఁ దర మెవరికి
తే. అంబికేయుఁ డంతట దనయాత్మజన్ముఁ, దలఁచి సంజయుఁ గన్గొని పలికె నిట్లు
నీతికోవిద సంజయా నీరజాక్షు, దయను బాండుతనూజులు తనరుచుండ్రు. 24
సీ. హరిరక్షణంబున నలరారుపాండవుల, కీడేమియును లేక వేడు కలర
జెలఁగెద రనుచు నీపలికినపలుకులు, నాచేతము దహించె నాఁగ వింటె
కురుకుమారశతము ఘోరరణంబున, వైరులచేఁ గూలినా రటంను
నాలించి నాహృదయంబుఁ బగులకుండె, వజ్రనిర్మిత మేమొ పరఁగ నిదియు
తే. అకట యంధుఁడ నైయున్నయట్టినాకు, బాలకులవిహారంబుల లీల లైన
వినుచు పంతసింపుదు నని కొనిననాకు, నెట్టువచ్చెను సంజయా యేమి సేతు. 25
వ. అని తనతనయులఁ దలంచి పరిపరివిధంబుల విలపించి దుర్యోధను నుద్దేశించి యిట్ల
ని ప్రలాపించె. 26

సీ. చతురంగబలములసహితుఁడ వైననీ, వొంటిగా రణమున నుంటివో కౌ-
రణము గల్గు నటంచు వెనుక నే నన్ను, భీష్మాదు లుండిరి భీతి యేల
పాండుపుత్త్రులకును భయ మొంద నంటివి, రణరంగకుశలుఁడౌ రాధసుతుఁడు
పాండుతనూజులఁ బరిమార్చు నంటివి, నీ విట్లు పలుకుట నేను నమ్మి
తే. జయ మగునటంచు నెంచితి స్వాంతమందు, నూఱుగురుసోదరులతోడ ఘోరముగను
నీకు మరణము కల్గె ననిలసుతుండు, నీతొడలు విఱుగఁగఁ గొట్టి ఘాతసలిపె. 27
వ. అని విచారించుచుండ విదురుం డాతని నాశ్వాసించుచుండె నంత. 28
తే. బాలసూర్యోదయం బయ్యె వాసుదేవ, సాత్యకులును సహోదరుల్ శమనతనయు
నన్నుతింప ధృష్టద్యుమ్నుసారథి వడి, ధర్మనందనుకడకును దఱలి వచ్చి. 29
వ. ధృష్టద్యుమ్నశిఖండిద్రౌపదేయు లశ్వత్థామవలన హతులగుటఁ దెలిపిన నజాతశత్త్రుం
డు ప్రతివింధ్యాదులకొఱకు మిక్కిలి విలపించె నంత. 30
తే. ద్రౌపదీదేవి యంతటఁ దనదుసుతులు, సమసి రని విని చాలదుఃఖమును బొందె
బాండవులశిబిరం బేడ్పు నిండియుండె, శమననందనుతోఁడఁ బాంచాలి పలికె. 31
తే. అధికపాపాత్ముఁ డాచార్యునాత్మజుండు, నిద్రఁ బోవుచునుండిననిసుగులఁ గని
హింసఁ జేసె నయ్యది నన్ దహించుచుండె, వాని దాఁకివధింపఁగ వలయు మీరు.
వ. వానిం బరిమార్చినఁ గాని మదీయచిత్తమునకు శాంతిఁ గల్గ దని ద్రుపదరాజనం
దిని వాయునందనుం గాంచి యి ట్లనియె. 23
క. గురుసుతునతి దుష్టాత్ముని, బరాభవింపంగఁ బోవ వలె నని కోరన్
మరుత్తనూభవుఁ డంతట, గురునందను నప్డు డెదురు కొనఁగాఁ బోయెన్. 34
వ. నకులుని సారథిగాఁ జేసి భీముం డశ్వత్థామ నెదుర్కొనఁ బోయె నంత నమ్మనుజేం
ద్రున కమ్మురాంతకుఁ డి ట్లనియె. 35
క. అనిలతనూజుఁడు ద్రోణా, యనిఁ దాఁకఁగ నొంటి గాఁగ నరిగెను గురునం
దనునకుఁ దండ్రి యొసంగిన, ఘనబ్రహ్మశిరోఽస్త్ర ముండెఁ గౌరవనాథా. 36
వ. ద్రోణుండు బ్రహ్మశిరోనామాస్త్రమును శిష్యవాత్సల్యమున మనపార్థునకుఁ గూడ
నొసంగె నస్త్రగురుం డాయస్త్రము నరులపైఁ బ్రయోగింపవల దని యశ్వత్థామ
కెఱింగించె. 37
క. ద్రోణాయని చిరజీవుం, డే నెఱుఁగుదు నీ వెఱుఁగుదు వెల్ల రెఱుఁగఁగా
బాణము లనేకములు గా, వానికిఁ గలిగినవి యో ప్రభాకరతేజా. 38
తే. పెక్కుశరము లున్నవి యని వీరవరుల, నరకుఁ గొనఁ డెవ్వరిపైఁ గాని గురుసుతుండు

మున్ను మీ రరణ్యంబున నున్నవేళ, నతఁడు నాపురి కేతెంచి యనియె నిట్లు. 39

క. నాయొద్దబ్రహ్మశిరమను, నీయస్త్రము గలదు దీని నిదె నీ కిత్తున్
నీయొద్దచక్రమును నా, కీయుము మనుచు నడిగె నన్ను నిభపురనాథా. 40

వ. అందుల కశ్వత్థామతో నే నిట్లంటి. 41

తే. నాకు వలదు నీయస్త్రము లోకవినుత, నాకుఁ గలయస్త్రములలోన నీకు వలయు
దానిఁ గైకొను మనుచును నేను బలికి, నాదుచక్రఖడ్గాదుల నాదరమున. 42

వ. వానిముం దుంచిన నతండు సుదర్శనచక్రమును స్వీకరింపఁ దలంచి చేత నెత్త
బోయి దాని నెత్తలేక యూరకున్నవాని కిట్లంటి. 43

ఆ. తుహినశైలమందుఁ దొల్లి పండ్రెండేండ్లు, విపులభక్తితోడఁ దప మొనర్చి
యీసుదర్శనంబు నేను గైకొని పరాక్రమముతోడ నుంటి క్ష్మాతలమున. 44

ఆ. ఇంతవఱకు నన్ను నీచక్ర మడిగిన, వార లెవరు లేరు వసుధలోనఁ
బార్వతీశుఁ గెల్చి పాశుపతముగొన్న, యర్జునుండు దీని నడుగలేదు. 45

వ. నీ వీచక్రము గొని యెవరితోఁ బోరుదు వన నతండు నీతోనే పోరెద నని పల్కి
వెడలిపోయె నిప్పు డాబ్రహ్మశిరోస్త్రము భీమునిపైఁ బ్రయోగించు నేమో మన
మాతనికి సహాయ మొనర్పఁ బోవుద మనిన. 46

ఆ. ధర్మనందనుండు దైత్యారిపల్కుల, సమ్మతించె జక్రి సవ్యసాచిఁ
గూడి పోయె నంత గురుపుత్త్రుఁ జేరఁగా, మార్గమందుఁ గనియె మారుతి నట. 47

—అశ్వత్థామ బ్రహ్మాస్త్రము ప్రయోగించుట—

సీ. వ్యాసమునీంద్రునివాసస్థలంబున, ద్రౌణి పార్థుఁగాంచి తా నొనర్చు
పాపకార్యమునకుఁ బరితాపమును బొంది వారి నెదుర్కొన గోరి మరల
నస్త్రగురుఁ డొసంగు నాబ్రహ్మశిరమును, మంత్రించె నంతట మహితగతుల
నగు నపాండవ మంచు నాయస్త్రమును బ్రయో,గించెఁ బాండవులపై గింకుఁడగుచు.

తే. అప్పు డాబాణవహ్నికి నచ్యుతుండు, పార్థ యియ్యెడ నూచితే బ్రహ్మశిరము
నీవు బ్రహ్మశిరోస్త్రము వేవిడువుము, నీసభ్రాతృవర్గ్యుఁ గావు మాదరమున. 48

వ. అని దామోదరుండు పల్కెను. 49

ఆ. ఫాల్గునుండు వేగ బ్రహ్మశిరంబును, విడిచె ద్రౌణిపైన విమువఁ గానె
రెండుశరము లంత నొండొంటెనిం దాకి, ప్రళయ మాచరించుభంగిఁ దనరె. 50

ఉ. ఆసమయంబులోనన మహాత్ముఁడు నారదమౌనివర్యుఁడున్
వ్యాసమునీంద్రుఁ డచ్చటికి వచ్చి శరంబుల నాఁగ నెంచియున్
జే సని మధ్యగా నిలిచి వీరల వాదలఁ గాంచి యిట్లుగా

జేసితి రేల మీరనుడుఁ జెచ్చెరఁ బార్థుఁడు మౌని కిట్లనున్. 51

చ. మునివర యస్త్ర మస్త్రమునఁ బొందును శాంత మటంచు నెంచుచున్
దన రెడునస్త్రరాజమును ద్రౌణిపయిన్ విడనాడియుంటి మీ
రనఘులు గాన నా కెటులయాజ్ఞ నొసంగిన నస్త్రరాజమున్
జన నుపసంహరించుగతి సల్పెద నంచు వచించి యవ్వలన్. 52

వ. అని పలికి పార్థుండు బ్రహ్మశిరోస్త్ర ముపసంహరించె నశ్వత్థామ యట్లుపసంహార మొనర్ప లేక పారాశర్యున కిట్లనియె. 53

సీ. భీముఁ డధర్మసంగ్రామమునందున, దుర్యోధనునిఁ గూల్చి తొడలు విఱిచె
నూరకుండక యంత వీర లెల్లరుఁ గూడ, నన్ను మార్కొనవచ్చినారు దేవ
ప్రాణభయంబున నే నస్త్ర మిదియుఁ బ్రయోగించియుంటి నోయోగివర్య
యగు నపాండవము నాయస్త్రమువలనను, దప్పదు నామాట తప్ప దనిన

తే. అందులకు సత్యవతిసూనుఁ డతనిఁ గాంచి, చాపగురుఁడు నీయస్త్రము సవ్యసాచి
కొసఁగియుండెమున్నొక్కటిపొసఁగుపేర్మిఁ, నాతఁడుపసంహరించెనాయస్త్రమిపుడు.

వ. నిన్నును బాండవులను రక్షింప గోరినమావాక్యములను విశ్వసించి నీ వీయస్త్రము నుపసంహరించి నీశిరోరత్నము పాండవుల కిచ్చి నీవు కామరోషవర్జితుండవై తపం బొనర్పు మనుకృష్ణద్వైపాయనున కశ్వత్థామ యిట్లనియె. 55

తే. తాపసోత్తమ పార్థుండు దైవతాంశ, సంభవుఁడు గాన నాతఁడీ శరము నుపహ
రింపఁ గల్గె నే నుపసంహరింపఁ జాల, ననుచు వ్యాసునితో ద్రౌణి యనియె నంత.

తే. పాండవేయదారలకు గర్భంబు లెల్ల, హానిసల్పిన పిమ్మట నస్త్ర మిదియు
శాంతిఁ బొందెడు నని పల్కఁ జక్రధరుఁడు, ద్రౌణిఁ గన్గొని యిట్లని తా వచించె.

తే. పాండుపౌత్రుల నెల్లర వధయొనర్చి, యూరకుండక పాండవదారలకును
గర్భముల హరించెద నంటి నిశ్చయుండ, కావు మొకగర్భమైనను గరుణతోడ. 58

వ. ఒక్కగర్భము గాచి మిగిలినగర్భములు నీయస్త్రజ్వాలల దగ్ధముగాపింపు మన గు రునందనుండు దేవకీనందనున కిట్లనియె. 59

తే. పక్షపాతము చే నిట్లు పలికినావు, నీవు పల్కిన యట్లుగా నే నొనర్ప
గలుఁగు నాశరమున హాని గర్భములకు, నీవు రక్షించు గర్భము నే నెఱుఁగుదు. 60

క. ఉత్తరగర్భము బోవఁగ నిత్తఱి నీమదిఁ దలంచి తీవిధమున నీ
చిత్తమునఁ దలఁపకనిపుడు, త్యుత్తరము నొసంగె హరికి ద్రోణసుతుండున్. 61

వ. నీవాక్యపరికారము నెఱవేఱ దభిమన్యుపత్నిగర్భము మదీయాస్త్రంబున ధ్వంసము కాకమాన దనునశ్వత్థామకు మాధవుఁ డిట్లనియె. 62

తే. మున్నుపప్లావ్యమం దొకభూసురవరుఁ, డుత్తరను గాంచి పల్కెనీయుదరమందుఁ
బ్రాణములు పరిక్షీణించు బాలుఁ డొకఁడు, జననమొంది పరిక్షితుఁ డనఁగ నొప్పు.
వ. అమ్మహానుభావునివాక్యము లమోఘము లని పల్కి సరోషంబున గురునందనుగాంచి బాలఘాతి వగునీవు దుర్గంధమునఁ గృశించుచు మూఁడువేలవత్సరము లిలపై నుండు మని శపించె వేదవ్యాసుండును శ్రీకృష్ణశాపము తప్ప దని పల్కె నంత న శ్వత్థామవ్యాసానుమతిమైఁదనశిరోరత్నభూషణముపాండవులకొసంగితపింపంబోయె.
ఆ. పాండురాజసుతులు వాసుదేవునితోడఁ, బురికి నేగుదెంచి పుత్రశోక
విహ్వలమున నున్న వెలఁదిపాంచాలిని, యూరడించి రెల్లవారుఁ గూడి. 65
ఉ. ద్రౌణి యొసంగురత్నమును ద్రౌపది కిచ్చిరి వార లెల్ల ర
జ్ఞానన యాశిరోమణినిఁ బార్థివశేఖరుఁ డైనధర్మరా
ట్సూనుని దాల్చు మంటయును సుందరి కిమ్మదిఁ దృప్తిఁ గూర్పఁ గా
మానవనాథుఁ డంతటను మౌళికమున్ ధరియించి భాసిలెన్. 66
వ. అంతఁ గాంతేయాగ్రజునకుఁ గృష్ణుండు శివప్రభావం బెఱింగించి రుద్రుఁడు దేవత లొనర్చుయజ్ఞము సేయుటయుఁ దెల్పి ధర్మనందనద్రౌపదులను వాసుదేవుం డా శ్వాసించె నని చెప్పిన విని జనమేజయుం డవ్వలివృత్తాంతమును జెప్పుమని వైశంపాయను నడుగుటయు. 67

ఆశ్వాసాంతము

చ. నిరతము భక్తి శ్రద్ధ గొని నిన్ను భజించుచు నుంటి నయ్య నీ
చరణయుగంబె దిక్కనుచు స్వాంతమునందున నమ్మియుంటి నీ
భరతులసచ్చరిత్రమును వ్రాసి భవత్పమందుఁ జేర్చితిన్
గరుణఁ దలిర్ప నన్ను దయఁ గావుము శీతమయూఖశేఖరా. 68

గద్యము.

ఇది కవిరాజ శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రిగారి పుత్రికయును,
కల్లూరి వేంకటసుబ్బరాయఁడుగారి పత్నియును,
రాజ్యలక్ష్మీపరిణయాది గ్రంథకర్త్రియును, అగు
విశాలాక్షమ్మచే రచియింపఁ బడిన
భారతకథామృతంబునందు
సౌప్తికపర్వము
శ్రీపరమేశ్వరార్పణమస్తు.
శ్రీ శ్రీ శ్రీ

శ్రీ ర స్తు

# భారతకథామృతము

---

## స్త్రీ పర్వము

క. శ్రీ మహనీయగుణాంచిత, ప్రేమాకర సుస్వభావ విశ్వేశ్వర నీ
ప్రేమామృతనిడి భరతక, థామృతమిదిస్వీకరింపు మభవమహేశా. 1

వ. వైశంపాయనుండు జనమేజయున కనంతరకథా విధాన మెఱింగింపఁ దొడంగె. 2

తే. అట్లు దుర్యోధనుఁ డీల్గె నన్నవార్త, సంజయునివలన విని జనవరేణ్యుఁ
డాంబికేయుఁడు దుఃఖాబ్ధియందుఁ గూలి, చాలవిలపించుచుండిన సమయమందు. 3

వ. అప్పుడు సంజయుం డాధృతరాష్ట్రు నవలోకించి యి ట్లనియె. 4

—సంజయుండు ధృతరాష్ట్రు నూఱడించుట.—

సీ. ఓమహాధరణీశ సామాన్యునట్లుగా, శోకింపఁగా రాదు నీకు దేవ
యెవ్వరి కై యిటు లేడ్చుచునుంటివి, నీదుఃఖమునకును లేదు తెఱపు
సర్వసైన్యంబులు సకలాధినాథులు, బంధుమిత్రులును మీపక్షమందుఁ
గురుపితామహుఁడును గుంభజముఖ్యులు, నీపుత్రశతకము నృపలలామ
తే. శత్రువులచేత మడిసిరి సంగరమున, మేనుఁ దొరగినయాపత్తి వానికొఱకు
నీవు దుఃఖింపఁ దగినదే నిశ్చయముగ, నైన ధైర్యము తెచ్చుకొ మ్మమలచరిత. 5

వ. బంధువులకుఁ దిలోదకదానము లొనర్ప మన నాంబికేయుండు సంజయు నవలో
కించి యి ట్లనియె. 6

—ధృతరాష్ట్రునిశోకము.—

ఆ. దీనవృత్తి కలిగెఁ దెలియ నోసంజయ, యన్యదయకుఁ బాత్రుఁ డైతి నకట.
ఱెక్కలేసియట్టిపక్కినిఁ బోలె నా, బ్రతుకు వ్యర్థమయ్యె వసుధలోన. 7

సీ. పాండవదూతయై వసుదేవసూనుండు చనుదెంచి నిచటికి సంధిఁగోరి
యాతఁ డనేకముల్ నీతులు చెప్పెను, నాపగేయుండు నాయస్త్రగురుఁడు
పరశురామాదులు పరమతపోధనుల్, హిత ముపదేశించి రెసఁగ నాకు
వారు చెప్పినహితవచనము లేమియు, వినఁ జాల నైతిని వెఱ్ఱినగుట
తే. పాండుసుతులకు నేను లోభత్వమునను, నర్ధరాజ్య మొసఁగ కుంటి నక్క టకట
క్రూరచిత్తుఁడ నేను నాకారణమున, సకలబంధులు సమసి రోసంజయుండ. 8

క. నాకీడుఁ దలఁపకుండఁగ, నాకౌంతేయులధనమున కాశించితి నే
నే కుటిలాత్ముఁడ నైతిని, లేకుండిన నిట్టు లగునె లేశం బేనిన్. 9

తే. బంధువులనెల్లరను మృత్యువాతఁ ద్రోసి, నట్టి నా కిఁక బ్రదుకేల నవనిలోన

గతజననసుకృతము లేని కతమువలన, ఘోర మిట్లయ్యె నే నతిక్రూరుఁడఁ గదె. 10

వ. అని విచారించుచున్న చిత్రవీర్యసుతు దుఃఖోపశమన మొనర్పఁ గా విదురుం డిట్లనియె.

—(వ్యాసాదు లాంబికేయు నోదార్చుట)—

సీ. పిరికివారల నైన భీరుల నైనను, జంపుటలోనను శపమునుఁ దొందు
సందేహ మొందఁడు చక్రవర్తికి నైన, బలవంతులకు నైన వచ్చుఁ జావు
ప్రతినూనవునకు ను రణరంగమందు నే, సంభవింపదు చావు జనవరేణ్య
పుట్టినవారలు గిట్టక పోరుగా, యందఱు చచ్చెదునట్టివారె

తే. తనువు రూపు యౌవనము నిత్యములు గావు, యిందుకై విచారించుట దేల నీకు
నన్ని సంగతు లెఱిఁగినయట్టివాఁడ వీవు దుఃఖింపఁ బోకుము భూవరేణ్య. 12

వ. విదురసంజయు లూరడించునంత ధృతరాష్ట్రు నూరార్పఁ దలఁచి కృష్ణద్వైపాయనుం
డిట్లనియె. 13

తే. తనయ నీ వెఱుంగుదు సర్వధర్మములను, నన్ని విషయము లెఱిఁగినయట్టి నిన్ను
నూరడింప నేతెంచితి నోయివత్స, పుత్రమరణదుఃఖం బిటు పొందఁ దగునె. 14

తే. కౌరవులకుఁ బాండవులకు ధారుణీశ, వైర మది నీ వెఱుంగక వచ్చె నొక్కొ
దీనికారణ మెల్ల నీసూనుఁ డగును, విధివశంబును దప్పింప వేఁడు దగునె. 15

క. మిత్రులు బాంధవులును నీ, పుత్రులు భీష్మాదియోధముఖ్యులు మఱి నీ
శత్రులు స్వర్గముఁ గాంచిరి, పుత్రా వారికివిచారమును బొందకుమా. 16

సీ మొదట విదురుఁడు తా నిది యెల్లనెఱిఁగియే, హితము బోధించె నీ కెంతయేని
విన వైతి వయ్యది తనయ యింతే కాక, దైవవశముఁ దప్పఁ దరము కాదు
దాని మాన్పఁగ నేరి కేని శక్యమ్ముఁగా, దొకవిశేషము విను మొకమార
వెనుక నే నొకనాఁడు వెడలితి నాకమ్ము, భూదేవి యపు డింద్రముఖ్యులఁ గని

తే. నాదుభారముఁ దగ్గింపఁగాఁ దలంచి, యత్నమొనరింతు మనుచు మీ రనిరి కాని
యట్లొనర్పఁగ లేదు మీ రనఘులార, దారిఁ గాన్పింప కుండె నాభారమునకు. 17

వ. అని పలుకుధరాదేవిం గాంచి నారాయణుం డిట్లనియె. 18

తే. సరఁగ ధృతరాష్ట్రుఁ డనియెడు చక్రవర్తి, సుతుల నూర్వురఁ గాంచును క్షితితలమున
నందు దుర్యోధనుం డనునగ్రసుతుని వలన నీభార మది తగ్గఁ గలదు నిజము. 19

తే. వానిఁ బ్రోవంగఁ గొందఱు వానిఁ జంపఁ, గొందఱును బ్రయత్నించివారందఱు నొగి
నాకురుక్షేత్రమునయందు నాజి సల్పి, పుడమివల్లభు లెందఱో మడియఁ గలరు. 20

వ. దాన నీభారము దగ్గు నని భూదేవికి మాధవుండు వచించె నియ్యది దైవనిర్మాణ
మని తలఁచి శోకం బుడిగి పాండునందనులు నీనందను లని భావింపు మని పల్కిన

వ్యాసవాక్యములకుఁ గలఁకఁ దేరి ధృతరాష్ట్రుండు పాలికలని కేఁగ నెంచి సంజయు
నవలోకించి యి ట్లనియె. 21

తే. సంజయా కుంతి గాంధారి సాధ్వు లిపుడు, కురువధూమణులును దోడుకొనుము యిటకు
వేగరా వలె ననియును విన్నవింపు, మనిన నతఁడ ట్లొనర్చెఁ దా నంతలోన. 22

సీ. అపుడు శోకంబెల్ల నాకారమును దాల్చె, ననునట్లు గానుండి రచటివారు
శిరములఁ జేతులఁ జేర్చుకొనెడువారు, కనుల బాష్పంబులు కార్చువారు
పైటచేరఁగఁ గుండెఁ బాదుకొనెడువారు, తలలను మోదుచుఁ దలఁగువారు
పరుగెత్తువారలై వార లెల్లనుఁ గూడఁ, బవరమున్ దీర్చినపతులకొఱకు

తే. పుత్రబంధుల కొఱకును మిత్రులకును, సర్వవిధముల నేడ్చుచుఁ జనముఖులు
కురువధూమణు లెల్లరు పరమదుఃఖ, భరితలై పాలికలనికి నరుగఁ జనిరి. 23

—ధృతరాష్ట్రుండు కౌరవాంగనలతోఁ బాలికలని కేఁగుట—

వ. వైచిత్ర్యవీర్యుండు సర్వభారతభార్యాసమేతుండై పాలికలని కేగుచుండఁ గృపకృత
వర్మాశ్వత్థామలు వారి కెదురై విలపించి యి ట్లనిరి. 24

క. ధరణీశ చింతిలకుమీ, వరతనయులు శౌర్యధనులు పౌరుష మలరన్
దురమునం బోనర్చి వారలు, సురలోకము చేరినారు సుమ్మీ మహాత్మా. 25

వ. అని కృపుండు దీనవక్త్రయుఁ బుత్రవిహీనయు నగు గాంధారి కి ట్లనియె. 26

సీ. భవదీయపుత్రులు వైరివీరులఁ గూల్చి, వీరమరణ మొందినారు తల్లి
యట్టివారలఁ గూర్చి యాత్మలో నీవు వి, చారింపఁగా రాదు సాధ్వి మిన్న
దానాదులుత్తమధర్మములొనరుపఁ, గలిగెడుఫలమునఁ గంటె మిగుల
ననిలోనఁ జచ్చుట యధికపుణ్యం బని, వేదముల్ ఘోషించు వింటె యమ్మ

తే. అనుచు గాంధారి నూరార్చె నాకృపుండు, మువ్వురును వారియనుమతిఁ బొందిరవల
చనిరి కరిపురి కాకృపాచార్యుఁ డరిఁగె, ద్రౌణివ్యాసాశ్రమముచేరెఁ దప మొనర్ప

వ. కృతవర్మ ద్వారక కరిఁగె విచిత్రవీర్యాత్మజుండు పాలికలని కేతెంచు టాలకించి ధర్మ
జుండు కృష్ణానుమతుండై సహాయానుజముగా నాతని కెదురేగిన నల్లగు ధర్మజా
దులఁ గాంచి. 27

—ధర్మరాజు తమ్ములతో నాంబికేయుం జూడఁబోవుట.—

సీ. ధర్మరాజునకును ధర్మగుణము లేదు, తాతల మామల భ్రాతృవరులఁ
దనయుల ముఖ్యుల ననిఁ గూల్చినాఁ డని, యర్జునునిం గాంచి యనిరి యిట్లు
యాశిఖండికి వెన్క నడరి గాంగేయునిఁ, జంపి యుండె నితండు సాహసమున
భగిని దుస్సలకును భర్తయౌ సైంధవుఁ, దునిమె నీతం డని యనెడువారు

తే. ఇట్లు కౌరవకాంతలు పల్కిన నెల్ల వినియు, ధర్మనందనుఁ డంతటఁ దలను వంచి
పుత్రమరణమువలనను బొగులుచున్న, యాంబికేయుని దరిఁ జేరె నంతలోన. 29

వ. అజాతశత్రుం డంబికాపుత్రుని సమీపించి తత్పాదాబ్జములకు నెఱఁగి బంధుమిత్రాదుల
మరణమునకు మిక్కిలి శోకించి నంత భీమార్జుననకులసహదేవులు ధృతరాష్ట్రునకుఁ
దమనామము లెఱిఁగించి రంత. 30

తే. భీమసేనుని వాక్యము విన్న వెనుక, నాంబికేయుఁడు కోపము నందియుండ
వాసుదేవుఁడు వీక్షించి వాయుతనయు, నతనిదద్దకుఁ బోవల దని వచించె. 31

వ. ధృతరాష్ట్రుండు భీమునిఁ దనసమీపమునకు రమ్మని కోరుటయు నయ్యవసరంబున.

క. భీమప్రతిరూపమున న, యోమయము మగుప్రతిమఁ దెచ్చి యొగి కృష్ణుం డుర్
భీముం డితఁడే యని యా, భూమీశుని ముందు నుంచెఁ బోడిమి తోడన్. 33

మ. ధృతరాష్ట్రుం డది భీముఁడే యనియు నెంతే జిత్తమం దెంచి తా
నతికోపంబున దానిని న్నుఱువఁగా నబ్జాక్షుఁ డా దేవకీ
సుతుఁ డద్దానిని గాంచి నవ్వి పలికెన్ క్షోణీతలాధీశ్వరా
యతిశోకోన్నతి భీముఁ డీల్గె నని నీవానందముం బొందితే. 34

సీ. అతఁడు నీచేఁ జావఁ డవనీతలాధీశ,నీచేత నిప్పుడు నిశ్చయముగ
విఱువఁ బడినయది భీమసేనుఁడుగా డ,యోమయప్రతిమయే యోమహాత్మ
యీ విట్టిఁ దని యెంచి యీయుక్తిఁ బన్నితిఁ,గాకున్న నెడఁ బరాక్రమమునందు
నీసమానుఁడు లేడు నీచేఁబడినవాఁడు,మరల బ్రదుకలేడు మాన్యచరిత

తే. పుత్రమరణదుఃఖంబునఁ బొక్కి నీవ,ధర్మపథమున భీముని ధారుణీశ
చంపఁ దలఁచితె పార్థులఁ జంపు నెడల,నీతనయులు జీవింతురా నిజము చెపుము. 35

తే. సకలవేదశాస్త్రంబులఁ జదివి నీవు,సర్వధర్మము లెఱిఁగినజనవరుఁడవు
నీదుబుద్ధు లెచటి కేగె నీదుమేలు,కోరి చెప్పనీతు ల్వినకుంటివి మును. 36

వ. భండనము కాకపూర్వము భీష్మద్రోణాదు లెన్నినీతులు చెప్పిన విన వైతివి నే
నురాయబారినై వచ్చి చెప్పిన విన వైతివి. 37

క. అలనాఁడు నిండుసభలో, వల సాధ్విశిరోజములను బట్టుక యీడ్చెన్
దులువ యగు నీతనూజుం, డలనాఁటిచరిత్రమెల్ల ననఘ మఱచితే. 38

వ. భీమునిపై నలుక వహించుట న్యాయహీనము నీతనయులకై విచారింపకు వీరినే
నీతనయులుగాఁ జూచికొమ్మనుచు రుక్మిణీవల్లభునకు గాంధారీవల్లభుం డి ట్లనియె. 39

క. దేవా వసుదేవాత్మజ, నీవువచించిన దదెల్ల నిశ్చయ మనఘా
నే విజ్ఞానవిహీనుఁడఁ, గావున నే యిట్లు వచ్చెఁ గమలదళాక్షా. 40

తే. తనయులందునఁ గల్గినయనుఁగుఁ బ్రేమ, విడిచిపై చెద నే నింక విశ్వనాథ
పాండురాజతనూజులే వారలింక, నాకుమారు లయ్యెద రయ్య నళిననాభ. 41
వ. కోపవిపరీతుండనై భీమునం దొనర్చినయపకృతి మనంబున నుంచక నన్ను శమింపు
మని బ్రతిమాలె నంత. 42
ఆ. అంబికాతనూజుననుమతిమీఁదను, బాండురాజసుతులు భవ్యమతులు
సర్వలోకనాథసహితులై గాంధారి,సాధ్వి నూఱడింపఁ జనినవేళ. 43

—వ్యాసాదులు గాంధారినాశ్వాసించుట—

తే. కాంత గాంధారిధర్మభూకాంతుఁ గాంచి, తనయశోకాతురంతఁగడు దైన్యమునను
యమతనూజునిదీవింప కలుకతోడ,శాప మీయఁ దలంచె నాసమయమందు. 44
వ. ఆవృత్తాంతంబు దివ్యదృష్టి నెఱింగి సాత్యవతేయుఁ డరుదెంచి యాసాధ్వి కిట్లనియె.
చ. నిరతము సత్యమార్గమున నేఁ జరియించునజాతశత్రుపైఁ
దరుణి యిటేల కోపమును దాల్చితి వమ్మ సతీలలామ నీ
వరసుతుపైన నెంతయును వత్సలతం దనరారుమమ్మరో
స్థిరమగుభక్తితోడుతను జేయును నీకు నితండ సేవలన్. 46
వ. ఈతనిశపింపకుము మఱియొకవిశేష మెఱింగింతు నాకర్ణింపుము. 47
సీ. దుర్యోధనుండప్డు దురము కేగెడువేళఁ,బ్రణమిల్లెఁ గదె నీకు భక్తితోడ
సమరము కేగెద జయము గల్గఁగ నాకు,నాశీర్వదింపుమా యనియె నిన్ను
నందుల కీవు నీనందనునిం గాంచి,యిట్లని పల్కితి వింనువదన
ధర్మ ముండెడుతావుఁ దప్పక జయలక్ష్మిఁ ప్రాప్తించు నని నీవు పలుక లేదె
తే. నీవు పల్కినయట్లుగా నిశ్చయముగ,ధర్మపరు లగుఁబాండురాట్తనయు లెల్లఁ
గైకొనిరి వారు జయలక్ష్మిఁ గాన నింక, వీరిమొదఁ గోపభావము వీడు మమ్మ. 48
వ. అని పలికిన నమ్మునీంద్రున కమ్మహాసాధ్వి యి ట్లనియె. 49
తే. నేను వీరియందు నసూయ లేనిదానఁ,గుంతి కెట్టులో నా కట్టికొడుకులు గదె
సందియంబు లే దింతయు సన్మునీంద్ర,ధార్తరాష్ట్రులే క్రూరులు తలఁచిచూడ. 50
సీ. ధార్తరాష్ట్రులు ఖలుల్ ధర్మహీనులు గానఁ,గౌరవకులమునఁ గలిగెఁ జేటు
పాండుపుత్రుఁడు ధర్మపరుఁడగుట జయించెఁ,గమలాలయేశుండు కనుఁగొనంగ
ననిలాత్మజుఁడు కోపమునను సుయోధను,నూరువుల్ విఱిచినాఁ డోమునీంద్ర
యిట్టిదుష్కార్యము నితఁడు చేయుటకు నా,డెందమందునఁ జింత బొందుచుంటి
తే. అనిన భీముఁ డామెను గాంచి వినయము మలర,ధర్మమును స్వధర్మంబును తల్లి మెచ్చఁగ

నాదుప్రాణరక్షణకయి యీదురాత్ము,నూరుభగ్నము గావించి యున్నవాఁడ. 51
క. అలనాఁడు నిండుసభలో,పలను రజస్వలయు నేకవస్త్రయుఁ గృష్ణన్
దలఁ బట్టి యీడ్చి వారలు,పలువల నొలువంగ లేదె పావనచరితా. 52
సీ. దుర్యోధనుం డంత ద్రుపదరాజాత్మజన్, దనయూరువందుఁ గూర్చొను మటంచు
సన్నఁ జేసెను గాదె సాధ్వి నే నది గాంచి,తత్కాలకోపము దవిలికొనఁగ
నతనితొడల్ త్రెంతు నని బ్రతిజ్ఞనొనర్చి,యున్నాఁడ నోయమ్మ యుత్తము లగు
రాజతనూజులు ప్రతిన భంగంబును,సైపఁగ నెందున సమ్మతిలరు
తే. ఇట్టికార్య మపుడె చేయ నెంచియుంటి,ధర్మతనయుఁడు వారించెఁ దల్లి నన్ను
ద్వాదశాబ్దముల్ వనులలోఁ దనరి యవల,జనని యజ్ఞాతవాసము సలిపినాము. 53
సీ. అజ్ఞాతవాసమునైనపిమ్మట మేము,సంధిఁ జేయఁ దలంచి చక్రధరుని
హస్తిపురికిఁ బంపి యతని కిట్లంటిమి,యన్నదమ్ములసుతు లైన మనము
పరులెల్ల మనలను బరికించు నట్లుగా,కలహ మొందుట మంచి కా దటంచు
దుర్యోధనునితోడఁ దోయజనాభుని,జెప్పఁ బంపితిమి మే మప్పు డతివ
తే. ఆపలుకులకు శాంతింప కాఖలుండు,రణముఁ బెంచెఁ గావున ధర్మరాజునకును
రాజ్యలాభ మయ్యెను నాదుఁ బ్రతినఁ దీరె,ననుఁడు గాంధారి యిట్లనె ననిలజునకు.
సీ. తనయ నీ విపుడు చెప్పినదుష్కృతంబులు, చేసె నాపుత్రుండు చెనఁటియగుచు
వాఁ డట్టిచావు చావఁదలంచినట్టిఁడే, కాని కారణ మొండు కలదు వినుము
శత్రుల నెందున సంహరింతురు కాని, వారి నెత్తురు ద్రాఁగువారు కలరె
యని నంత నామెతో ననిలతనూజుండు, వినయముతో నిట్లు మనవి చేసె
తే. ద్రుపదరాజతనూజను విపులసాధ్విఁ, గేశములఁ బట్టి యీడ్చి నావేశమునను
దున్నసేను వధించి నెత్తురును ద్రావు, నట్లు ప్రతినఁ జేసినవాఁడ నమ్మ నేను. 55
క. ఘోరాజి నతనిఁ దాఁకితిఁ, గౌరవవీరులకు భయముఁ గల్గించుటకై
యారుధిరము వదనంబునఁ, జేరిచితిని నాప్రతిజ్ఞ చెల్లెను దల్లీ. 56
వ. నెత్తురుఁ ద్రావునట్లు నటించితిఁ గాని నేను మానుషరక్తముఁ ద్రావునంతమూఢాత్ముఁడఁ గా నన గాంధారి పాండవేయుల నవలోకించి యి ట్లనియె. 57
తే. నూఱుగురు పుత్త్రు లందుఁ గుమారులార, మీకు నెగ్గు సేయనివాఁడుగాకయొకఁడు
లేక పోయెనా యొకఁ డైన బ్రతుకటముగఁ, బ్రతికియుండిన మీకడ్డు వచ్చునొక్కొ.
వ. అంతఁ బుత్రశోకాతురయై పల్కినగాంధారితోఁ జింతాకులమానసుండై యుధిష్ఠిరుం డి ట్లనియె. 59
తే. సకలమగుబంధుల ననేకజనవరులను, నీతనూజులఁ జంపిననీచుఁ డైన
నన్ను శాపమునను జంపు కన్నఁ దల్లి, చంపకున్న శిక్షింపుము సాధ్విమిన్న. 60

క. క్రూరం బొనరించితి నా, కీరాజ్యం బేలనుచు జనయిత్రియన గాం
ధారి విని యేమి పల్కక, యూరక యుండెను విచారయుక్త మనమునన్. 61

వ. అంతఁ బాండవులు గాంధారియాజ్ఞ వలనఁ దనవారికై విలపించుకుంతీదేవికడ కేగి
కుంతిగాంధారు లొకరినొక రూఱడించుకొనుచుండి రంత. 62

—(గాంధారిరణనిహతులగు దుర్యోధనాదులకొఱకు శోకించుట.)—

సీ. బాదరాయణుదయవలన గాంధారికి, దివ్యదృష్టిఁ గలిగెఁ దేజ మరల
నంతట నాసాధ్వి హతులైనసుతులను, గనుఁగొన సమరరంగమున కరిగె
రణరంగమంతయు రక్తప్రవాహమై, భూతపిశాచసంప్రీతి కయ్యె
భీభత్స మైనట్టియాభండనంబునఁ, గురువధూమణు లెల్లఁ బఱచివచ్చి

తే. పాండవులచేతఁ గూలినదండిమగలఁ, జనుల బంధుల మిత్రుల సతులఁ గాంచి
సర్వవిధముల దుఃఖించు సమయమందుఁ, గవిన వారి కెల్లను భీతిఁ గలుగుచుండె. 63

వ. అపుడు గాంధారీదేవి శ్రీకృష్ణాదులతో సమరాంగణనిహతు లగు వీరాగ్రేసరుల
గుణంబు లభివర్ణించుచుఁ జెప్పుచు దుర్యోధను కళేబరముం గాంచి విలపించి నేలకుఁ
గూలి యాతని మేనుచేత నిమురుచు మాధవునితో ని ట్లనియె. 64

సీ. తోయజనాభ యీదుర్యోధనుఁడు మున్ను, సంగరమున కేగుసమయమందు
జయముఁ గాంచఁగఁ గోరి జనయిత్రి ననుఁ గాంచి, దీవింపు మని పల్కె దేవదేవ
ధర్మ మెచ్చట నుండుఁ దనయ యచ్చోటనే, గలుఁగును జయమని పలికియుంటి
నది గాక యిట్టిటి నాలమునందున, నోడి వచ్చుటకంటె నోకుమార

తే. మరణమును బొంది వీరుఁడై పరమపదము, చేరుకొన మంచి దంటిని శ్రీనివాస
నాదువచనానుసార మీనరవరుండు, మడిసె యుద్ధమందున వింటె మహితచరిత.

సీ. అఖిలమహీనాథు లరిగాపులై కొల్వ, సర్వభూతల మేలుచక్రవర్తి
ఘోరరణంబునఁ గూలి యెట్లుండె నో, పరికించి చూచితే పద్మనాభ
విదురుండు దండ్రియు వీనికనేకముల్, నీతులు జెప్పిరి నీరజాక్ష
వీఁడు నీతుల నెల్లఁ బెడచెవిఁ బెట్టెను, గావున ని ట్లయ్యెఁ గంసదమన

తే. కాల మాసన్న మైనయీఖిలున కపుడు, హితము లేల రుచించెడు నెంచి చూడఁ
బధియునొక్కఁ డక్షౌహిణీవల్లభుండ, ధరణిఁ గూలెను గంటివే దైత్యదమన. 66

వ. అని గాంధారిదుశ్శాసనవికర్ణాదికుమారశతంబును గర్ణశకునియభిమన్యాదుల మృత
కళేబరములం గాంచి విలపించి శరతల్పగతుం డైన భీష్మాదిత్యుం గాంచి దేవకీనంద
నున కి ట్లనియె. 67

సీ. వలనొప్పఁ దండ్రివివాహముకొఱకు నై, వాహిక మొల్లక వాసుదేవ
బ్రహ్మచర్యంబునఁ బ్రబలినాఁ డీతఁడు, త్రిజగములందునఁ దేజమునను

శౌర్యమం దితనికి సాటియెవ్వరు లేరు, గాంగేయుఁ డీతఁ డీకయ్యమందు
శరతల్ప గతుఁ డయ్యె సకలేశ్వ రేశ్వరా, యీతఁడు దేవసంభూతుఁ డగును
తే. కాని నరమాత్రుఁ డీతఁడు కాడు దేవ, తనువు నిష్టమైనప్పుడు తాను బాయ
నాపి యుండె మహామహుఁ డాపగేయు, నితనిఁ బ్రస్తుతిఁ జేయఁగా నేరితరము. 68

వ. ఈతం డమరపురి కేగినఁ బాండవులకు ధర్మాధర్మము లెఱింగించు వా రుండ రప్వు డురు లిప్వరుషోత్తమునివలన సకలధర్మాధర్మము లెఱింగిన మే లగు నని ద్రోణశల్యాది రాజులకళేబరములఁ గాంచి పుత్రశోకమగ్నమానస యగుగాంధార రాజనందన కోపమ్మున నమ్మురాంతకున కి ట్లనియె. 69

—గాంధారి శ్రీకృష్ణుని శపించుట—

ఉ. కౌరవపాండవేయు లిటు కయ్య మొనర్పఁ దలంచి యున్నెడన్
వారల నాపఁ జాలకయ భండనముం బొనరింపఁ జేసి యీ
కౌరవవంశముం జెఱుపఁ గాఁ దలపోసినయట్టివాఁడ వో
క్రూరుఁడ నీదుమూలమున ఘోర మి టయ్యె నటంచుఁ బల్కుచున్. 70

తే. సకలధారుణీనాథులసంగరమునఁ,జంపి వైచినాఁడవు నీవు సారసాక్ష
కురుకుమారుల నెల్లరఁ గూల్చి నీవు,నాశన మొనర్చినాఁడవు న్యాయహీన. 71

క. నీవే జ్ఞాతుల కిట్టుల, నీవైరముఁ గల్గఁ జేసి తియ్యది నిజమా
నీ వనుభవింప వలె నది,కావున శపియింతుఁ నిన్నుఁ గంజదళాక్షా. 72

వ. భవదీయవంశస్థు లిట్లే వైరంబున మేను దొరంగెదరు మీ రప్వు డివ్విధంబున శోకింతు రింక ముప్పదారేండ్లకు నీవు దిక్కులేని వధం బొందెద వని శాప మిచ్చిన గాంధారిం గాంచి నవ్వుచు నవ్వనజోదరుం డి ట్లనియె. 73

తే. దేవి శాప మిచ్చితివి నీ వీవిధంబు, యాదవకులనాశన మగు ననుచు మున్ను
ముని యొకఁడు శాప మిచ్చెను గినుకతోడ,మరల దాని నిచ్చితివమ్మమాన్యచరిత.

వ. యాదవులవధింప దేవేంద్రాదుల కశక్యము గావునఁ దమలోఁ దాము కలహించి మడియుదు రన గాంధారి నిశ్చేష్ట యయ్యె నంత ధర్మజుండు సమరనిహతు లగుసకలబాంధవులకు దహనాదు లొనర్చి ధృతరాష్ట్రముఖ్యులతో బాగీరథి కేగి యెల్లరకుఁ దిలోదకదానంబు లిచ్చుచుండఁ గాంగేయాగ్రజునకుఁ గుంతీదేవి యి ట్లని విన్నవించె. 75

—కుంతి ధర్మరాజునకు గర్ణుఁడు తనపుత్రుఁడని తెల్పుట—

సీ. ధర్మనందన చిన్నతనమున నుండియు, ధార్తరాష్ట్రులమైత్రిఁ దనరె నెవఁడు
నెవ్వానిభుజబల మెవ్వానిశౌర్యము, గని సుయోధనుఁడు తాఁ గయ్యమునకు
గడఁగె నో మీతోడఁ గౌరవతనయుల,పెట్టనికోటయై వెలసె నెవఁడో

యమరు లెల్లరుఁ గూడ నానంద మొందఁగ, నెవ్వాఁడు నొప్పించె నెసఁగ మిమ్ము
తే. అస్త్రశస్త్రవిద్యానిధి యమలమూర్తి, యట్టికర్ణుఁడు రాధేయుఁ డతఁడు కాఁడు
భాస్కరుని దివ్యమంత్రప్రభావమునను, నా తనూజుఁడై జన్మించె నా డతండు. 76
వ. అని కానీనునిజన్మవృత్తాంత మెఱింగించినఁ బాండవులు హాహాకార మొనర్చి మిక్కిలి విలపించి ధృతరాష్ట్రాదు లెల్లరు విచారించి రంత నజాతశత్రుండు జనయిత్రి కి ట్లనియె. 77
తే. ఎవనిశౌర్యాతిరేకము నెల్ల నెఱిఁగి, ధార్తరాష్ట్రులు మాతోడఁ దలపడిరొకో
యెవరిశౌర్యమువలన మహీశు లెల్లఁ, గౌరవేంద్రున కరిగాపు లైరొ తల్లి. 78
తే. మహిని యుద్ధమునందున మ మ్మెవండు, బాధఁ బొందించెనో యట్టిభాసురాంగుఁ
గర్ణుఁ డగ్రజుఁ డని మాకు నిర్ణయించి, చెప్ప కెట్టులు దాఁచితి చెనఁటి వగుచు. 79
తే. అతని ననిని మార్కొనుటకు నర్జునునకుఁ, దక్క నేరివశం బయ్యెఁ దల్లి వింటె
యతఁడు మా కగ్రజుం డని యనునెడలను, బోరు మా కిట్లు రాకుండఁబోవుఁగాదె.
వ. అని యనేకవిధంబులఁ గర్ణుం దలంచి విచారించి యాభానుసూనునకుఁ దిలోదకదానాదు లన్నియు యథావిధిగా నజాతశత్రుండు నిర్వర్తించె నని చెప్పిన విని జనమేజయుండు వైశంపాయను నన్వలికథావిధానము దెల్పు మని కోరుటయు. 81

ఆశ్వాసాంతము.

మ. నిరతంబుల్ భవదీయపాదయుగళిన్ జిత్తంబులో నిల్పి నీ
వరకళ్యాణచరిత్రము న్వినుటకై వాంఛింతు నెల్లప్పుడున్
బరమేశా భరతాన్వయేశులకథన్ భవ్యాత్మ నీకిచ్చితిన్
గరుణాస్వాంతముతోడఁ గైకొను మిదే కాత్యాయనీవల్లభా. 82

గద్యము.

ఇది కవిరాజ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారి పుత్రికయును,
కల్లూరి వేంకటసుబ్బరాయఁడుగారి పత్నియును,
రాజ్యలక్ష్మీపరిణయాది గ్రంథకర్త్రియును, అగు
విశాలాక్షమ్మచే రచియింపఁ బడిన
భారతకథామృతంబునందుఁ
స్త్రీ పర్వము
శ్రీపరమేశ్వరార్పణమస్తు
శ్రీ శ్రీ శ్రీ

వ. కౌరవపక్షపాతియు మహాగుణవిభూషణుండును శౌర్యపరాక్రమవంతుండును నగు మదీయాగ్రజుం గర్ణుం డట్టివాని గోల్పోవుకతన రాజ్యలాభము గల్గినయుత్సాహము మనశ్శాంతియు లేదని మఱియు ని ట్లనియె. 9

క. రణరంగము నందునం గ, ర్ణునివలనను నొచ్చియుంటి నొయ్యన శిబిరం
బున కేతెంచితి నవ్వల, మనముందున నేవిచార మగ్నుండ నైతిన్. 10

సీ. ఆసమయంబున నాసేనమారయుఁ, గృష్ణుఁ డేతెంచెను గిరిశిఖోడ
నవ్వ డర్జునుఁ గాంచి యమితకోపంబున, దుర్జయుఁ డైనయాకర్ణువధముఁ
గావింపకుండఁగ నీ వేలవచ్చితి, వనుచు దూషించితి నధికముగను
నాతనిశౌర్యము నధికముగాఁ జేసి, కర్ణుఁ జంపించితి దుర్జయుఁడను

తే. అట్టిభ్రాతను గోల్పోతి నవనిలోన, రాజ్య మేల భోగము లేల రాణువేల
యతఁడు జీవించియుండి నట్లయ్యె నేని, మాకు నడ్డమెయ్యేదియుండు లోకవినుత. 11

తే. అతనిదేహము కుంతిదేహమును బోలు, బాండురాజాగ్రసూనుండు పావనుండు
నస్త్రశస్త్రవిద్యానిధి నమితబలుఁడు, దేవసముఁ డైనకర్ణునిచావుఁ గంటి. 12

క. ఆకర్ణుఁడు జూదమ్మున, నాకౌరవనాథునకుఁ బ్రియం బొనఁగూర్చెన్
పీకను మము నిందించెను, నాకది కోపంబు లేదు నారదమౌనీ. 13

చ. సోదరఘాతి నైతి నిలసూర్యతనూభవుఁ గోలుపోయితిన్
లేదు శమంబునుం దనుము లేదు సుఖం బది రాజ్యలాభమే
మోదముఁ గాక పోయినది భూస్థలి జ్ఞాతులఁ గోలుపోయితిన్
నేదురితాత్ముఁ డైతిని మునీశ్వర యే మని పల్క నయ్యెడున్. 14

క. అర్ణవభీకరుఁ డగునా, కర్ణునిజన్మంబు వినఁగఁ గౌతుక మగునీ
దుర్జయవిచారునకు నా, స్వర్ణశరీరునిచరిత్ర సాంతము చెపుమా. 15

వ. అని విచారించుజనవల్లభు నోదార్చి మునివల్లభుం డి ట్లనియె. 16

సీ. ధర్మతనూజ పృథాదేవి కన్యయై, యలరారు వేళల ననఘయశుఁడు
దుర్వాసుఁ డేతెంచి తోయజాననకును, భాస్కరమంత్రముఁ బరఁగ నొసఁగెఁ
గొంతకాలమునకుఁ గుంతిమహాదేవి, జాహ్నవీస్నానము సలుప నరిగి
ముని మంత్రమహిమను గనుఁగొనఁ గా నెంచి, జ్ఞానహైన్యమున నాసరసిజాక్షి

తే. నిన్నుఁ బోలినవానిని జిన్నిసుతుని, నాకు నొసఁగు మటంచును బ్రాకటముగ
బాలభాస్కరుఁ బ్రార్థించెఁ బడఁతిమిన్న, దాన నేతెంచె మిత్రుఁ డుదారచరిత. 17

వ. నలినాప్తుం డాజలజాక్షిం గూడిన సద్యోగర్భమున సహజకవచకుండలుం డగుకర్ణుండు

శ్రీరస్తు.

# భారతకథామృతము.

## శాంతిపర్వము.

క. శ్రీశర్వాణీప్రియ జగ, దీశ రమానాథవినుతయీశ్వర దయతో
నీశాంతిపర్వమును గొను, మాశంకర సతులొనర్తు మహితచరిత్రా. 1

వ. జనమేజయమహీనాధునకు వైశంపాయనమునినాథుండు ధర్మనందనుజిత్తమునకు
శాంతిం గూర్చు శాంతిపర్వవృత్తాంత మిట్లు చెప్పం దొడంగె. 2

తే. పాండునందనులు సకలబాంధవులకు, నుదకర్మము లొనరించి సవయు లగుచు
గాంగతీరమునందు నిష్కల్మష మగు,నొకకుటీరము నిర్మించి ప్రకటితముగ. 3

వ. దైవసన్నిభు లగు బాండవేయులు ధృతరాష్ట్రవిదురసర్వభారతభార్యాసమేతంబుగా
నాకుటీరంబున నివసించి రంత వ్యాసనారదాదిమహర్షు లరుదెంచిన నెల్లరు వారికిం
బ్రణమిల్లి రంత నారదుం డజాతశత్రు న కిట్లనియె. 4

సీ. విశ్వనాథుండును శాశ్వతుండును యోగి, వందితుం డైన యానందసుతుండు
మీయెడం గరుణించి మీశ్రేయముం గూర్చు,వలన జయముమీకుం గలిం గెననఘ
విజయునిభుజబలవిభవమువలనను,జయము గల్గెను మీకు జనవరేణ్య
ధర్మవర్తన మెందుం దనరారునచ్చట, జయముం గల్గుచునుండు సదమలాత్మ

తే. అనిన ధర్మజుం డిట్లనె మునివరునకు, నోమహాత్మ తాపసివర్య యోదయాత్మ
మీరు సెలవిచ్చునట్లుగా నీరజాక్షు,కరుణ భీమార్జునులపరాక్రమమువలన. 5

ధర్మరాజు కర్ణునిగూర్చి శోకించుట.

క. పరమమునీశ్వరులును గురు,వరులును దీవించుకతన భారతరణమం
దరుదుగ జయంబుం గాంచితి, బరమమునీశ్వరవిషాదభరితుండ నైతిన్. 6

చ. రణమున నెల్లబాంధవులప్రాణముం దీయుట చేతం బార్థనం
దనుం డభిమన్యుం డీల్గుటయు ద్రౌపదిపుత్రుల గోలుపోవుటన్
జనవరు లెల్ల నాకొఱకు జచ్చుట చేత విచార మయ్యె నో
మునివర చెప్పుచుంటి విను ముఖ్యముగా నొకవాక్య మియ్యెడన్. 7

సీ. సర్వోత్తమం బగుశౌర్యవిక్రముండును, గురుకుమారులపట్టు కొమ్మయగుచు
సంగరంబున మమ్ము సర్వవిధమ్ముల, బాధ లొనర్చినబల్లిదుండు
సకలసుగుణపూర్ణుం డకలుషమూర్తియు, స్వర్ణవర్ణుం డైనకర్ణుండతండు
మాయగ్రజుం డని మాయమ్మ వచియించె, నుదకదానమువేళ నోమునీంద్ర

తే. యంతరంగము నిప్పుల నలముకొనియె, గుణవిశారదు నాతనిం గోలుపోతి
నిట్టిదుష్టున కెట్లుండు నట్టిభ్రాంతి,యక్కటక్కట యేమందు ననఘచరిత. 8

వ. కౌరవపక్షపాతియు మహాగుణవిభూషణుండును శౌర్యపరాక్రమవంతుండును నగు
మదీయాగ్రజుఁ గర్ణుం డట్టివాని గోల్పోవుకతన రాజ్యలాభము గల్గినయుత్సాహము
మన శ్శాంతియు లే దని మఱియు ని ట్లనియె. 9

క. రణరంగము నందునఁ గ, ర్ణునివలనను నొచ్చియుంటి నొయ్యన శిబిరం
బున కేతెంచితి నవ్వేళ, మనముందున నేవిచార మఱఁగ నైతిన్. 10

సీ. ఆసమయంబున నాసేనమూరయుఁ, గృష్ణుఁ డేతెంచెను గ్రీడితోడ
నప్పు డర్జునుఁ గాంచి యమితకోపంబున, దుర్జయుఁ డైనయాకర్ణువధముఁ
గావింపకుండఁగ నీ వేలవచ్చితి, వనుచు దూషించితి నధికముగను
నాతనిశౌర్యము నధికముగాఁ జేసి, కర్ణుఁ జంపించితి దుర్జయుఁడను

తే. అట్టిభ్రాతను గోల్పోతి నవనిలోన, రాజ్య మేల భోగము లేల రాణువేల
యతఁడు జీవించియుండి నట్లయ్యె నేని, మాకు నడ్డమెయ్యదియుండు లోకవినుత. 11

తే. అతనిదేహము కుంతిదేహమును బోలు, బాండురాజాగ్రసూనుండు పావనుండు
నస్త్రశస్త్రవిద్యానిధి యమితబలుఁడు, దేవసముఁ డైనకర్ణునిచావుఁ గంటి. 12

క. ఆకర్ణుఁడు జూదమ్మున, నాకౌరవనాథునకుఁ బ్రియం బొనఁగూర్చెన్
వీకను మము నిందించెను, నాకది కోపంబు లేదు నారదమౌనీ. 13

చ. సోదరఘాతి నైతి నిలసూర్యతనూభవుఁ గోలుపోయితిన్
లేదు శమంబునుం దమము లేదు సుఖం బది రాజ్యలాభమే
మోదముఁ గాక పోయినది భూస్థలి జ్ఞాతులఁ గోలుపోయితిన్
నేదురితాత్ముఁ డైతిని మునీశ్వర యే మని పల్క నయ్యెడున్. 14

క. అర్జునభీకరుఁ డగునా, కర్ణునిజన్మంబు వినఁగ గౌతుక మగుసీ
దుర్జయువిచారునకు నా, స్వర్ణశరీరునిచరిత్ర సాంతము చెప్పుమా. 15

వ. అని విచారించుజనవల్లభు నోదార్చి మునివల్లభుఁ డి ట్లనియె. 16

సీ. ధర్మతనూజ పృథాదేవి కన్యయై, యలరారు వేళల ననఘయశుఁడు
దుర్వాసుఁ డేతెంచి తోయజాననకును, భాస్కరమంత్రముఁ బరఁగ నొసఁగెఁ
గొంతకాలమునకుఁ గుంతిమహాదేవి, జాహ్నవీస్నానము సలుప నరిగి
ముని మంత్రమహిమను గనుఁగొనఁ గా నెంచి, జ్ఞానహైన్యమున నాసరసిజాక్షి

తే. నిన్నుఁ బోలినవానినిఁ జిన్నిసుతుని, నాకు నొసఁగు మటంచును బ్రాకటముగ
బాలభాస్కరుఁ బ్రార్థించెఁ బడఁతిమిన్న, దాన నేతెంచె మిత్రుఁ డుదారచరిత. 17

వ. నలినాప్తుం డాజలజాక్షిం గూడిన నద్యోగర్భమున సహజకవచకుండలుం డగుకర్ణుండు

జన్మించె నంతఁ బ్రద్యోతనుఁ డావిమ్మల్లతాంగి కన్యాత్వముదూషితము గాకుండ
వరం బిచ్చి చనియె. 18

ఉ. సుందరి కుంతి యంతటను సూర్యసమానవిరాజమానుఁ డౌ
నందనుఁ గాంచి చింతిలుచు నాతిసువర్ణవిరాజమాన మౌ
మందసమందుఁ గర్ణుని సుమాస్త్రసమానుఁ బరుండఁ బెట్టి తా
నందలిసాగరంబునను నయ్యది వైచెను సాహసంబునన్. 19

వ. లోకమిత్రప్రేరితముగా సముద్రమున నరుదెంచుఁగాంచనపేటికలో దివ్యరత్నప్రభా
భాసమానుం డగునందను వైచి నదిలో దిగవిడిచి తనయింటి కేగె నయ్యవసరమ్మున.

ఉ. అంతఁ దరంగవేగమున నయ్యది సూతునిచేతఁ జిక్కినన్
స్వాంతము వేడ్కతో నతఁడు జయ్యన దానిని విచ్చి స్వర్ణస
త్కాంతుని సుందరాంగుఁ డగుఁగర్ణునిఁ గన్గొనె నాతఁ డంతటన్
సంతస మేర్పడన్ దనదుసాధ్వికొసంగెను రాధ కన్యకన్. 21

క. రాధా సుందరి యంతఁగు, లాధారునిఁ బోలె నున్నయకులాత్ముని శ్రీ
నాధసముఁ బెంచె సుతువలె, రాధేయుం డయ్యె నతఁడు రాజవిశాఖా. 22

సీ. విజయుధనుర్విద్య విని భానుసూనుండు, ద్రోణునివద్దకుఁ దాను బోయి
యస్త్రవిద్యలలోన నసమానుఁ గాఁ జేయుమనుచును బ్రార్థించె జనవరేణ్య
సూతసూనుం డని యాతని భావించి, సమ్మతింపకఁ బోయెఁ జాపగురుఁడు.
తరువాతఁ గర్ణుఁడు పరశురామునిఁ గాంచి, బ్రాహ్మణుండ నటంచుఁ బలికెఁ బొంకి
తే. అస్త్రవిద్యల నేర్పుఁడీ యధికముగను,నను చు జామదగ్న్యువలన నభ్యసించె
నస్త్రశస్త్రాది శరవిద్య లనఘమూర్తి, బాహుబలపరాక్రముఁడు నీభార్గితయతఁడు. 23

తే. అంత నొక్కదినంబున నస్త్రవిద్య,లాతఁ డభ్యసింపఁగ నొక్క యవనిసురుని
హోమధేనువు కర్ణునుద్దామశరము,నందు నను బడి మృతిఁ జెందె నంతలోన. 24

వ. రౌద్రావేశపరవశుండై యమ్మహీసురుండు రణరంగమునఁ గర్ణునిరథచక్రములు
భూమిలోఁ గ్రుంకు నట్లు శాపం బిచ్చె నంత నొకానొకదినంబున. 25

సీ. పరశురాముం డంతఁ బవళించె దాతని,తొడలపై నను నిద్రితుఁడగు నట్టి
సమయమునందున నరుఁగఁ గీటక మొండు, రాధేయుతొడ నొల్చె రక్త మంతఁ
గాల్వలై పాఱ మేల్కనిజామదగ్న్యుండు, తోయజాప్తునిసూను తొడను గాంచి
రక్తము గారు కారణ మేమి యనుసెడఁ, గానీనుఁ డాకీటకమును జూపెఁ
తే. కీటకస్వరూపము విడి కీటకంబు, రాక్షసస్వరూపము గాంచి రాము మ్రొక్క

దగ్రింశుఁ డనురక్కసుఁడ నేను దపసివర్య, శాపమోక్షణ మయ్యెను స్వామి నాకు.

వ. భృగుపత్ని నపహరించినకారణంబున నతం డలిగి కీటకము గమ్మని నన్ను శపించె నినుఁ గాంచి శాపమోక్షణ మొందితి నని యథేచ్ఛం జనె నంతఁ బరశురాముఁడు కర్ణున కిట్లనియె. 27

సీ. ధరణీసురుల కిట్టితాలిమి యుండదు, నీ వెవ్వఁ డగుదువో నిజము దెల్పు
మనినఁ గర్ణుం డను మునివరేణ్యా నేను, సూతకులుఁడ రాధసుతుఁడ ననియె
నతనికపటమున కాత్మలోఁ గోపించి, వికల మయ్యెడు నస్త్రవిద్య యనుచు
శాపం బొసంగెను జమదగ్ని రాముండు, రాధేయుఁ డాధృతరాష్ట్రినగరి

తే. సుతుఁడు దుర్యోధనునకుఁ దాహితుఁడు నయ్యె, శాపమిచ్చెఁ గర్ణునకుముఖ్యజగతిసురుఁడు
పరశురాముఁ డవ్వేళను శాపం బొసంగెఁ, గర్ణువృత్తాంత మియ్యది కౌరవేంద్ర.

తే. మీకు హిత మొనర్పఁ బాకారియాతని, కవచకుండలములఁ గైకొనియెను
గుంతివరముఁ గోరె శాంతనవుం డర్ధరథుఁ డటంచు నలుకఁ బ్రిబలఁజేసె. 29

క. అర్ణవముఁ బోలుననిలోఁ, గర్ణకఠోరమున మద్రికాంతుం డపుడీ
కర్ణునిఁ గలంచి వైచెను, గర్ణుఁడు తా నీల్గె నిట్టి కారణములచేన్. 30

వ. ఇన్ని కారణములవలన గాండీవి కర్ణుం గెలిచె నన విని యన్నరపతి కన్నీ రొలుకశోకవ్యాకులితచిత్తుం డై యుండఁ గుంతీదేవి కౌంతేయాగ్రజున కిట్లనియె. 31

సీ. ఈ విధ్విధముగ మహీతలనాయకా, వ్యసనముఁ బొందుట యనుచితంబు
నేను గర్ణునితోడ వాసిజన్మాదుల, నెఱిఁగించియుండితి నిట్టు లయ్యెఁ
దమ్ములతోడ యుద్ధం బొనరించుట, యనుచిత మంటిని వినక పోయెఁ
బుండరీకాక్షుండు పురుషోత్తముఁడు పెక్కు, విధములఁ బల్కిన వినక పోయె

తే. నెన్ని చెప్పిన వినఁ డాయె నేమి సేతు, ధార్తరాష్ట్రుల విడనాడఁ దలఁప ననియె
దుర్ణయవిచారుఁ డైనయాకర్ణుకొఱకు, నీవు దుఃఖింపఁగా నేల నృపవరేణ్య. 32

వ. అనిన జనయిత్రి వాక్యముల కసహ్యపడి ధర్మరాజు స్త్రీలకు రహస్యగోపలక్షణములు లేకుండునట్లుగా శపించి రణమున మడిసినబంధుల కెల్ల నుత్తరక్రియలు నిర్వర్తించి వివ్వచ్ఛునాననం బాలోకించి యిట్లనియె. 33

—జాయానుజులు ధర్మరాజు నాశ్వాసించుట—

సీ. తమ్ముఁడా జ్ఞాతులందఱు సంగరంబున, మనచేతనే కదా మడిసినారు
అక్కటక్కట యిట్టియనుచితం బొనరింప, నెంతపాపం బయ్యె నింతలోన

బంధునాశన మగు వైభవం బేలను, రాజ్య మదేల ధరాతలమున
వల్కలాదులఁ దాల్చి వనవాసమున కేగి, తప మొనరించుటే ధర్మ మగును

తే. ఆత్మవధ మొనరించినయట్టిఁ జైతి, రాజ్యమిషమున మన మెల్ల రణమునందుఁ
గుక్కలను బోలెఁ బోరియుఁ గోట్లకొలఁది, జనులఁ జంపియున్నార మోసవ్యసాచి.

వ. మఱియు నభిమన్యాదికుమారులు లేనియీ రాజ్యం బెవ్వ రేలుదురు కానల కేగి తపం బాచరించుట పరమోత్తమం బనినఁ దేజోధనుం డగుధనంజయుం డారాజేంద్రున కిట్లనియె. 35

సీ. ధర్మనందన యిట్టి ధర్మము గల్గునా, శత్రు లెల్లరఁ గూల్చి సంగరమున
నడవులకేగి భిక్షాన్నము భుజియింపఁ, దగదు తగదు నీకు ధర్మరాజ
ధర్మపథంబున ధరణీతలంబును, స్వీకరించితి విట్లు చేయ నేల
సకలశాత్రవుల నాశనముఁ జేయఁగ నేల, భూపాల మది గోర్కి పొడమ నపుడు

తే. ఇంతమందిశాత్రవసేన నెల్లఁ గూల్చి, రాజ్య మేలక నిప్పు డరణ్యములకుఁ
జనినఁ బరిహాసింతురు గాదె జనములెల్ల, రాజ్యలక్ష్మి భరింపుము పూజ్యచరిత. 36

తే. సకలబంధుల నాప్తుల సాకుటకును, గలిమియే ప్రధానంబగు నలలితాత్మ
ధనము నధికమార్జించుటే ధరణిలోన, రాజులకుఁ బురుషార్థము రాజరాజ. 37

వ. అనమయమున నజాతవైరికి నకులుం డిట్లనియె. 38

క. వైరుల నిర్జింపక నే, వారలు రాజ్యంబు నేలు వారలు కలరో
రారాజ ధర్మరక్షణ, కై రాజ్యం బేలుమయ్య కౌరవనాథా. 39

తే. ధర్మమార్గము దప్పనిధరణివరుఁడు, సుగతిఁ జెందు నటంచును శ్రుతులు పలుకు
గోహిరణ్యాదానంబులఁ గోర్కి సలిపి, భూసురులఁ దృప్తిఁ బొందింపు భూవరేణ్య.

వ. అరణ్యంబుల కేగెద ననుట నీకుఁ దిచితముగా దని మఱియు ని ట్లనియె.

సీ. దేవతల్ వేదవిధిప్రవర్తకులును, బ్రాహ్మణులును నట్టివార లందు
న్యాయముచేత ధనార్జన మొనరించి, దేవభూదేవులఁ దేజమలరఁ
బూజ లొనర్పుము పూరువంశేశ్వర, మనకులధర్మము వినవె నీవు
జనులసేమంబును గనుఁగొనఁగా వలె, రాజ్య మేలఁగవలె రాణ మెఱయ

తే. రాజధర్మ మొనర్పనిరాజవరుఁడు, దోషపథమునఁ బోవు నిర్దోషియైన
దానధర్మము లొనరింప దగును గాని, తగునె వనుల కేగుట నీకు ధర్మరాజ. 42

వ. అంత సహదేవుం డాకౌంతేయాగ్రజున కి ట్లనియె. 43

సీ. వంశధర్మంబును వదలకఁ జరియింపు, మగ్రజా నామాట లాలకింపు
నీవ చుట్టంబును నీవ నెచ్చెలియును, నీవ తండ్రివియును నీవ గురుఁడ

నీవలె నన్యమౌ దైవ మెందున లేదు, వేఁడినుడుల నిన్ను వేఁడుచుంటిఁ
గాన విషాదవాక్యముల సైపుము నీవు, నుచిత మైనను లేక యనుచిత మైన
తే. అడవులకు నీవు పోవరా దధికమైన, దక్షిణాదుల నొసంగి యధ్వర మొనర్చి
విప్రులను దృప్తిఁ బొందించి విమలచరిత, సర్వసర్వంసహను బ్రోవు జగము లలర.
వ. ధర్మజుండు తమ్ములయుచితవాక్యములను విని యూఱకుండె నంత ధర్మాధర్మవిదర్శ
నశీల యగుపాంచాలి యన్న రేంద్రునిఁ జేరి యి ట్లనియె. 45
క. ఈ రాజ్యమునకుఁ గాదా, వైరులఁ జంపితివి ధర్మవర్ధన నీవుం
గోరికతో నేలకఁ గాం, తారములకుఁ బోవఁ నీకుఁ దగునే నాథా. 46
సీ. దండనార్హుల నెల్ల దండింప కుండుట, పార్థివేంద్రునకుఁ బాపంబు గాదె
యలనాఁడు కౌరవుల్ తులువలై నిండుస, భామధ్యమునకును బాప మనక
యేకవస్త్ర రజస్వలాకాంత యనకుండ, నన్నుఁ దోడ్కొని వచ్చినారు కాదె
దుర్యోధనుం డతిదుర్మార్గుఁడైనన్నుఁ, దనతొడ గూర్చుండు మని వచించె
తే. దుస్ససేనుఁడు వస్త్రముల్ తొడరి వలిచె, గేలిచేసె రాధేయుఁ డవ్వేళ నన్ను
నిట్టి దోషము లుండుట లెఱిఁగి మీరు, వారలను వధియించిరి వసుమతీశ. 47
క. ఇందులఁ ద ప్పేమున్నది, కొందల మందంగ నేల గురువల్లభ యా
నందమున రాజ్యమేలవె, యిందుకులాభరణ దీని కేటికి వగవన్. 48
ఉ. కౌరవు లట్టిదుర్నయము గల్గినవారలు వారిచేతకున్
వారు ఫలంబుఁ గన్గొనిరి వారలకై దురపిల్ల నేల నో
భూరమణాగ్రగణ్య కురుపూజ్యరమన్ భరియింప వే యిఁకన్
భారతవంశశేఖర ప్రభాకరతేజ యమాత్మసంభవా. 49
తే. సర్వసర్వంసహారమ చంద్రవంశ, భూషణా నీవు భరియించి పూజితముగ
యాగములఁ బెక్కు లొనరించి యశము మీఱ, జనులఁ బ్రేమఁ బాలింపుము జనవరేణ్య.
తే. పరసతీహరుఁ డగువాని బంధుఘాతి, బరధనాపహారణునిని బాపమతిని
గరదునిన్ గృహదాహకుఁ గఠినచిత్తుఁ, జంపి సుకృత మందఁగ వలె జనవరుండు. 51
చ. దురితము లెన్నొ చేసి రిల దుష్టులు కష్టులు ధార్తరాష్ట్రులా
కురుకులవంశపాంసనులఁ గూలుచు నెంతయు మేలుగల్గు నీ
ధరణికిఁ గల్గుభారమును దగ్గుసు వారలు పోయినంత నే
భరతకులాధినాథ కులపావన నీ విఁకఁ జింత వీడుమా. 52
వ. అని పాంచాలి పల్కిన మాటలు పల్కనియుధిష్ఠిరున కింద్రనందనుండు
జనకున కతనిభార్యతో నైన సంవాదమునుఁ జెప్పెనంత దేవస్థానుమహాముని

ధర్మరాజునకు హితోపదేశ మొనర్చె నంతఁ బారాశర్యుండు సుద్యుమ్నుచరిత్రం
బును సేనజిత్తువాక్యములను జనకున కశ్మకుండుచెప్పినరీతిని జెప్పె నంతట శ్రీకృష్ణుం
డు షోడశరాజచరిత్రంబును బర్వతనారదుల వృత్తాంతంబును సువర్ణష్ఠీవిచరిత్రంబు
ను దెలిపిన నంతటఁ గృష్ణద్వైపాయనుండు ధర్మరాజునకు ధర్మము లెఱింగింప
ని ట్లనియె. 53

సీ. అబ్జబాంధవునుదయాస్తమయములందు, నిద్రించు టెంతయు నీచతరము
గురుతిరస్కారము పరదారగమనము, సేవకులను దయఁ బ్రోవకుంట
భూసురుం డేతేరఁ బోషింపకుండుట, యవనీసురధనాపహరణములును
శరణార్థిఁ జేపట్టి యరసిరక్షింపక, గోభూసురులహత్యఁ గోరుటయును
తే. పాపకర్మములనుచును బలుకుచుంద్రు, సంగరమున శాత్రవులను జంపుటయును
విప్రుకల్మిఁ గైకొనువారి వెస వధించుటఘము వొందదు వినుమయ్య యమలచరిత.
తే. మఱియుఁ బ్రాణహానియగుసమయమునందు, నన్నపానాదు లవి లేక యున్నతఱినిఁ
దెలిసి కల్లుదావినఁగానిఁ గలుఁగ దింత, యేనిదోషము నైన నో యిభపురీశ. 55
తే. ప్రాణహానిసమయమునఁ బరిణయంబు, వేళ ధనధాన్యములు పోవువేళ లందుఁ
బలుకవచ్చు ననత్యంబు పలుకు నెడలఁ, బాప మింతయుఁ గలుఁగదు పార్థివేంద్ర. 56
సీ. స్వప్నంబునందున స్ఖలన మయ్యెడు నేని, బ్రహ్మచర్యము చెడఁబడదు సుమ్ము
యాదోషపరిహార మగ్నిహోత్రమునందు, వేల్వవలయు నేయి విధివిధమున
నగ్రజుండుండిన నతఁడు సన్యాసియై, యుండినఁ బరిణయం బొల్లకున్నఁ
దమ్ముఁడు తాన యుద్వాహ మాడఁగ వచ్చు, ధర్మలోపము రాదు ధర్మరాజ
తే. ఆవులకు రక్షణార్థమై యడవిఁ గాల్చి, యజ్ఞకార్యమునందున నావువధము
చేయుటయుఁ గీడు గా దని చెప్పుచుంద్రు, రాజవంశభూషణ పాండురాజతనయ.
వ. తపోదానయజ్ఞాదులవలనఁ బాపంబులు పరిక్షీణంబు లగును బ్రాయశ్చిత్త మెఱింగిం
చెద నాకర్ణింపుము. 58
చ. వినుము కపాలమందు నను భిక్షము నెత్తుచు నేకకాలమే
తిని నను మాంసభోజనము దిన్నను గృచ్ఛ్రములం బొనర్చినన్
అను వగునశ్వమేధ మనుయాగ మొనర్చినఁ దీర్థసేవనం
బును బొనరించునాతనికిఁ బోవుచునుండును బ్రహ్మహత్యలున్. 59
ఆ. వత్సరం బొకండు పరమపియతిత్రోడఁ, దీర్థసేవనంబుఁ జేయు నేని
పరసతిగమనము పాపముపోవును, భరతవంశవార్థిపారిజాత. 60
తే. పుణ్యకర్మము లనొనర్చు భూసురులకు, ధనముచేఁ దృప్తి జేయుచుఁ దనరు నేని

పూర్వభవకృతపాపముల్ వోవుచుండు, రవిసమానతేజ పాండురాజపుత్ర. 61
సీ. వావిగానట్టిది వనితను బొందిన, నాఱుమాసంబులునార్ద్రవస్త్ర
ధారణంబును భస్మధారణంబును భస్మ, శయనము నియతిని సలిపె నేని
పోవు నాపాపము పూరుకులాధీశ, నఱకఁ దగనిమ్రాను నఱకువాఁడు
దిర్యగ్వధంబను గౌర్యము చేసిన, మూఁడుదినంబు లప్పూరుషుండు
ఆ. తనదుచేత మదినిఁ దలపోసికొనుచును, వాయుభక్షణంబుఁ జేయునేని
నరఁగ నొక్కలక్ష సావిత్రిఁ జేసిన, నైనఁ బోవు నఘము మానవేంద్ర. 62
తే. సచ్చరిత్రుఁ డతిథిపూజ సలుపకుండ, భోజనము చేయఁగా రాదు రాజరాజ
పాత్రుల నపాత్రుల నెఱింగి ప్రత్యహంబు, దానధర్మాదు లొనరింపఁ దగు మహీశ.
వ. ప్రాయశ్చిత్తము లల్పము లైనను ఘోరపాపములఁ బోఁగొట్టును భారతయోధవ
ధంబునకు నీయంతఃకరణమున జనించినకరుణ పశ్చాత్తాపము నిన్నుఁ బవిత్రుం జే
సె నని చెప్పి పాత్రాపాత్రపురుషుల తెఱం గెఱింగించెనంతనావ్యాసవచనము
లాలించికొంత శాంతించి కౌంతేయాగ్రజుండు ధృతరాష్ట్రవిదురాదులతో జాయా
నుజసమేతముగఁ గరిపురికిం బోవ నెంచె నంత నెల్లవిప్రులు ధర్మపుత్రున కిట్లనిరి.
క. ధర్మాత్ము లైనతమ్ములు, నర్మిలి నీపనుపుఁ జేయ నవనీతలముఀ
ధర్మమున నరసి ప్రోవుము, ధర్మతనూభవ మహాత్మ ధరణీరమణా. 65
వ. అయ్యవసరమ్మున. 66
తే. భీమసేనుండు రథమును బ్రీతిఁ గడప, సవ్యసాచి ఛత్రంబును సరవిఁ బట్టి
మాద్రిసుతులు వింజామరల్ మఱియు వైవ,యాదవాధీశ్వరుఁడు వెంట నరుఁగుఁ దేర.
తే. దివ్యరత్నమయం బయి తేజరిల్లు, కనకమయరథంబున నెక్కి కరినగరము
దగఁ బ్రవేశించె నంతట ధర్మరాజు,పౌరులెల్లరు నమ్మోద భరితులైరి. 68
చ. అనఘుఁడు ధర్మనందనునియాగమనంబును నంతకుమున్న గా
విని పురిలోన నెల్లరును వేడుక నొంది గృహాదులందు ర
త్ననికరతోరణంబులను దద్దయుఁ గట్టిరి సర్వభూతముల్
వినుతు లొనర్చుచుండఁ బృథివీపతి తాఁ జనె రాజగేహముఀ. 69
సీ. భూసురాశీర్వాదములు విస్తరింపఁగా, రాజమందిర మేగె రాజరాజు
సకలభూపతులు విశ్వంభరామరులును,బట్టభద్రుఁడ వయి ప్రబలు మనుచు
యమసుతునకుఁ జెప్పి యాభిషేకాదిసం,భారములను సమకూరుచుటయు
మణిమయాసనమున మానవాధీశ్వరుఁ,గూర్చుండఁ జేసిరి కోర్కు లలర
తే. నెల్లరకు నుచితాసనా లేర్పరచిరి, సాత్యకిసమేతుఁడయి నేడ్కఁ జక్రధరుఁడు
ధర్మనందనుప్రక్కను దా వసించె,రాజులెల్ల వసించిరి ప్రక్కలందు. 70

వ. ధృతరాష్ట్రవిదురసంజయకృపాదిముఖ్యులుఁ గుంతీగాంధార్యాదిసాధ్వీమణులును సమీప
    పకాంచనాసనమ్ములపై నధిష్ఠించి రయ్యవసరమ్మున. 71
సీ. అంతట మాధవు ననుమతంబునఁ జేసి, ధౌమ్యుఁడు వేడ్కతో ధర్మసుతుని
    నభిషేక మొనరించె నఖిలనృపాలురు, కానుక లొసఁగిరి కడకతోడ
    వివిధమంగళతూర్య వీరనాదంబులు, బోరుకొల్పఁబడెఁ బొలుపుమీఱ
    దేవత లంతటఁ బూవులవానలు, కురిపించుచుండిరి కోర్కె లలర.
తే. చెలఁగఁ బార్థుఁడు పట్టాభిషిక్తుఁ డయ్యె, వాయుజుఁడు యువరాజుగాఁ జేయఁబడెను
    సకలదానధర్మంబులు ప్రకటితముగ, సలిపె ధర్మనృపాలుఁ డాసమయమందు. 72.
వ. అప్పుడు ధర్మనందనుండు ముకుళితకరములుండై ముకుందుని విలోకించి యిట్లనియె.
సీ. దేవ మహాదేవ దీనరక్షా పరా, పుండరీకాక్ష యోపురుషవర్య
    నీదయాపాత్రుఁడ నేనగుటను జత్తు, రబ్ధివేలావలయ మగునట్టి
    భూచక్రమునకును మొగిఁ జక్రవర్తినై, పాలింప నుంటిని బద్మనాభ
    వేదమయుం డని వేదరూపుం డని, సర్వజగములు ని న్నాడుచుండు
తే. నిన్నుఁ బ్రస్తుతిఁ జేయంగ నేను జాల, శ్రీసుదర్శనధర కృష్ణ శ్రీనివాస
    దేవకీగర్భపుత్రక దివ్యగాత్ర, యనుచుఁ బ్రస్తుతిఁ జేసె నయ్యాదవేంద్రు. 74
వ. అట్లతివైభవంబున నిందువంశాధీశ్వరుం డగుధర్మరాజు పట్టాభిషిక్తుండై రాజ్యమే
    లుచు నొకనాఁ డుదయమునఁ గృష్ణునిసదనంబున కేగి పరమధ్యానాసక్తుం డైన
    యాయోగీశ్వరేశ్వరునకుఁ బ్రణమిల్లి యుధిష్ఠిరుం డిట్లనియె. 75
సీ. దేవ మేఘశ్యామ దివ్యనామా రవి, ప్రతిమాన తేజ యోపరమపురుష
    నీరజలోచనా నేఁడేల నీ విట్లు ధ్యానించుచుంటి వత్యధికముగను
    గడువింత నా కిది కలిఁగెను గావునఁ, గారణ మెఱిఁగింపు కమలనాభ
    యనుచుఁ బ్రార్థింపంగ నచ్యుతుండు నజాత, శత్రున కిట్లనె సమ్మతమున
తే. దివిజగంగ యెవ్వనిఁ గాంచి యవనిలోనఁ, బావనంబుగ నయ్యెనో భార్గవుండు
    సకలవిద్యావిశారదు సకలుషమతి, నెవనిఁ దనప్రియశిష్యుఁగా నెంచి యుండె. 76
తే. అట్టిభీష్ముఁడు శరతల్పమందు నుండి నన్నుఁ దనచిత్తమున భక్తి సన్నుతించు
    నందువలన నామానస మతనిఁ జిక్కెఁ, గారణం బిది వింటివె కౌరవేంద్ర. 77
వ. అని పల్కి మఱియు. 78
క. అతఁ డుత్తరాయణమునకు, మతి నెదురుఁగఁ జూచుచుండె మహిమాన్వితుఁడై
    యతఁడు నిలిపెఁ బ్రాణంబుల, నతనికడకుఁ బోయి రావె యవనీనాథా. 79
తే. అతఁడు మరణించె నేని యి య్యవనితలము, సర్వమును మరణించినసరణి నుండు
    కావ నాతనికడ కేగి కౌరవేంద్ర, సకలధర్మము లెఱుఁగుట సమ్మతంబు. 80

వ. అనపుడు నజాతశత్రుండు కేల్మోడ్చి దేవకీపుత్రున కిట్లనియె. 81
తే. మున్ను గాంగేయుసంగతి విన్నవాఁడ, నతఁడు సకలధర్మాధర్మరతుఁ డటంచు
నతనివలన ధర్మార్థము లాలకింప, సంతసంబు నా కెంతయు సారసాక్ష. 82
సీ. నిన్నొకదానిని నే వేఁడుచున్నాఁడ, నన్ను మన్నింపుము నళిననేత్ర
యమ్మహాత్ముం డగునాపగాసుతుఁడుదా, నుత్తరాయణముకై చిత్తమందు
నెదురుచూచుచునుండె నిందిరాసుందర, నీరాకఁ గోరును నెమ్మనమునఁ
గావున నాయందుఁ గరుణాసమేతుఁడై, విచ్చేయు మచటకుఁ బృథ్వీనాథ
తే. యనిన సమ్మతమును బొంది యాదవుండు, పాండవుల వెంటఁ బెట్టుక భవ్యమైన
యరదమందు నాసీనుఁడై సురనదీశ, సూనునిం గనఁ బోయె నారాజుతోడ. 83
వ. అక్కడ భీష్ముం డేకాగ్రచిత్తమున శ్రీకృష్ణు నిట్లు ధ్యానించుచుండె. 84
సీ. ఎవఁడు ధరాభార మెల్లఁ దీర్పఁగ నెంచి, దేవకీతనయుఁడై తేజరిల్లె
యదువంశదుగ్ధాబ్ధియందు శశాంకుఁడై, వసుదేవసూతియై పొనఁగె నెవఁడు
యెవనిపాదాబ్జంబు లెల్ల మౌనీంద్రులు, జపియించుచుందురు సంతతంబు
బృందారకుల మహాబృందము లెల్లను, సేవించు నెవ్వాని చిత్తమందు
తే. సవ్యసాచికి రణమున సారథియగు, నట్టి మేటి సర్వాతీతు నాదిదేవు
సర్వయోగీశ్వరేశ్వరు సరసిజాక్షుఁ, గృష్ణదేవుని మదిలోనఁ గీర్తి సేతు. 85
వ. అని యనేకవిధంబుల శ్రీకృష్ణుని వినుతించుచుండె నంత యదూద్వహుండు కురూ
ద్వహునకుఁ బరశురామచరిత్రంబు చెప్పి పాండవవ్యాసాదులతో భీష్మునెదుట సా
క్షాత్కరించె నంత శాంతనవుం డమ్మాధవున కిట్లనియె. 86
క. లీలామానుష విగ్రహ, శ్రీలక్ష్మీకేళిలోల శ్రీగోపాలా
యాలింపవె నానుడులను, శ్రీలీలామదనదేవ శ్రీపరమేశా. 87
సీ. సర్వజగములకు సాక్షివి కర్తవు, హర్తవు భర్తవు నగుదువీవు
పరమేశ భవదీయశరణాగతుండను, మోక్షపదవికి నపేక్షఁ గొంటి
నిన్నుఁ బూజించెద నిన్ను సేవించెద, శరణు దాసుఁడ నన్నుఁ గరుణఁ జూడు
మని వేడుకొను నెడ వనరుహనేత్రుండు, గంగాతనూభవుఁ గాంచి పలికె
తే. శాంతనవ నీదుభక్తికి సంతసంబు,నన్ను భక్తితోఁ, గొలుచుచున్న వారి
హృదయకమలములందున ముదముతోడ,సతతమువసించుచుందునుసదయహృదయ.
తే. నీయభీష్టమ్ము నెఱవేర్తు నిశ్చయముగ, నేఁబదారుదినములకు నిండునీకు
వనజహితుఁ డుత్తరాయణమునఁ జరించు,మాఘశుద్ధపక్షైకాదశి మాన్యచరిత. 89
తే. అపుడు నీ దేహమును వీడి యమలమూర్తి, పుణ్యలోకములకు నీవు పోవఁ గలవు

వీరలెల్ల నీపౌత్రులు కౌరవేంద్ర, నామువాక్యముల న్వినుమ నయముమీఱ. 90

ఉ. ధర్మతనూభవుం డితఁడు తాతవు నీవలన న్సమస్తమౌ
ధర్మ మధర్మముం దెలిసి ధన్యతఁ బొందఁగ నేగుదెంచె నో
నిర్మలమూర్తి నీ వితనినిం గరుణాత్మ ననుగ్రహించు మ
ర్మము లన్నిటిం దెలిపి ధన్యుని జేయు మజాతశాత్రవున్. 91

వ. అని పల్కిన దేవదేవునకు దేవవ్రతుం డి ట్లనియె. 92

సీ. యాదవరా భవదీయమృదువాక్యజాలము, లస్మదాత్మకు నవి యమృతమట్టు
లానంద మొనఁగూర్చె నోనందనందనా, సకలధర్మాధర్మచక్షుఁ డీవు
నీముందుఁ బలుకుట నీరజభవునకు, శక్యము గాదు నాశక్య మగునె
నే నేమి పలుకంగ నేరుతు నోయయ్య, వశము గా దయ్యె నోవాసుదేవ

తే. శరములు శరీరమునకును జాలఁదగిలి, మిగుల యావేదనంబునఁ బొగులుచుంటి
నవయవంబులు వశముగావబ్జనాభ, శక్తి లేదు విశేషమౌ నుక్తులాడ. 93

క. నాయందు గరుణతో నీవే యెది హిత మగునొ దాని నీసమయములో
నీయమసూనుఁ డెఱుఁగఁగాఁ, జేయుము వందనము గొమ్ము శ్రీగోపాలా. 94

వ. మఱియు నీముందు నే నితనికి ధర్మము లుపదేశించుట గురునిముందు శిష్యుఁడు వచించిన ట్లగు నని వినయకపూర్వకముగాఁ బల్కిన గాంగేయునకు వాసుదేవుం డి ట్లనియె. 95

సీ. సంభాషణంబున శక్తిఁ గల్గెడు నట్లు, శరవేదనము లేనిసరవి గాఁగ
నాకలిదప్పులు నడఁగి పోయెడునట్లు, వర మిచ్చితిం గొను పరమపురుష
యని వాసుదేవుఁ డాయమరవ్రతునకును, వర మిచ్చె నాతనికరుణవలన
శరవేదనము దగ్గె సంభాషణంబున, శక్తి లభించె విస్తారముగను

తే. శాంతనవుఁ డపు డెంతయో సంతసమున, విశ్వనాథునిభక్తితో వినుతిఁ జేసి
ధర్మజునకు ధర్మంబులఁ దాను జెప్ప, వాఁడ నని సమ్మతించె నాభవ్యమూర్తి. 96

వ. గోవిందుం డానాఁడు పాండవులతో హస్తిపురి కేగె నంత నమ్మఱునాఁడు సర్వకౌరవులతోఁ దమ్ములతోఁ బుండరీకాక్షునితోఁ బాండవాగ్రజుండు భీష్మునిపాలి కేగ నంత దేవకీపుత్రుండు దేవవ్రతుం గాంచి యి ట్లనియె. 97

తే. పరమపావను లైనయీపాండవులకు, సకలధర్మము లెఱిగింపు శాంతనవుఁడ
యనినఁ భీష్ముఁడు కృష్ణున కనియె నిట్లుధర్మనందనుఁ డడిగిన దానిఁ జెపుదు. 98

వ. అంత నజాతశత్రుండు సర్వకౌరవానుమతుండై పితామహుని పాదారవిందములకుఁ
బ్రణమిల్లి వర్ణాశ్రమధర్మములను రాజధర్మములను జెప్పు మని కోరిన నమ్మనుజేం
ద్రున కమ్మందాకినీనందనుం డిట్లనియె. 99

తే. రాజధర్మముల న్నమ్మందు రాజరాజ, నీకు నే విన్నవించెదఁ బ్రాకటముగ
నవహితుండవై వినుము నాయన్న యనిన, నధికసంతోషమును బొందె యమసుతుండు.

వ. భాగీరథీనందనుం డిట్లు చెప్పనారంభించె. 101

క. తనమేలు గోరుభూపతి, యనిమిషులకుఁ బూజఁ జేసి యవనీసురులం
దున భక్తిఁ జూపవలయున్, వినుమా నృపధర్మములను విశ్రుతచరితా. 102

సీ. దాంతియు శాంతియు దానధర్మము గల్గి, ఋజన మొనర్చుచు నమలమతిని
బ్రజలసేమము చూచి పరిపాలన మొనర్చి, సమరమౌ నస్ఫుట శౌర్యమునను
రాజగుణము లివి రాజగుణములందు, క్షత్రియోత్తములకు సంగరంబు
పరమధర్మం బని పలుకుదు రార్యులు, రవిసమతేజయో రాజచంద్ర

తే. వేదవేత్తయు శాంతుఁడు విప్రవరుఁడు, శస్త్రము ధరించి సమరము సలిపెనేని
వానిని వధింప వచ్చును బార్థివుండు, తొలిమినుకు లిట్లు పల్కు నోలలితమూర్తి.

క. భృత్యులయెడఁల నరేంద్రుం, డత్యంతాసక్తితోడ నలరుట చెడుగాఁ
బ్రత్యహము జనులసేమం, బత్యమలమతిం దలంప నగు భూపతికిన్. 104

వ. మఱియుఁ గర్తవ్యవివేకములేనివాని నవినీతి సేయువానిని గురు వైనను నరేంద్రుండు
విడనాడవలయుఁ బ్రజలక్షేమాభివృద్ధికిఁ బాటుపడు రాజభివృద్ధి నొందును. 105

క. పరధనము నపహరించెడు, ధరణీరమణుండు చూడఁ దనమనుజులచే
నిరతంబుఁ గీడుఁ గాంచును, బరధనముం గోరరాదు పార్థివుఁ డెందున్. 106

తే. అల్పమైనను శత్రువు లగ్నివిషము, లట్లు గావున వైరుల నవనివిభుఁడు
నార్జవంబునఁ జెఱుపనౌ నవనినాథ, రాజధర్మము లివి వింటె రాజతేజ. 107

వ. అని దేవవ్రతుండు రాజధర్మము లెఱింగించి దండనీతిప్రకారంబును సైన్యం డను
రాజచరిత్రంబును దెలిపి ధర్మజునకు వర్ణాశ్రమధర్మము లెఱింగింపఁ దలఁచి. 108

తే. శాంతముఁ దమంబు సత్యము శమము మూఁడు, వర్ణముల కుండఁగాఁదగు వరగుణములు
ధరణిసురులకుఁ దప మది ధర్మ మగుట వార లతినిష్ఠ దాని సల్పంగ వలయు. 109

సీ. పరిణయమును మాని గురుసేవఁ జేయుచు, వేదాధ్యయనమును వేడ్కఁ జేసి
తనకు నెంతైనను ననురాగమే లేక, యేరితోడను బగఁ గోరికొనక

శైశవావస్థయందు దివసములు గడపుట, బ్రహ్మచర్యాశ్రమ వ్రతము సుమ్ము
తనదారతో సుఖంబునఁ దనరారుచు, గరుణయుఁ దాల్మియు గలిఁగియుండి
తే. సజ్జనులతోడ మైత్రిని సలుపుచుండి, నిరతమును భగవద్ధ్యానపరుఁడు నయ్యు
సత్య మాడుచు దీనుల సాఁకుచున్న, నిది గృహస్థాశ్రమం బగు నిభపురీశ. 110
క. మానినితోడుత నైనన్, దా నొంటిగ నైననరిఁగి తపియించుచు నా
కాననములందు నుండుట, వానప్రస్థాశ్రమం బు వసుధాధీశా. 111
వ. ఇట్టియాశ్రమంబులఁ జొరఁబడువా రవసీసుకులే యగుదురు పరిశుద్ధు లగువైశ్యక్ష
త్రియులు గూడ నిందుఁ బ్రవర్తింప నగు ననిన ధర్మజుండు కేల్మోడ్చి పితామహా!
రాష్ట్రజనుల కర్తవ్యంబు లగుధర్మము లెఱింగింపు మన నమ్మహీపతి కమ్మహాత్ముం
డి ట్లనియె. 112
సీ. మానవుల్ రాజును మర్యాదగాఁ జూడ, వలె నట్లు గానిచో వైరు లెల్ల
జనవల్లభుని వారు సరకుఁ జేయఁగఁ బోరు, రాష్ట్రజనుల్ సదా రాజునందు
భయభక్తులు గలిగి వర్తింపవలయును, జనక భావంబున జనవరుండు
ప్రజలనుఁ జూడనౌ వారిసేమమునకై, తలఁచుచుండ వలయుఁ దనమనమునఁ
తే. బతికి వెఱచుచుండఁగ వలెఁ బ్రజ లెపుడును, బ్రజలు పెద్దఁజేయఁగ లేనివసుమతీశు
సరకుఁగొన రెవ్వరును గాన సర్వజనులు, రాజుపై భక్తితోడనుబ్రబలవలయు. 113
వ. మఱియు రాజధర్మము లెఱింగింతు నాకర్ణింపుము. 114
సీ. యాగంబులు స్మహాభోగంబులును గూడ, మనుజేంద్రరక్షణఁ మానవులకు
నెఱవేఱవలయును నరులకు నృపతియే, యాత్మ యనెడురీతి నలర వలయు
నారామములకుఁ సంచారస్థలములోఁ బు, రద్వారములకును రాజవరులు
రక్షకభటుల నేర్పఱచి యుంచఁగ వలె, శాత్రవవీసుల సంగతులను
తే. తెలియఁగా నమ్మకంబును గలుఁగువారిఁ, జారులను నియోగించుట చాలమేలు
కోట నేమరకయ ప్రోవ మేటివీర, భటుల నియమింపవలయును బార్థివుండు. 115
వ. రాజులు ముందే కర్యమునకుఁ గాలుఁద్రవ్వక సామదానదండోపాయముల శా
త్రవులమనమును మరలింప వలయును. 116
సీ. అవనీంద్రవర్యులు వివిధాయుధములతోడఁ, గలిఁగి యుండఁ దగు నెక్కాలమందు
రణరంగమందున వెనుదీయకుండెడు, యోధుల సేనగా నుంచ వలయు
ధర్మార్థకామముల్ తా నెఱుంగ వలయు, సత్వరజస్తమస్సద్గుణములు
తెలిసి యుండంగను వలయు నమాత్యుల, బంధుల మిత్త్రులవసుధజనుల
తే. ధనముఁ గల్గు కోశాగారమును సతంబు, నరయుచుండంగ వలయును బరమధర్మ

పాలన మొనర్చుచుండఁగ వలయుసుమ్మి, ధర్మనందన వింటె యీధర్మములను. 117

వ. ధర్మార్థకామము లొకప్పుడు నశించినను మరలధర్మనిష్ఠం జేసి సుస్థిరముగా వర్ధిల్లుఁ గావున నరేంద్రులు ధర్మమే భూషణముగాఁ గాపాడికోవలయు సురాపానాదిదుర్వ్యసనంబులఁ జిక్కఁగూడదు. 118

ఆ. పుణ్యకార్యములను బొలుపారఁ జేయుచుఁ, గ్రతువు లాచరించి యతులితముగ
నమలమూర్తులైనయట్టిమంత్రులతోర, హాస్యములను దెలుప నగు నృపతికి. 119

క. దేవతలను భక్తిని భూ, దేవులఁ బూజించుచుండి తేజం బలరన్
భూవలయంబును నేలెను, భూవిభుఁ డత్యధికకీర్తిఁ బొందు నృపాలా. 120

తే. రాజు యజనంబు లొనరించి తేజ మలర, దేవతల సర్వకాలముఁ దృప్తిఁ జేయ
మూల మగుఁ బురోహితుఁడె యీభూతలమునఁ గాన సత్పురోహితుఁ డుండ నొప్పు నృపతికి.

క. పరిశుద్ధిలేనివారలు, పురోహితులు నీచదశలఁ బొందుదు రెపుడున్
ధరణీశ్వరునకుఁ గీడులు, పురోహితుఁడె శాంతిఁ జేసి ప్రోవఁగ వలయున్. 122

తే మహితయశుఁడౌ పురోహితుమంత్రిరక్షణము ప్రధానము గావున నరవరుండు
విపుల జపతపోధనుఁడును విజ్ఞుఁ డైన, వానినిం బురోహితుఁ గల్గిప్రబల వలయు, 123

వ. అని దేవవ్రతుం డన్నరదేవోత్తమునకు నిట్లనియె. 124

సీ. ధనధాన్య మధికమై తనరుస్థలంబున, హాని గల్గకయుండ నరయ వలయు
నట్లుచూచినయెడ నాధనాగారము, వృద్ధిఁ బొందుచునుండు పృథ్వినాథ
ప్రతివత్సరంబును బ్రజలు వర్ధిల్లిన, రాజులకు ధనంబు ప్రబలుచుండుఁ
గ్రూరిగ లొవారికి ఘోరశిక్ష యొనర్చి, వారిధనము ప్రజావల్లభుండు

తే. తనధనాగారమునఁ జేర్పఁ దగును సుమ్ము, ప్రజల బలవంతపెట్టక వారివలన
ధనము నభివృద్ధి జేయనౌ మనుజవిభుఁడు, ధర్మ మెందుండునో లక్ష్మితనరు నచట.

తే. మతిపరాంగనాగమనము నరవరుండు, సల్ప నేనియు నతనిరాజ్యంబునందు
వర్షములు గురియఁగఁ బోవు ప్రజల కందు, దైన్యముం గల్గుచుండును ధారుణీశ.

క. ధనమున దురాశ గల్గిన, జనపతి ధర్మంబు విడిన సర్వధనాదుల్
దను గోల్పోవును శాకిలఁ, గొనియెడు దుర్వ్యాశ మతంబు గురుకులనాథా. 127

వ. అని భీష్ముండు ధర్మజునకు రాజభాండాగారాభివృద్ధినిఁ దెలిపి ధర్మప్రకారంబును సమరంబునఁ బాడియు సమరానివర్తనంబు నిందాప్రబరీసంవాదంబును శకునాపశకునంబులఫలంబును రాజు పగఱయెడ నుండువిధానంబు దెలిపి ధర్మసూక్ష్మ మెఱింగింప నిట్లనియె. 128

సీ. ధర్మనందన వినుము ధర్మసూక్ష్మంబును, దల్లి తండ్రియును నత్యధికభక్తి
సేవింపఁదగువారి సేవింపవలయును, వారియాజ్ఞల నడుపంగ వలయు

నాగమత్రయమును నగ్నిత్రయంబును, లోకత్రయంబును బ్రకటముగ
దైవత్రయంబునఁ దల్లిగారవ మది, యెక్కుడుగా నొప్పు నిభపురీశ
తే. తల్లిదండ్రులం దతిభక్తిఁ దనరువాఁడు, మూఁడులోకములందునఁ బూజితుండు
గురుపదంబుల భక్తితోఁ గొలుచునాతఁ, డుత్తమోత్తముఁ డయ్యెడు నుర్విలోన.
వ. అని చెప్పి పాపనిస్తరణప్రకారంబును దండనీతిప్రకారంబును ధర్మార్థకామముల తెఱంగును శరణాగతరక్షణఫలంబును గపోతోపాఖ్యానంబును గృధ్రజంబుకోపాఖ్యానంబును వపావిధంబును సత్యస్వరూపంబును నాడీజంఘోపాఖ్యానంబును మొదలగు పరమపవిత్రచరిత్రంబు లెఱింగించి యజగరచరిత్రము దెలిపి శాంతనవుండు కౌంతేయాగ్రజున కాచారవిధి నిట్లని చెప్పందొడంగె. 130
సీ. రాజమార్గంబున రథ్యయందుఁ బురీష, మూత్రముల్ విడ రాదు భూవరేణ్య
శుచికి నైస్నానంబు రచియింపవలయును, సంధ్యాసమయముల జలజహితుని
నారాధన మొనర్పు టధికధర్మం బగు, నుదయాస్తమానము లుర్విజనులు
నిద్రఁ బొందుట మహానింద్యము పంచార్ద్ర, భావాన్నమును దింట భవ్య మగును
తే. ఇతరులను నిందపాల్సేయు టెప్పుడు తగదు, తడిపదములతో నిద్రింపఁ దగ దెపుడును
నుదయ మగుసూర్యునిం జూచు టొప్పుగాదు, పాపకృత్యము దాఁచుట పాడి గాదు.
తే. సురతిఁ బ్రకటింపఁగా రాదు ధరణిలోన, గురునిశుశ్రూషయును బ్రహ్మకులభజనము
సలుప నాయువెచ్చును లక్ష్మి గలుగు మిగుల, పుణ్యమును గలిగించును భూతలేంద్ర.
వ. అన్యస్త్రీలను వస్త్రహీనలుగ నుండఁ జూడ రాదని యాచారవిధి యోగప్రకారము నెఱింగించిన ధర్మనందనుండు సంతసించి సత్యాసత్యవృత్తాంతంబులఁ జెప్పుమని కోర నాపగేయుఁ డిట్లనియె. 133
సీ. సత్యంబు పలుకుట సకలధర్మంబుల, కెక్కుడుగా నగు నెఱుఁగ వలయు
ననృతంబుఁ బల్కుట యధికపాపంబుల, కెక్కుడుగా నగు నెఱుఁగ వలయు
నితరులభాగ్యము నెంచి హరింపఁగాఁ, జూచువారలతోడ సూనృతంబు
పలుకు టదెంతయో పాపకృత్యం బగు, నట్టివారి వధించు టర్హ మగును
తే. భూతములకు హిత మొనర్చు బొంకు లెల్లఁ, బరమధర్మము లనుచును బలుకుచుంద్రు
భూతములకు బాధ లొనర్చు భూమిజనులు, పాపఫలమును గాంతురు పార్థివేంద్ర.
వ. అనినఁ బాపంబులు నిర్వర్తించువా రెవ్వ రన నమ్మహాత్ముం డమ్మనుజేంద్రున కిట్లనియె. 135
సీ. వర్ణాశ్రమాచారవంతులు శబ్దాది, విషయంబులందున విరహితులును
నతిథిపూజకులును నధ్యయనరతులు, నగ్నిహోత్రపరులు నమలమతులు

రణరంగమందున వెనుకఁదీయనివారు,సాధుపోషకు లగుసజ్జనులును
సర్వదేవతలతో సము లని యెఱుఁగుమా, భగవాను నిత్యము భక్తితోడఁ
తే. బ్రస్తుతించినవారినిఁ బరముఁ డెపుడుఁ,బ్రోచుచుండును విష్ణుండు భూవరేణ్య
వాసుదేవుఁడు మీయందుఁ బరమకరుణఁ,దనరుచుండెను దురితము దలఁప వశమె.
వ. ధర్మనందనా! ధర్మార్థకామముల తెఱం గెఱింగింతు నాకర్ణింపుము. 137
సీ. కామమధిక మైనఁ గలధర్మములు రెండు,నాశనమును బొందు నరవరేణ్య
కామసక్తచిత్తుఁడు నరకనివాసమును బొందు, ధర్మపరాయణుఁడు స్వర్గంబుఁ బొందు
సాధుజనులు వానిసన్నిధి నుండరు,సువ్యాధు లుండఁగఁ బోరు సుమచిరాంగ
కాన ధర్మస్థితిఁ గలుగఁగాఁ జేసెదు,నర్థమం దభిలాష నలరవలయు
తే. ధర్మసిద్ధి కలుగఁ బ్రయత్నం బొనర్చ,వలయుఁ గామాదులుం డొట వలవ దెపుడు
నివ్విధమున వర్తించువాఁ డెల్లదిశల,భూమికాంతను బొందును భూవరేణ్య. 138
వ. దృషద్వతియు సరస్వతియు ననునదులలో స్నాన మొనర్చిన నెట్టిపాపము లైనను నశించును. 139

చ. యమసుత పాపముల్ తొలుత నై యొనరించిన నైనఁ గాని పా
పమునకు ఖేద మొందినను వాఁడు సుబుద్ధిఁ జెలంగి ధర్మమా
ర్గమునఁ జరించు నంతటనె కల్గినపాపము నాశనంబు నై
క్రమముగఁ బుణ్యలోకమును గైకొను భారతవంశభూషణా. 140
చ. దమము దలిర్చు టే యధికధర్మము సత్యధికంబు నైన పు
ణ్యము నది మోక్షసాధనము నయ్యెడు కౌరవవంశభూషణా
దమమును వీడియున్న యెడ ధర్మము సిద్ధినిఁ బొంద దెప్పుడున్
దమమునకన్న నెక్కు డగుధర్మము లేదు ధరాతలంబునన్. 141
క. దమవంతుఁడు కామక్రోధములను లోభాదు లెల్లఁ దాఁ గెల్చును శీ
లము మైత్రి కరుణ మొద లవి,దమము వలనఁ గలుగుఁ గాదె ధరణీనాథా. 142
తే. కొండగుహయందు నియతితో నుండువాఁడు,బ్రహ్మపదమును గాంచును రాజచంద్ర
మఱిదమోపహితుం డగు మానవునకు,వచ్చు నిక్కము మహనీయబ్రహ్మపదము.
వ. అని చెప్పినపితామహునకుఁ బ్రణమిల్లి తపోవిధాన మెఱింపు మను ధర్మజునకు గాంగేయుఁ డిట్లనియె. 144
సీ. తపము సర్వమునకుఁ దానె మూలం బగు,గ్రహము మీఱఁగ నట్టియమలతపము
వ్రతతంత్రము లొనర్చువా రొనరింతురు,గందమూలాదులఁ గైకొనెదరు
యన్నమువదలుటే యధికతపం బని,యార్యులు పల్కుదు రనఘమూర్తి
తపముచేఁ బంచవిధము లగుఁబాపముల్,నాశన మొందును నరవరేణ్య

తే. తపమునను సత్యశౌచముల్ విపుల మగును, వెతలభూదేవగణములవినుతిఁ గలుగు
సకలసిద్ధులు చేకూరు సంతతంబుఁ, దప మొనర్చెడువాఁ డిల ధన్యుఁ డధిప. 145

వ. అనిన మందాకినీనందనున కభివందనం బొనర్చి పాండునందనుండు సత్యప్రకారము చెప్పు మనుటయు నదీనందనుం డి ట్లనియె. 146

తే. సర్వధర్మములకు నిధి సత్య మగును, సత్య మత్యంత సుఖ మగు జగతిలోన
సత్యమున మోక్షము లభించు సత్యమునకు, నశ్వమేధము సాటిరా దండ్రుబుధులు.

వ. అసత్యముకంటెఁ బాపము సత్యముకంటెఁ బుణ్యము లేదు. 148

క. పంచమహాపాతకులున్, బంచత్వము నొందువేళఁ బ్రాయశ్చిత్తం
బెంచి యొనరించునెడలను, బంచమహాపాతకములు వదలును వారిన్. 149

తే. అనృత మిలఁ బాతకం బగు నట్టిదైన, వనితలందు మరణమునఁ బరిణయమున
సర్వధనములు పోయెడుసమయమందుఁ, బల్కు నెడలఁ బాపము గాదు పార్థివేంద్ర.

క. లేనిదగుఁ పాప మితరుని, పైనను జెప్పునెడఁ జాల పాపము గల్గున్
వానిపయిఁ జెప్పుపాపము, తా నొనరించినఫలంబుఁ దప్పకకల్గున్. 151

వ. ధర్మార్థకామాభిలాష వదలి సుఖదుఃఖములను బొందక దైన్యమదాదుల విడిచి యుంటయే మోక్షసాధనము మఱియు విష్ణుమంత్రప్రభావ మెఱింగింతు నని యాపగేయుఁ డిట్లనియె. 152

ఆ. పరమభక్తితోడఁ బరమేశు విష్ణుని, నింద్రియముల నిగ్రహించి సతము
ధ్యానముం బొనర్చునమలస్వరూపుని, పాపములు నశించు వసుమతీశ. 153

క. సురపితృపూజలయందునఁ, బరమనియతితో ననంతుఁ బరమేశ్వరునిన్
నిరతముఁ దలంచి పావక, పరిచర్యఁ దలంచువాఁడు పాపరహితుఁడౌ. 154

సీ. సర్వకాలములందు సర్వేశుఁ గొల్చిన, వాఁడు ముక్తుం డగు వసుధ సకల
కర్మములందునఁ గలుగుఫలముకంటె, నీశుఁ గొల్చినఫల మెక్కు డగును
భూదానగోదానములఁ బొనర్చుటకన్న, విష్ణుసేవఫలంబు వెలయుఁ జాల
నశ్వమేధసమాప్తి మాచరించుటకన్నఁ, బొందరానిఫలంబుఁ బొందఁ గలఁడు

తే. అనిన విని ధర్మనందనుం డధికహర్ష, మునను గృష్ణున కాపగాపుత్రునకును
భక్తితోడను బ్రణమిల్లి పలికె నిట్టు, లనఘ తెలుపు మధ్యాత్మవిద్యావిధంబు. 155

వ. భీష్ముండు యుధిష్ఠిరున కధ్యాత్మవిద్య నెఱింగించి కాలచక్రప్రకార మెఱింగింప నెంచి యి ట్లనియె. 156

తే. కాలచక్రము వ్యక్తమై క్రాలునట్టి, సప్తదారలు గలయది జనవరేణ్య
మఱియు నిది మనస్తత్త్వమై తిరుగుచుండు, నిట్టివిషయము జ్ఞానంబున నెఱుఁగవలయు.

వ. మఱియు సత్త్వరజస్తమోగుణాతిశయంబున మోహాదులు గలుఁగుచుండును వివేకమువలన మోహాదుల వీడవలయును. 158

తే. ఆర్యవర్యులు సద్వృత్తి నభ్యసించి, మోహములను వదలుదురు భూతలమున
నాదరము ప్రవృత్తియు లక్షణాన్విత మగు, నదియు ధర్మో దయంబున నగు మహీశ.

తే. ఎంతసామంతులకు నైన నెంచి చూడ, దేహమందభిమానము ద్రెళ్ళకుండ
శోకమోహాదుఃఖాదులు రాకపోవు, టధిక దుస్తర మయ్యెడు నవనినాథ. 160

వ. వేదాంతవిదుం డగువాఁడే దేహాభిమానము వదలుటకై ప్రయత్న మొనర్చును మఱియు. 161

తే. కానలోఁ బ్రవేశించివృక్షంబు లెల్ల, గనెడువానికిఁ గుతుకము గలుఁగునట్టు
లరయ సంసారవనములోఁ దిరుగువాఁడు, కోర్కిఁగాని వైరాగ్యము కోర డెపుడు.

సీ. రోగమునకు మందు రోగి సైకొనునట్లు, సంసారరోగవిశ్రాంతికొఱకు
సత్యశౌచంబుల శమదమంబుల నెల్ల, నభ్యసింపఁగ వలె నవనిలోన
నిట్లొనర్చినయెడ నెల్లమోహంబులు, విడనాడి పోవును విమలచరిత
యింద్రియంబులకును నెల్లభూతముల క, హంకార మునికిపట్టై యొసంగు

తే. స్మృతియు సంప్రీతియును గూడ సృష్టిలోన, సత్త్వగుణములై యలరారుజనవరేణ్య.
రాగలోభరోషాదులు రాజసములు, దర్పశోకాదు లయ్యవి తామసములు. 163

వ. జ్ఞానమున కీగుణములు విఘ్న మొనరించుఁ గావున. 164

తే. సాత్త్వికము నవలంబించి సర్వజనులు, తామసము రాజసంబును దాము వదలి
మఱియుఁదత్త్వవివేచనఁ జేరవలయును ధర్మగుణరత్నభూషణా ధర్మరాజ. 165

తే. జ్ఞానమును గోరుకొనియెడుమానవుండు, ముందు సత్యశౌచాదుల నొంద వలయు
మఱి యహంకారమమతల మఱువ వలయు, ముక్తిఁ జెందు నట్లైనను భూవరేణ్య.

వ. అనిన సౌఖ్యవంతుం డెట్టి వాఁడెఱింగింపు మనుకొంతేయాగ్రజునకు శాంతనవుం డి ట్లనియె. 167

సీ. సర్వవర్ణంబులు శమముఁ దమము గల్గియుండఁగా వలయు నీయుర్విలోన
క్షితిసురునకును విశేషించి దమశమా,హితవృత్తు లుండిన నింపుమీఱు
శౌచ మక్రోధము సత్యము శాంతము, దైన్యరాహిత్యము దమగుణములు
దుర్వాదహీనత దురభిమానము లేమి, నిందాస్తుతుల వర్జనీయ మగుట

తే. సాధుజనసంగమంబును సర్వభూత,దయయు గురుసేవనంబును దప్పకుంట
యిల జితేంద్రియత్వమును నహింసయును సుశీలభావము లివి సుగుణాలవాల. 168

వ. ఇవి సత్త్వగుణంబు లియ్యవికలవాఁ డిహపరలోకసౌఖ్యంబులొందు నని మఱియు ని ట్లనియె. 169

తే. దినమునకు రెండుమాఱులు దినుచు మధ్యమధ్య భుజియింపకుండెడుమానవుండు
పరఁగు నాతం డిల సదోపవాసి యనఁగ, సావధానుఁడ వై విను సార్వభౌమ. 170

క. ఋతుకాలంబున నే తన, సతి సాంగత్యంబు బొనర్చి సర్వదినములం
దతిథుల వేల్పుల, గొల్చెడు, నతఁడు సదాబ్రహ్మచారి యగు లోకేశా. 171

తే. తనదుపంక్తిఁ గూర్చుండినమనుజులకును, దనభుజించువిధమున భోజన మొసంగు
నతఁ డవిఘసాశనుం డగు ననఘవర్య, ధర్మసూక్ష్మత తెఱఁ గిది ధర్మరాజ. 172

వ. మఱియు భృత్యులు భుజించినపిదప భుజించువాఁ డమృతాశియుఁ బగలు నిద్రింపని వాఁ డస్వప్నుఁడు. 173

సీ. కలిమిలేములు రెండు కలవు దైవాయత్త, ము లవి పురుషయత్నములును గావు
శత్రులఁ జెఱచుట మిత్రులఁ బ్రోచుట, యును నాపదలయందు మునుఁగకుంట
యనునివి కూడ దైవాయత్తములె యగు, మనుజయత్నము లేదు వినఁగ నెందుఁ
దెలివి లేమికతంబువలనను నేఁ గర్త, నని తలంచుచు నుండు రవనిజనులు

తే. కాన దేనికి మనుజుఁడు కర్త కాఁడు, సిద్ధ్యసిద్ధులయందున స్థిరము కాని
సుఖమునందు దుఃఖమునందు సుంతయేని, జింతఁ బొందక యుండుటే శ్రేష్ఠ మగును.

వ. సకలకర్మములును దైవవశంబున నగు నని తలంచు వాఁడు మహానీయుఁ డన నొప్పును. 175

క. దాంతుఁడు ప్రజ్ఞావంతుఁడు, శాంతుం డగువాని మానసం బాయాస
భ్రాంతము గా కెందు న ని, శ్చింతుండై యుండవలయు క్షితిలో నధిపా. 176

వ. అంతఁ గౌంతేయాగ్రజుండు శాంతనవున కభివందన మాచరించి పితామహా లక్ష్మి యెవ్వారియందు వసించియుండు నన నవ్వసూత్తముఁ డి ట్లనియె. 177

క. గురుభక్తి నెఱపువారలు, నిరత మతిథిదేవపూజ నెఱపెడువారల్
పరధనము గోరునట్టిరు, సిరులును సంపదలఁ గాంతురు క్షితివరవింటే. 178

తే. సత్య మాడెడువారలు శాంతమతులు, దానశీలురు ను న్మహాత్యాగపరులు
పరసతులఁ గోర కుండెడువారలందు, నిశ్చయముగ శాశ్వతలక్ష్మి నిలిచియుండు.

సీ. పరధనంబులయందుఁ బరదారలందుఁ బ, రాఙ్ముఖచిత్తులై ప్రబలువారు
బ్రాహ్మణప్రియులును బగటిజామునయందు, బవళింపకుండెడు ప్రాజ్ఞులంను
వృద్ధులయందును వెలఁదులయందును, శౌచనిరతులందు సదయులందు
నతిథిపూజ లొనర్చునాసక్తులందును, శమద మోన్నతు లగుజనులయందు

తే. కలిమిలేమ నిక్కంబుగాఁ జెలఁగుచుండు, గామమును గ్రోధమును గల్గి గర్వులైన
వారియందును బరుషముపలుకువారి, దరికిఁ జేరగాఁ జాలదు సిరి నృపాల". 180

వ. భిక్షుము వేయక కూ)రచరిత్రిముల బొ)ద్దులు పుష్పవారలను లక్ష్మి మెచ్చఁ బోదు బుద్ధి నీతి క్షమ శాంతి ధృతి సమ్మతి శ్రిద్ధ యనునీయేడుగురు దేవతలు లక్ష్మి నభివృద్ధిఁ బొందింతురు. 181

సీ. సకలదిక్కుల కేగున శ్వేంది)యంబులఁ, దనయుల శిక్షించు దండి)ఁ బోలె
శిక్షించి యెందుఁ జేరఁగా నీయక,మనమందు నిశ్చలమునఁ జెలంగి
యుంట యదెంతయో నుత్తమపద మగు,ధర్మములం దది ధర్మ మగును
నివ్విధంబుగ నరుఁ డింద్రియంబుల నెట్టి,విషయంబులందున వెడల నీక

తే. తలఁపు లుడిగినయెడలను దప్పకుండ,మోక్షమును బొందు నాతఁడు పూరువంశ్య
పాము కుబుసము విడచెడుపగిది గాఁగ,బుణ్యపురుషుఁడు పాపముల్ పోవిడుచును

ఆ. బంధనముల గొప్ప బంధనమైనది, కామ మనఁగ నొప్పఁ గాన దాని
విడుచు వాఁడు మంచువిడినచంద్రునిఁ బోలెఁ, తేజరిల్లుచుండు రాజరాజ. 183

వ. పరతత్త్వోపాసనాసక్తుండును జ్ఞానవంతుండును సూర్యునివలన మంచు విడినట్లు పాపముల వీడి సుఖింతురు. 184

క. ధనధాన్యపశుకళత్రిము, లను విడి ఘను లైనపుత్రులను వీడి నరుం
డనువుగఁ గానలకుం జని,ఘనతపముం జేయ ముక్తి గలుఁగు నృపాలా. 185

తే. సంసృతిని లంపటుం డగుజనుఁడు వ్యర్థుఁ, డగును మృత్యుదేవత యుండు నతనిదరిని
నట్లు గలమృత్యుదేవత యతనిమి)ంగుఁ, గాన సంసార మతిదుఃఖకారి యగును.

వ. మూఢచిత్తుం డగువాఁ డింద్రియలోలుండై యనేకవ్యసనంబులఁ బొందుఁ గావున.

తే. సర్వవాంఛలును ద్యజించి యుర్విలోన, సత్యశౌచశాంతంబుల శమదమములఁ
దాల్చి యుండినమనుజుఁ డీధాత్రిలోన,నమృతమయమోక్షమునుబొందునమలచరిత.

వ. దురన్నశాల్యన్నంబులు భూశయ్యామృదుశయ్యలు లోహకాంచనములు శీతోష్ణములు సుఖదుఃఖములు సమాన మని యెంచువాఁడు మోక్షము గాంచును. 189

సీ. న్యాయపరుం డైననరుఁ డెవ్వఁడో వాఁడు,వందనీయుఁ డటంచుఁ బలుకుచుండు)
ధర్మార్జనమున సాధనము కొంచెం బైన,ధర్మము నొనరింపఁ దలఁచునేని
యది మహాఫల మని యతులు పల్కుచునుందు),మునుల ఋణము దీర్ప బుద్ధియేని
వేదాధ్యయనమును నేడ్కఁ జేయఁగ వలె, నమరులఋణమును యజ్ఞములను

గీ. జేసి తీర్పంగ వలెఁ బూజఁ జేసి యతిథి,ఋణము శ్రాద్ధంబులను బితృఋణము దాన
వ్రతములను మానవఋణంబు వరుసఁ దీర్చ, వలయునయ్యధర్మతనూజవసుధలోన.

తే. ధర్మపథమున నడచు టుత్తమ మనర్థ్యుఁ,డైన విష్ణుసంకీర్తన నర్థుఁ డగును
నరుఁడు ధర్మరూపణను జ్ఞానంబు నొందు,సత్యసంసేవ నిహపరసౌఖ్య మొందు. 191

వ. ఆహితాగ్ని యగువాఁ డత్యంతపుణ్యుం డగును శూద్రులగువారు విప్రసంసేవనమున నిహపరలోకసౌఖ్యములఁ గాంతురు. 192

తే. అవనిజనులు జీవన మనిత్యం బటంచు, సుఖము దుఃఖముఁ గలిఁగిన సూతయోని
యేమఱక ధర్మకార్యము లెపుడు చేయు,వారు పుణ్యలోకంబులఁ బడయఁ గలరు.

తే. పాపకార్యము కొంచెమై పరఁగు నైన, దానిఫలము ననుభవింపఁ దప్ప దెపుడు
నల్పఫలకారి యైనను ననవరతము,పుణ్యములఁ జేయవలయు నగణ్యచరిత. 194

తే. బ్రాహ్మణుఁడు యాగములొనర్పవలయు రాజు, సంగర మొనర్పవలయును శౌర్యమలర
వైశ్యుఁడు ధనార్జన మొనర్పవలయు శూద్రకులుఁడు విప్రశుశ్రూషణము సల్పవలయు

వ. ధర్మలబ్ధం బగుధనంబు బహుఫల మిచ్చును బాపలబ్ధమగుధనము నిష్ఫలము. 196

తే. తపము సత్యము కంటె నుత్తమము విద్య,దుఃఖసుఖకామకోపముల్ తొడరి విడిచి
మోక్షమునకు యత్నింపఁనోఁ బూరుషుండు,సావధానముగా విను చక్రవర్తి. 197

తే. మోక్షమునకు యత్నింపక పూరుషుండు, సంసరణకూపమందు నాసక్తుఁ డైన
రెండవది జన్మ మందు నాతండు ముక్తిఁ, బొందఁగా లేడు వినుమయ్య భూపవర్య.

తే. మోక్షమునకుఁ గామక్రోధములును రెండు,పరమశాత్రవు లని తలఁపంగ వలయు
రెంటిని నశింపఁగాఁ జేయుకంటె ముక్తి,నొందు సాధన మొండొకఁ డుండఁబోదు.

వ. పరిగ్రహమును బరిత్యజించి సకలారంభములను వదలినమహాత్మునకు దుఃఖము గలుఁగదు మోక్షము సులభ మగును. 200

తే. ఇంద్రియజయంబు నొందుట హింస లేమి,పరమవైరాగ్య మొంది చపలత విడుట
యిట్టిగుణములు గలిఁగిన నెట్టివాని,కాత్మ మహిమము నరచేత నలరుచుండు. 201

ఆ. పుత్రదారబంధుమిత్రసంసక్తుండు, వడుసులోనఁ బడినహస్తిఁ బోలె
వలను జిక్కినట్టిపక్షిచందంబునఁ,బరమదుఃఖ మొందు వసుమతీశ. 202

వ. ధర్మాధర్మములను సత్యాసత్యములను దొరంగ వలయు నని చెప్పి భీష్ముండు యుధిష్ఠిరునకు నరనారాయణసంవాదంబును విష్ణుదేవునిమహిమను నారాయణుండు నారదున కుపదేశించినతత్వమును భగవన్నామనిర్వచనంబును హయగ్రీవమాహాత్మ్యంబును వ్యాసునకు నారాయణనందనత్వము గలిఁగినప్రకారమును భృగునిచరిత్రంబును బద్ముం డనుసర్పరాజు భృగునిఁ గానవచ్చుటయు మొదలగునవి యెఱింగించెనని శాంతిపర్వవృత్తాంతసంగ్రహ మెఱింగించిన వైశంపాయనునకుఁ బ్రణమిల్లి జనమేజయుం డవ్వలివృత్తాంతము చెప్పు మని కోరుటయు. 203

ఆశ్వాసాంతము.

ఉ. దేవ ! భవత్పదాబ్జములు దేజము మీఱెడుభక్తి వాకులన్
పూవులఁ బూజ సేయుచును బ్రోదిగ భారతకావ్య మిచ్చితిన్
నీ విది స్వీకరింపు మని నెమ్మి భజించుచు నుంటి నెప్పుడున్
జావును బుట్టువుం గొనని సౌఖ్య మొసంగు ముమామహేశ్వరా. 204

గద్యము.

ఇది కవిరాజశ్రీపాదకృష్ణమూర్తి శాస్త్రిగారిపుత్రికయును,
కల్లూరివేంకటసుబ్బరాయఁడుగారి పత్నియును,
రాజ్యలక్ష్మీపరిణయాది గ్రంథకర్త్రియును అగు
విశాలాక్షమ్మచే రచియింపఁ బడిన
భారతకథామృతంబునందు
శాంతిపర్వము.

శ్రీపరమేశ్వరార్పణమస్తు.

శ్రీ. శ్రీ. శ్రీ. శ్రీ. శ్రీ.



శ్రీరస్తు.

# భారతకథామృతము.

## ఆనుశాసనికపర్వము.

క. శ్రీమంతుండవై వెలసిన, నీమహిమం దెలియ వశమె నిఖిల జగములు
నీమీఁద నిలిచియున్నవి, స్వామీ! నాకృతి గ్రహించి సాఁకవె కరుణన్.

వ. జనమేజయునకు వైశంపాయనుం డిట్లు చెప్పం దొడంగె నట్లు శాంతిపర్వమున దివ్య జ్ఞానదేదీప్యమానుం డగుశాంతనవునివలనఁ గౌంతేయాగ్రజుండు సకలధర్మము లెఱింగి యతనికి దండప్రణామం బాచరించి వినయభూషణుండై దీపించుచు ని ట్లనియె. 2

చ. అనఘ సమస్తధర్మముల నాత్మకు శాంతిగ నీవు చెప్పినన్
వినినను నామనంబునకు వీరవరేణ్య శమంబు లేదు నే
నని నఖిలాత్మబంధువుల నందఱఁ జంపితి శాంతి యెట్లు నా
మనమునఁ గల్గునో చెపుమ మాన్యచరిత్ర సురాపగాత్మజా. 3

క. ఓభాగీరథినందన, లోభమున సుయోధనుండు లోలాత్ముఁడు మా
తో భండన మ్మొనర్చెను, లోభునివలె నైతి నేను లోకపవిత్రా. 4

క. మాకారణమునఁ గాదే, యీకౌరవవంశమునకు నింతలు పుట్టెన్
లేకున్న నిట్టు లగునా, నా కెట్లిక శాంతి కలుగు న్యాయవిచారా. 5

తే. అనిన భీష్ముఁ [illegible] నియె సయ్యవనిపతికి, ధర్మజా విచారము నొందఁ దగదు నీకు
చంపుటకుఁ [illegible] దాగాఁడు జగతి జనుఁడు,నిందలకునొకయితిహాస మెఱుఁగుమన్న.

వ. అని గౌతమి [illegible] జంగకాలమృత్యుసంవాదంబును నగ్నిదేవుఁడు సుదర్శన యను కన్యను వివాహము చేసికొనుటయు సుదర్శనునింటికి ధర్మదేవత యతిథియై వచ్చుటయు నింద్రమతంగసంవాదంబును విశ్వామిత్రునకు బ్రాహ్మణ్యంబు గల్గిన తెఱంగును వీతహవ్యుం డనురాజునకు బ్రాహ్మణత్వము గల్గినప్రకారంబును దైవపౌరుషంబుల తెఱంగును నాశ్రితుం బరిత్యాజ్యుఁ డనుటయు గరుత్మంతునిచరిత్రమును గద్రువకొడుకులకు జనమేజయునివలనఁ గల్గిన శాపంబును గజకచ్ఛపంబుల తెఱంగును [illegible]గఁడుం డింద్రుని జయించి యమృతము దెచ్చి కద్రువకుఁ జూపుటయు హీనవర్ణునకు [illegible] దేశింపఁగూడ దనుటయుభృంగాశ్వుం డనురాజు స్త్రీ [illegible] యులఁ గాంచి [illegible] ఁడు భృంగాశ్వునకుఁ గోరినవరంబు లిచ్చుటయు సనత్సుజాతుండు [illegible] కుఁ దేశించినతత్వప్రకారమును గరుత్మంతుఁడు [illegible] మహిమ [illegible] దేశించి [illegible] యాత్మతత్వప్రకా

రంబును నష్టావక్రమునికుమారచరిత్రమును ఉత్తరదిశ యష్టావక్రుని చిత్తశుద్ధిఁ
బరీక్షించుటయుఁ దెలిపి దానపాత్రభూతులతెఱం గెఱింగింప నెంచి శాంతనవుండు
కౌంతేయాగ్రజునిస్వాంతం బలర ని ట్లనియె. 7

తే. ధర్మజా బ్రాహ్మణుఁడు నిజధర్మమునను, జెలఁగు నెడ దానపాత్రుఁడౌ నిల నతండు
లింగి యైనను గాని యలింగి యైన, నాతనిని విచారించుట యనవసరము. 8

వ. అనిన విని ధర్మనందనుండు గంగానందనున కి ట్లనియె. 9

చ. కురుకులనాథ శ్రద్ధలను గూడి యొసంగెడుదాన మెప్పుడున్
దురితము నొందనేర దని తొల్మనువుల్ వచియించు నన్న నా
సురనదినందనుం డనియె శుద్ధులు భవ్యులు నైనవార లా
దర మలరారఁ గా నొసఁగుదానము పాపహరంబు ధర్మజా. 10

వ. నావుఁడు పితామహునకుఁ బౌత్రుఁ డిట్లనియె. 11

తే. పితృలకార్యములందున విప్రవరునిఁ, జేయుదురు పరిశీలన శ్రేయ మెఱర
నటులె దైవకార్యములందు నవనిసురుని, వలయు నే పరిశీలింపఁ బౌరవేంద్ర. 12

వ. అనినఁ బరిశీలింపవలె నని దేవవ్రతుం డాభూవరున కి ట్లనియె. 13

సీ. సత్క్రియాపరుఁడు కాఁ జాలని వానికి, నపరంజి నొసఁగినయట్టివారు
పదియేడ్లు నరకనివాస మొనర్తురు, సావధానత విను జనవరేణ్య
సర్వవిధంబులఁ జదువుల నేరిచి, తనవిద్యచేత నితరులకీర్తి
నాశన మొనరింప నాశ చేసినవాని, బ్రహ్మహత్యాఘంబు వచ్చి ముట్టు

తే. వేయియశ్వమేధము లొకవేపు నిల్పి, సత్యమొకవైపునందున సరిఁగఁ దూఁచు
నెడల సత్యవాక్యమునకే యెక్కు వైన, గౌరవంబును గలదయ్యెఁ గౌరవేంద్ర. 14

తే. మద్యమాంసముల్ వదలుటే మానవునకు, బ్రహ్మచర్యము కంటెను బహుళమైన
పుణ్య మగు శమదమములు పొంది యుంట, భూప్రదక్షిణ మొనరించుపుణ్య మనఘ.

తే. రేపకడలును బవలును మాపులు నొగిఁ, గ్రమము మీఱక . ధర్మార్థకామములను
నాచరింపఁగ వలె నటు లాచరించు, నపుడు దానియం దాసక్తి యనుచితంబు. 16

తే. గురుని విప్రునిఁ బూజించునరుల కెల్ల, నధికపుణ్యము గల్గెడు నవనిసురుని
వేదముల నగ్నిహోత్రముల్ విడుచువాఁడు, మిగులఁ బాపము బొందును మేదినీశ.

వ. అనిన దానపాత్రుల నెఱిఁగింపు మన నజాతశత్రునకు శంతనపుత్రుం డి ట్లనియె. 18

సీ. పాండవోత్తమ విను వసుధామరులయందు, సత్యసంధులు సద్ధిజనులు మఱియు
క్రోధహీనులు మహాగుణులు ధీరమతులు, దాంతులు జితేంద్రియుల్ శాంతమతులు
సర్వభూతసములు శమయుతుల్ నిజకర్మ, నిరతులు నగువారు ధరణిలోన

దానపాత్రము లగు మానవనాయకా, సకలవేదము చదువువారు
తే. మఱియు షట్కర్మనిష్ఠలఁ బరఁగు వారు, తక్కువినుతైనబ్రాహ్మణోత్తముల కిచ్చు
దానము సహస్రగుణ మగు ధర్మరాజ, సావధానుఁడ వయి దీని నీవు వినుము.19
తే. విశ్రుతశ్రుతంబులు శీలవృత్తములును, గలుగువారికి దానము దెలియనిచ్చు
వలన వంశాభివృద్ధియౌ బ్రాహ్మణుండు, తృప్తిఁ గొనిన సద్యోమయుల్ తృప్తులధిప.
వ. యోగ్యుం డగుబ్రాహ్మణుండు పిత్రుకార్యంబులఁ దృప్తి వహించిన పితృదేవతలు పరితృప్తు లగుదు రనిన విని పూజాకాలము లెఱుఁగుపు మన గాంగేయుండు పాండ వాగ్రజున కిట్లనియె. 21
తే. రాజపూర్వాహ్ణమునఁ పరాహ్ణ మెప్పుడు, దేవపిత్రుపూజలకు నెన్న దివ్యమగుచు
మధ్యసమయమునందున మానవులకుఁ బూజలకుఁ దగుకాలము పురుషవర్య. 22
వ. అమంత్రకము భుక్తశేషము నగుద్రవ్యము రాక్షసులు గైకొందు రట్టిదానిని దానము చేయరాదు. 23
తే. మాననీయ ద్రవ్యంబున మానవులను, దేవపిత్రులనుఁ బూజింప దివ్య మగును
దేవపితృకార్యములఁ బాపభావులైన, వారలకు నన్న మిడుట నిష్ఫలము రాజ.24
తే. మత్తుఁ బతితునిఁ గ్లీబు నున్మత్తు చపలు, దేవలకు జికిత్సకు దుష్టభావు ఖలు గృ
తఘ్ను రాజయక్ష్మయుతు నర్తకుని సోము, వితియుని వేదవిక్రయున్ విద్యహీను.
ఆ. వడ్డి కిచ్చి బ్రదుకు వానినిఁ బాత్రవి, క్రయుని దేవపిత్రులకార్యములను
విడువవలయు నన్న విని ధర్మనందనుఁ, డాపగేయుతోడ ననియె నిట్లు. 26
వ. పితామహా దేవపైతృకంబు లగుదానంబులకుఁ బాత్రభూతుల నిరూపింపు మన సురాపగేయుండు కురూద్వహున కిట్లనియె. 27
సీ. భోజనాదులఁ దృప్తిఁ బొందించు వాఁడును, సౌశీలవంతను నోలుపోవు
ధనముఁ గోరెడువాఁడు తన్ను దాను స్వావా, హాముచేయ సహించునట్టివాఁడు
గురుఁ దల్లిదండ్రులన్ బరమసాక్షినిసతిక్క, బత్రులఁ బ్రోచెడు బుద్ధివాఁడు
శమదమోన్నతియును శౌచసత్యములను, వ్రతములఁ గాఁ గల్గియుండెడువాఁడు
తే. సర్వకాలభిక్షాటన సల్పువాఁడు, మఱియు నిష్పాపుఁడును మోదపరుఁడుశుచియు
నైనవిప్రుఁడు దేవపిత్ర్యాదులైన, కార్యములకుఁ దగినవారు కౌరవేంద్ర. 28
సీ. స్త్రతము సాలయఁ జలిపండఁదల్ మఱి, రచ్చకొట్టంబుల వ్రచ్చుటయును
గురుజనంబులఁ దిరస్కరణం బొనర్చుట, వేదవిక్రయమును వేదనింద
యన్నృతంబులను బల్కి యవని జీవించుట, సంధిభేదనమును శాంతి లేమి
పరదారఁబొందుట పరదారలను బొందు,నగినమంత్రాదుల దా నెఱుఁగుట

తే. శాస్త్రవిధ్వంసనము కృతఘ్నతయు లేమి, వృద్ధులకుఁ దాపసులకును భీతిఁ గొలిపి
వంచనల్ భృత్యులకు మునివరుల కిడక, తనయులకుఁ బెట్టకుండఁగఁ దాను దినుట.

వ. ఇవి నరకలోకనివాసప్రదంబులు మఱియు. 30

తే. విషము శస్త్రకేశాదులు విక్రయించి, శస్త్రములచేతఁ గన్యాదిజనుల విప్ర
జనుల సొమ్ముఁ దరియుట వనము గుహను, భక్తిఁ గంభ్రూణహత్యని విడుట పాతకమ్ము. 31

తే. బాటలోఁ గంటకంబుల నాటుటయును, గొయ్యలను బాతి చెఱుపును గోరుటయును
నేరమును లేక శిక్షింపఁ గోరుటయును, నారకనివాస మొసఁగును నరవరేణ్య. 32

వ. నెపములేక శిక్షించి ప్రజలహింసించి వారివలన నన్యాయముగా బన్నుగొను జనవ
రుఁడు నరకనివాస మొందును. 33

తే. గోవులకుముక్కుఁగుట్టఁగఁగోరువాఁడు, దుష్కర్మములనుఘాతమొనర్చుమూర్ఖమతియు
మేఁత వేయకఁ బాగ్గొనుఘాతుకుండు, నరకలోకముఁ గాంతురు ధరణినాథ. 34

వ. దేవకార్యముల కొనర్చినపశుహింస పరమశివం బని యార్యులు పల్కుదురు. 35

తే. దీను లగువారలకు నన్నపానములను, హేమవస్త్రాదుల నొసంగి ప్రేమతోడఁ
బ్రోవవలె నిట్లు వారలఁ బ్రోచువాఁడు, పరమసంతోషమును బొందుఁ బార్థివేంద్ర.

తే. రచ్చకొట్టముల్ మఱియు నారామములను, బావులును గుంటలొనరించి భయముఁ గల్గు
వారిఁ గాపాడి కన్యల వాహనముల, దాసదాసీల నొసఁగుట ధర్మ మధిప. 37

తే. కీడు చేసినవారలఁ గూడ సైచి, చెలువుఁ జుట్టంబులను వేడ్కఁ జెలఁగఁ బ్రోచి
దుష్కృతంబుల నొనరింపఁ దొడరకుండు, నాతఁ డుత్తమగతిఁ జెందు భూతలేశ. 38

వ. పుణ్యపాపకారణంబుల తెఱంగెఱిఁగించితి నింక నేమి చెప్పవలయునో కోరు మన ధ
ర్మజుం డాధర్మాత్మున కిట్లనియె. 39

తే. బ్రహ్మహత్యాసమము లగుఁ బాపము లని, కర్మలను గొన్ని యందు రక్కారణంబు
నాకు నెఱిఁగింపు మన్న గంగాకుమారుఁ, డనియెఁ బాండవోత్తమున కిట్లనుపమీఱ.

సీ. కృశుఁ డగువిప్రుని విశదపూరీతిని బిలిచి యన్నంబును బెట్టకుంట
యుత్తమకులమును నుత్తమవిద్యయు గలబ్రాహ్మణునివృత్తిఁ గైకొనుటయు
సరసున ద్రావంగ నరుదెంచు గోవుల విఘ్న మొనర్చుట వేదములను
శాస్త్రములను నింద సల్పుట బహిరంగ, గ్రంథధనంబులఁ గైకొనుటయుఁ

తే. కోపమున నూరిలో రచ్చకొట్టములను, వనమునందున నగ్నిని వైచుటయును
విప్రవర్యులను బరాభవించుటయును బ్రహ్మహత్యాసమానముల్ రాజరాజ. 41

వ. సుగుణసౌందర్యశీలునకుఁ గన్య నియ్యక ధనంబున కాశించి తగనివరున కిచ్చుట దా

నికి విచారముఁ గలిగించుట బ్రహ్మహత్యాశోఁ దుల్యా మన ధర్మజుండు భీష్మునకు
మ్రొక్కి పుణ్యతీర్థవిశేషము లెఱింగింపు మనఁ బితామహుం డిట్లనియె. 42

### తీర్థవిశేషములు.

తే. చంద్రభాగయందున వితస్తయందు నూర్మిమాలిని నేడుదినములు మానవుండు
స్నానసంధ్యాజపాదులు సలిపె నేని, మునిసమానుఁ డగును వాఁడు వినుము పార్థ.
వ. కాశ్మీరవనమందలి మహానదులలో స్నాన మొనర్చిన నాకలోకప్రాప్తి గలుగును.
తే. పుష్కరప్రభాసనైమిశమునను స్వర్గ, బంధు వింధ్యమార్గమునందుఁ బావనమగు
వానియందు స్నాన మొనర్చువార లెల్ల, రచ్చరలతోడ విహరింత్రు సచ్చరిత్ర. 45
వ. ఇంద్రతోయము కరతోయము కుశేశయము హిరణ్యబిందువులం ద్రిరాత్రోపవా
స మొనర్చిన వారశ్వమేధఫల మొందుదురు గంగాద్వారము నీలభూధరము కుశా
వర్తము బిల్వకమున స్నాన మొనర్చిన వారు నాకలోకనివాసము గాంతురు. 46
క. వరభాగీరథియందున, దురితంబులఁ దొలఁగునట్టితోయము లాడన్
నరుఁ డిహపరంబులందును, బరమసుఖంబులను బొందుఁ భారత వింటే. 47
వ. భృగుతుంగమున మహాహ్రదమున మూఁడుదినము లుపవసించి మొనర్చువారు
బ్రహ్మహత్యాదిమహాపాతకములు విడనాడుదురు. 48
సీ. విను కాన్యకుబ్జమం దనలము శోధ ని, వాస మొనర్చుమవాఁడు రాజ
యుభయలోకములందు నొందుఁ గీర్తులు సిరుల్, సుందరికాహ్రదమందు నరుఁడు
స్నాన మొనర్చినజన్మాంతరంబున, సుందరాకారుఁడై క్షోణిఁ బుట్టు
వైమానికమున నివాస మొనర్చిన, స్వర్గలోకసుఖంబు వాఁడు గాంచు
తే. కృత్తికాంగారకములను గీర్తిగాఁగ, సేవఁ జేయుటవలనను క్షితినరుండు
సకలపాపములఁ దొలఁగి స్వర్గమునకుఁ, జనును వింటె తీర్థాఖ్యానమును నరేంద్ర.
వ. కలికాశ్రమమున బ్రహ్మచర్య మొనర్చిన జన్మరహితుం డగును గృత్తికాశ్రమమున
బ్రహ్మచర్యము సలిపిన శివలోకనివాసము గల్గును. 50
తే. చిత్రకూటజనస్థానసేవ వలన, రాజ్యలక్ష్మి చేకూరును రాజరాజ
గంగ యమున సంగమమును గాంచువాఁడు, నశ్వమేధయాగఫలము ననుభవించు. 51
క. వైవస్వతతీర్థంబును, సేవించిన సకలతీర్థసేవాఫలమున్
వావిరినిఁ బొందుమనుజుఁడు, భూవర యిది వినినయెడలఁ బుణ్యా మధికమా. 52
వ. ప్రయాగలో మూఁడుకోట్లపదివేలతీర్థములు నివసించు నందుస్నాన మొనర్చినవాఁ
డు మోక్ష మొందును గంగయందును బ్రహ్మశిరమునందునను స్నాన మొనర్చి
నిర్గాహారుండై యున్నవాఁడు చంద్రలోకము గాంచును కౌహిత్యమును సేవించినఁ

బుండరీకాధ్వరఫలం బొందును రామహ్రదంబున జలక మాడిన సకలకల్మషము
లం దొరంగును జమదగ్నిని సేవించినఁ బుణ్యలోకముఁ గల్గును వింధ్యయందున దా
మహ్రదంబునను నీరమాడినఁ బాపరహితులై పుణ్యలోకము గాంతురు. 53

ఉ. నర్మదతీర్థమందున మనంబున భక్తిని స్నానముఖ్యస
త్కర్మములం బొనర్చినను ధన్యుఁడు రాజకుమారుఁ డయ్యెనుర్
నర్మిలి జంబుమార్గమునయందు వసించినవాఁడు పుణ్యుఁడౌ
ధర్మజ పార్శ్వ సేవనము దాల్మినిఁ గొల్చినఁ బాపహీనుఁడౌ 54

వ. కోశాముఖతండలీకాశ్రమములఁ దప మొనర్చి నిరాహారుఁడైనవాఁడు దేవకన్యల
కధిపతియై జరామరణరహితుం డగును కుల్యాస్నాన మశ్వమేధఫలం బొసంగును
బ్రహ్మసరస్సు సేవించినఁ బౌండరీకఫల మగును భండారకస్నాన మగ్నిష్టోమఫలం
బగును. 55

చ. నరుఁ డిలఁ దీర్థసేవనమునందుఁ దమంబు శమంబు శాంతితోఁ
బరఁగుచు సర్వపాపములఁ బాయును భూవర తీర్థయాత్రిలన్
నిరతము మానసంబునను నెమ్మిఁ దలంచినయట్టి వానికిన్
దొరకును సర్వతీర్థములఁ దోయము లాడుఫలంబు భారతా. 56

వ. శిష్యపుత్రస్నేహితులకు సద్విషయంబుల నెఱింగించిన వాఁ డుత్తమలోకనివాసి
యగుననియనేకవిధంబులఁ జెప్పె నయ్యవసరమ్మున వసిష్ఠాత్రిపులస్త్యగౌతమవిశ్వా
మిత్రాదులు శరతల్పగతుం డగుభీష్ముం జూడ నేతెంచి యమ్మహాత్మునిపదములకుఁ
బ్రణమిల్లి రయ్యవసరంబున. 57

తే. ధర్మనందనుఁ డంతటఁ దాత కధిక, భక్తితోడను బ్రణమిల్లి పౌరవేంద్ర
యేనదులు పుణ్యమయమగు నెఱుఁగఁజేయు, మనుఁడు శాంతనవుండిట్టు లనునతనికి.

తే. వేయిపాపముల్ చేసినపిదప గంగ, స్నాన మొనరించు నెడలను భానుతేజ
మునను జీఁకటి పోయెడు పోల్కిఁ గాఁగ, సర్వపాపాపహారణమౌ సార్వభౌమ. 59

తే. ఎన్నివేలవత్సరము లిం దెవనియెమ్ము, లుండునో గంగలోపల దండిమీఱ
నన్నివత్సరములు నాతఁ డమరనాథ, లోకవాసము గాంచును లోకవినుత. 60

క. గంగాస్నాన మొనర్చిన, బొంగుచు మానవుఁడు దివముఁ బొందెడు ననుచున్
గంగామహత్వ మంతయుఁ గాంగేయుఁడు ధర్మజునకుఁ గరుణ వచించెన్. 61

వ. గంగ లేని దేశంబులు హీనంబులు నూఱు చాంద్రాయణవ్రతంబులు గంగాస్నానము
నకు సాటిరావు గంగానదితోఁ దుల్యమైనది లేదు శరణు లేనివారికి గంగాదేవి శ
రణము. 62

తే. గంగమీఁదుగా వచ్చుగాలి మేనసోఁకి, దేహమందున సోఁకుతో దెలియవాఁడు
సకలపాపములఁ బోనడంగి ప్రకటితముగ, నూర్ధ్వలోకంబులను బొందు నోమహీశ.

వ. గంగను దలంచుచు నితరజలంబుల స్నాన మొనర్చిన సర్వపాపపరిహార మగును న మర్త్యుఁడై గంగను జూడనివాఁడు పశుతుల్యుఁ డనఁ బరఁగును ధర్మనందనా! గంగా మాహాత్మ్య మెఱింగింప నింద్రునకు శక్యముఁ గా దని వాసుదేవనారదసంవాదప్రకారమును వాసుదేవభూదేవీసంవాదప్రకారంబును నారద పంచచూడాసంవాద బును దేవశర్మ యనుమునిభార్య రుచి చరిత్రంబును దెలిపి గాంధర్వాదివివాహ ములతెఱం గెఱింగింప నెంచి యిట్లనియె. 64

క. కులమును శీలము విద్యయుఁ, గలవానిం జేరఁ బిలిచి కన్యాదానం
బలరఁగ నొసంగ వలయును, జలధారాపూర్వకముగ జనద్రికులేంద్రా. 65

వ. అది బ్రాహ్మ్యవివాహము కన్యక వరునిఁ గోరుకొనుట క్షత్త్రియ వివాహము పర స్పరానురాగవివాహము గాంధర్వము శుల్కము గ్రహించి కన్య నిచ్చుట యసుర వివాహము కన్నియను బలిమిని బలాత్కరించుట రాక్షసవివాహ మని మఱియు.

తే. తల్లిదండ్రులు లేనట్టిదాని భాత్ర్యఁ, హీనుఁడౌ నగుకన్యను మానవుండు
పరిణయము చేసికొనుటయే సరితమగును, మఱియుఁ జెప్పెదవినుమయ్య మానవేంద్ర

వ. బ్రాహ్మణుండు శూద్రజాతికన్యను వరింపరా దని యెఱిగించి యాగసావిత్రీభే దాదు లెఱింగించి చ్యవనకుశికసంవాదం బనునితిహాసంబును జ్యవనుండు యోగబ లంబునఁ గుశికునకు నాకలోకము చూపుట మొదలగునవి యెఱింగించి దానవిశే షము లెఱింగింప నెంచి మందాకినీనందనుం డిట్లనియె. 68

—దానవిశేషములు—

సీ. కాంస్యోపదోహయుఁ గాంచనశృంగయు, ధవళాంబరంబుల దాల్చినదియు
నావును భక్తితో నవనీసురులకును, దానమిచ్చినమహాధర్మ మగును
దాన మిచ్చినవారు దానికాయంబున, నెన్నిరోమము లుండు నన్ని వేల
దివ్యవత్సరములు దేవలోకంబున, వసియించుచుందురు వసుమతీశ.

తే. మఱియుఁ దమకులంబున నేడుతరము వారి, స్వర్గమునకును బంపెదు వా రగుదురు
ధరణిఁ గన్యకాగృహముల దాన మిచ్చు పుణ్యమును స్వీకరింతు రగణ్యచరిత. 69

వ. కన్యాగృహాజలశకటాంబరాదుల దాన మిచ్చునా రుభయలోకంబులఁ బూజ్యు ల గుదురు. 70

తే. యాచకుఁడు కోరువస్తువు లమూల్యములు, బ్రియము మీఱ నొసంగుటే శ్రేష్ఠమగును
వస్తులదానముల నిచ్చినది యటంచు, నార్యవర్యులు పల్కుదు రవనిలోన. 71

వ. మఱియు సర్వభూతములకు దానము చేయుటకంటె గొప్పదగుదానము లేదు పీరశ
యన ముత్తమదాన మని వాహినీనందనుండు ధర్మనందనున కిట్లనియె. 72

తే. శత్రుడైన దీను డయిన శరణు వేఁడ, నెట్టివానినిఁ గాపాడి యొసఁగువాఁడు
ధరణిఁ బురుషోత్తముం డనఁ బరఁగుచుండు, ననియు మఱియుఁ గాంగేయుఁ డిట్లనె నతనికి.

తే. ఆకలిం గొన్నతనయుల నరయ లేక, యాచన మొనర్పఁ దెలియనియట్టివాని
నరసి తగినద్రవ్యం బిచ్చునతఁ డిహంబు, నందుఁ బరమందు సౌఖ్యములొందు నధిప.

తే. సర్వకాలములందు యజ్ఞము లొనర్చు, కామదోషరహితు లగుభూమిసురుల
వెదకి కాపాడుచుండు శ్రీపృథ్విలోన, నధికధర్మ మనుచు నందు రార్యవరులు. 75

వ. అనిన యాచనాయాచనంబులలో నెయ్యదిదానార్హం బన ధర్మజునకు వాహినీనంద
నుం డిట్లనియె. 76

సీ. యాచించువానికి నవల నిచ్చుటకంటె, యాచింపఁ గోరఁ డే డని యెఱింగి
యిచ్చినఫల మది యెక్కువఫల మిచ్చు, యాచించుటన్న నో హానికరం బ
యైన నడుగుదాని నతిదయతో నిచ్చి, పోషించు నెంతయో పుణ్య మొదవు
బ్రాహ్మణోత్తములకు భక్తితో గోభూసు, వర్ణదానము లిచ్చువాఁడు ధరణి

తే. సకలదానయజ్ఞఫలము సరసిఁ గాంచు, యజ్ఞముకన్న దానమే యధికమ యగు
ననిన ధర్మజుఁ డానందమునఁ జెలంగి, జాహ్నవీసూతి కిట్లనె సవినయముగ. 77

తే. కురుపితామహ వింటె యీయనుశాసనమున, బెక్కుదానముల్ గలవని విన్నవాఁడ
నన్నిటను గొప్ప దగుదాన మనఘ నాకుఁ, దెలిపినను గృతార్థునిఁ జేయు దేవ నీవు.

సీ. ధర్మతనూభవా దానము లన్నిట, భూదాన మెక్కుడు భూతలమున
సకలసంపదలకు సకలసుఖములకు, భూమికారణ మగు సోమకులేశ
భూదాన మనిన మహాదానములలోన, నుత్తమ మని కీర్తి నొందె నయ్య
భూమిదాన మొనర్చునామనుజుం డిల, కనకరజతవస్త్రధనములు మఱి

తే. వివిధరత్నము లొకతూరి విప్రులకును, నిచ్చినట్టిఫలము నొందు నిభపురీశ
భూమి కెంతటి యాయువో భూమిదాన కర్త యన్నాళ్లు నాకలోకమున నుండు. 79

తే. అల్పభూమిదాన మొనర్చి యధికఫలము, బొందు నా జగన్నాథుఁడు భూమిదాన
ఫలము నైనను రణహతఫలము నైనఁ, బొందవలె నిది యాలింపు పురుషవర్య 80

క. మేదినినాయక వింటే, భూదానమువలనఁ గల్గుపుణ్యము ద్విజహ
త్యాదిమహాపాతకముల, నేదియు లేకుండఁ జేయు నిభపురనాథా. 81

తే. భూమిదాన మదెంతటిమూర్ఖువలనఁ, గైకొనినఁగాని పాపముఁ గలుగఁ బోదు
భూమిదానాశ్వమేధముల్ భూతలమున, సమములని యార్యులందురు శమనతన య

వ. దారిద్ర్యంబునఁ బరితపించువిప్రునకు భూదాన మొనర్చినఁ దత్ఫలము నుతింప నజు నకు శక్యము గాదు గోచర్మమంతటిపరిమితి గలభూమి దాన మొనర్చినఁ బోవు పాపము కోటివేలవత్సరములు ఘోరతప మొనర్చినఁ బోదు మఱియు. 83

క. దురమునఁ జచ్చినవారలు, గురుపూజను జేయువారు కువలయమందుఁ
ధరణీదాన మొనర్చిన, నరులకును సమంబు కారు నరవర వింటే. 84

వ. మున్ను భూదేవి నరుల కిట్లనియె. 85

తే. మానవోత్తములార నన్ మానకుండ, దానములను బొనర్చుడు దానివలన
రెండులోకములందున మెండు గాఁగ, సౌఖ్యములఁ బొందువా రని నరవిఁ బలికె.

తే. నన్ను దాన మొనర్చుచున్ననరుఁడు, మూర్ఖుఁ డైనను బుణ్యము పొందఁగలఁడు
సందియం బింద లే దని క్షమ వచించె, ననుచు భీష్ముండు వచియించె జనవరునకు.

సీ. రత్నగర్భంబు ధరాస్థల మెల్లను, భూదాన మొనరించుపూరుషునకు
హాస్తియు వనితాదు లఖిలరత్నము లిచ్చు, వలనఁ గల్గుఫలము గలుగుచుండు
ధనమును గూర్చెడి ధరణిదాన మొనర్చు, వానినిఁ జూచి యీవసుధలోన
సకలభూతంబులు సంతసమును బొందు, వసుధదాన మొనర్పవలయు నృపతి

తె. పార్థివుఁడు పాపములకు నావాస మగుట, వసుమతీదానమునఁ దనపాపములను
నాశన మొనర్ప వలయును న్యాయ మలర, ధర్మనందన వింటె భూదానఫలము. 88

వ. పూర్వు లిచ్చినభూమి నాక్రమించిన మూర్ఖుఁ డిర్వదియొకతరములవారితో నరక లోకనివాస మొందును. 89

తే. మునులు దేవోత్తములునన్నమునునుతింత్రు, క్రతువులన్నమువలన నేకలుఁగుచుండు
నన్నమున భూతములు దృప్త లగుచు నుండు, నన్నదానముతో సమ మైన దేది. 90

వ. పవిత్రాన్నదానముతో సమ మగునది ముల్లోకములను లేదు. 91

తే. ప్రాణములకు నాధారమై పరఁగుఁ గాదుఁ, దనగృహమునందు వారికిఁ దక్కువైన
నన్నమును దాన మిడవలె నతిథులకును, దాని లేదనఁ గా రాదు ధర్మరాజ. 92

వ. ఆఁకలి యనుబాలుని వృద్ధుని వనితను నతిక్రమించుట మహాపాతక మయ్యెడు. 93

తే. దేవపితరుల కన్నముఁ దృప్తిఁ జేయ, వలయు నితరుల కన్నము నైచునపుడు
కులము వృత్తము లడుగుట కూడ దెందు, నడుగ కన్నదాన మొనర్చుటధికఫలము.

తే. అన్నమును బెట్టుఁమనుజుఁ డిహంబునందుఁ, బరమునందును సౌఖ్యముపడుచునుండు.
సకలభోగము లొందును బ్రకటితముగ, నన్నదానముఁ బోలిన దవని లేదు. 95

వ. అనిన నక్షత్రదాన మహిమము చెప్పి వెన నస్పైవ పురుషుఁ డపర్థన కిట్లనియె
సీ. స్వర్ణ దానంబు సకలకామ్యము లిచ్చు, ధామ నిత్య మగు ... లుఁగ చుండు

నుపరంజిదానంబు నాయుఃప్రదం బగు, భావశుద్ధియు మహాపావన మగు
స్వర్ణదానంబును సలిపినయాతఁడు, సర్వదానఫలంబు నుర్విఁ గాంచుఁ
బానీయదానము పరమోత్తముఁ బగు, గోలఁకుల బావుల నిలఁ జెఱువులఁ

తే. దవ్వ్రఁ టత్యుత్తమం బగు ధర్మ మగును, నవియె యుత్తమలోకము లిచ్చుచుండు
నవని నెవఁడు త్రవ్వించుజలాశయమున, గోవు లుదకము దప్పికిఁ గ్రోలు నందు. 96

వ. వానివంశము వారందఱు పుణ్యలోకములఁ గాంతురు యెవరొనర్చినతటాకమున మూనవు లవభృథస్నానము లొనర్తురో యట్టిపుణ్యుండత్యుత్తమలోకము నొందును.

తే. సర్వదానములందున జనవరేణ్య, యుత్తమము దిలదాన మీయుర్విలోన
వినుము తిలదానమందునఁ బితరులెల్ల, నిత్యశుచు లగుచుందు రోసత్యమూర్తి. 98

వ. ధర్మనందనా! తపోవంతులకంటెను గోవులగౌరవం బెక్కుఁ డని యాఖ్యలు నుడువుదు రాలకింపుము. 99

తే. ఆవు కుపచార మొనరించునట్టివాఁడు, పాపరహితుఁడై పొందును బరమపదము
నావుపాలమృతం బని యజుఁడు పలికె, నావుదాన మమృతదాన మనఁగ నొప్పు.

వ. ఒకగోవును దానమిచ్చినఁ బుణ్యలోకము గల్గును బెక్కుగోవుల దాన మొనర్చినఁ మోక్షము గలుఁగు నన్నోదకదానము లత్యుత్తమ మైన వనియుఁ దిలదాన మతిపవిత్ర మనియుఁ దిలదానవిషయకయమబ్రాహ్మణసంవాద మెఱింగించి నృగుఁడు శ్రీకృష్ణునివలనఁ బాపవిముక్తుఁడై పుణ్యలోకముల కేగుట గోప్రభావవిషయకశ్వేతకేతుచరిత్రమును బృహస్పతి మాంధాతకుఁ దెలిపినగోదానవిధిప్రకారమును గోవునకుఁ గపిలత్వము సిద్ధించుటయు వేదవ్యాసుఁడు శుకునకుఁ దెలిపినగోప్రభావమును సుమిత్రమునిచేఁ బోధింపఁ బడుగోప్రభావము గోవులురంతిదేవునియజ్ఞపశువులై గోలోకమునకుఁ బోవుట కపిలగోమహానుభావత్వము శ్రీగోసంవాదంబును దెలిపి సువర్ణదానమహిమ నెఱింగింపఁ దలఁచి యిట్లనియె. 101

సీ. స్వర్ణదానము మహాపావన మైనది, పావనమాత్మకు వంశమునకు
స్వర్ణదానంబున సర్వపాపంబులు, నాశన మయ్యెడు నరవరేణ్య
బ్రాహ్మణోత్తములకు రజతసువర్ణముల్, దాన మొనర్పుము ధర్మరాజ
కలుషనాశన మగుఁ గనకమాహాత్మ్యము, నధికతేజోమయ మవనిలోన

తే. స్వర్ణదాన మొనర్చినవాఁడు ధాత్రి, నగ్నివలెఁ బరిశుద్ధుఁ డౌ ననఘచరిత
సర్వపాపహరుం డగు జనవరేణ్య, యనిన ధర్మజుఁ డత్యంతహర్ష మందె. 102

వ. అంత శాంతనవుండు కౌంతేయాగ్రజునకుఁ బితృపూజావిధాన మెఱింగించి యత్రిమహాముని నిమి కెఱింగించిన శ్రాద్ధక్రియ విశేషంబును గృత్తి యనురక్కసి వృషాదర్భిచే వ్యాకినోదటియు సూర్యజమదగ్నిసంవాదంబును శూద్రున కపశ్యానుష్ఠి

యంబు లగుధర్మములను సర్వపక్షపాతమాన్యధర్మనిరూపణప్రకారంబునుపరాశర
మునిప్రణీతధర్మంబులును ధర్మజున కెఱిఁగించి యాసర్మలాత్ముం డిట్లనియె. 103

సీ. ధర్మార్థకామముల్ ధర్మము దప్పక, నడపెడువారలు పుడమిలోన
సతులు కోరంగ దగు సౌందర్యమును గల్గి, వారిచేతను గోరఁబడియుఁ గూడ
నిష్కాములై యుండి నిజరూపవ్యాపులఁ, గలిగినగర్వము గలుఁగకుండఁ
దనభార్యయందుఁ దృప్తినిఁ బొందు వారలు, సత్యవ్రతస్థులు శౌచవిధులు

తే. విపులజపతపోనిధులును వినుతయశులు, గూఢధర్ములు సన్యాసకోవిదులును
మూఁడులోకములందునఁ బూజితులగు, వందనీయులగుదురయ్య సుందరాంగ.

వ. అనిన విని ధర్మనందనుండు తటాకనిర్మాణఫలము చెప్పవేయని కోరిన భాగీరథీనం
దనుం డిట్లనియె. 105

తే. ఏతటాకమునందున భూతలమున, సర్వకాలము నిండుగా జలముఁ గల్గు
నాతటాకమ్ము నిర్మించినట్టివాఁడు, పరమపదమును గాంచును పార్థివేంద్ర. 106

వ. మఱియు ననేకయజ్ఞము లొనర్చినసుకృతమును సర్వోత్తమంబగు లక్ష్మీకీర్తుల
లను గాంచును. 107

క. ఫలవృక్షాదుల నాఁటిన, నిలఁ బక్షులకును నివాస మేర్పఱచుటె యాఁ
దెలియ విను మయ్య యాతఁ, డలరఁగ నిహపరములందు నతిసుఖ మొందున్. 108

సీ. కారవేశ్వర తటాకముల నిర్మించినఁ, బితరుల మదికి సంప్రీతిఁ గలుఁగు
భూరుహచ్ఛాయను గోరుచువారును, పూవులవలన వేల్పులును మఱియు
ఫలములఁ బిత్రుదేవతలును మోదింతురు, తరులనాఁటినఁ గల్గుఁ బరమపదము
ననిన ధర్మతనూజుఁ డనఘ గంగాత్మజా, గృహధర్మములను నా కెఱుఁగఁ జెప్పు

తే. మనిన గాంగేయుఁ డిట్లనె నతనితోడ, నిత్యదేవక్రియలఁ జేయ వలె గృహస్థుఁ
డట్లొనర్చి చూడఁగవలె నతిథికొఱకు, నతిథి వచ్చినఁ బూజింప నగు సతంబు.

తే. తాను భుజియింప నుద్యుక్తుఁ డైనఁ గాని, యతిథు లెవ్వరు రాకున్న నగ్నిముఖము
నందు హోమము నొనరించి యవలనుపఁడు, బంధుమిత్రులతోఁ గుడువంగవలయు.

వ. గృహస్థధర్మము ననుసరించి భోజన మొనర్చిన నిహపరలోకంబున నమితసౌఖ్యము లభిం
చును. 111

—పూజావిధానములు—

తే. పుష్పములచేత వేల్పుల బూజఁ జేయ, వారలకు మంచిమనమయి పరఁగుఁ గాన
పుష్పములు సుమనసు లని పొందెఁ బేరు, సుమనములఁ బూజమెచ్చెదరమరులధిప.

క. పరిమళమగుఁ బుష్పంబుల, సురలను బూజింప వలయు సురుచిరభక్తిన్

దురితములు దొలఁగఁగా నిహ, పరసౌఖ్యము లొందు చుండ్రు ప్రజలు నరేంద్రా. 113

వ. పుష్పములోఁ దామరలు మత్తులసీదళములు వేల్పులకుఁ బరమసంతోషముఁ గల్గించును.

తే. పుష్పములను గైకొని భక్తిఁ బూజఁ జేయ, దేవతలు పరమప్రీతిఁ దేజరిల్లి
నరుల కిచ్చెద రప్పుడే వరము లెల్లఁ, గానవారిఁ బూజించుటే కడుసుకృతము. 114

తే. దీపదానముత్తమ మగు దీపమందు, వర్తి ఘృతము సమంబుగా నైన వలయు
నట్టిదీపదాన మొనర్చు నట్టివాఁడు, నాయురైశ్వర్యకీర్తులఁ గాంచు నధిప. 115

తే. దేవునకుఁ బ్రియంబుగ నిచ్చు దివ్యమైన, దీప మపహరించిన వాఁడు పాపియగును
గ్రుడ్డివాఁడగు నభలోన గుడులమీఁద, దీప మిడిన నైశ్వర్యము లేపుమీఱు. 116

వ. దీపదానమునకు గోఘృతం బత్యుత్తమం బగును దీపము చక్కఁగ వెలిఁగినదీపదా
త సకలైశ్వర్యము లనుభవించును. 117

తే. దేవతల కుపహారము దెలియ నొసఁగి, పిదప భుజియింప వలయును విప్రు లిలను
నట్లుచేయక పోవువాఁ డసురుఁ డగును, సురల కుపహార మిచ్చుట పరమశుభము.

తే. దీపదాన మన్నిటిలోన దివ్య మగును, దీపదాన మొనర్చిన దివ్యతత్త్వ
మైనజ్ఞానోద్భవం బగు నవనినాథ, సావధానుఁ డవై విను స్వాంత మలర. 119

తే. దేవసాన్నిధ్యమందున దీప మెన్ని, నిమిషములు వెలిఁగించునో నెమ్మి మనుజుఁ
డన్ని దివ్యవత్సరము లయ్యమరపురిని, సర్వసౌఖ్యములను బొందు సార్వభౌమ. 120

వ. అని యింద్రునకు మతంగమునితో నైన సంవాద మెఱిఁగించి యాపగేయుండి
ట్లనియె. 121

సీ. ధర్మతనూజ సదాచార మాయువు, వృద్ధినిఁ బొందించు విశ్వమందు
నంతియె కాకుండ సంతతి కీర్తులు, వృద్ధిఁ బొందించును విమలచరిత
యాచారహీనున కాయు వల్పం బగు, నాచారసంపన్నుఁ డగుట మేలు
గురులవాక్యంబులు నిరసింపఁ గారాదు మఱియు బ్రభాతాస్తమానములను

తే. నబ్జహితుఁ జూడఁగా నాయు వల్ప మగును, సంజదేవపూజాదులు సల్పవలయు
హింస యనృతకోపాదుల నెంచి విడుట, వృద్ధి యగునెందు నాయువు పృథ్వినాథ.

క. పరదారగమనవాంఛయుఁ, బురుషులకుం గలుగునెడల భూతలనాథా
పరికింప నాయువెంతయు, హరించి వై చెడును, గాన నది మానవలెన్. 123

ఆ. వంశనాశన మగుఁ బరదారగమనము, పుణ్యమును హరించుఁ బురుషులకును
బంధుమిత్రు లెల్ల వాని దూషింతురు, నరక మొందుఁ దాదిని నరవరేణ్య. 124

వ. మఱియు నాయురైశ్వర్యముల హరించును బరకాంతలలో గురుభూసురభృత్యబుధుల

భార్యాదులాయువుఁ గమశ్రీఘుఖోహరింతురు కావునఁ బరనారి వాంఛ యకార్యము. 125

సీ. దేవాలయమున వీథిని గోష్ఠశాలను, మలమూత్రములు వీడ మంచి గాదు
ప్రాఙ్ముఖుండవు నార్ద్రపాదుండవై భోజన, మును జేయవలయును జనవరేణ్య
నిలిచి భోజనమును సలుపుట పాపము, నిలిచి మూత్రము విడువలన నఘము
వేదముచదివెడు వేళశిరంబును, బట్టి నిద్రించుట పాడి గాదు
తే. రెండుచేతుల దల గోకుకొనఁగ రాదు, శిరము నూనె దేహమునకుఁ జేర్ప రాదు
గురునితోఁ గయ్య మాడుట దురిత మగును, ధర్మనందన వినవె యీనర్మములను.
చ. గురువులతో నసత్యమును గోరి వచించిన నాయు వల్ప మౌ
దురితమును చుట్టివచ్చును దొడ్డతనం బది కాదు కావునన్
నిరతము సత్యవాక్యములనే పలుకం దగు నట్టులైన నా
నరుఁ డిహమందున స్వర్గమునందున సౌఖ్యము లొందు భూవరా. 127
తే. క్షత్రియులకు ముసలులకు గర్భిణులకు, భారవాహకులకును దుర్బలజనులకు
దారియింప నాటంకము దగులు నవక, మార్గ మిచ్చుట మంచిది మాన్యచరిత. 128
వ. బ్రాహ్మణోత్తములు వృషభములు దేవాలయములు కనఁబడినఁ బ్రదక్షిణనమస్కారము లొనరింపవలయును పౌర్ణమాస్యమావాస్యలందు బ్రహ్మచర్యవ్రత మవలంబింప వలయు. 129
తే. ఉభయసంధ్యలయందున నిభపురీశ, నిద్రఁ బొందుట యెంతయో నీచ మగును
దల్లిఁ దండ్రి కాచారికిఁ దప్పకుండ, మ్రొక్కవలె నిరతంబును బూరుషుండు. 130
సీ. గర్భిణీసతులసంగమము గోరుట మహా, దురితకార్యం బగు ధరణినాథ
పశ్చిమోత్తరములౌ ప్రక్కల శిర ముంచి, పవ్వళింపఁగ రాదు పాప మగును
జినిఁగినపఱుపునందునఁ బవ్వళించుట, యనుచితకృత్యమౌ నమలతేజ
పుష్పములందుఁ జెల్వుచు బసిమిఁ గలవి, ధరియింపఁ గాఁదగుఁ బరమపురుష
తే. మాపు స్నానమొనర్చినఁ బాప మగును, స్నానమును మాని రాత్రుల సంజవేళ
దనదు దేహము దుడిచిన దానివలనఁ, బావనం బగు మనుచు బార్థివేంద్ర. 131
తే. స్నానానంతరమందు గంధాదు లలదుట ప్రాశస్త్యము నొందు. 132
వ. వస్త్రముఁ దడి విదిల్చుట పాప మగును బరులుఁ గట్టుక విడిచినవస్త్రములను.
గట్ట రాదు మడత మార్చి కట్టరాదు, శాస్త్రపద్ధతి సు మ్మిది సార్వభౌమ. 133
**స్త్రీలు అను మూమా** వినష్టిపదార్థము, భుజియింపఁగా రాదు భోజనముల

నన్యచిత్తముతోడ నాహారముం గొను, టనుచితకృత్యమౌ నయ్యె వింటె
యన్నము దూషించు టతిపాతకం బగు, నుప్పునవములుట యొప్పగాదు
దధి మధూచ్ఛితపదార్థములను రేయి, భుజియింపఁ గా రాదు పుణ్యమూర్తి
తే. యొరులు చూచుపదార్థము నొకఁడు తింట, తనదుపంక్తి నిఁకూర్చున్న జనములకును
వేఱె యొక్కవిధంబుగాఁ బెట్టుటయును, విషసమానభోజనములు పృథ్వినాథ. 134
వ. భుక్తశేష మితరుల కిచ్చుట మహాపాతక మయ్యెడు. 135
తే. పగటియందున సురతము పాప మగును, క్రోధవాక్పారుష్యంబులు కూడ వెందు
కన్యలను బొందు టనుచితకర్మ మగును, వినుము పతితాంగననుముట్టినను నఘమగు.
తే. ఆచమనము నొనర్చెడునట్టివేళ, నీరు దొరకక పోయిన నెమ్మనమునఁ
బ్రణవ ముచ్చారణ మొనర్చి ఘనుఁడాచి, దక్షిణపుకర్ణము స్పృశింపఁదగు నరేంద్ర.
వ. ఇట్లొనర్చిన నత్యంతపావనం బగును. 138
తే. తనదునక్కసెల్లెం డ్రన్నదమ్ములకును, గురువులకును దారిద్ర్యము గూరె నేని
తనగృహమునకుఁ గొని వచ్చి తనదుశక్తి, వారిఁ బోషింపవలయు నవార్యతేజ.
తే. సంజకాలమునందునఁ జదువుటయును, భోజనం బొనరించుట పోల దెందు
శేయిఁ బితృకార్యములనేని జేయువలన బాప మేమియు గలుగదు పార్థ వింటె.
వ. తైలస్నానాదులకుఁ దిథివారాదులఁ బరిశీలింపవలయు. 141
క. కులమును శీలము రూపముఁ, గలకన్నియలను వరింపఁగాఁ దగు మనుజుం
డిలఁ దనబిడ్డల కగు మం, గళములకుం గొల్వవలయుఁ గదె దేవతలన్ 142
క. పిలువనిబంధుగృహమునకు, నిల భోజనముం బొరన్న నేగుట చెడు గాఁ
దలిదండ్రు లన్నలకుఁ ద, మ్ములకు హితుం డౌట మేలు పూరుషుఁ డధిపా. 143
తే. క్షత్రియుం డగువాఁ డశ్వముల నెక్కి, యుద్ధమొనరించుటను నేర్చియుండవలయు
యుద్ధతంత్రముల నెఱింగి యుండవలయు, దండనీతిశాస్త్ర మెఱుఁగఁ దగు మహీశ.
తే. ధరరజస్వలాంగనఁ గూడుపురుషులకును, బాతకము గానసటు చేయఁ బాడిగాదు
ఋతుకాలమునందున సతులఁ బొంద, వలయు ధర్మానుసారము లలితమూర్తి
వ. ఆయుర్వృద్ధికరం బగునాచార మవశ్యము నడుప వలయు. 14
సీ. సకలధర్మముల కాచారము మూలము, యగు నాయురభివృద్ధి యందువలన
లక్ష్మియుఁ గీర్తియు లలి వృద్ధిఁ బొందును, నాచారములలోన నఖిలభూత
దయఁ గల్గియుండుట ధర్మోత్తమం బగు, నఖిలవర్ణంబుల నధికదయను
నారయ వలె నని యార్యులు పల్కుదు, రనఘ యీయర్థముల్ వినఁగ దయ్య
తే. తమ్ము లగ్రజునందునఁ దగినభక్తిఁ, గొలువవలయుఁ దదానతి సలుపవలయు

వ. వేదార్థవిచారంబున విప్రులును భూదానంబున రాజులు నూర్ధ్వలోకము గాంతు రని యనేకధర్మము లెఱింగించి బృహస్పతి దేవలోకమున కేగె నంత భీష్ముండు ధర్మజునకు నహింసాస్వరూపము నిరూపించి చెప్పి వేదవ్యాసునివలనఁ గీటకమునకుత్తమలోకముఁ గల్గుట, వ్యాసమైత్రేయసంవాదంబును నారదపుండరీక సంవాదంబును శ్రీకృష్ణచిత్రచరిత్రంబును నుమామహేశ్వరసంవాదంబును బరమేశ్వరుండు పార్వతికిఁ దనశ్మశానవాసతకుఁ గారణము చెప్పుటయు వర్ణాశ్రమనిరూపణమును శివుఁడు పార్వతికిఁ దపస్స్వరూపము చెప్పుటయు శివుఁడు పార్వతికిఁ రాజత్వమహిమాతిశయము చెప్పుటయు వర్ణకర్మపరిపాలకంబుల తెఱంగును నాయుర్వృద్ధిక్షయంబులకుఁ గారణంబును స్వప్నాదుల తెఱంగును బార్వతికిఁ బరమేశ్వరుండు మానసికవాచికకాయికములఁ ద్రివిధపాపములఁ జెప్పుటయు దానఫలవిశేషముల తెఱంగును ధర్మవిశేషములును సాంఖ్యప్రకారంబును నాత్మసాయుజ్యప్రాప్తిసాధనము నెఱింగించి శాంతనవుండు కౌంతేయాగ్రజునకుఁ బార్వతి తెల్పినపతివ్రతాధర్మము నిట్లెఱింగించెను. 159

—పతివ్రతాధర్మములు.—

క. ఋతుమతియుఁ గాక పరిశు, ద్ధతఁ గలసతి కన్య యనఁగఁ దనరెడు నిల న
య్యతివకుఁ బెండ్లి నొనర్పఁగ, నతులితముగఁ దండ్రి యన్న లర్హులు సూడఁగ. 160

తే. వారు మంచివరునిఁ జూచి వాని కతివ, నొసఁగి పెండ్లిచేయం దగు బోసఁగురీతి
నటు వివాహమైనది మొదలు లజ్జనేత్రి, పతినె దైవ మటంచును మతిఁ దలంచు. 161

చ. వనజదళాక్షి యెప్పుడును భర్త యనుజ్ఞను బొందియుండియా
తని కెదురాడకుండఁ గను ధర్మ మొనర్చుచు నాథునాజ్ఞతో
ననువుగ వేల్పులం గొలిచి యర్థులఁ బ్రోచుచు నుండనొప్ప ని
ట్లనయము సంచరించు నది యౌను మహాసతి ముజ్జగంబులన్. 162

క. పతికి ననుకూల మగుచు, వ్రతములఁ జేయుటయె గృహిణి ధర్మం బగు నీ
క్షితి దనగృహకృత్యములను, సతి మెలఁకువఁ జేయ వలయు సదమలమూర్తీ. 163

తే. ఉత్తమాంగన గృహకృత్య మొనరఁ జేసి, భర్త కింపగునట్లుగా వంట సలిపి
సతము నతనికిఁ బ్రియముగా సంచరింప, వలయు నది జగజ్జననుతిపాత్రమగును.

తే. పనుల యెడఁ గొంచెమేనియుఁ బ్రాలుమాల, కలరిధర్మార్థకామముల్ సలలితముగఁ
జేయుచుండఁగ వలె నిట్లు చేయుచుండి, సవతులందు విరోధము సలుపరాదు. 165

వ. సవతికిఁ బ్రియముగ సంచరించి ప్రాణకాంతున కానంద మాపాదింప వలయును.

తే. ఇవ్విధంబుగఁ జరియించునిందువదన, సర్వలోకనమస్కృతుల్ సన్నుతులును
బొందు నిహపరసౌఖ్యముల్ పొందుచుండుఁ, బరమసాధ్వి వినుతింప వశముగాదు.

తే. భర్త యగువాఁడు తనకిచ్చువస్తువులను, మరల నాతం డడుగునెడ మానసమునఁ
గపటమిసుమంతెఁ దలఁపక గరితనిక్కు, వినయమునఁ దెచ్చియీవలె విభునకెందు.

సీ. భర్త యిచ్చినదానిఁ బరమ మోదమ్మునఁ, గైకొనవలయును గరిత లెందుఁ
బుత్రునితో నైనఁ బాలఁతి యేకాంతస్థ, లములందు నుంట ధర్మమది కాదు
ధనవంతుఁ డనుచు నిర్ధనుఁ డనుచును మది, రోగహీనుఁ డటంచు రోగి యనుచు
రూపవంతుఁ డటంచు రూపహీనుం డంచుఁ, బండితు డని మూఢభావుఁడనియు

తే. భేద మెంచక మదిలోన నాదరమునఁ, జేయవలయు శుశ్రూషలు శ్రేయ మలర
సతికిఁ బతికంటె దైవము జగతిలోన, నేఁడు లే దని యెంతురు విబుధవరులు. 169

తే. దేవపితృపూజలొనరించు పూవుఁబోఁడి భర్తకును మేలుఁ గలుగఁగ వలయుననియు
భావమందున బ్రార్థింపవలయుఁ బతుని గరితలకుఁ బతికా కొక్క గతియుఁగలదె. 170

క. పతిభక్తిఁ గలిగి యెందును సతులు ప్రవర్తింప వలయు జగతీస్థలిలో
బతిభక్తివలన నంగన లతులితసౌఖ్యంబుఁ గాంతు రవనీనాథా. 171

సీ. సర్వకాలము పీఁక సంచరించెడునది, పతులయందును దనసుతులయందు.
స్నేహము లేనిది గేహకార్యంబుల, నేరుపు లేనిది ఘోర మైన
రాక్షసి యగు నట్టిరాక్షసి యెప్పుడు, ననృతంబుఁ బల్కెడునట్టిదగును.
నెపుడు నిద్రను బోవ నెంచెడునట్టిది, పొరుగింటఁ బ్రొద్దులఁ బుచ్చునదియు

తే. నారకమునకుఁ బోదురు వారె కాక, భర్తకులమున నుండినవారిఁ గూడ.
నారకము బొందఁ జేసెడు వా రగుదురు, సతి కసర్హధర్మము లివి ధర్మాత్మతేంద్ర.

క. తొలుత నవివేకవశమునఁ జెలి యొకదుష్కార్య మెంచి చేసినయెడ న
వ్వల సత్కార్య మొనర్చిన దొలిఁ గలపాపములు పోవుఁ దోయలి కధిపా. 173

తే. భర్త మరణము బొందినవార్తఁ దెలిసి, దుఃఖ మిసుమంతయును లేకఁ దోయజాక్షి
పతునితోఁ గూడ దానును మరణ మొందు, నెడలఁబుణ్యలోకముఁగాంచునిభపురీశ.

వ. దుర్మార్గు లగుఁ బుత్రులు కలిఁగిన నాపుత్రులఁ ద్యజించి భర్తతో మరణించునది
పరమసాధ్వి యని యుమామహేశ్వరసంవాద మనునితిహాస మెఱింగించి భీష్ముండు
ధర్మరాజునకుఁ బరప్రాప్తి భూతజప మెఱింగింప నెంచి యి ట్లనియె. 175

తే. అన్న యో పాండవోత్తమా యాలకింపు, మేపరమపురుషునిఁగొల్చి యిలనరుండు
సకలశుభములఁ గాంచునో జపములందు, నుత్తమంబెద్దియో విను ముచితరీతి. 176

—విష్ణుసహస్రనామ ప్రభావము.—

సీ. సంసారబంధమ్ము సమసిపోయెడుదాని, విను మెఱిగించెద జనవరేణ్య
సకలలోకములకు సకలదేవతలకు, దేవుఁ డంతము లేని దేవుఁ డెవఁడొ

పురుషోత్తముం డనువరనామధేయుండు, దివ్యనామసహస్రదీపితుండు
నఖిలకాలంబుల నత్యంతవిమలుండు యజమానుఁ డైనవాఁ డవ్యయుండు
తే. అయినవాని నారాయణు నన్నియెడలఁ బూజఁ జేయంగవలయును భూతలేశ
యతఁడు సకలేశ్వరుం డను నాఖ్య వడసె, ననఘ గొల్చిన దుఃఖము లాఱిపోవు. 177
క. మహనీయుని విష్ణునిఁ బ్రీ, త్యహమును బూజించు నెడల ధరణీసుతుఁడుం
బహుపుణ్యంబును గాంచెడు, నిహపరసౌఖ్యంబు లొందు నినసమతేజా. 178
తే. సర్వకాలములందును జక్రధరుని, బరుని హరిని సేవించుట పరమధర్మ
మనియు ధర నెన్నఁగాఁ బడు నినసమాన, తేజ ధర్మతనూభవ రాజరాజ. 179
క. సకలజగత్కారణుఁడును, బ్రకటితతేజుండు హరినిఁ భజియించునెడన్
సకలాఘంబులు పోయెడు, సకలసుఖంబులును గలుఁగుఁ జంద్రకులేంద్రా. 180
వ. వేయిదివ్యనామములుఁ గలనారాయణు నుపాసించుట యఖిలకల్మషహరణం బని
గాంగేయుండు విష్ణుసహస్రనామమహామంత్ర ముచ్చరించి ధర్మనందనున కిట్లనియె.
తే. భూరిగుణ యోగవిఖ్యాతకారణములు, నిల ఋషిసమాజపరిగీతములును విష్ణు
భవ్యనామసహస్రముఁ భక్తితోడఁ, బొగడునెడఁ బుణ్యలోకముఁ బొందు నరుఁడు.
సీ. దినదినంబును విష్ణుదివ్యనామసహస్రమును బఠించెడువాఁడు వినెడువాఁడు
నిహపరసుఖముల నెసఁగుచు నుండును, విప్రుఁడు వేదాంతవేద్యుఁడగును
క్షత్రియుండు పఠించి జయమును గాంచును, వైశ్యుండు ధని యగుఁ బఠనమునను
శూద్రుండు పఠియించి భద్రము గాంచును, నెల్లరుఁ దమకోర్కు లెసఁగఁగాంతు
తే. రధికభక్తితోడ భజించునట్టివారు, గాంచు ఫల మింత యంతని యెంచఁ దరమె
దివ్యనామసహస్రము దినదినంబు, బఠన మొనరించువారికి భయము లేదు. 183
వ. విష్ణునామసహస్రము పఠియించువారు బలతేజంబులతోడను గాంతితోడను బ్రసి
ద్ధిఁగాంచి రోగదుఃఖాదు లొందరు. 184
తే. పఠనమాత్రఁ బోవును సర్వపాపములును, శ్రద్ధయుతముగఁ బఠియించునట్టివాఁడు
సకలపాపముల్ విడివడసౌఖ్య మొంది మోక్షమును బొంద నర్హుఁ డౌ నోక్షితీశ.
వ. విష్ణుసహస్రనామస్తోత్రము బఠియించు వారికి రాగద్వేషక్రోధాదులుఁ గలుఁ
గనేరవు. 186
తే. అనుచువిష్ణునామసహస్రమాపగేయుఁ, డపుడు ధర్మరాజునకు మహాగుణునకు
నిచ్చె నుపదేశ మంతయు నిచ్చతోడ, ధర్మనందనుఁ డయ్యది తా గ్రహించె. 187
వ. పితామహునకుఁ బ్రణమిల్లి పూజానమస్కారముల కెవ్వరు భాజనము లెఱింగింపు
మని నదీనందనుం డి ట్లనియె. 188

సీ. పూజానమస్కృతుల్ పొందుట కొఱకును, బ్రాహ్మణోత్తములు సత్పాత్రు లధిప
వారలచెఱుపును గోరినయెడల మ, హేంద్రుఁడు నశియించు నిభపురీశ
బ్రాహ్మణులను దృప్తిఁ బఱచినవారికి, సర్వశుభంబులు జరుగుచుండు
ధర్మసేతువు లగుధారుణీసురు లన, దేవతలకుఁ గూడ దేవతలును
తే. బ్రాహ్మణులలోన వృద్ధుఁడు బాలుఁ డనక యు, నెంచకుండఁగ వారిఁ బూజించవలయుఁ
బ్రాజ్ఞు లగు బ్రాహ్మణోత్తముల్ వందనీయు, లనియు నెన్నంగవలయు మనుజవరేణ్య.
వ. బ్రాహ్మణపూజానమస్కారములు పరమోత్కృష్ట మని నిరూపించి పవనకార్తవీ
ర్యార్జునసంవాదంబును వాయుదేవుండు కార్తవీర్యార్జునున కత్రిప్రభృతులమహిమ
చెప్పుట కృష్ణునిప్రభావంబును బ్రాహ్మణప్రభావంబును దూర్వాసుండు కృష్ణుని
మనశ్శుద్ధిఁ బరీక్షించుట యనుగ్రహించుటయుఁ దెలిపిన గాంగేయు నెల్లరుఁ బ్రశం
శించి రయ్యవసరమ్మున యదువంశాభరణాయమానుఁ డగు పుండరీకాక్షుండు పాండ
వాగ్రజున కిట్లనియె. 190

— శివమహిమము. —

తే. భక్తితో శతరుద్రీయపఠన సలిపి, శివుని మదిలోన ధ్యానము చేయునట్టి
యాతఁ డిహపరసౌఖ్యము లందు మెలఁగుఁ, బరమశివునిమాహాత్మ్యము వశమె తెలుప.
క. శివుఁడు మహాదేవుం డని, భువి నేకనామంబుఁ గలుగు పురహరు నతనిన్
దవిలి భజించినమనుజుఁడు, ప్రవిమలసౌఖ్యంబుఁ గాంచుఁ బావనచరితా. 192
తే. అమ్మహానుభావునకుఁ గోపమ్ము గలుగు, ధర్మహీనముల్ చేసినఁ దక్షణంబె
నాశనంబును గాంతురు జనంబు లెల్ల, నఖిలకల్మషహార మగు నతనిసేవ. 193
క. పరమేశు శివునిఁ బొగడఁగఁ, బరమేష్ఠికి వశము గాదు పశుపతి నతనిన్
నిరతంబును సేవించిన, నరునకు సర్వార్థసిద్ధి నరవర కలుఁగున్. 194
తే. శివునిమహిమము భక్తిలోఁ దప్పు వినిన, గలుగు సర్వార్థసిద్ధులుఁ గరిపురీశ
భక్తజనులపాపంబులఁ బాపుఁ బ్రకటన, మహిమ మనఁగ నేమి కలిఁగిన శాకలికిని. 195
వ. ఉగ్రత్వంబున నిదుర్గు సెయ్యు మహాతి యును బ్రఖ్యాతిఁ గాంచుట మహాదేవుం డ
య్యెఁ గర్మములకు శుభాకారఫలము లిచ్చుటవలన శివుఁ డయ్యెఁ బరమశివున కనేకది
వ్యనామములు గల వని దేవకీనందనుండు చెప్పిన సాదరమున వినిన ధర్మజునకు
గాంగేయుఁడు ధర్మసూక్ష్మప్రకారంబును సాధ్వసాధుల నిరూపించి చెప్పి యిట్లనియె.
చ. తొలిజననంబునందునను దొడ్డతనంబున వృద్ధిఁ గొల్చినన్
గలిమియు విద్య సౌఖ్యమును గల్గు నహింసను గల్గియుండినన్
గలిగెడు నాయు రాయతులు గావున సర్వశుభాశుభంబులున్

గలుఁగుచు బూర్వపుణ్యముచఁ గౌరవనాయక ధర్మనందనా. 197

ఉ. దానము వృద్ధసేవనము ధర్మము నుం దపముల్ నహింసయుల్
బూనిన సర్వకామ్యములు పొందు విభూషణ తీరుఁ గావునన్
దానము వృద్ధసేవనము ధర్మములం బొనరింపు నీ వఁకన్
దానికి సంతసంబునను ధర్మతనూజుఁడు గొల్చె భీష్మునిన్. 198

వ. అనేకధర్మాధర్మములఁ బోధించి ధర్మచిత్తుం జేసి సర్వకౌరవప్రముఖ్యను మధ్యాహ్న మార్తాండునిమాడ్కి దేజరిల్లుచున్న కౌంతేయాగ్రజుం గాంచి యుపలాలించి దివ్యజ్ఞానవిశేషుం డగుశాంతనవుం డిట్లనియె. 199

సీ. ధర్మనందన నీవు ధర్మతత్పరుఁడవు,వరశుభంబులకును భాజనమవు
నీబుద్ధి సద్ధర్మనిష్ఠతో నుండును,యాయాతిఁబోలె నీయవనిలోన
భూరిదక్షిణలను భూసురుల కొసంగి,చేయుము సుఖములు శ్రేయ మలర
సకలధర్మములందు శ్రద్ధతో మెలఁగుము,రాజధర్మంబుఁ బ్రోద్ధి గనుము
తే. ప్రజలమది రంజన మొనర్పు రాజరాజ,బంధుమిత్రులు నిను తలవారు కూడ
వృత్తమునఁ బత్తు లుండినవిధముఁ గాఁగ,నాశ్రయింపెద రయ్య ని న్నవనిలోన.

తే. పొమ్ము కరిపురి కిప్పుడు భూతలేశ,సూర్యుఁ డుత్తరాయణ మొందఁ జూచి నీవు
నాసమీపమునకు రమ్ము భాసురాంగ,బంధువులతోడ సుఖముండ వయ్య నీవు.

వ. అని యానతిచ్చి ధర్మజునిఁ గాంచి భీష్ముండు హస్తిపురికిఁ బంపించిన నతండు తదనుజ్ఞాతుండై కరిపురి కేగి గాంధారీధృతరాష్ట్రుల గౌరవించి సకలభూమండలాధిపత్య మొనర్చుచుండ నంత సూర్యుఁ డుత్తరాయణము చేరుటయు. 202

— భీష్మనిర్యాణము. —

సీ. ఆసమయంబున నంతకనందనుఁ,డంబికేయునితోడ నతులితముగఁ
గుంతిగాంధారులఁ గూడుక శ్రీకృష్ణ,సాత్యకుల యుయుత్సుసంజయులను
గృపుని ధౌమ్యాదులఁ గ్రీడి భీమాదుల, మంత్రకోవిదు లగుమంత్రివరుల
బరివారమును గూడి బయలువెడలి భీష్ము,శయనతలము చేరి సమ్మతమున
తే. మురవిభంజనాదులతోడ నరదము డిగి, భీష్మునొద్దకుఁ జని కడువినయమునను
బ్రణతు లొనరించి తత్పాదవనజములకు, మునుల కెంతయుభక్తితో మ్రొక్కెనంత.

వ. భవదాజ్ఞానుసారముగా సకలబంధుమిత్రామాత్యులతో వచ్చితి మమ్ముఁ గనువిచ్చిచూడు మన గాంగేయుండు సంతసమ్మునఁ దనచేతితో ధర్మనందనుని చేయిఁబట్టికొని. 204

తే. తండ్రి ! మేలుచేసితి వయ్య ధర్మరాజ, నీమహాభక్తికి మెచ్చితి న్పాండవరేణ్య
మాఘమాసము వచ్చెను మాన్యచరిత,శుక్లపక్ష మిప్పుడు మహోత్సుకత నాకు.

వ. అని ధృతరాష్ట్రుం గాంచి కవుంగిలించి విజ్ఞానదేదీప్యమానుం డగుశాంతనవుం డి
ట్లనియె. 206

సీ. సకలధర్మజ్ఞానసుకలుఁడ వగు దీవు, వృద్ధసేవనమును వేదశాస్త్ర
ములఁ నెఱింగినదివ్యమూర్తి వౌదువు నీవు, బాదరాయణకృపవలన మఱియు
దేవరహస్యముల్ దెలిసి యుండితి వయ్య, కా నగుకార్యముల్ కాఁగలవియె
యట్టికార్యంబుల కనఘ నీయాత్మలో, వ్యసనము చెందుట యనుచితంబు

తే. వాస్తవముగఁ దలంచినఁ బ్రాస్త లెల్ల, నీవు కన్నపుత్రులు గారె భూవరేణ్య
కాన వీరినిఁ బాలించి కౌరవేంద్ర, వీరివలన శుభశ్రూషలు గోరుమయ్య. 207

సీ. ధర్మనందనునందు దయఁగల వాఁడవై, చేయ నౌకార్యముల్ చేయుటకును
నతని నియోగింపు మయ్య ధర్మజునకు, నీయందు నెంతయో నెయ్య ముండెఁ
గాంతేయుఁ డీతఁడు కలుషభావుఁడు కాడు, వాత్సల్యమునఁ జూడవలయు నితని
నీదుకుమారులు నీతివిహీనులు, నిజధర్మ మెఱుఁగనినీచమతులు

తే. వారిదుర్గుణము లెఱింగి వారి కొఱకుఁ, జింతఁ బొందకు మయ్య నీచిత్తమునఁ
దండ్రిఁ బోలెఁ బాండవులను దయఁ జెలంగఁ, బ్రోచుచుండుమునతముగ భూవరేణ్య.

వ. అని దేవవ్రతుండు దేవకీనందనుని గాంచి యి ట్లనియె. 209

సీ. దేవదేవాత్మకా దేవకీనందనా, శంఖచక్రగదాదిసాధనుఁడవు
వాసుదేవుండవువరదుఁడవును సర్వలోకేశ్వరుండవు శ్రీకరుఁడవు
పరమపురుష నీకుఁ బ్రణమిల్లు చుంటిని, నన్నుఁ గరుణఁ జూడు నళిననాభ
దేవోత్తమా కృష్ణ నీవు నాబలమవు, నీకు నే భక్తుండ నిన్నుఁ గొలుతు

తే. నేనుదారసుతాదులు లేనివాఁడ, నిన్ను రక్షకుఁగాఁ గోరి యున్నవాఁడఁ
బరమపదమునకును బోవ సరసిజాక్ష, నాకు ననుమతి నీ గదే లోకవినుత.

వ. అని మఱియు ని ట్లనియె. 211

తే. దేవ పాండునందనులకు నీవు ధరణి, రక్షకుండవై యుండుమీ యేక్షణమున
నీవె తండ్రివి వారికి దేవదేవ, యనుచుఁ డు నాపగేయున కిటు లనియె శౌరి. 212

తే. శంతనుసుతుండునను నీకుఁ జాల భక్తి, కాన మృత్యువు నీయాజ్ఞలోన నుండె
నీకు నే నాజ్ఞ నిచ్చితి నీవు పోయి, వసువులందునఁ గలియుము పరమపురుష. 213

వ. అంత నాశంతనవుత్రుండు ధృతరాష్ట్రాదులఁ గౌఁగిలించుకొని విప్రులకు ధర్మము
లొనర్చి ధర్మజు నభినందించి శౌరికిఁ బ్రణామమర్పించి యాభాగీరథీనందనుండు
సమాహితచిత్తుండై యూర్ధ్వగతిఁ జైకొనియె బ్రాణంబాత్మశిరంబును భేదించుకొని
యాకాశంబున కేగసె సురలు విరులసోనలు గురిసిరి దేవదుందుభులు మొఱసె నంతఁ

బాండవులు భీష్మునకు నగ్నిసంస్కారాదివివిధకర్మము లొనర్చి భాగీరథి కేగి వారెల్లరు భీష్మునకుఁ దిలోదకదానము లొనర్చి రంతఁ బుత్రశోకాతుర యైన గంగాదేవిని శ్రీకృష్ణవ్యాసాదు లూరడించుటయు ధర్మనందనుండు సర్వభారతులతోఁ గృష్ణసహితుఁడై కరిపురి కేగి భూమండలాఖండలునిం బోలెఁ గౌరవరాజ్యలక్ష్మినిఁ బరిపాలించుచుండె నని చెప్పిన నవ్వలివృత్తాంతము చెప్పు మని జనమేజయుండు వైశంపాయను నడుగుటయు. 214

ఆశ్వాసాంతము.

ఉ. తప్పుల నన్నిటి న్విడిచి తాలిమితోడ మహానుభావ యిం
దొప్పుల స్వీకరింపఁ గదె యోపరమేశ్వర భక్తితోడ నేఁ
జెప్పితి నీపదాబ్జములఁ జేర్చితి నన్య మెఱుంగఁ జాల నా
కెప్పుడు నీదయామృతము నీయఁ గదయ్య హిమాంశుశేఖరా. 215

గద్యము.

ఇది కవిరాజ శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రిగారి పుత్రికయును,
కల్లూరి వేంకటసుబ్బారాయఁడుగారి పత్నియును,
రాజ్యలక్ష్మీపరిణయాదిగ్రంథకర్త్రియును, అగు
విశాలాక్షమ్మచే రచియింపఁ బడిన
భారతకథామృతంబునందు
నానుశాసనికపర్వము
శ్రీ పరమేశ్వరార్పణమస్తు.
శ్రీ శ్రీ శ్రీ



శ్రీ ర స్తు,

# భారతకథామృతము.

## అశ్వమేధపర్వము.

క. శ్రీకమలజాదినన్నుత, లోకాతీతప్రభావ లోకాధ్యక్షా
నీకు సమర్పించితి నే, నీకావ్యము స్వీకరింపు మిందు విభూషా. 1

వ. జనమేజయమహీపాలునకు వైశంపాయనుం డవ్వలివృత్తాంత మిట్లు చెప్పం దొడం గె నట్లు గంగాతీరమ్మునఁ బాండవేయులు బాంధవుల కుదకదానము లొనర్చి యె ల్లరు కరిపురి కేతెంచి రంత సర్వప్రజారంజకముగా నజాతశత్రుండు రాజ్యమును బరిపాలించుచు నొకదినంబున సమరనిహతు లగుజ్ఞాతులకై విచారించుచుండ ధృత రాష్ట్రుం డాపాండవాగ్రజుఁ బాదివి పట్టుకొని యి ట్లనియె. 2

—వ్యాసాదులు ధర్మరాజు నాశ్వాసించుట.—

సీ. సర్వరాజ్యంబును క్షత్రధర్మంబునఁ, గైకొనినాఁడవు కావె తనయ
న్యాయమార్గంబున నలరారునీ వేల, వ్యసనము గాంతువు పార్థివేంద్ర
దుఃఖము విడనాడి దొరవైననీ వింకఁ, దమ్ములతోఁ గూడి ధర్మరాజ
పుడమి రాజ్యంబును భోగములొందుము, చింతింపఁగా రాదు సుంత యేని

తే. నావలనగాదె యి ట్లయ్యె మేదినీశ, విదురసంజయహితములు వినకపోతి
దుష్టుఁ డగుసుయోధనునుడుల్ తొడరి వింటి, పుత్రమోహసాగరమునమునిఁగిపోతి.

వ. నావలననే జ్ఞాతివధం బయ్యె నని పల్కినఁ బుండరీకాక్షుండు పాండవాగ్రజున కి ట్లనియె. 4

క. కురుకులనాయక రణమున, మరణంబును గాంచినట్టి మాన్యుల కొఱకై
పరితాప మొంద నేలా, పరమగతికిఁ జనిరి వారు భారత వింటే. 5

చ. దురమునఁ బోవువారి కయి దుఃఖముఁ బొందకు నీకు నప్పరా
శరసుతుఁ డాపగేయుఁడును జాలఁగ జెప్పిరి ధర్మసూక్ష్మముల్
ధరణిపతిఁ బ్రోచుచుండు మతిధర్మయుతంబున నెల్లవేళలన్
నరులను బిడ్డ లట్లు నరనాయక మూడుము పాండవాగ్రజా. 6

వ. వసుదేవనందనునివాక్యము లాలకించి కుంతీనందనాగ్రజుఁడు సత్యవతీనందనున కి ట్లనియె. 7

ఆ. కర్ణుఁ జంపినాఁడ గాంగేయుఁ జంపి నా, నఘముఁ బాసి పోవ యతివరేణ్యా
కానవము న కేగి కఠినవ్రతత్తోడను, దప మొనర్తు నాజ్ఞ నిపు డొసఁగుఁడు. 8

చ. అనవుడు బాదరాయణమహాముని ధర్మజుఁ గాంచి యిట్లనున్
జనవర నీకు ధర్మములు సర్వవిధంబుల మేము చెప్పినన్
వినక యిటాడ నేటికి వివేకవిహీనునిఁ బోలె దేనికిన్
మనుజుఁడు కర్త కాఁడనియు మానుషులందున నాలకింపవే. 9

సీ. ఈశ్వరానుజ్ఞమై నెసఁగుశుభాశుభ, ములు పాపమున శంకఁ గలిగె నేని
యాగంబు లొనరించి యది పాపి కొనరాదె, యశ్వమేధ మొనర్పనఘము లెల్ల
నాశముఁ బొందెడు నరనాయకా నీవు, భరతాదులను బోలె నిరత మెందు
దానధర్మ మొనర్చి తనరారు మనునెడ, వ్యాసున కిట్లనె యమసుతుండు

తే. అశ్వమేధయాగంబున నఖిలమైన, పాపములు పోవునందురు పండితులును
నీదువాక్యానుసారము నిశ్చయముగ, నశ్వమేధయాగ మొనర్తు విశ్వవినుత. 10

వ. అనిన ధర్మనందనునివచనముల కెల్లరు సంతసించి రంత వేదవ్యాసుఁడు మరుత్తుని
చరిత్రము యుధిష్ఠిరున కెఱింగించి మరుత్తుఁడు సంవర్తునిఁ దనయజ్ఞమున కుపద్రి
ష్టగా నియమించుట సంవర్తుఁడు మరుత్తునియజ్ఞమున కుపద్రష్టయగుట యగ్నిదేవు
డింద్రసందేశంబును మరుత్తునకుఁ జెప్పుటమరుత్తునియజ్ఞము హవిర్భాగములకై దేవ
త లేతెంచుటయుం దెలిపె నంత శ్రీకృష్ణుఁడు ధర్మజునకు మనస్తాపోపశమనము చే
యుటయు వ్యాసనారదాదులు ధర్మజుని వీడ్కొని నివాసస్థానముల కేగి రంతట శ్రీకృ
ష్ణుం డర్జునునకుఁ దత్వజ్ఞానస్థిరీకరణము చేయుటయు శ్లేష్మాదిరోగవికారములని
రూపించుట తత్వజ్ఞానవిశేషప్రదర్శనము నంతర్యాగప్రకార నిరూపణమును నింద్రి
యమనః పరస్పరసంవాదంబును జీవాత్మస్వరూపనిరూపణప్రకారమును జనకు
నకు బ్రాహ్మణవేషధరుం డైనయమునితో నైనసంవాదంబును గురుశిష్యసంవాదం
బును మనోబుద్ధ్యహంకారాదితత్వప్రకారమును నవ్యక్తనామనిరూపణము సత్యం
బవశ్యానుష్ఠేయం బని యెఱింగించి శ్రీకృష్ణుం డర్జునున కిట్లనియె. 11

—(కృష్ణుఁడుద్వారక కేగుట)—

క. జనకుం డగువసుదేవునిఁ, గనుఁగొనఁ గాఁ జిత్తమందుఁ గల్గెన్ గానన్
జనియెద ద్వారావతి కే, ననుటయు నింద్రాత్మజుండు హరి కిట్లనియెన్. 12

సీ. కమలేశ నీయభిగమనేచ్ఛ దీర్పంగ, నే నెంతవాఁడను నీరజాక్ష
ధర్మపుత్రునకు వృత్తాంతము దెలిపిన, నతఁడు నిన్ బంపెడు నబ్జనాభ
కౌరవసైన్యాబ్ధిఁ గడచినారము మేము, నీదయామృతమున యాదవేంద్ర
గురుభీష్మకర్ణులఁ గూల్చియుంటిమి మేము, నీసహాయంబున భాసురాంగ

తే. శత్రువీరవరుల నీవు సంహరించి, జయము మా కిచ్చినాఁడవు శ్యామలాంగ
నీదయావిశేషంబున నిశ్చయముగ, రాజ్యపూజితుఁ డగు ధర్మరాజు నిజము. 13

సీ. మాధవా నీదగుమహిమ వర్ణింపఁగ, బ్రహ్మాదులకుఁ గూడ శక్యము గాదు
యజ్ఞాదు లెల్ల నీయవయవరూపం బని, విజ్ఞాను లందురు విశ్వనాథ
వాయువు నీదగుశ్వాస మటంద్రు నీ, క్రోధము మృత్యువు శ్రీధరుండ
నీప్రసాదము లక్ష్మి నీవలనం బ్రీతిఁ, జెలఁగ సౌఖ్యంబులు గలుఁగుచుండు

తే. సర్వకాలములకు నీవు సర్వభూత, ములకు నాధారభూతుఁడౌ పుడమిలోనఁ
గౌశికుండు నారదుఁడు పరాశరుండు, నీప్రభావము చెప్పఁగా నేను వింటి. 14

వ. సర్వలోకాత్ముండ వగునీవు నాకు బ్రహ్మవిద్య నుపదేశించితి వనిన దేవకీనందనుం
డభినందించె నయ్యవసరంబున హృషీకేశగుడాకేశులు ధర్మజుపాలి కేగి మ్రొక్కి-
రంత నర్జునుం డన్న కి ట్లనియె. 15

ఉ. కౌరవనాయకా వినుము కంజదళాక్షుఁడు చాలకాల మై
ద్వారవతీపురంబుఁ దనదారలఁ బుత్రుల బంధుమిత్రులన్
బౌరులఁ బాసెఁ గావునను వారలఁ జూడఁగ గోరె నీతఁ డీ
శౌరికి ద్వారకాపురికిఁ జయ్యనఁ బోవ ననుజ్ఞ నీయవే. 16

సీ. బంధుజనంబులఁ బాసి యీకృష్ణుఁడు, మనతోడ నుండెను మాన్యచరిత
జననీజనకులును సతులును బుత్రులు, నెదురు చూచుచునుండు రితనిరాక
వారిఁ జూడ నితండు కోరుచున్నాఁడు, నీ వానతిచ్చిన నృపవరేణ్య
ద్వారకాపురి కేగి తద్బంధువులఁ గాంచి, యశ్వమేధము వేళ కరుఁగుదెంచు

తే. ననుచు నర్జును డనఁ గౌతుకాబ్ధి మునిఁగి, కమలనాభునిఁ గన్గొని యమసుతుండు
ఫాలనమునఁ గేలు మోడ్చుచు భక్తితోడ, బలికెఁ బరమాదరమున నాలలితమూర్తి.

సీ. దేవదేవా యదువంశదీప నీకతమున, మాకు రాజ్యముఁ గల్గె లోకనాథ
బెడిదంపుటిడుమలఁ గడచి వచ్చితి మయ్య, నీదయామృతమున యాదవేంద్ర
సకలజగంబులు సర్వేశ నీయందు, వర్తించుచుండు నోవనజనాభ
వాగీశ్వరున కైన వశముగాదో కృష్ణ, నిన్ను వర్ణింపఁగ నీరజాక్ష

తే. నిన్ను బాసియుండుటకు నోసన్నుతాంగ, సమ్మతింపక యుండె నాస్వాంత మిపుడు
నైన నీప్రయాణం బాపు టనుచితంబు, ద్వారకకుఁ బోయి రావయ్య దైత్యదమన.

ఉత్సాహము. ద్వారకాపురమున కేగి తల్లిఁ దండ్రి మిత్రులన్
దార సుతుల బాంధవులను దర్శనం బొనర్చి యో
సారసాక్ష పౌరజనుల సమ్మతింపఁ జేసి యే

చేర రమ్ము వేగ మిటకు శ్రీరామామనోహరా. 19

తే. అశ్వమేధయాగ మొనర్తు నప్పటికిని, బంధుమిత్రులతోఁ గూడి వైభవమున
నరుఁగుఁదెంచుమీవిచటికిఁబరమపురుష, యనుచునచ్యుతునకు మ్రొక్కెజనవరుండు.

వ. పెద్దలకు వందనములు పిన్నలకు దీవనలను జెప్పి మనుసజాతశత్రు నభివందించి
శ్రీకృష్ణుండు పాండవానుమతుండై కుంతీద్రౌపదులయాజ్ఞ సుభద్రం దోడ్కొని సా
త్యకిసమేతుండై ద్వారకాభిముఖుండై చని మార్గమందు నుదంకాశ్రమము చేరె న
య్యెడ నుదంకుం డామాధవున కిట్లనియె. 21

చ. భరతులపాలి కేగితివి భండనమందున నెల్లవారినిన్
గురుకులవంశశేఖరులఁ గూల్చితి పక్కట యెల్లవారిపైఁ
గరుణను జూపఁగా వలదె కౌరవనాశము గోర వచ్చునే
పరమదురాత్ముఁ డీ వనుచుఁ బల్కెను నిష్ఠురవాక్యముల్ గడున్. 22

వ. కృష్ణా! పక్షపాత సహితుండవై కదా ధార్తరాష్ట్రులం గూర్చి పాండవులకు రాజ్యమి
ప్పించితి వనుతాపసున కాపురుషోత్తముఁ డిట్లనియె. 23

తే. తపసిరాయ సంధికి నేను దగువిధముల, నలిపి యుంటిఁ బ్రయత్నము శాంతనవుఁడు
మొదలు గాఁగలకురుకులముఖ్యు లెల్ల, హితము చెప్పిన వినరువా రెంత కేని. 24

క. కౌరవులు పాండవులతో, ఘోరరణము సల్పి కాదె కూలిరి వారల్
చేరిరి యుత్తమగతి కె, వ్వారలు దైవవిధిఁ గడచువారు మహాత్మా. 25

వ. అని పలికినఁ గోపపరీతుండై తాపసుఁడు గోపాలున కిట్లనియె. 26

తే. చాలుఁ జాలు నీగుణములు చాలఁ దెలిసె, గౌరవులనాశమున కీవె కారణుఁడవు
నీకు శాపం బొసంగెద నిశ్చయముగ, ననినఁ దాపసేంద్రున కిట్టు లనియె శౌరి. 27

సీ. ధర్మవంతులఁ బ్రోచి ధర్మహీనులఁ గూల్చి, జగమెల్ల నడపెడుస్వామి నగుదు
నాదుసామర్థ్యము నాపరాక్రమమును, గనుఁగొన లే వైతి మునివరేణ్య
బ్రహ్మవిష్ణ్వాదులై బహునామములతోడ, నేను జగంబున నెసఁగుచుందు
దుష్టాత్ములైనట్టిదుర్యోధనాదులఁ, బాండవేయులను గల్పంగ నెంచి

తే. నాదుశక్తి ధారను బోసి నాఁడ నేను, బాదరాయణాదులు తపోవశమువలన
నాచరిత్ర మెఱింగి యున్నా రటంచుఁ, బలికెఁ బరమేశ్వరుండు దప్పు వానితోడ. 28

వ. అని పలికి తనవిశ్వరూపము చూపిన నుదంకుం డాశ్చర్యమానసుండై శ్రీకృష్ణు న
నేకవిధముల సన్నుతించి తన్నుఁ బ్రోవు మని వేఁడిన దామోదరుండు ప్రసన్నుఁ
డై సాత్యకీసుభద్రాదులతో ద్వారకాపురి కేగె నంత. 29

తే. ధర్మజుం డశ్వమేధముఁ బా నొనర్ప, సత్ప్రయత్నము లన్నియు నలిపి యుండ
వినియుఁ గృష్ణుఁ డయ్యాదవవీరవరుల, తోడఁ గరిపురి కేతెంచె వేడు కలర. 30

వ. ఆసమయమున. 31

తే. అంబికేయపాండుతనూజు లఖిలజనులుఁ, గుంతి గాంధారి ద్రౌపది కాంత లెల్లఁ
జక్రిధరు రాక కెంతయు సంతసిలిరి, విడుద లేర్పర్చె వారికి విదురుఁ డంత. 32

— పరీక్షిజ్జననము. —

ఆ. ఆసమయములోన నభిమన్యుపత్ని యా, విరటరాజపుత్రి వినుతసాధ్వి
విగతజీవుఁ డైనమగశిశువుం గాంచెఁ, బాండవులు విచార భావు లైరి. 33

క. కుంతిసుభద్రయు ద్రౌపది, యెంతయు మనములు గలంగి నేడ్చుచు నుండన్
అంతఃపురం బ దంతయు, నెంతో చీకాకుఁ బొందె నెసకం బేగన్. 34

వ. ఆసమయంబున సాత్యకీసమేతుండై పాంచజన్యధరుం డేతెంచి మిక్కిలి విచారించెఁ
గుంతీసుభద్రలు కృష్ణున కి ట్లనిరి. 35

సీ. దేవ జగన్నాథ నీవె మా కిల దిక్కు, యభిమన్యునకుఁ గల్గినట్టిసుతుఁడు
వంశాంకురం బని వంశరక్షకుఁ డని, నమ్మి యున్నారము నళిననాభ
విగతజీవుం డయి వెసఁ బాలుఁడు జనించెఁ, గావు మిప్పుడ వీనిఁ గమలనాభ
ద్రౌణి బ్రహ్మశిరోస్త్రతత్ప్రయోగంబున, దుర్దశ యి ట్లయ్యెఁ దోయజాక్ష
తే. ఉత్తరాగర్భసంభూతు నుజ్జ్వలాంగు, బాలు రక్షింతు ననుచు గోపాలదేవ
ప్రతిన సల్పితి ద్రౌణితో వాసుదేవ, ప్రతినఁ దీర్చు కాలం బిది వచ్చె నయ్య. 36

తే. మమ్ముఁ గృపతోడఁ జూడుమా మధువినాశ, గర్భవేదనాభరమునఁ గ్రాలుచున్న
విరటరాజనందనయందు విశ్వనాథ, ప్రేమఁ జూపు మటంచును వేఁడుటయును. 37

వ. అప్పు డప్పరమేశ్వరుండు వారి నెల్లర నూఱడించి యశ్వత్థామబ్రహ్మశిరోస్త్ర ముప
సంహరించి యాయర్భకుఁ బాన్పుపై నుంచి యి ట్లనియె. 38

సీ. వైరులయం దైనవసుధాతలంబున, ననృతము నే నాడ నైతి నేని
సంగ్రామమందున శత్రువర్గమునకు, భయ మొంది పాఱని వాఁడ నేని
ధరణీసురులకును నిరతము భక్తితోఁ, జెలఁగి శుశ్రూషలు చేతు నేని
సత్యవ్రతంబు నానిత్యవ్రతం బేని, యర్జునుపైఁ బ్రేమ నలరు నేని
తే. పాండురాజతనూజులపౌత్రుఁ డైన, యుత్తరాగర్భసంభూతుఁ డుజ్జ్వలాంగు
డీతఁ డభిమన్యునందనుఁ డీక్షణమున, లబ్ధజీవుఁ డగుఁ గాక లలితగతుల. 39

క. అని పల్కెను వనజాక్షుఁడు, జనియించిన బాలుఁ డంత సత్వరగతిమై
కనులను విచ్చుచు నెల్లెడఁ, గనుగొనుచుండెఁ బరమేశకరుణాన్వితుఁ డై. 40

వ. అట్లు సజీవుం డైన బాలుం గాంచి కుంతీసుభద్రద్రౌపదు లత్యంతానంద మొంది
రయ్యవసరమ్మున. 41

ఉ. ఉత్తర యంతనల్లన మహోత్సుకతం జని చిన్నిబాలుఁ దా

నెత్తుక వచ్చి శ్రీహరికి నెంతయు భక్తి నమస్కరించెఁ దా
నత్తఱిఁ బాండవేయులు మహాత్ములు సంతస మొంది రెల్ల రా
జోత్తము లక్కుమారునకు నొప్పఁగ నిచ్చిరి పెక్కు కానుకల్. 42

వ. కృష్ణాదు లాయభిమన్యునాత్మజునకు కానుక లొసంగి పరీక్షిత్తను నామకరణం బొనర్చి రంత. 43

(అశ్వమేధయాగము.)

సీ. హిమవన్నగము కేగి విమలాత్ము లగుఁ బాండు, తనయులే తెంచిరి ధనముతోడ
నభిమన్యు నందనుఁ డగుపరీక్షిత్తుని, రక్షించి నట్టియారక్షకునకుఁ
బాండుతనూజులు పరిచర్యఁ జేసిరి, కొనియాడి రెల్ల రావినుతయశుని
నంత వ్యాసమహర్షి యరుదేర వా రెల్ల, భక్తితో మ్రొక్కి రావ్యాసునకును
తే. అత్తపసి వారలం గాంచి యశ్వమేధ, యాగమునకుఁ బ్రయత్నింపుఁడనివచింప
ధర్మజుఁడు సంతసంబున దైత్యదమనుఁ, డైనవాసుదేవుతోడ ననియె నిట్లు. 44

సీ. అశ్వమేధ మొనర్తు ననఘ యీభారము, నీవు వహింపు మాదేవదేవ
తల్లివి మా కిలఁ దండ్రివి గురుఁడవు, నాప్తుండ వీ వగు దబ్జనాభ
సర్వజగములకు సర్వభూతములకు, నాధార మీ వన మాధవుండు
ప్రత్యుత్తరంబు గాఁ బార్థున కిట్లనె ధర్మజ యాతపోధనుఁడు పల్కు
తే. నట్టు లశ్వమేధ మొనర్చి యనఘుఁ డగుము నన్ను దీనియం దెదిచేయుమన్నఁగాని
తప్పకుండ నేఁ జేయుదు ధారుణీశ సందియం బంద కింతయు స్వాంతమందు. 45

క. ఈయాగంబునకును నేఁ, జేయఁదగుఁ బ్రయత్నములను శీఘ్రము గా నేఁ
జేయుదు ననుచు వచించుడు, నాయెడ వ్యాసుండు పల్కె నవనీశునితోఁ. 46

మ. అనఘా ధర్మతనూజయాగమునకై యావత్ప్రయత్నంబులన్
దనరం జేయుము యుత్తమాశ్వ మిపు డోధాత్రీశ వేదోక్త మొ
ప్పను దాని న్విడువంగ నొ నదియు విశ్వం బెల్ల రాష్ట్రంబులన్
జని నీకీర్తిని వృద్ధిఁ జేయును గదే చంద్రాన్వయాధీశ్వరా. 47

వ. ఆయశ్వసంరక్షణార్థ మొకవీరాగ్రేసరుండు దానివెన్నంటి పోవలయు ననుటయు. 48

సీ. ధర్మజుఁ డంతటఁ దనదు సేవకులచే, సర్వకళ్యాణలక్షణములు గల
వారువంబును దెచ్చి వ్యాసునిముందుంచి, దీనివెంటను జనుధీరుఁ డెవఁడొ
వివరింపుఁ డనునెడ విజయుఁ డీయజ్ఞాశ్వ, రక్షణార్థము పోవు రాజరాజ
వాయుజనకులులు వారు రాష్ట్రంబును, రక్షించుచుందురు ప్రౌఢిమీఱ
తే. కడఁగి సహదేవుఁడు కుటుంబకార్యములను, జూచుచుండెడు గావుత సొంపుమిగుల

ననిన ధర్మజుఁ డెంతయు హర్ష మంది, యర్జునుంగాంచి యి ట్లనె నతనితోడ. 49

తే. అనుజ! వ్యాసప్రబోధితుఁ డైననేను, వారువము వెంట నిను బంపువాఁడ నైతి
దీనిరక్షించు భారము బూని నీవు, దీనివెంటను బోవుము దేజ మలర. 50

తే. రాజులందఱితో ధర్మరాజొనర్చు, యాగమును జూడ రండను మనుజ నీవు
అనుచు నర్జునునకుఁ బల్కి యమసుతుండు, హర్షసంభూతమనమున నలరుమీఱె.

వ, భీమనకులసహదేవులకు వారివారిపనుల నియోగించి యజాతశత్రుండుయజ్ఞదీక్షితుఁ
డయ్యె నయ్యెడ. 52

సీ. అగ్రజానుమతినయ్యశ్వముతో నేగ, ననుమతిఁ బొందె నయ్యర్జునుండు
కాంచనభూషణాల్ గడువేడ్క ధరియించి, గాండీవబాణముల్ గరము దాల్చి
యదరముపై నెక్కి యజ్ఞాశ్వమును గావ, నుత్తరాభిముఖుఁడై యొనర నరిఁగె
నంతఁ ద్రిగర్త దేశాధీశు లెల్ల రా, యశ్వముఁ బట్టఁగ నరుగుఁ దేర

తే. నతఁడు వారలఁ గన్గొని యనియె నిట్లు, రాజనందనులార నిరంతరమును
ధర్మకార్యము లొనరించు ధర్మరాజు, చేయు యజ్ఞవిఘ్నంబును జేయఁ దగదు. 53

తే. సకలరాజవరేణ్యులు సన్నుతింప, శ్రీయుధిష్ఠరరాజు తాఁ జేయఁబోవు
యాగమునువిఘ్న మొనరించుటనుచితంబు, పాపమగుఁగానవినుఁడునావాక్యములను.

ఆ. దీని కడ్డు రాక మానవేశ్వరులార, మన్నుఁ గృపను జూచి మమత తోడ
నధ్వరంబుఁ జూడ నరుదేర వలయును, ధర్మపుత్రునాజ్ఞఁ దప్పకుండ. 55

శా. వా రామాట నిరాకరించియును భీభత్సుతో వడిన్ మార్కొనన్.
ఘోరాజిం బొనరించి వారిఁ గెలిచెన్ గుంతీసుతుం డయ్యెడన్
వా రాపార్థునిఁ గోరి రంత శరణున్ వారిఁ గటాక్షించి యా
రారాజానుజుఁ డంత వారువముతోఁ బ్రాగ్జ్యోతిషం బేగినన్. 56

తే. తత్పురీశ్వరుఁ డగువజ్రదత్తుఁ డంత, నశ్వమును బట్టఁ గోర్కితో నరుఁగుదెంచెఁ
బార్థుఁ గన్గొని యంతట వజ్రదత్తుఁ, డపుడు బవరం బొనర్చె మహాధికముగ. 57

వ. అర్జునుండు వజ్రదత్తు నోడించి పరాభవించి యి ట్లనియె. 58

సీ. శమనతనూజుండు సవనదీక్షితుఁ డయి, యశ్వము వెంట న న్ననుపునపుడు
దీనిఁ బట్టఁగ నెంచుమానవనాథుల, వధియింప వల దని పలికెఁ గానఁ
గరుణించి నాఁడ నకారణమున నిన్ను, నీవు బంధులఁ గూడి నృపవరేణ్య
యజ్ఞము వీక్షింప నరుఁగుదె మ్మని పల్కి, సింధుదేశంబును జేరె నంత

తే. సింధుదేశాధినాథులు సైంధవునకుఁ, బుత్రపౌత్రులే కావున మున్ను వైర
కారణంబును విడువక కక్షతోడ, సమరమును జేయ వచ్చిరి శౌర్య మలర. 59

వ. అశ్వముఁ గట్టి వచ్చి తసింధు దేశాధీశుం డర్జునుం దోడించి సైంధవనందను నుఱుమాడుటయు దుర్యోధనానుజ యగుదుస్సల పౌత్త్రుం గొనివచ్చి వీనిం గావు మని ధనంజయు శరణంబుఁ గోరె నర్జునుం డతని విడిచి మణిపూరున కేగె నంత. 60

సీ. అప్పురంబునకును నధినాథుఁ డైనట్టి, బభ్రువాహనుఁడు తాఁ బార్థుఁ గాంచి
తనజనకుం డని మనమున మోదించి, విజయున కెదురేగె వినయమునను
మ్రొక్కినఁ గవ్వడి యక్కుమారుం గని, యాదరింపక నిటు లనె నతనికి
యజ్ఞాశ్వ మెదు రైన నయ్యది పట్టుట, క్షత్రియధర్మము జగతిలోన

తే. నిట్లు వినయముతోఁ బల్కె నేల నీకు, రాజలక్షణ మిది కాదు రణవిహీన
పోవు మిట నుండి వేవేగఁ బోవు మనఁగ, దీనుఁ డై పోవుచుండె నాసూనుఁ డంత.

వ. అప్పుడు మ న్నర్జునుని వరించినయులూపి యనునాగాంగన యట కరుదెంచి బభ్రువాహనునితో ని ట్లనియె. 62

తే. నేను నీతల్లి నగుదును నీహితంబుఁ, గోరి యిట వచ్చి యుంటిని గొడుకుకుఱ్ఱ
తండ్రి యనుమతిఁ గాఁగ నాతనిని నీవు, దాఁకు మతి శౌర్య మేపార ధారుణీశ. 63

తే. బభ్రువాహనుఁ డంతటఁ బార్థుతోడఁ, బోరఁ దొడఁగెఁదా నెంత యో పౌరుషమున
వానిబాణమున మహేంద్రసూనుఁ డంత, విగతజీవుఁ డై పడియెను బృథ్విమీఁద.

వ. అంతఁ జిత్రాంగద ప్రార్థించిన నులూపి సంజీవమణిచే నర్జునుని బ్రతికించె నులూపి యర్జునునితో వసువులకోపప్రసాదాదు లెఱింగించె నంతఁ గౌంతేయుండు బభ్రువాహనుని సకుటుంబపరివారముగా యజ్ఞమున కాహ్వానించి జరాసంధపౌత్రుఁ డగు మేఘసంధితో సమరం బొనర్చె నంత. 65

సీ. గాంధారపతులతోఁ గయ్యము నొనరించి, వారల నోడించి వంగ ద్రవిడ
కేరళ కర్ణాట ఘూరమణుల గెల్చి, వారి నెల్లరఁ దనవశ మొనర్చి
ద్వారకానగరము దరి కేగి యదుకుమా, రులవల్ల మన్నన లలరఁ గాంచి
తనదుసేమంబును ధర్మరాజుకుఁ దెల్ప, చారులఁ బంపించె సవ్యసాచి

తే. యమతనూభవుఁ డయ్యెడ యజనదీక్షఁ, దాల్చి యజ్ఞమునకు వచ్చుధరణిపులకుఁ
దగినవిడుదుల నేర్పర్చి తాను వారి, నధికగౌరవ మేపార నాదరించె. 66

వ. అంత హస్తినాపురమున. 67

సీ. గౌరవార్థంబుగఁ బౌరు లెల్లరుఁ గూడి, ప్రతిగేహమందున రమ్యముగను
వివిధ శృంగారముల్ వేడుకఁ జేసిరి, మంగళవాద్యముల్ మ్రోఁగె
నచ్చటఁ జూచిన నచ్చట ధర్మజు, గుణములు వినుతింతు రి మనుజు లెల్ల
నెవంకఁ జూచిన నావంకఁ బార్థుల, ధర్మకార్యంబులే తలఁచుచుందు రి

తే. ధర్మజునిరాజ్య మాచంద్రతారకముగఁ, బరిఢవిల్లవలయు నని కరుణతోడఁ
బరమమునులు దీవించెడువార లైరి, నాకమును బోలె నాహస్తినాపురంబు. 68

వ. మఱియు సంగీతగానములవలనను వందిమాగధజనస్తోత్రములవలనను రమారమణచ
రణారవిందసేవకులతోడను యాగమును జూడ వచ్చినభూపాలురతోడను సర్వజన
ములతో హస్తినాపురము మిక్కిలిప్రకాశించె నంత నర్జునుండు ద్వారకనుండి పం
పించినచారుం డేతెంచి యజాతవైరి కిట్లనియె. 69

సీ. అనఘ నీయాజ్ఞమై యజ్ఞాశ్వమును గావ, నే నేఁగుచుంటిని నృపవరేణ్య
పార్థివేంద్రులు మనవశ మయి రెల్లను, నశ్వమేధము చూడ నవనిపతులు
కోరికతోడను గూడి వచ్చుచునుండ్రి, నరనాథ యిందున నాసుతుండు
మణిపూరనాథుండు గుణసాగరుం డగు, బభ్రువాహనుఁడును వచ్చుచుండె

తే. నిన్నుఁ దర్శింపఁ గోర్కెతోఁ గన్నసుతుఁడు, వచ్చు ననుచు నాపార్థునివచనములుగఁ
దెలిపి నంత ధర్మసుతుండు చెలువు మీఱ, స్వాంతమునను నెంతయో సంతసించి.

వ. కృష్ణున కాశుభవార్తఁ దెలిపి యూవారలకు మిగిలివిశేషముఁ గాఁగ నొసం
గె నంత. 71

సీ. ఆమనుచటిపిన మనురేంద్రసూనుఁడు, సవనాశ్వరాజము సహితుఁ డగుచు
వచ్చుచున్నాఁ డనువార్తను నాలించి, ధర్మజకృష్ణసాత్యకులు మఱియు
మారుతాత్మజుఁడును మాద్రేయులును వార, లాంబికేయాదులు సతులితముగ
నర్జును నెదురుకో నరిగి వా రాతని, నొగిఁ బుటఁ జేర్చిరి కౌతుకమున

తే. అర్జునుఁడు రాజధానికి నరుఁగుదెంచి, కుంతిగాంధారులకు మ్రొక్కెఁ గోర్కెతోడ
వారివలన దీవన లొందె వార లెల్ల, నవ్యసాచినిఁ గన్గొని సంతసిలిరి. 72

వ. బభ్రువాహనుఁడు కుటుంబసమేతుఁడై యరుదెంచె నంతట యాగదినము సమీపిం
చుటయు. 73

తే. వివిధమంగళతూర్యముల్ వెలయుచుండ, భూసురాశీర్వచనములు పొదలుచుండ
నప్సరసలు నృత్య మొనర్చి యలరుచుండఁ, బుష్పవర్షముఁ గురియఁగ భూవరుండు,

వ. పరమపవిత్ర మగునశ్వమేధయాగ మొనర్పఁ బ్రారంభించి యనేకదానధర్మము
లొనర్చె సుప్రయోగముగా నయ్యధ్వరము సాత్యవతేయుండు నెఱవేర్చె ధర్మనం
దనుండు యజ్ఞమునకుఁ గరుదెంచినధరణీశ్వరుల నెల్లర సబహుమానముగా వీ
డ్కొలిపె నని వైశంపాయనుండు జనమేజయున కెఱింగించి సక్తుప్రస్థచరిత్రంబును
నకులంబు బ్రాహ్మణులకుఁ జెప్పుటయు యమునుండు సక్తుప్రస్థునికడ కతిథియై వచ్చు
టయు సక్తుప్రస్థుఁడు సకుటుంబముగా బ్రహ్మలోకమునకుఁ బోవుటయు నగస్త్య

మహాముని ద్వాదశవార్షికయజ్ఞప్రభావమును జమదగ్నిమహాముని పితృదేవతలశాపంబున నకులంబై పుట్టినకథను చెల్పిన వైశంపాయనుం గాంచి జనమేజయుఁ డవ్వలివృత్తాంత మడుఁగుటయు. 75

ఆ శ్వా సాం త ము.

చ. దురితము లెన్ని చేసితినొ దోషపథంబున గ్రుంగకుండ న
న్నరయుము ప్రేమతోడను మహాప్రభవా భరతామృతం బదే
గరిమను నీ కొసంగితిని గైకొన వే దయతోడ మా కిలన్
బరమశుభంబు లీఁగదవె బాలశశాంకధరా మహేశ్వరా. 6

గ ద్య ము

ఇది కవిరాజ శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రిగారి పుత్రికయును,
కల్లూరి వేంకటసుబ్బారాయఁడుగారి పత్నియును,
రాజ్యలక్ష్మీపరిణయాదిగ్రంథకర్త్రియును, అగు
విశాలాక్షమ్మచే రచియింపఁ బడిన
భారతకథామృతంబునందు
అశ్వమేధపర్వము
శ్రీ పరమేశ్వరార్పణమస్తు.
శ్రీ శ్రీ శ్రీ



శ్రీ ర స్తు.

# భా ర త క థా మృ త ము.

## ఆశ్రమవాస పర్వము.

క. శ్రీమన్మంగళమూర్తిని, గామాంతకుని న్మహేశు గౌరీనాథున్
బ్రేమాకారుని దైవల,లామునిఁ బూజింతు నిను లలాటాక్ష శివా. 1

వ. జనమేజయమహీవల్లభునకు వైశంపాయనుం డిట్లు చెప్పఁ దొడంగె నశ్వమేధయాగ మొనర్చి ధర్మనందనుండు తమ్ములతో ధృతరాష్ట్రగాంధారులకు శుశ్రూష లొన ర్చుచుండె నంత. 2

చ. తనయులు లేనియక్కొఱత ధర్మతనూజుఁడు తీర్చి యాంబికే
యునకును సర్వకాలమును నొవ్వఁగ సేవ లొనర్చునాతఁ డా
తనయులభక్తి కెంతయును దాలిమి సంతస మొంది యాత్మనం
దనులకు మావనంబునను దానువిచారము నొందకుండెడున్. 3

క. ధృతరాష్ట్రున్నాజ్ఞ నాధ,ర్మతనయుఁ డతిపుణ్యకార్య రంజితుఁడై దా
సతతము ననేకదానము,లతులితముగఁ జేయుచుండె నానసమయములోన్. 4

క. పురజనులు ధర్మనందను,పరిపాలనమందు సౌఖ్యపడి రధికముగా
నరపతి ధృతరాష్ట్రుం డీ,వరతనయులయందుఁ జాలవత్సలుఁ డయ్యెన్. 5

తే. పాండుసుతు లొనర్చుపరిచర్యవలనను, బుత్రదుఃఖ మెల్లఁ బోఁగ విడిచి
యధికతోషమునను నాంబికేయుండు గాం,ధారి తనరుచుండ్రి తలఁప నంత. 6

ఉ. ధర్మజరాజ్యపాలనము ధారుణి నెంతయుఁ గీర్తిహేతు వౌ
ధర్మవిచారుఁడున్ సుగుణ తత్పరుఁ డాశ్రితరక్షకుండు న
త్కర్మ లొనర్చువాఁ డతఁడు దాతయు నేతయు లోకనాథుఁ డా
యర్మిలిపత్నితోడ నలరారుచు నేలుచునుండె రాజ్యమున్. 7

ఆ. అతఁ డశ్వమేధయాగ మొనర్చియు,దానధర్మములను దనరఁ జేసెఁ
బ్రజలు సుఖముఁ గనిరి రాజ్యపాలనమున,విమలకీర్తిఁ గాంచె యమసుతుండు. 8

అట్లు ప్రజానురంజితుఁడై యుధిష్ఠిరుండు సహోదరసమేతుఁడై సహధర్మచారిణి యగుకృష్ణతో రాజ్యపాలన మొనర్చుచు వైచిత్రవీర్యానుమతి ననేకదానధర్మము లొనర్చి యాతనికిఁ బ్రీతిఁ గలిగించుచు గోదానభూదానవస్త్రరజతసువర్ణదానాదు లొనర్చుచుఁ [illegible] లొనర్చుచుండెఁ గుంతీద్రౌపదీసుభద్ర లత్యంతభ క్తితో ధృతరాష్ట్రగాంధారులను సేవించుచుండి రివ్విధంబున బదునేనువత్సరంబు లయ్యె నంత నాంబికేయుండు ధర్మనందను దన యొద్దకు రావించి యి ట్లనియె. 9

ఉ. కౌరవపాండవేయులకుఁ గయ్యము గల్గెను దాని కంతకున్
గారణ మేన యయ్యెదను క్ష్మాపతిఁ జేసితి నాసుయోధనున్
గ్రూరుని లోభమానసునిఁ గూళను గావున నిట్టివెల్లఁ జే
కూరెను భీష్ముఁ డచ్యుతుఁడు కుంభజముఖ్యులు పల్కువాక్యముల్. 10

తే. వినక పోయితి నే నవివేకి నగుట, నేను విన నైతి గాంధారినీతు లెల్ల
విదురసంజయుల్ చెప్పిన వినక పోతిఁ, దత్ఫల మనుభవించితిఁ దనయులార. 11

తే. వీరపురుషోచితంబుగా వార లెల్ల, మరణమును జెంది కాంచిరి పరమపదము
లోన దానికిఁ జింతింపఁ బోను గాని, నీదునాజ్ఞకు వేచితి నేను దనయ. 12

వ. ఏకార్యంబేని యొనర్చిన భూకాంతు నాజ్ఞపైఁ జేయుట శ్రేష్ఠము గావున నావాక్యము లాలకింపుము. 13

ఆ. మాకులంబునను సమరమునఁ జచ్చుటో, యడవిఁ దప మొనర్చి హత మగుటయొ
యట్లు జరుగుచుండె నాచార మాటను, దప మొనర్పఁ బోదు విపినములకు. 14

క. భూరమణా నేనును గాంధారియుఁ గానలకుఁ బోయి తపము సలిపి మెం
పార సుగతిఁ గాంతుము మా, కోరిక నెఱవేర్పు మయ్య కుంతీ తనయా. 15

వ. అని తనమనోరథ మెఱింగించిన నరేంద్రునకు ధర్మజుఁ డిట్లనియె. 16

సీ. అనఘ నీ వీరీతి వ్యసనముఁ బొందుచుఁ, గాంతాసమేతుఁడై కాన కేగ
నాకు రాజ్యం బేల నాకు భోగము లేల, నమ్మించి యిటు లేగ న్యాయ మగునె
తల్లియుఁ దండ్రియు దైవము గురుఁడును, మాకు నీవే కద మాన్యచరిత
కాంతారమున కీవుఁ గదలి పోయినయెడఁ, గరిపురి నే నుండఁ గాను జాల

తే. నేను నీతోడఁ జనుదెంతుఁ గానలకును, నన్ను వదలి పోయినయెడ నాకు [illegible]ల
దుర్యశం బది కల్గెడు నార్య నీవు, నన్ను విడనాడి పోవుట న్యాయ మగునె.

క. రాజోత్తమ నీ విలకున్, రాజవు గాకుండ నేను రాజ నగుదు నా
రాజవు నిను నియమింపఁగ, రాజును నేఁ గాను నీవె రాజవు తండ్రీ. 18

తే. ధార్తరాష్ట్రులదుష్కృతిఁ దుఃప నేను, దైవయోగమువలనను భూవరేణ్య
వారలకు మాకునుం గూడఁ బోరు కలిఁగె, దాన నింతలు పుట్టెను మాననీయ. 19

క. కుంతిని గాంధారిని నే, స్వాంతంబున గారవింతు సమముగ నోభూ
కాంత నను విడిచి మీరలు, కాంతారము కేగ నేల కరిపురనాథా. 20

తే. నీవు గాంధారితోడను బోవుదేని, నీదు వెనువెంటఁ గానకు నేను వచ్చి
నీకు శుశ్రూష లొనరించి లోకవినుత, పాపి కొనియెదఁ జిత్తతాపంబుఁ దండ్రి. 21

వ. అని వినయంబున ధృతరాష్ట్రునిచరణసరోరుహమ్ములపైఁ బడి వ్రాలిన నతం

డయ్యజాతశత్రుని లేవ నెత్తి కౌఁగిలించి మూర్ధాఘ్రాణ మొనర్చి యి ట్లనియె. 22

తే. పుత్ర మాకు శుశ్రూషలు మున్నునుండి, చేయు చుండిన వాఁడవు శ్రేయమలర
నేను వృద్ధుండ నైతిని గాన నింక, విపుల తపమొనర్పఁగఁ బోదు విపినములకు. 23

వ. అని ధృతరాష్ట్రుండు వనవాసమునకుఁ బోవుదు ననుటయు ధర్మనందనుండు వారిం
చుటయు నానమయంబున దివ్యదృష్టిం గాంచి వేదవ్యాసుం డరుదెంచి వారిచేఁ బూజ
లొంది సుఖాసీనుండై యుధిష్ఠిరు నవలోకించి యి ట్లనియె. 24

సీ. ఆంబికేయుం డనున ట్లొనరింపుము, వృద్ధుఁ డీతఁడు సుతవిరహితుండు
గాంధారికినిఁ గూడఁ గానల కేఁగుట, సమ్మతమై యుండె జనవరేణ్య
యీతనికులము పృథ్వీతలేశ్వరు లెల్లఁ, బొందుసౌఖ్యము నితఁ డొంద వలయు
నని చెప్పి వారల నాశీర్వదించియు, నాంబికేయునకును నాజ్ఞ నొసఁగి

తే. వ్యాసుఁ డరిఁగె నంతటఁ దపోవనమునకును, రాజ్యవిషయము లాధర్మరాజునకును
దెలుప వైచిత్రవీర్యుండు తలఁచి మదిని, బలికె నతని కిట్లు రహస్యతలమునందు.

సీ. విద్యాసమేతుల వృద్ధభూసురులను, సంతృప్తిఁ జేయుము సంతతంబు
వా రుపదేశించువాని నీతులను నీ, మనమందు నుంచుము మానవేంద్ర
పరరాజ్యమందలి వార్తలఁ దెలియఁగఁ, బంపుము నమ్మినవారి నరసి
పురరక్షణంబును బొనరించు పనియందు, భక్తివిశ్వాసముల్ పరఁగువారి

తే. వీరులను నియోగింపుము వినుతచరిత, యాప్తజనుల నంగనలను నగరుపనికి
మంత్రులను గూడిచేయుము మంతనమును, హాస్యసంభాషణముమహాహానిఁ దెచ్చు.

తే. దుష్టజనులను శిక్షింపఁ బోదరునపుడు, వారినేరమునకుఁ దగువఱకు శిక్ష
చేయుచుండఁగ వలయును న్యాయమునను, ధనము చేకూర్పవలయు నోధర్మరాజ.

ఆ. రాష్ట్రజనులఁ బ్రోచి రాజ్యమునకు హానిఁ, జేయువాని శిక్ష చేయవలయు
భయము భక్తిఁ గల్గువాని సేనాపతిఁ, జేయవలయు రాజశేఖరుండ. 28

తే. అనఘ నీ రాష్ట్రమందు రహస్యములను, వైరు లెఱుఁగకుండెడునట్లు పరఁగ వలయు
వైరివరుల రహస్యముల్ భటులవలనఁ, దెలిసికొనుచుండవలయును లలితమూర్తి. 29

ఉ. శాత్రవవీరు లున్నెడల సంగరమందున వారిఁ గూల్చి లో
కత్రయ మేలు మోయనఘ కౌరవభూషణ ధర్మరాజ యో
పుత్రక నీకు నీతులను మున్నుఁ బరాశరపుత్రుఁ డాపగా
పుత్రుఁడు దేవకీసుతుఁడు ప్రోడిమిఁ జెప్పిరి కాదె యెంతయున్. 30

తే. అయిన నీయందు వాత్సల్య మలరుచుంటఁ, గొన్ని నీతులఁ దెల్పితి నన్న నీకు
నీమనంబున నియ్యవి యేమఱకయ, ప్రోచుచుండుము రాజ్యము భూతలేశ. 31

వ. అని ధృతరాష్ట్రుండు రాజనీతివిశేషములను శత్రుల జయించు తెఱంగును జెప్పి
యభ్యంతరమందిరమున కేఁగి గాంధారిం గాంచి యరణ్యమునకుఁ బో ధర్మజుఁ డ
నుజ్ఞ నిచ్చె నన నెప్పు డరణ్యమున కేఁగుద మను నచ్చెలువకు నాంబికేయుఁ డి
ట్లనియె. 32

ఆ. ఇంకఁ దడయ నేల యిందీవరాక్షి యాహవనిహతు లైన బాంధవులకుఁ
బుణ్యగతులుఁ గల్గఁ బుణ్యకర్మ లొనర్చి, మనము పోద మవియె మనుజవిభుఁడు. 33

క. పురజనులయాజ్ఞఁ గాంచుట, పరమోత్తమ మని తలంచి వసుధేశ్వరుఁ డా
పురముఖ్యులఁ బిలువు మనఁగ, బురజనులం బిలిచె ధర్మపుత్రుం డంతన్. 34

వ. అప్పు డావిచిత్రవీర్యాత్మజుండు పౌరులం బిలిచి యి ట్లనియె. 35

సీ. మునులి తపంబును బొనరించుఁకొనఁగఁ గాం, తారము కేఁగుట ధర్మ మనుచు
మీర లెఱింగి యున్నారలు శంతను, భూపతిఁ రాజ్యముఁ బ్రోచునప్పు
డేకొఱంతయుఁ గూడ లేక పాలించెను, నతని యనంతర మూప గేయు
పాలనమం దీరుఁ బహుసౌఖ్య మొందితి, రొనర విచిత్రవీర్యుండుఁ గూడ

తే. ధర్మమును దప్పకుండఁగ ధరణిఁ బ్రోచెఁ, బాండు భూపతి యాయందుఁ బరమభక్తిఁ
బట్టభద్రుఁడై రాజ్యము ప్రోషి నేలె, ధర్మజుం డిప్డు రాజయ్యె ధన్యులార. 36

ఉ. ఈతనిసచ్చరిత్ర మిల నెల్ల నెఱింగినవార లౌట నే
నీతఱి మీకుఁ జెప్పుటది యేల సుయోధనుఁ డాతతాయి యై
యీతనియందు వైరమున నెగ్గు లొనర్చెను లెక్కలేక యా
ఘాతుకుఁ డంత గయ్యమునఁ గాలునివీటికి నేగె వింటిరే. 37

సీ. దుర్నయపరుఁ డైనదుర్యోధనుఁడు మహీ, చక్రి మేలెను మున్ను సాధులార
శమనతనయునితో సమరంబు నొనరించి, సర్వమహీశులఁ జావ జేసి
కులముల నెన్నియోఁ గూల్చి వైచెను, నతనిచెయ్వులను మీయాత్మలందుఁ
దలఁచుచుండక మహాధర్మానుసారము, ధరణిచక్రము నేలుధర్మతనయు

తే. భక్తివిశ్వాసములఁ గొల్వవలయు మీర, లిదియె మీకు నే జెప్పఁగ నెంచియుంటిఁ
బరమకరుణాసమేతులై వనములకును, బో ననుజ్ఞ నీయుఁడు పౌరముఖ్యులార. 38

వ. అనిన ధృతరాష్ట్రవాక్యములకుఁ బౌరు లెల్లరు విచారించి రప్పు డందొకవిప్రుం
డాంబికేయున కి ట్లనియె. 39

చ. భరతకులప్రదీప విను పల్కుచు నుంటిని నాదు పల్కు మీ
కురుకులవంశశేఖరులు గొప్పతనంబునఁ బ్రోది రెల్లరీ

ధరణిని వారిఁ బోలఁ దగు ధర్మవిచారుఁ గల్గి రెయునన్
బరమపవిత్రమూర్తు లగుభారతవంశజు లోనరేశ్వరా. 40

ఉ. దేవ పరాశరాత్మజుఁడు తెల్పినయట్టులుగా నొనర్ప మా
భూవరుఁ డైనశంతనుఁడు ప్రోచినతీరున నీకుమారుఁ డీ
భూవలయంబు నేలె మును బూరుకులాధిప వానిచేతలం
దేవిధ మైనలోపమును నెంచఁగ లేదు మహీతలేశ్వరా. 41

ఆ. అజునిప్రేరణమున ననఘ యీకౌరవ, పాండవేయులకును బవర మయ్యె
నిరుతెఱఁగుల నావహిల్లె జనక్షయ, మాతఁ డొకని వలన నగుట కాదు. 42

చ. సమరము చేసి చచ్చుటలు క్షత్రియవీరుల ధర్మ మంచు శా
స్త్రములు వచించుచుండెడును ధారుణినాయక యట్లొనర్చి నీ
కొమరులు నాకలోకమునఁ గోర్కులు సౌఖ్యము లొందుచుండ్రి నీ
వమరఁ దపోమహత్త్వమున సన్న్యాలు పొందనిసౌఖ్య మొందుమా. 43

ఆ. నీవు చెప్పినట్లు నృపవర మా కిఁక, రక్షకులగుఁ బాండురాజసుతులు
వారు నిరతధర్మవ్రతపరాయణులు మా, యందుఁ బ్రేమతోడ నుందు రధిప. 44

ఆ. ఇంద్రలోకమైన నేల శక్తిఁ గలారు, పాండురాజసుతులు భవ్యమతులు
మమ్ముఁ బ్రోచుచుంత మాకు వారే తల్లిఁ, దండ్రులగుదు రింక ధారుణీశ. 45

వ. అనిన నాంబికేయుం డమందానందకందళిత హృదయారవిందుండై పౌరుల వలన
వనవాసానుజ్ఞాతుండై వారల వీడ్కొల్పెనంత. 46

క. భారత రణంబు నందున, ధారుణిపైఁ గూలునట్టి ధన్యాత్ముల కిం
పార సుగతిఁ గల్గుటకై, భూరమణుఁడు చేయఁ దలఁచెఁ బుణ్యక్రియలన్. 47

వ. భీష్మాదులకుఁ బుణ్యకర్మము లొనర్చి వనంబున కేగఁ దలంచి ధృతరాష్ట్రుండు
విదురున కి ట్లనియె. 48

తే. యమతనూభవుకడ కేగి యతని తోడ, నాజిఁ జచ్చినవారికి మీ జనకుఁడు
శ్రాద్ధకర్మ లొనర్పఁగ సమ్మతించెఁ, దగినయేర్పాటు నినుఁ జేసి తనరు మనియె. 49

వ. అనినఁ గౌరవభాగ్యస్వరూపుం డగువిదురుం డజాతవైరి కడ కేగి యాంబికేయు
వాక్యముల విన్నవించుటయు. 50

తే. శమన తనయుఁడు దానికి సమ్మతించె, సవ్యసాచియుఁ గవలును సమ్మతింప
వాయుజుఁడు సమ్మతిలకున్నఁ వానిఁ గాంచి, పాకశాసన పుత్రుఁడు పలికె నిట్లు. 51

తే. ముదుకఁడును విశేషముమనముఖ్యుఁ డైన, జనకుఁ డగుధృతరాష్ట్రుండు జ్ఞాతులకును
శ్రాద్ధ కర్మము లొనరింప సమ్మతించి, మనల నర్థించె ధనము నో యనిలతనయ. 52

క. నీవందు కొడుకం బడసీ, భావంబున జూపి ధర్మవ్రతభంగంబౌ
భూవరుఁ డొనర్చు దానికి, నీవిటు విఘ్నం బొనర్ప నెంచుట తగునా. 53

వ. అనిన నింద్రనందనునకుఁ బ్రభంజననందనుఁ డిట్లనియె. 54

చ. మునుపు పితామహాది కురుముఖ్యుల కెల్లను శ్రాద్ధకర్మముల్
మన మొనరించి యిప్డు తగ మా యటు చేయఁగ నాంబికేయుఁడున్
మనలను బెట్టుబాధలవి మానసమందున నాఁటియుండె నీ
ధనమిపుడీయ నెందులకొ దానినిఁ జెప్పుము వాసవాత్మజా. 55

తే. మఱియుఁ బాంచాలరాట్పుత్రిక మహితసాధ్వి, పరిభవం బొనరించి యువనమునకు
మనలఁ బంపించినప్పుడీ మనుజపతికిఁ, బ్రేమ మెందునఁ బోయెనో విజయ చెపుమ. 56

వ. అని పలికిన యనిలసుతుని శాంతచిత్తుం జేసి కౌంతేయాగ్రజుండు విదురున కి
ట్లనియె. 57

క. మాతండ్రి యాంబికేయుం, డాతం డొనరింపఁ దలఁచునవి చేయుటకున్
బ్రీతి యగు మాకు నెల్లను, నాతం డొనరించు దాని కడ్డముఁ గలదే. 58

క. నాయింటఁ గలధనంబునఁ, జేయఁ దలఁచునట్టి వతఁడు చేయఁగ వచ్చున్
నాయాశ్రిమలం దలఁచుము, వాయుజుఁడను మాట కలుఁగ వలదని చెపుమా. 59

క. మాతండ్రి కిచ్చ వచ్చిన, రీతిని భూసురుల కెల్లఁ బ్రీతిం జెలంగన్
నాతతధనం బొసఁగు మని, మాతండ్రికిఁ దెలుపు విదుర మాన్యచరిత్రా. 60

వ. ధర్మజునివచనములకు విదురుండు ముదం బంది గాంధారీధవునికడ కేగి ధర్మపుత్రు
నివాక్యము లెఱింగింప నతండు మిక్కిలి యానంద మొందె నయ్యవసరమ్మున. 61

చ. ధనమును రత్నరాసులును ధాన్యములున్ ధృతరాష్ట్రపాలికిన్
జనపతి ధర్మనందనుఁడు చయ్యనఁ బంపెను నాంబికేయుఁడున్
దనయశతాళికిన్ మఱియుఁ దద్దయు భక్తిని జాహ్నవీతనూ
జనకును శ్రాద్ధకర్మములు చొప్పడఁ జేసెను శాస్త్రసమ్మతిన్. 62

వ. మఱియు నాసమయంబున వైచిత్ర్యవీర్యుం డనేకాగ్రహారములను గోభూసువర్ణము
లను మహీసురలకు దాన మొనర్చె నంత. 63

తే. అంత వనమున కేగఁగ నాత్మఁ దలఁచి, సాధ్వి గాంధారనందనసహితుఁ డగుచు
వల్కలాజినములఁ దాల్చి పార్థివుండు, పురము వెడలె భూమీసురుల్ ముందు నడువ. 64

క. కుంతియు ద్రౌపది మొదలగు, కాంతలు కనుఁ గవలనీరు గాఱుచు నుండన్
జింతాకులులై నడచిరి, కౌంతేయాగ్రజుఁ డతండు కడు దుఃఖించెన్. 65

వ. శోకాకులచిత్తుం డగు నజాతశత్రుండు ధృతరాష్ట్రున కిట్లనియె. 66

తే. ఓమహారాజ మమ్ముఁ బాసి యోమహాత్మ, వననివాస మొనర్పఁగఁ జనుచునుంటి
యనుచు నేలకుఁ బడుచు లేచుచు నతండు, నాంబికేయునితోఁ గూడి యడవి కరిగె.

తే. మారుతియుఁ బాకశాసని మాద్రిసుతులుఁ గృపయుయుత్సుసంజయులును గ్లేశమంది
వెంబడించిరి యాతనివెనుక నపుడు, పాండవులు మరు వసకేగుపగిది నుండె. 68

తే. ఎండకన్నను వానక న్నెఱుఁగ నట్టి, పడఁతుకలు చింతతోడను నడచుచుండి
రాంబికేయుఁడు పురి దాఁటి యవనిసురుల, బౌరుల నిలువగని యోగపఱచెనంత.

సీ. విదురుండు ధృతరాష్ట్రువెంటఁ బోఁ దలఁచెను, సంజయుఁడును బోవ సమ్మతించెఁ
గృపయుయుత్సులరాక నృపతిసమ్మతిలక, ధర్మసుతునివద్దఁ దనరఁ డనియెఁ
గోడండ్రి నెల్లరఁ గూర్మితో వెనుకకుఁ, బోవఁగ నియమించెఁ బొలఁతు లెల్ల
గాంధారి దేవికిఁ గౌరవేశ్వరునకుఁ, బ్రణమిల్లి శోకము ప్రబలుచుండఁ

తే. జనుచు నుండిరి వెనుక కాననములందు, శమనసుతుఁడుకుంతినిఁ దనజననిఁగాంచి
తల్లి మాతండ్రివనులకుఁ జనుచునుండెఁ, బోవువాఁడ నే నాతనిసేవఁ జేయ. 70

వ. నీవు కోడండ్రఁ దోడ్కొనిపురి కేగు మన నమ్మహాసాధ్వి యమ్మనుజేంద్రున కి
ట్లనియె. 71

తే. తనయ నీ కిట్లొనర్చుట ధర్మ మగునె, యనుమతింపఁడు నీరాక కవనినాథుఁ
డదియె నే నొనరించెడు నట్టి దగును, వీరివెంట నే నేగెద విపినములకు. 72

వ. గాంధారీధృతరాష్ట్రులకుఁ గాంతారమునఁ బరిచర్య లొనరించుచుందు నని పలికె.

తే. వీరు కాంతారములకును వెడలుచుండ, నేను మాత్రమిచట నుండ నేల తలఁతు
మిగులఁ బాప మొనర్చినమగువ నగుటఁ, బాపపరిహార మగు నేను వనుల కేగ.

తే. దేవసముఁ డైనకర్ణునిఁ దివ్యమూర్తి, వానిపుట్టుకఁ దాఁచితిఁ బాప మనక
నాదురితపరిహారమా నటవి లోనఁ, దప మొనర్చుచునుండెద ధర్మరాజ. 75

సీ. కలసి యుండెద నేను గాంధారితోడను, నీవు భూసురులకు నృపవరేణ్య
వివిధదానంబులు వెసఁ జేయుచుండుము, నే వనులకుఁ బోదు నిశ్చయముగ
మాద్రేయులందు బ్రేమముతోడ నుండుము, భీమార్జునులు గవల్ విపులభక్తి
నిరత మొనర్తురు నీకు సేవాకృతుల్, రాజ్య మేలుచునుండు రాజరాజ

తే. పరమసాధ్వీశిరోమణి భాసురాంగి, ద్రుపదరాజనందనయందు విపుల మైన
గారవమునఁ జెలంగుడు మీర వింకఁ, బురములోనికిఁ బోవుడు పుత్రులార. 76

వ. అనిన విని భాష్పాకులితలోచనుండై పాండవాగ్రజుండు తల్లి కి ట్లనియె. 77

సీ. నిన్నుఁ గానకుఁ బంపి నిమిషకాలంబైన, నివసింపఁ జాలను నిశ్చయముగ
తల్లి నీ వేగిన ధరణిరాజ్యం బేలు, నుష్ట వాటిల్లు నేఁ జెప్పుచుంటి

రాజ్యభోగాదినిర్వాహణక్రియంబును, జెప్పవా రెవ్వరో చెప్పు మమ్మ
నీకుఁ దోచినరీతి నిత్య మిచ్చట నుండి, దానాదు లొనరింపు తల్లి నీవు

తే. తల్లి లేనివారలు మాద్రితనయు లకట, వారి విడిచి పోవుట నీకుఁ బాడి యగునె
వనములకుఁ బోవ వల దని బహువిధములఁ, దల్లికినిఁ జెప్పి ప్రార్థించె ధర్మరాజు. 78

వ. అప్పుడు భీమార్జుననకులసహదేవద్రౌపదీసుభద్రాదు లామెచరణంబులపై వ్రాలి విలపించిన నామె తనపట్టినపట్టునందే దృఢనిశ్చయ యగుటయు. 79

ఆ. అంత ధర్మపుత్రుఁ డామెనుఁ దోడ్కొని, ముందుఁ బోవుచున్న మునలు లైన
తల్లిదండ్రులకును దగురీతి వచియించి, యప్పగించి వచ్చె నప్పగిదిని. 80

వ. అజాతశత్రుండు కుంతీదేవిని ధృతరాష్ట్రాదులకడ నప్పగించి తాను దనవారితో హస్తినాపురి కేగె నావైచిత్రవీర్యుండు విదురసంజయ గాంధారీ కుంతీసమేతుండై శతయూపరాజర్షి యాశ్రమము చేరి యచ్చటఁ దపోనియతి నుండె. 81

తే. ఆకురుక్షేత్రసామీప్యమందు నున్న, యట్టిశతయూపరాజర్షి యాశ్రమమునఁ
బత్నితో ధృతరాష్ట్రుండు పరమనియతి, నుండెఁ గుంతి వారికిఁ జేయుచుండె సేవ. 82

సీ. సంజయుఁ డంతట సంతత మాంబికేయాదులసేవల నలరఁ జేసి
హరిచింతనాలోలుఁ డై నెగడుచునుండె, విదురుండు నప్పుడు విపులభక్తిఁ
బొనర నియతి జటీభూతకేశుండు దిగంబరుఁడై యుండెఁ గడుఁ జెలంగి
వారియాశ్రమమున దూరముగా నైన, యాశ్రమమందున నతులితముగఁ

తే. దప మొనర్చుచు నుండెను విపులముగను, బరగు హస్తినాపురమునఁ బాండుసుతులు
నొక్కదినమున నొకరితో నొక్క రొకరు, నాంబికేయాదులనుగూర్చియనుకొనిరిటు.

తే. వృద్ధుఁడును సుకుమారుఁడు వీరవర్యుఁ, డాంబికేయుఁడు నిర్జన మహావనమునఁ
దపము చేయుచుఁ దా నెట్లు తనరి నాఁడొ, కోమలాంగులుగాంధారికుంతియునరయొ.

తే. ఎండకన్నును వానకన్నెఱుఁగనట్టి, వార లాకందమూలాదిఫలములఁ దిని
సలుపు లెట్లొకొ తపమును సంజయుండు, విదురుఁ డెట్లున్న వారలో విపినమందు.

చ. మనలను బాసి యుండుటకు మానసమందున నిచ్చ లేనియా
జనని భయంకరాటవిని సల్పుచునుండెఁ దపం బదెట్టులో
మనలను బాసి యెట్లుచట మానినిఁ యున్నదొ పెద్దలెల్లరున్
జనిరి వనంబులోఁ దపము సల్పఁగఁ బంధులు గూలి రక్కటా. 86

వ. తపం బొనర్పఁ బోయినధృతరాష్ట్రాదుల కొఱకును సమరనిహతు లగునభిమన్యుద్రౌపదేయాదులకొఱకును బాండవులు విచారించుచుండ సహదేవుఁడు ధర్మపుత్రున కిట్లనియె. 87

తే. అగ్రజా యిట్టివృత్తాంత మంతయు మును, నీకు నెఱిఁగింపఁగా నెంచి నేను వేఱచి
నాఁడ జనయిత్రి కుంతి కాననములోన, నేవిధమునున్నదో చూడఁగా వలయును. 88

తే. అమ్మహాదేవి తనబావ కక్కకు నొగి, సేవ లెటు చేయుచున్నదో భావరేణ్య
కాంచఁ గోరికఁ గల్గెను గాన మనము, నామె నిప్పుడుచూడఁబో నర్హ మగును.

వ. ధృతరాష్ట్రగాంధారులను గుంతినిఁ జూడ జిత్తము తత్తఱపడు చున్న దన ద్రౌపది
యు వల్లె యనుటయు నంతఁ గౌంతేయాగ్రజుఁడు వృద్ధుల నందర్శించునుత్సాహ
మునఁ బ్రయాణసన్నాహ మొనర్చుటయు. 90

చ. భరతకులైకభూషణుఁడు పాండుతనూజుఁడు ధర్మరాజు న
ల్వురు తనతమ్ములం గలసి యొప్పుగ ద్రోవదితో సుభద్రతోఁ
గురుకులకాంత లందఱను గూడుక పోయె వనంబులోనికిన్
బరమపవిత్రు లైనతనవారలఁ జూచెడువేడ్కఁ జేయుచున్. 91

వ. కురుక్షేత్రంబున కేగి శతయూపరాజర్షియాశ్రమంబున రథావతరణం బొనర్చి ధృ
తరాష్ట్రుం డెం దేగె నన నచ్చటివా రాతండు యమునానదికి స్నానమొనర్పఁ
బోయె నని చెప్పుటయు. 92

ఆ. ధర్మనందనుండు తనతండ్రి కెదు రేగ, నఖిలజనులతోడ యమున కేగి
వచ్చుచుండినట్టివారి గాంధారిని, నాంబికేయుఁ గుంతి నతఁడు కాంచి. 93

ఆ. భక్తిపూర్వకముగ భ్రాతలతోఁ గూడి, వందనము లొనర్చి వారలకును
వారిచేత నున్ననీరకలశముల, నతఁడు స్వీకరించె నధికభక్తి. 94

తే. సరఁగ సహదేవుఁ డంతట జననిఁ గాంచి, కౌఁగిలించుక విడిచెను గనుల నీరు
నంత శతయూపరాజర్షి యాశ్రమమున, కెల్లవార లేతెంచిరి యెంచిచూడ 95

వ. వా రెల్ల రప్పాండవుల నాశీర్వదించి రంత ధృతరాష్ట్రుం డజాతశత్రునకి ట్లనియె.

సీ. ధర్మజా మీకు నిత్యమ్ము సౌఖ్య మయ్యెనా, పౌరులు నీయాజ్ఞ బద్ధు లగుచు
భయము భక్తియుఁగల్గి వర్తిలుచుండెరి నీ, సఖు లెల్లరును గూడ సుఖులె చెపుమ
బాంధవుల్ సంతోషభరితులై యుండిరా, సచివులు నీయాజ్ఞ సలుపుచుండ్రె
మున్ను రాజులఁ బోలె నున్నవాఁడవె నీవు, ధర్మము నడుపుదే ధారుణీశ.

తే. దేవ భూదేవులకుఁ బూజ దినదినంబు, సలుపుచున్నాఁడవే నీవు సమ్మతమున
ననుఁడు ధర్మజుఁ డిట్లని యాంబికేయు, తోడఁ దాఁ బల్కె నెంతయు వేడు కలర.

క. జనక భవదీయవాక్యము, లను మనమున నిల్పి యుంటి ననిఁ జెలఁగఁగ భూ
మినిఁ బ్రోచుచుంటి మీమీ, తనువులు తపములకు నోర్చి తనరునె చెపుమా. 98

తే. జనని కుంతి శుశ్రూషలు సమ్మతమున, మీకు సలుపుచున్నదా లోకవినుత

సంజయుఁడు మీకు శుశ్రూష సలుపునొక్కొ, విదురుఁ డెచ్చటనుండెనో వేగఁ జెపుమ.
తే. సోదరుల వధించిన యీ దురాత్ముఁ దలఁచు నొక్కొ యెట్టైన గాంధారి దేవి
తల్లి యీ మహాదేవి తాఁ దప మొనర్చి, యెట్టులున్నది చెప్పుమా యిందువంశ.
వ. అనినఁ బాండవాగ్రజునకు విచిత్రవీర్యాత్మజుం డి ట్లనియె. 101
సీ. అనఘ తపంబున నాయాస మే లేదు, కుంతి మాయందు సుస్వాంతమునను
బరమభక్తిఁ జెలంగి పరిచర్యఁ జేయు నీ, పెదతల్లి గాంధారి విపులతపము
చేయుచునుండెను శ్రేయ మెలర్పఁగ, సంజయుండును దపశ్చరణనుండి
సేవఁ జేయును మాకుఁ బావనమూర్తి యా, విదురుఁ డీచెంగటి విపినమందు
తే. ఘోరతప మొనర్చుచునుండెఁ గొడుకుకుజ్జ, నాఁగ దండ్రివాక్యములు మనమున మెచ్చి
తత్క్షణమున విదురుఁ జూడ ధర్మసుతుఁడు, నరుఁగుచుండెఁ దా నవ్విదురాశ్రమంబు.
వ. ధర్మనందనుం డంత దిగంబరుం డగు విదురుం గాంచి యి ట్లనియె. 103
తే. ఓ మహాత్మ విదుర నన్నుఁ బ్రేమఁ జూడు, నిన్నుఁ గన్గొన వచ్చితి నిలువు నిలువు
మనుచు నెలుఁ గెత్తి పిలిచిన నావిదురుఁడు, ధర్మజునిఁ గాంచి నిలుచుండెఁ దరువుదరిని.
వ. అజాతశత్రుం డతని సమీపించి యతఁడులోచనములు మూసికొనియుంటఁ గాంచి
పెద్దయెలుంగున ని ట్లనియె. 105
క. నినుఁ జూడ నేను వచ్చితి, గను విప్పుము నన్ను దయను గనుఁగొను మనఁ గా
విని విదురయోగి యంతటఁ, దనకన్నులు విప్పి చూచె ధర్మతనూజున్. 106
వ. విదురుం డంత యోగబలము గైకొని దేహము ద్యజించి యజాతశత్రుని దేహముం
జొచ్చె నంత నప్పార్థాగ్రజునకు. 107
సీ. తేజంబు బలమును దెలివియు నాతని, కెక్కుఁడు కాఁ జొచ్చె నక్కజముగ
జీవరహిత మగు నావిదురునకుఁ దా, నగ్నికార్య మొనర్ప నాత్మఁ దలఁచె
నంత నాకమునుండి యమనందనా ధర్మ, విదుఁ డగు నట్టి యీవిదురునకును
వహ్నికార్య మొనర్ప వల దని విన వచ్చె, ధర్మతనూజుఁ డాతలఁపు మాని
తే. యరిఁగె శతరూపరాజర్షి యాశ్రమమున, కాంబికేయాదిముఖ్యుల కందఱకును
విదురవృత్తాంత మెల్లను విశదముగను, దెలుప నాశ్చర్యమునను వా రలరి రంత.
తే. అంతఁ బాండవసహితుఁ డౌ నాంబికేయు, జూడఁ దలఁచి పరాశరసూనుఁ డంత
నరిగె శతయూపరాజర్షి యాశ్రమంబు, వ్యాసునకు మ్రొక్కి రచ్చటి వారలెల్ల.109
వ. సుఖాసనాసీనుండై సత్యవతీనందనుం డంబికానందను నవలోకించి యి ట్లనియె.110
సీ. అంబికానందన యారణ్యవాసము, చేయఁగ నీమది స్థిరము పడెనె
సుతులీలుగుట నగుశోకము నీమది, నుంచక యుండితే యుర్వినాథ

గాంధారిదేవి యీకాంతారవాసత,పోనిష్ఠ కోర్చెనా మాననీయ
వెనువెంట మీతోడ వనుల కేతెంచుచు,థా దేవి నిష్ఠతోఁ దప మొనర్చి
తే. మీకు శుశ్రూష లొనరించునే కుమారు, డయిననాపయి నిల్పు దేదయ వృకోద
రార్జునులఁ గవలను ద్రుపదాత్మజాత, వత్సలత మీఱఁజూతువే భవ్యచరిత. 111
క. శాంతికి మూలంబై నీ,స్వాంతము నిర్మలత గొనెనొ జనవర నా కీ
వంతయు వచింపు మన నతఁ, డంతట నిట్లని వచించె నందఱతోడన్. 112
సీ. విదురుండు లోకైకవిజ్ఞాని యాతండు, దేహము విడుచుటఁ దెలిసికొంటి
దండధరు డతండు మాండవ్యశాపంబు, వలనను శూద్రభావంబు నొందె
ధర్మదేవత యగునిర్మలాత్ముఁ డతండు, చతురాస్యునాజ్ఞానుసారముగను
నతఁడు విచిత్రవీర్యాధీన మగుక్షేత్ర, మునను బ్రవర్తింపఁ దనరె విదురుఁడు
తే. ధర్మదేవావతారుఁడౌ ధర్మసుతుని, కాయమునఁ బ్రవేశించెను గడఁగి యతఁడు
విదురువృత్తాంత మెల్లను వినఁగఁ, దెలుప వ్యాసుఁ గన్గొని గాంధారివల్లభుండు. 113
వ. తపోనిష్ఠాదులం గూర్చి ముచ్చటించుటయు నంత సాత్యవతేయుం డాంబికేయున
కి ట్లనియె. 114
క. మీచింతఁ బాపుకొఱకై, మీచెంతకు వత్తునిపుడు మిక్కిలిదయతో
మీచిత్తమందుఁ గోరిక, వే చేసెద వాఁడ నయ్య విమలచరిత్రా. 115
వ. నిశ్శంకముగా నీమనంబునఁ గలయభిలాష మెఱింగింపు మనుబాదరాయణునకు
వైచిత్రవీర్యుఁ డి ట్లనియె. 116
చ. పరమమునీంద్ర మీ రనినవాక్య మమోఘము గాఁగ నయ్యెడన్
వరము నొసంగువాఁడ నని పల్కిరి కావున నేను గోరెదన్
గురుకులవీరు లెల్లరును గూలిరి కయ్యములోన వారలన్
గరుణను మాకుఁ జూపవలెఁ గౌతుక మిద్ది పరాశరాత్మజా. 117
ఆ. దుష్టబుద్ధి యైనదుర్యోధనుఁడు మున్ను, పాపదూరు లైనపాండుసుతుల
తో దురం బొనర్చి తాఁ దమ్ములను గూడి, ధరణిఁ గూలెఁ గాదె తాపసేంద్ర. 118
తే. అతని కొఱకై యనేకమహానృపతులు, సమరరంగమునందున జచ్చినారు
వార లెందుండిరో తెల్పవలయు మీరు, దాన నావగఁ బాయును మానినాథ. 119
వ. అనునాంబికేయునివాక్యము లెల్లర కానంద మాపాదించె నంతగాంధారీమహాదేవి
వ్యాసమహామునీంద్రునిపాదంబులకుఁ బ్రణమిల్లి యి ట్లనియె. 120
తే. అనఘ మానీంద్ర చంద్ర మహానుభావ, నీతపోమహిమవలన నిశ్చయముగఁ
జూపు మనిన ముల్లోకములఁ జూపఁ గలవు, పుత్రులనుజూపుట నెంతమునివరేణ్య.

తే. పృథయు నేను ద్రోవదియు సుభద్రయు నొగి, శతకుమారులసతులును సమరమందు
దునిఁగినట్టిబాంధవులను గనుఁగొనంగ, నభిలషించుచునుంటిమో యఖిలవేది. 122
తే. అపుడు కుంతి మనంబున నాత్మజన్ము, గర్ణుఁ దలఁచి విచారింపఁ గాంచి వ్యాసుఁ
డామె నూరార్చి యచటివా రాలకింప, సాధ్వి గాంధారి కిట్లనె సమ్మతమున. 123
సీ. నీవు నీపుత్రుల నీసహోదరులను, గనుఁగొనుదాన వోఁగరితమిన్న
కర్ణుని వీక్షింపఁ గలదు కుంతీదేవి, పాంచాలి దేవి సుభద్ర లిందె
వారికుమారుల బంధువర్గంబును, గనుగొన నగుదురు వినుతచరిత
యిట్టికోరికఁ దీర్ప నిచటి కేతెంచితి, నీకును గుంతికి భూవరునకు
తే. భారతరణమృతులఁజూపఁ గోరియుంటి, మీయభీష్టము దీర్చెద మీర లెవరు
పుత్రమిత్రబంధులకును భ్రాతులకును, చింతఁ బొందఁగ రా దమ్మ స్వాంతమందు.
క. భారతరణమున మడిసిన, వీరులు వా రెల్లఁ గూడ వేల్పులకు సముల్
వారలు పరమపదంబునఁ, గోరిక తో నున్నవారు కోడల వింటే. 125
సీ. ధృతరాష్ట్రుఁ డన నొప్పు నితఁడు గంధర్వుఁడు, ధృతరాష్ట్రుఁడై పుట్టె క్షితితలమున
మరుదంశమునఁ బాండునరపతి జన్మించె, ధర్మాంశమునఁ బుట్టె ధర్మరాజు
పవనాంశమున భీముఁ డవతరించెను నరుఁ, డనుపుని యర్జునుఁడై జనించె
నశ్వినుల్ కవ లయి యవతరించిరి తల్లి, వసుదేవతనయుఁడై పరఁగె శౌరి
తే. కలిఁగె దుర్యోధనుం డిలఁ గలినిజాంశ, నినునియంశఁ గర్ణుం డిల జనన మొందెఁ
జంద్రునంశ సౌభద్రుఁడు జన్మ మొందె, ననలునంశ ధృష్టద్యుమ్నుఁ డైజనించె. 126
తే. దైవగురుఁ డస్త్రగురుఁ డయి ధర జనించె, ననిలునంశ శిఖండి తా జనన మొందె
వసువులంశ గాంగేయుండు ప్రబలె రుద్రు, నంశ నయ్యె యశ్వత్థామ యమ్మవింటె.
వ. అని గాంధారికిం బల్కి వ్యాసుం డెల్లవారల కుల్లము లుల్లసిల్ల నప్పు డిట్లనియె.
తే. మీమనములఁ జింతను బాపి మేలు గూర్తు, మీరు భాగీరథీనదిఁ జేర రండు
బవరమందునఁ జచ్చినబాంధవులను, మీర లచ్చటఁ గాంతురు కోరి కలర. 129
వ. అని వారి నెల్లరఁ బాండవాదిజనులతో నదీతీరమునకుఁ గొంపోయె నంత సమ్మరు
నాఁడు ప్రభాకరోదయంబున వ్యాసభట్టారకుండు భాగీరథీసలిలంబులలో మునింగి
భారతరణవీరులారా! యిందురం డని పెద్దయెలుంగునఁ బలికె నయ్యవసరమ్మున.
సీ. ధృతరాష్ట్రముఖ్యులమతుల కద్భుతముగా, బాదరాయణునితపంబువలన
దొడరి గంగానది దుర్యోధనాదికు, రుకుమారశతమును బ్రకటితముగఁ
గర్ణసౌబలులును గాంగేయద్రోణులు, సౌభద్రద్రౌపదీసత్తనయులు
గాన వచ్చిరి యంతఁ గలవారి కెల్లను, ధృతరాష్ట్రునకు వానినతికిఁ గూడ

తే. దివ్యదృష్టి లభించెను దేజ మలర, నట్లు కానంగ వచ్చిన యాత్మబంధు
వులకు ధృతరాష్ట్రముఖ్యులు చెలువుమీఱ, సముచితాచారముల నెల్లసలిపిరంత.

తే. వ్యాసుమహిమ కద్భుతమును బడిరి వారు, భరతరణమృతు లంతట వారివారి
లోకములకుఁ బోఁదలఁచియుఁ బ్రాకటముగ, సలిలమందు మునిఁగి రాసమయమందు.

ఆ. వ్యాసుఁ డందుఁ జొచ్చి పతుల ననుగమింపఁ, గోరుసతులఁ బిలిచె గౌరవమున
భరతభార్య లపుడు వైచిత్ర వీర్యాది, వృద్ధులకును మ్రొక్కి వేడ్కతోడ. 133

వ. వితంతు లగువార లెల్ల నాసలిలంబులందుఁ జొచ్చి తమతమపతులం గలసి రంత
ధృతరాష్ట్రుండు బంధుమిత్రులతో నిజాశ్రమంబున కేతెంచినఁ బాండురాజనంద
నులు వైచిత్రవీర్యానుమతులై బంధువులతో గజపురరాజ్యమేలుచుండుటయు. 134

ఆ. అట్లు పాండుతనయు లంబికాతనయుని, యాజ్ఞఁ గాగఁ జనిరి హస్తిపురికి
నంతఁ గొంతలోన నాకలహాశనుఁ, డరుగుదెంచె నప్పు డచ్చటకును. 135

ఆ. యమతనూజుఁ డంత నాతనికర్ఘ్యపా, ద్యాదివిధు లొనర్చి యర్హపీఠ
మందు నుంచె నంత మనుజేశ్వరుం గాంచి, బ్రహ్మపుత్రుఁ డిట్లు పలికె నవల. 136

సీ. అంబికానందనుననుమతులై మీరు, హస్తిపురికి వచ్చి రప్పగిదిని
గొంతట మీతండ్రి కుంతి గాంధారియు, సంజయునిం గూడి సార్వభౌమ
గంగాపరిసర మహాకాననంబున కేగి, వాయుభక్షణమును వార్నలువురు
సేసి ఘోరతపంబుఁ జేయఁ దొడంగిరి, యిట్లుండఁగా వార లొకదినమున

తే. నాపగా స్నాన మొనరించి యాశ్రమంబు, వారు పోవుచుండఁ భటారవములతోడ
నడవి నలుదిక్కులందున నగ్ని పొడమె, వార లెందునఁ బోఁ జాల రైరి పార్థ. 137

వ. అప్పు డాంబికేయుండు సంజయు నవలోకించి యి ట్లనియె. 138

తే. మాన్యచరిత సంజయ మోక్షమార్గము గని, యగ్నికీలలయందుండి యవలి కేగు
నేను గుంతి గాంధారియుఁ గాని రాము, నాఁగ సంజయుఁ డిట్లనె నరవరునకు. 139

తే. ఇట్లు నీ వనుటేల మహీశలేశ, చిన్ననాఁటినుండియును బెంచితివి నన్ను
నిట్టి గనువిడ నాడ నా కెట్లుతగదు, మిమ్ము విడనాడి పోనన సమ్మతమున. 140

వ. మీ రే గతికిఁ బోయిన నే నా గతికిఁ బోదు ననుసంజయునకు ధృతరాష్ట్రుం డగ్ని
జ్వాలలనుండి యెట్లైయిన బయటికిఁ బొమ్మని బలవంతము చేయ నాసంజయుండు
హిమశైలరాజ మారోహించె నంత. 141

ఆ. ఆవిచిత్ర వీర్యునాత్మజుండును మఱి, సుబల రాజతనయ సుగుణశీల

కుంతి వారు మువ్వురు కూడఁ బోవఁగ లేక, నిశ్చలమనముతోడ నిలిచి రచట. 142

క. పరమేశ్వరుధ్యానంబున, బరమేశ్వరువీక్షణమున వారంతట ము
వ్వురు నచటను గూర్చుండిరి, దరికొనె ననలంబు వారి ధరణీనాథా. 143

వ. ఇట్లు ప్రాణంబులఁ బాసి యామువ్వురు పరమపదంబు జేరి రని చెప్పిన విని పాండవేయులు మూర్ఛిల్లి వారికై యనేకవిధంబుల విలపించిన నారదుండు వారల నూరార్చి ధృతరాష్ట్రాదులకు శ్రాద్ధక్రియ లొనర్పుఁ డని తపలోకమున కేగెఁ బాండవులు మునీంద్రు నాజ్ఞానుసార మొనర్చి రని చెప్పిన విని జనమేజయధరారమణుం డనంతరవృత్తాంతము చెప్పుమని వైశంపాయను నడుగుటయు. 144

—ఆ శ్వా సాం త ము.—

మ. శివలింగంబును బూజఁ జేసినయెడన్ జేకూరు సర్వార్థముల్
శివుఁడే లోకము లన్నిటిన్ గరుణతో సృష్టించువాఁ డంచు నీ
యవనీచక్రమునందు మానవులు నిన్నర్చింత్రు కాదే సదా
శివ నాకావ్యము నీదయామృతమునన్ జేకొమ్ము సర్వేశ్వరా. 145

గ ద్య ము

ఇది కవిరాజ శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రిగారి పుత్రికయును,
కల్లూరి వేంకటసుబ్బారాయఁడుగారి పత్నియును,
రాజ్యలక్ష్మీపరిణయాదిగ్రంథకర్త్రియును, అగు
విశాలాక్షమ్మచే రచియింపఁ బడిన
భారతకథామృతంబునందు
ఆశ్రమవాసపర్వము.
శ్రీ పరమేశ్వరార్పణమస్తు.
శ్రీ శ్రీ శ్రీ



శ్రీరస్తు.

# భారతకథామృతము.

## మౌసలపర్వము.

క. శ్రీసర్వేశ్వర కేశవ, భాసురసుగుణాలవాల పరమేశ్వరకై
లాసాచలవాస శివా, భాసిల్లు భవత్పదముల భజియింతు శివా. 1

వ. వైశంపాయనుండు జనమేజయున కవ్వలివృత్తాంత మిట్లు చెప్పం దొడంగె. 2

తే. ద్వారకాపురి కొకనాఁడు నారదుండు, కణ్వమౌనియు సుతియును గాధిసుతుఁడు
వాసుదేవునిఁ జూడంగ నాసఁ జేసి, వచ్చుచుండిరి తత్పురప్రాంతమునకు. 3

వ. ఆసమయంబున. 4

తే. యదుకుమారు లెల్లనుఁ గూడ ముదముఁ గదుర, సాంబునకు నంగనాకృతి నలిపి తెచ్చి
వచ్చుచుండినయట్టి తాపసుల కెల్ల, వందన మొనర్చుచుండిరి వారలపుడు. 5

వ. అమ్మానినీవేషధారి యగు సాంబుని బభ్రునిభార్య యని చెప్పిన నమ్మునీంద్రు లాత్మ
దృష్టి నక్కపటకార్య మెఱింగి కోపమున యాదవుల కిట్లనిరి. 6

తే. అంగనావేషధరుఁడగు నట్టి డితఁడు, జలజనాభునిపుత్రుఁడు సాంబుఁ డగును
మీరు నమ్ముఁ బరిహసించువారు కాన, నిట్లసత్యము పల్కి రోహితులార. 7

తే. షాసఁగ సాంబునికడుపున ముసలమొకటి, కలుఁగు నదియె యాదవకులక్షయ మొనర్చు
శౌరి రౌహిణేయులఁ దక్క సకలయాదవులు నశింతురు ముసలమువలన నిజము.

తే. రౌహిణేయుండు తనదగు దేహము విడి, సాగరముఁ బ్రవేశించుఁ జక్రధరుఁడు
భూశయనమున దేహమ్ముఁ బొంచి విడుచు, మానుఁ డీప్రకారం బగు మానకుండ.

వ. అని పలికి మునులు భక్తవత్సలుండగు దేవకీనందనునిఁ జూడకుండఁగనే తమతా
వుల కేగి రంత. 10

చ. కరిపురమందు ధర్మజుఁడు కౌరవరాజ్యరమాసతీమణిన్
బరమదయాసమేతుఁడయి పాలనఁ జేయుచునుండె సోదరుల్
నిరతము తన్నుఁ గొల్వఁగను నీరజలోచన యాజ్ఞసేనితోఁ
బరమసుఖంబులం గొనుచుఁ బార్థివముఖ్యుఁడు ఖ్యాతిఁ గాంచెడున్. 11

వ. అట్లు యుధిష్ఠిరుండు సర్వప్రజానందకరముగ రాజ్య మేలుచున్న సమయమ్మున.

ఆ. ఆంబికేయపత్ని యైనయాగాంధారి చక్రధరున కపుడు శాప మొసఁగె
దాని గతువు వచ్చె ద్వారకాపురమున, దుర్నిమిత్తములవి తోచుచుండె. 12

తే. అంత సాంబునిగర్భమువందు నొక్క, ముసలము జనించె యాదవపుత్రులెల్ల
రత్యభీతంబు బొంది యాయబ్జనాభునకును దెలియంగఁ జెప్పిరి ప్రకటితముగ. 13

వ. శ్రీకృష్ణుం డావృత్తాంత మాలించి యమ్ముసలమును పొడిచేసి సాగరములోఁ బార
వేయ నియమించిన వా రట్లొనరించి రంత ద్వారకలో గాంధారీశాపప్రభావంబున
ననేకమహోత్పాతములు జరుగుచుండె. 14

క. జలజోదరుండు ను న్మఱి, బలరాముఁడు తక్క మిగతవా రెల్లరు వి
ప్రుల బాధించుచును గురు, వుల నవమానించుచుండి రొగి యాదవులున్. 15

తే. యాదవాంగన లెల్లరు నాత్మవిభుల, మాటలను గొంచె మేనియుఁ బాటిసేయ
కుండ లజ్జావిహీనలై యుండి రపుడు, చాల దుర్నిమిత్తంబులు జరుఁగుచుండె. 16

మ. కమలావల్లభుఁ డన్నిటిన్ గనుఁగొనెన్ గాంధారిశాపప్రభా
వము చేకూరె యదుక్షయం బనుచుఁ దా భావంబులో నెంచుచున్
గ్రమ మేపారఁగ నీయదుక్షయము వేగం బౌను గాన న్సము
ద్రముతీరంబున నైన మేలనుచు నారాజీవనేత్రుం డొగిన్. 17

క. యాదవులనెల్లరఁ బిలిచి, యాదామోదరుఁడు పలికె నందఱతో నో
యాదవులారా వేగము, పోదము మన మాసముద్రుఁ బూజించుటకై. 18

సీ. అబ్జాక్షుఁ డట్లను నారేయియందు నా, శ్రీకృష్ణచక్రము చిత్రముగను
జనులు విస్మయ మొందఁగను దివంబున కేగెఁ, బరఁగసుగ్రీవశైబ్యములు మఱియు
మేఘపుష్పంబు నామెయిఁ జూడఁ గానె వ, లాహక మనఁబడు వాహనమును
శౌరిరథం బది చక్రము పోయిన, యామార్గమునఁ బోయె నంతలోన

తే. వాసుదేవుఁ డాయాదవప్రవరులఁ గని, యబ్ధిఁ బూజింపఁ బోవుట కాజ్ఞ యొసఁగె
సర్వయాదవు లప్పుడు శౌరియాజ్ఞ, సాగరమును బూజింపఁ బోసాఁగి రంత. 19

వ. అనేకభక్ష్యభోజ్యాదులతోఁ బాలు పెరుఁగు నేయి శర్కరాదులతో గంధాక్షతపు
ష్పాదులతో యాదవు లెల్ల సముద్రమును బూజింప నేగినఁ గృష్ణుండు వారివెనుక
వాహనారోహణ మొనర్చియు బలరాముండు తాలినషకను బోయి రంత. 20

క. ఘనుఁ డగునా బలభద్రుఁడు, వనజోదరుతోడఁ జెప్పి వనమందుఁ దపం
బును జేయ నరిగె యాదవు, లనువుగఁ బూజించి రప్పు డంభోరాశిన్. 21

వ. యాదవులు దాము దెచ్చినభక్ష్యాదు లాయబ్ధికి నైవేద్య మొసఁగి రయ్యవసరమ్మున.

తే. అజుని ప్రేరణమున నాకృతవర్మయు, చారుదేష్ణుఁ డవల సాత్యకియును
వనజనాభుసుతుఁడు ప్రద్యుమ్నుఁడు న్మొద, లైనయదుకుమారు లపుడు. 23

వ. సురాపానం బాచరించి యొడలు తెలియక నొకరి నొకరు దూషించుకొనుచుఁ
బరియాచకము లాడుచుండి రంత. 24

ఆ. మద్యపానమునను మత్తుఁడై సాత్యకి, కన్ను లెఱ్ఱఁ జేసి క్రౌర్య మనక

కేలఁ గత్తిఁ దాల్చి కృతవర్మపై కేఁగి, యతనిశిరము దుంచె నంతలోన. 25

వ. కృతవర్మ మడిసినఁ దద్బంధువు లెల్లరు కోపోద్రేకమున సాత్యకితోఁ బోరుచుండి రా సమయమున. 26

తే. వెనుక సాంబునిగర్భమునను గలిగిన, ముసలమును బొడిగాఁ జేసి పోసఁగ వారు
సాగరదరిని వైచినసమయమందె, పొడి యదెల్లను దుంగమై పోల దోఁచె. 27

వ. యాదవు లెల్లరా తుంగను లాగి దానితోఁ బోరొనర్చుచుండి రంతట. 28

సీ. చక్రాయుధుం డంత సాత్యకినిం గావఁ, దల పూనఁ డయ్యెను దనమనమునఁ
బ్రద్యుమ్నుఁ డంతటఁ బ్రాడ్విభోజులఁ దాఁకె, మద్యపానంబున మదము నొంది
దేహములే మియుఁ దెలియఁ జాలక వారు, యాదవు లొండొరు లాజి సల్పి
చాసిరి పెక్కురు ప్రద్యుమ్నుఁ డనిరుద్ధ, సాంబాదిముఖ్యులు సాత్యకియును

తే. వారలు పరస్పరకలహావాంఛితు లయి, హతము నొందిరి యంతట నద్ది గాంచి
సుబలపుత్రుని శాపము మనసునఁ దలంచి, నిర్వికారుఁడై కృష్ణుఁడు నెగడుచుండె. 29

వ. అమ్మురదమనునికడకుఁ దారుకుండును బభ్రుండును జని యి ట్లనిరి. 30

తే. అఖిలయాదవుల్ మడిసిరి యాదిదేవ, ఘనుఁడు బలరాముఁ డేదెసఁ జనినవాఁడొ
యతనిజాడ నరసివత్త మనుచుఁ దేరు, మనుఁడు వారితో వనజాక్షుఁ డరిఁగె నంత.

క. తరువు సమీపమునందున, పరమేశ్వరుఁ డపుడు గాంచె బలభద్రు నొగిన్
సరసీజోదరుఁ డంతట, నరయఁగఁ దారుకునితోడ ననె నిట్లనుచున్. 32

తే. హాస్తినపురికిఁ బోయి యర్జునాదులఁ గాంచి, యదుకులక్షయంబు నవలఁ దెలిపి
పార్థునిట కిటకు వడిగరమ్మనుమనెడఁ, దారుకుండు పోయె దంతిపురికి. 33

వ. కృష్ణుండును యదుకులక్షయవృత్తాంతము బలరామున కెఱింగింప నతండు మిక్కిలి విచారించె నంత హరి బభ్రుం గాంచి యాదవాంగనలను బురము విడిచి రమ్మని తెల్పి మఱి యాజ్ఞాపించుటయు బభ్రుండు పోవుచుండఁ బోయవాఁ డొకం డా బభ్రుని వధించిన మునిశాపమున కాశ్చర్య మొంది శ్రీకృష్ణుండు బలరామున కి ట్లనియె. 34

సీ. అగ్రజా యాదవుల్ హతులైరి యెల్లరు, రథగజంబులను దురంగములను
బరిఁ జేర్చి యత్తు నీతిరువుపద్దని నీవు, నివసింపు మనుచు మాధవుఁడు వేగ
ద్వారకాపురి కేగి వసుదేవునిం గాంచి, యల్లన నతనితో ననియె నిట్లు
యగ్రజుఁ డిపుడు తపంబు నాచరింపఁగఁ బోయె, నేను దపింపఁగ నేగువాఁడఁ

తే. గౌరవకులక్షయము మున్నె గాంచినాఁడ, యాదవకులక్షయము చూడ నైతి నేను
బంధుహీనుఁడ నైతి నీ యనంతరమున, నేను నిమిషము నివసింప లేను దండ్రి. 35

వ. నేఁ డెల్లి పార్థుం డేతెంచు నని వసుదేవుని యాదవకాంతల నెల్లర నూరార్చి తా
నతివేగ బలభద్రునిసమీపమున కేగె. 36

తే. పరఁగ బలరాముఁడును యోగబలమువలన, దేహమును విడనాడియాదివ్యమూర్తి
చే ననంతునియందున వెలయుచుండ, దివ్యదృష్టి నెఱిఁగె దేవదేవుఁ డదియు. 37

వ. యదుపుంగవుం డగువాసుదేవుం డరణ్యమున సంచరించుచు ధరిత్రిలోఁ దా నొన
ర్పఁ బోయినకార్యములు పూర్తి యగు టెఱింగి మునులశాపము గాంధారిశాపము
దలంచుచు గాఢసమాధి నొంది ధరణీతలశయనుం డయ్యె నయ్యెడ. 38

ఆ. బోయవాఁ డొకండు పురుషోత్తముం గాంచి, హరిణ మిది యటంచు నాత్మఁదలఁచి
బాణమును విడువఁగఁ బద్మదళాక్షుని, పాదతలము దూఱె బాణ మపుడు. 39

ఆ. వేటకాఁడు మనుజుఁ డౌటఁ గనుంగొని, మాధవునకుఁ దా నమస్కరించి
కనుల నీరు కాల్వఁ గట్ట నేడ్చుచునుండ, నూఱడించె వాని శౌరి యపుడు. 40

వ. వాని నూరార్చి దేవకీపుత్రుండు నిజపదంబు నొందుటయు. 41

సీ. అట్లూర్ధ్వలోకమునందు నిజపదము, గైకొన నేగినకంసదమను
కెదురుగా నెల్లరు నేతెంచి రంతట, నమరులు దేవేంద్రుఁ డధికభక్తి
స్వాగతమిచ్చిరి జలజోదరునకు నా, వాసుదేవున కిట్లు వజ్రి పలికె
ధర్మరక్షణకు యాదవవంశమునఁ బుట్టి, నరకకంసాదులఁ బరమపురుష

తే. హత మొనర్చిన వాఁడ వోయయ్య నీవు, ప్రతియుగంబున నిట్లు ధర్మార్థముగను
జన్మ మొంది దుర్జనులను సంహరించి, సజ్జనులఁ బ్రోచుచుందువు స్వామి నీవు. 42

వ. అంత విధాత యరుదెంచి యనేకవిధంబుల భగవానునిఁ బ్రస్తుతించె నట్లు యాదవ
వంశమున దేవకీవసుదేవులకు నందనుండై జన్మించి పరాత్పరుండు నిజరూపం బగు
విష్ణురూపము ధరించి వైకుంఠమునకు వేంచేసె నంత. 43

ఆ. దంతిపురికిఁ బోయి దారుకుఁ డంతటఁ, బాండవులకు శౌరివచనములను
యదుకులక్షయంబు నంతయు నెఱిగింపఁ, బార్థులతివిచారభావు లైరి. 44

వ. అంత నర్జునుం డగ్రజానుమతి దారుకువెంట ద్వారక కేగిన వాసుదేవునిపత్నులా
వాసవిం గాంచి మిక్కిలి శోకించి రంత నాతండు వసుదేవునిఁ జూడఁ బోవ నతండు
కన్నీరు కార్చుచు నాసంక్రందననందనున కిట్లనియె. 45

తే. నాయనా యర్జునా విను నాదునుడులు, సకల మగుసురాసురతతి సంహరించు
యాదవుల కారణంబున హతము నొందఁ, గనులఁగాంచియు న్నాఁడను గౌరవేంద్ర.

వ. సాత్యకిప్రద్యుమ్నానిరుద్ధాదులు మడియుట వినియుఁ జావ నైతిని. 47

సీ. ఎట్టికార్యం బైన నెంచి చేయఁగలాఁడు, మృతుఁ డౌ పరీక్షిత్తు నతులితముగ
బ్రతికించినట్టిఁడు పద్మదళాక్షుండు, యదువంశకలహము నాపకుండె

అతఁ డిది యంతయు నావశ్యక మని యు, పేక్ష వహించెను విజయ వింటె
యజునివశమున నట్లై యుండఁగా నోపు, నని యాతఁ డనునెడ నాలకించి

తే. జిష్ణుఁ డెంతయు మదిలోనఁ జింతఁ బొంది, సేదఁ దేర్చెను వసుదేవు నాదరమున
శౌరి యెచ్చోట నుండు నాజాడఁ దెలుపు, మనుచు వసుదేవుఁ డిట్లనె నర్జునునకు.

సీ. యాదవు లెల్లరు హతు లైన పిమ్మటఁ, గమలనాభుండు నాకడకు వచ్చి
నను నేదఁ దేర్చుచు నాతండ్రి విధివశుల్, వృష్ణిభోజాంధకవీరు లెల్ల
నశియించి రిపుడు ధనంజయుఁ డోడితే, దారకుఁ బంపితి దంతిపురికి
నతఁ డీపురంబున కరుదెంచు నీయందు, భయము భక్తియుఁ గల్గి ప్రబలుచుండు

తే. నీవు చెప్పిన ట్లొనరించు నావిజయుఁడు, నాకు నతనికి భేదము లేక యుండు
నతనిఁ జేపట్టి పురి నేలు మయ్య యింక, నతఁడు బాపు నీదువిచార మనఘచరిత.

క. బలరాముఁడు యదుముఖ్యులు, కలహింపక యున్నతఱిని గానల నియతిన్
జెలఁగ నరిఁగె నేనును నా, బలరాముని బోలె నరుగు వాఁడను దండ్రీ. 50

ఆ. మది విచార ముడిగి మహితచరిత నాకు, నాజ్ఞ నిమ్ము తపము నాచరింప
నర్జునుండు నీదునాజ్ఞఁ బ్రవర్తించి, నీదు సేవఁ జేయు యాదవేంద్ర. 51

వ. మృతు లగుయాదవులకుఁ బార్థుండు వహ్నికార్య మొనర్పు నని ముకుందుండు తపింపఁ బోయె నర్జునా! నీ వీద్వారకను రథగజతురగాదులను కృష్ణునాజ్ఞఁ బరిపాలింపు మనిన నత్యంతదుఃఖాకులుఁడై వాసవి వసుదేవున కిట్లనియె. 52

సీ. వాసుదేవుఁడు లేనిద్వారకాపురమున, మీరు వసించుట మేలుగాదు
ధర్మనందనుఁ డిది తాను మున్నె వచించె, రథగజంబులను దురంగములను
యాదవవనితల నఖిలబాలురతోడ, ఖాండవప్రస్థము కడువడిగను
జేరుపు మనియును జెప్పియుండెను గానఁ, జింతను బాయు నీచిత్తమందు

తే. మీర లెల్లఁ దత్పురికినిఁ జేరవలయు, ననుచు దారుకుఁ గన్గొని యర్జునుఁ డనె
శౌరి యెచ్చోటి కేగెనో స్వాంతమందుఁ, జూడఁ దత్తఱ మొందుచున్నాఁడ నేను.

వ. అని వసుదేవునాజ్ఞను ధనంజయుండు శ్రీకృష్ణమందిరమున కేగి నేఁటికేశవనాఁడు ద్వారకాపురి నంబుధి ముంచు నని యెఱిఁగి యావాసుదేవుని మందిరమున శయనించుటయు. 54

తే. తెల్లవారుచుండఁగ వసుదేవుఁ డంత, యోగనిష్ఠను గైకొని యూర్ధ్వలోక
మునకు నేగె నర్జునుఁ డది వినియు వేగ, నతని కడ కేగి పిలపించె నధికఖిన్నుఁగను. 55

వ. అంతఁ గౌంతేయుండు వసుదేవున కగ్నికార్య మొనర్పఁ దత్పత్ను లెల్లరుఁ దమనాథునితో నగ్నిం జొచ్చి ప్రాణంబులఁ బాయుటయు. 56

సీ. అర్జునుం డంతట నబ్ధితీరంబున, సకలయాదవులకు సమ్మతమున
నగ్నికార్య మొనర్చె యఁదారుకుని, గూడి, బలరామకృష్ణుల్ తపం బొనర్ప

నరిగినకానకు నరిగి యం దొకచెన,వాసుదేవునికళేబరముఁ గాంచి
పరితాప మొంది యప్పరమేశ్వరున కపు, డగ్నిసంస్కారాము లాచరించి

తే. మరల నాతఁడు ద్వారకాపురినిఁ జేరి,యప్పురము మరుదినమున నబ్ధిమునుచు
నని యెఱిఁగి బాలవృద్ధుల నంగనలను,భటుల రథగజాదుల నతిత్వరితమునను. 57

వ. ఇంద్రప్రస్థమునకుఁ గైకొని పోవుచు మార్గమధ్యమునఁ బంచనదమున విడిసె నంత.

తే. ఆతఱిని సతులఁ గని కిరాతు లెల్ల,వారిసొమ్ము లపహరింపఁ బార్థుఁ డాఁకి
రర్జునుఁడు దుస్తరంబగునట్టికష్ట.మొంది కాచెఁ గొందఱఁ గృష్ణసుందరులను. 59

వ. రుక్మిణ్యాదులను బలరామపత్నిని రక్షించె నంతఁ గిరాతు లాయర్జును నోర్చి యాద
వాంగనల సొమ్ము లపహరించుటయు దేవతల కజేయుండగుఁ దనకు శక్తి తగ్గు
టకై పార్థుఁడు విచారించి వారి నెల్లరఁ దోడ్కొని యింద్రప్రస్థమున కేగుటయు.

క. తరువాత నర్జునుం డాఁకరమాత్మునివార్త యెల్లఁ బత్నుల కెఱిఁగిం
ప రయంబున వారల ముందరికిం జని పరితపించె దైన్యాతురుఁడై. 61

వ. వా రెల్ల రతనివాపోవుటకుఁ గారణ మడిగి యాపార్థునివలన బలరామదేవకీనంద
నుల వృత్తాంత మెఱుఁగుటయు నంత రుక్మిణి జాంబవతి మొదలగువాసుదేవుని
పత్నులును బలరామపత్నియు నగ్నిప్రవేశ మొనర్చిరి సత్యభామాదులు తపింపఁ
బోయి రంత నర్జునుండు వేదవ్యాసాశ్రమమున కేగి యదుకులక్షయంబెఱిఁగించి
యమ్మునీంద్రునిచే నూరడింపఁ బడి కరిపురి కేగి ధర్మనందనునితో సర్వవృత్తాంత
మెఱిఁగించె నని చెప్పిన విని జనమేజయుండు వైశంపాయను నవ్వలివృత్తాంత
మడుగుటయు. 62

ఆశ్వాసాంతము.

ఉ. నేరిచినట్లు వ్రాసితి మునిప్రవరస్తుత విశ్వనాథ నా
నేరము లెన్ని యుండినను నెమ్మినిఁ బ్రోవు మటంచు మ్రొక్కెడిన్
భారతసత్కథామృతము వైభవ మొందఁగ స్వీకరింప వే
శ్రీరమణీమనోరమణ సేవితపాదసరోరుహద్వయా. 63

గద్యము—ఇది కవిరాజ శ్రీపాదకృష్ణమూర్తి శాస్త్రిగారి పుత్రికయును
కల్లూరి వేంకటసుబ్బారాయఁడుగారి పత్నియును
రాజ్యలక్ష్మీపరిణయాదిగ్రంథకర్త్రినియు నగు
విశాలాక్షమ్మచే, రచింపఁ బడిన
భారతకథామృతంబునందు
మౌసలపర్వము.
పరమేశ్వరార్పణమస్తు.
శ్రీ. శ్రీ. శ్రీ.

శ్రీరస్తు.

# భారతకథామృతము.

---

## మహాప్రస్థానిక పర్వము.

క. శ్రీపార్వతీమనోహర, తాపసజనహృదయలోల దైవలలామా
నీపాదార్చనఁ జేయుదుఁ, గాపాడుము దయను గరళకంఠ మహేశా. 1

వ. జనమేజయునకు వైశంపాయనుం డవ్వలివృత్తాంత మిట్లు చెప్పందొడంగె నట్లు దేవకీ
నందన పరలోకప్రాప్తియు బలభద్రునిపరమానందమును యాదవక్షయమును వ్యా
సహితభాషణములను దెల్పిన విని గాండీవికిఁ బాండవాగ్రజుఁ డిట్లనియె. 2

## పాండవుల ప్రస్థానము.

క. చిత్తము ప్రస్థానమునకుఁ, దత్తఱమును బొందుచున్నది దమ్ముఁడ వింటే
యిత్తఱి నాదుప్రయత్నము, చిత్తంబున మెచ్చి వేగఁ జేయు కుమారా. 3

చ. అనియు నజాతశత్రుఁ డపు డబ్జదళేక్షణ యాజ్ఞసేనిఁ బా
వనిఁ గవలం గనుంగొనియు వాంఛిత మెల్ల నెఱుంగఁ దెల్పఁ దె
ల్పిన విని వారలెల్లరును వేడ్క బొంది మహీశు మెచ్చియున్
వనమున సంచరించుటకు వారును దత్తఱ మొందియుండిరన్. 4

వ. అంత ధర్మనందనుం డభిమన్యునందనుం డగుపరీక్షిన్నరేంద్రుని సర్వసర్వంసహా
రాజ్యమున నభిషేకించి సర్వదానము లొనరించి సకలసద్గుణభద్ర యగుసుభద్ర
కి ట్లనియె. 5

చ. మనుమని కీపరీక్షితికి మానుగ రాజ్యము నే నొసంగితిన్
వనితరొ యాదవేశుఁ డగువజ్రున కిచ్చితిఁ గొంత రాజ్యమున్
దనరఁగ రెండువంశముల ధైర్యముతోడను నీవె బ్రోవుమా
వనమున కేము పోదుము తపం బొనరించుకొనంగఁ దల్లిరో. 6

క. ధరణీచక్రంబునకున్, బరీక్షితుం డయ్యె నేఁడు బాలుం డతనిన్
గరుణామతివై నీవే, నిరతంబును బ్రోవవలయు నీరజవదనా. 7

వ. అని ధర్మనందనుండు పరీక్షిత్తున కనేకరాజనీతు లుపదేశించి యవ్వల. 8

చ. భారతయుద్ధమందుఁ గడుఁ బ్రస్తుతిఁ జెంది గతించువారికిన్
భూరమణాగ్రగణ్యులకుఁ బుత్రులకున్ ధృతరాష్ట్రముఖ్యులౌ
కౌరవకోటికిన్ సుగతిఁ గల్గ నొనర్చె ననేకదానముల్
ధారుణినాయకుం డమలధర్మతనూజుఁడు సంతసంబునన్. 9

క. భూదానంబులు మఱి క, న్యాదానంబులు గనక మహాదానంబుల్
మోదముతోఁ జేసెను ధౌ, మ్యాదిపురోహితుల కెల్ల నాసమయములోన్. 10

ఉ. పౌరుల నెల్లరం బిలిచి వారలఁ గన్గొని యిట్లు పల్కె నో
పౌరవరేణ్యులార గుణవంతితులార మదీయపౌత్రునిన్
ధారుణినాథుఁ జేసితిమి ధన్యుఁ బరీక్షితు నుత్తరాసుతున్
మీ రతిభక్తితోడ నిఁక మీఁదఁ బరీక్షితునిన్ భజింపుఁడీ. 11

క. మాయేవురకు న్మాఱుగ, నీయభిమన్యూత్మజునకు నెంతయు భక్తిన్
జేయుఁడు సేవ లితఁడు మీ, శ్రేయము లొనఁగూర్చుఁ బౌరశేఖరులారా. 12

క. అని పౌరుల నూరార్చియు, జనపతి వీడ్కొలిపె వారి సత్వరగతిఁ దా
వనవాసదీక్షఁ గైకొని, యనుజులతో సుదతితోడ నలరారుటయున్. 13

వ. పాండవు లంతఁ బాంచాలీసహితులై జటావల్కలంబుల ధరించి వనమునకు బయ
లువెడలుటయు వారి నొకశునకము వెంబడించె నంత. 14

చ. చని చని వార లెల్ల రొక సాగరతీరము చేరఁగా నెయ
ర్జున కమలేశుచక్ర మది సొంపుగఁ బోయె దివంబుఁ గాండీవం
బును విడువం దలంపవొకొ బుద్ధివిహీనుఁడ వైతి వోక్కొ యీ
ధనువును మున్ను నే వరుణదైవముదగ్గరనుండి తెచ్చియున్. 15

వ. నీ కొసంగితి నయ్యది నే నిపు డాతని కీ వలయుఁ గావున గాండీవము విడనాడుము.

క. అని విన వచ్చినఁ గుంతీ, తనయుం డగుసవ్యసాచి తద్గాండివమున్
వననిధిమధ్యమునందున, దనవారలు చూడ నైచెఁ దత్సమయమునన్. 17

(భీమార్జుననకులసహదేవద్రౌపదులు దేహత్యాగ మొనర్చుట)

వ. అంతఁ బాండవులు పాంచాలీసారమేయములతో భూప్రదక్షిణ మొనర్పఁ బశ్చి
మోత్తరసముద్రంబుల నతిక్రమించి హిమాలయంబుఁ దాఁటి మేరుపర్వతసమీప
మున కేగి రయ్యెడ. 18

తే. యోగ మెడలుటవలన నయోనిజ యగు, ద్రౌపదీదేవి యంతట ధరణిఁ బడియె
వాయునందనుఁ డంతటఁ బత్నిగతిని, దెలియఁ జెప్పి ధర్మజునితోఁ బలికె నిట్లు. 19

ఉ. ప్రాపగుధర్మరూపిణి శుభప్రదురాలు మహాత్మురాలు నీ
ద్రౌపది యోగహీన యయి ధారుణిపైఁ బడుకారణంబు నే
నీపగిదిన్విన న్వలతు నియ్యది తెల్పు మటంచుఁ బల్కగా
నాపృథివీతలేంద్రుఁ డపు డాతనిఁ గన్గొని పల్కె నిట్లొగిన్. 20

తే. వాయునందన వినవె యీవారిజాక్షి, సర్వకాలములందును సవ్యసాచి

యుండుఁ బక్షపాతంబున నలరె గాన, నీని కిటు వచ్చె నని సమాధాన మొసఁగె.

తే. అట్లు ద్రౌపదిఁ బాసి వా రరుగుచుండ, దేహమును బాసి యా సహదేవుఁ డంత
ధరణిఁ బడినను భీముఁ డాకస్మికత్వ, మన్న కెఱిఁగింప ధర్మజుఁ డనియె నిట్లు. 22

క. ఏఁడు తనకన్నఁ బ్రాజ్ఞుఁడు, లేఁ డని గర్వించుబుద్ధి లేమికతమునన్
ఏ డివ్విధమున ధరఁ బడె, నాఁ డని సహదేవుఁ బాసి నరవరుఁ డరిగెన్. 23

వ. పాండవు లట్లు పోవుచుండ నకులుండు నేలం బడిన భీముండు ధర్మజున కిట్లనియె. 24

తే. ఇమ్మహానుభావుం డగుఁ దమ్ముకుఱ్ఱ, ధారుణీస్థలిఁ బడియె నాకారణంబు
నా కెఱిఁగింపవే యన నరవరుండు, వాయుసూనునితోడను బల్కె నిట్లు. 25

క. ఇతఁడు తనతో సమానుఁడు, క్షితి నెవ్వఁడు లేఁ డటంచుఁ జిత్తములోనన్
సతతము గర్వించుట చే, నితనికి నిటు వచ్చె ననియు నెఱిఁగించి వెసన్. 26

వ. నకులునిఁ బాసి వా రరుగుచుండఁ గొంతలో నర్జునుండు నేలం బడిన వృకో
దరుండు యుధిష్ఠిరున కిట్లనియె. 27

సీ. పాండవాధీశ యీగాండీవి యిట్లయ్యె, నిర్మలాత్ముఁ డితండు నిశ్చయముగ
నితనియం దనృతంబు నెందు గన్పట్టఁ బో, దితఁ డివ్విధముపడ నేమికత మొ
యనిన ధర్మజుఁ డిట్టు లనిలాత్మజున కనె, నితనియందును సత్య మొందు లేదు
కౌరవులందరఁ గడఁగి యొక్కదినాన, వధియించెద నటంచుఁ బలికెఁ గాదె

తే. పలికి యారీతి నీతఁడు సలుపఁ డయ్యె, నెఱి ధనుర్ధరు లందఱ నిందఁ జేయు
నదియె కారణ మగుట నీయర్జునునకు, నిట్టి గతిసంభవించె నీ వెఱుగు మయ్య. 28

వ. అని యర్జునుని విడిచి భీమసేనధర్మనందను లరుఁగుటయు భీముం డంత నేలం బడి
నేఁ బడుటకుఁ గారణ మే మనిన నజాతశత్రుం డిట్లనియె. 29

తే. రాజనందన నీవతిభోజనంబు, సత్యధికముగ నుండెడి దదియుఁ గాక
బలముఁ గల దని గర్వము గలదు నీకు, ననృతములఁ బల్కుచుందు వీవప్పుడపుడు.

తే. అందువలన నీ కిట్లయ్యె నని వచించి, మాఱుమాటాడ కుండగ మారుతి నటఁ
బాసి శునకద్వితీయుఁడై పార్థివేంద్రుఁ, డరుగుచుండెను బహుదూర మడవిలోన. 31

తే. అట్లు శునకసమేతుఁడ య్యమసుతునకు, దివ్యరథము గైకొని వచ్చె దివిజరాజు
తద్రథంబునఁ గలకాంతిదశదిశలను, బరిఢవిల్లుచునుండె నప్పగిదిఁ జూడ. 32

వ. మఱియు నయ్యింద్రరథముతో నరుదెంచిన సిద్ధసాధ్యాదులు స్తోత్రము లొనర్పు
చుండి రంత. 33

తే. పరమవైభవమునఁ బాకశాసనుఁ డప్డు, తనదుఃముందు నిలువ ధర్మరాజు
భక్తితోడ్త నమ్మఱిపాదాబ్జములు వ్రాలె, నతఁడు సంతసించె నితనిఁ గాంచి. 34

—ఇంద్రధర్మజుల సంవాదము.—

క. సురలోకనాథుఁ డంతట, కురురాజోత్తమునిఁ గాంచి కూరిమితోడన్
నరనాథ స్యందనం బిదె, త్వరలో నిది యెక్కి రమ్ము స్వర్గంబునకున్. 35

వ. అనిన విచారంబున యుధిష్ఠిరుం డింద్రున కి ట్లనియె. 36

సీ. నాతోడఁ బుట్టువుల్ నాతోడఁ జనుదెంచి, మరణము నొందిరి సురవరేణ్య
యత్యంతసుందరి యగు ద్రౌపదీదేవి, యోగవిహీనయై యుర్విఁ గూలె
నాకుఁ దోడై వచ్చినారు వారలు లేమి, నీతోడ సురపురి నేను రాను
కావున నిప్పుడు దేవోత్తమా నీవు, పరమకృపామతి వారిఁ దెమ్ము
తే. తమ్ముకుఱ్ఱలు మఱియును ద్రౌపదియును, లేకపోయిన యెడల నో లోకనాథ
యమరసాయుజ్య మేల నా కని వచింప, నింద్రుఁ డి ట్లని పల్కె మహీశ్వరునకు.

తే. ధర్మజా దుఃఖ మొందకు తగదు నీకు, తమ్ము లా ద్రౌపదీసహితమ్ము గాఁగ
నమరలోకమునకు వచ్చి రమలచరిత, వారి నందునఁ గనుఁగొన వచ్చు నీవు. 38

క. కావున విచార మొందకు, నీ పతిధర్మాత్ముఁ డౌట నృపకులతిలకా
నీ వీ దేహము తోనే, దేవపురంబునకు రమ్ము దివ్యగుణాఢ్యా. 39

వ. అనిన ధర్మజుండు సంక్రందనున కి ట్లనియె. 40

తే. పురము నే బయల్వెడలిన మొదలు గాఁగ, సారమేయము నాతోడ సమ్మతమునఁ
బరమభక్తితోడుత నిదే వచ్చుచుండె, దీనియందు నెయ్యముతోడ నేను నుంటి. 41

క. కావున దీనిని నాతో, దేవోత్తమ నాకమునకుఁ దెచ్చుటకై నీ
వీవలె ననుమతి నిప్పుడు, నా వుడు ఋభురాజు పల్కె నరనాథునితోన్. 42

తే. ధర్మజా నీనుడుల్ విచిత్రముగ నుండె, శునకమునకు దేవత్వము చనదు టెట్లు
దీని విడనాడి వచ్చిన మానవేంద్ర, కఠినమానసుఁ డవు నీవు కావు సుమ్ము. 43

వ. కాలయాపన మొనర్పక స్యందన మధిష్ఠింపు మని ధర్మజునకు మహేంద్రుం డి
ట్లనియె. 44

సీ. ధర్మతనూభవా తగదు కోపము నీకుఁ, గోపము ధర్మము గూల్చివైచుఁ
గుక్కకు స్వర్గ మ దెక్కడ లభియించు, నిట్టి యభిప్రాయ మేల నీకు
సన్నిహితం బయి యున్న శుభంబును, కైకొను మయ్య యో కౌరవేంద్ర
యనుఁడు ధర్మతనూజుఁ డమరేంద్రునిం గాంచి, దీనత్వమును బొంది తెలియఁ బలికె
తే. భక్తియుక్తుని విడుచుట బ్రహ్మహత్యఁ, బోలు నని వచియింతురు పుణ్యనిధులు
దేవలోకము నాశించి దేవరాజ, నేను దీనిని విడువను నిశ్చయముగ. 45

వ. అనిన ధర్మనందనున కింద్రుం డి ట్లనియె. 46

సీ. వ్రతము లొనర్చెడువాఁడు కుక్కను జోఁకి, సుకృతక్షీణుం డగు సుకుచిరాంగ
శునకముఁ బాయు దీనిని నీవు పాసిన, స్వర్గలోకసుఖంబుఁ జాల కలుఁగు
జనసుతిపాత్రుఁడై సత్కార్యము లొనర్చి, యమరత్వ మొందుట కాసపడవు
వాయుజార్జునుల ద్రౌపదిని మాద్రేయుల, విడిచి యీశునకముఁ విడువలే వె
తే. యనిన ధర్మతనూజుఁ డి ట్లతని కనియె, సకలలోకంబులకు నీవు స్వామి వగుదు
ధర్మముల కెల్లఁ బ్రభువవు తండ్రి నీకు, దెలియ కున్న నా కెక్కువ తెలియునొక్కొ.
తే. ద్రౌపదిని నాదుతమ్ముల దైవరాజ, వీడఁగా లేదు వారలె విగతజీవు
లైరి వారికై శోకించు టనుచితంబు, భక్తులను విడనాడుట పాప మగును. 48
వ. కావున నావాక్యము లాలకింపుము. 49
ఆ. నాకలోకసుఖము నాకు లేకుండిన, లేక పోవుఁ గాక లోకనాథ
శునకమును విడువగ మన మొప్పకున్నది, దేవపురికి రాను దేవరాజ. 50
క. నను విడనాడుము నీ వీఁక, ఘన మైనతపం బొనర్చి కడువేడుకతో
నిను సేవించెడువాఁ డను, వనభూములలోన నుందు వాసవ యనినన్. 51
వ. అట్లు దృఢవిశ్వాసుండై పలుకుధర్మరాజుపల్కు లాలకించి శునకరూపమునతో ను
న్నధర్ముండు శునకాకారము విడిచి నిజరూపంబున సాక్షాత్కరించి యజాతశత్రుం
గాంచి పుత్రప్రేమంబున నిట్లనియె. 52

(ధర్మరాజుస్వర్గమున కేగుట)

సీ. నీపుణ్యవృత్తము నిర్మలశ్రద్ధయు, భూతదయయుఁ గన మోద మయ్యె
భూలోకమున నిన్నుఁ బోల రెవ్వారలు, యముఁడ నన్నెఱుఁగుమోయమలమూర్తి
మును గానలోన నీవినుతధైర్యము జూచి, యున్నవాఁడను గాదె యోకుమార
యపుడు నీతమ్ములయందున నొక్కని, బ్రదికింతు ననియును బలికినాఁడ
తే. అవ్వచనముల నెల్ల నీవాలకించి, తల్లి బిడ్డల మదిలోనఁ దలఁచి నకులు
బ్రదుకఁ జేయు మటంచును బలుకఁ గానె, నీదుధర్మబుద్ధికి మెచ్చి నేను మదిని. 53
వ. నీనల్వురుతమ్ములం బ్రదికించితి నామనంబున నిన్నుఁ గాంచి ప్రమోదంబయ్యె నిన్ను
బోలువాఁడు స్వర్గమున నైన లే డని యి ట్లనియె. 54
సీ. నీవు దేహముతోడ దేవలోకము కేగి, యందలి వా రెల్ల రలరునట్లు
సకలశుభంబులు ప్రకటితంబుగఁ బొందు, మనియు వచించె నయ్యంతకుండు
నా సమయంబున నానందమగ్నులై, దేవమునీంద్రులు దేవవిభుఁడు
గంధర్వసిద్ధులు కాలుఁ డశ్వినులును, ధర్మనందను నెత్తి దయ దలిర్ప
తే. వృందవారాధుఁ జేసి రాసమయమందు, సిద్ధసాధ్యులు వినుతులఁ జేయుచుండ
ధర్మనందనుఁ డంత బృందారకేంద్ర, సహితుఁడై నాకమునకుఁ జనియె నంత. 55

వ. అప్పుడు నారదుం డెల్లరకు హృదయరంజకముగా ధర్మనందనుసుగుణకళ్యాణగుణ
ము లభివర్ణించి చెప్పుటయు ధర్మజుఁ డప్పరమతపోధనున కిట్లనియె. 56
తే. నాదుఁతమ్ముల నల్వుర నాకుఁజూడ, మనమునందుఁ గోర్కి జనించె మునివరేణ్య
చూచువఱకు నా కేమియు సుఖము లేదు, నాదుఁపత్నినిఁ దమ్ముల నాకుఁ జూపు
వ. అవ్వాక్యముల విని పురందరుం డాయుధిష్ఠిరున కిట్లనియె. 58
తే. నీవుఁ బుణ్యవశంబున భూవరేణ్య, వచ్చితివి బొందితోఁ బుణ్యపదమునకును
మర్త్యభావము బొందె నీమన మిచటను బాంధవులఁ జూడవలె నని వాంఛ కలిగె.
క. అనఘ యతిదుర్లభం బది, మునులను సిద్ధులను దేవముఖ్యుల నిచటన్
గనుగొనుము ధర్మజా నీ, యనుజులు నినుఁ బోలియుండ నర్హులె చెపుమా. 60
ఆ. పుణ్యపదవివారు పొంద నర్హులు గారు, వసుధలోనఁ గల్గుబంధు లెల్ల
రారు సుమ్మిచటకు రాజేంద్ర నీ వింక, శ్రమము విడువు మనియె నమరవిభుఁడు. 61
వ. అప్పు డింద్రున కమ్మహీంద్రుఁ డిట్లనియె. 62
తే. దేవ మీ రేమి పల్కిన భావమందు, నాకు సమ్మతి లేకుండె నాయనుజులఁ
గాంచి పుత్రమిత్రాదులఁ గాంచువాఁడ, బాంధవులఁ గానకున్న నే బ్రదుకఁగలనె.
తే. నాదుదమ్ములనుం గాంచి మోద మలర, నవల దివ్యభోగంబుల ననుభవింతు
నీవు కరుణాంతరంగుఁడై దేవదేవ, నాకు నావారలను జూపు ప్రాకటముగ. 64
వ. అని ప్రార్థించె నని వైశంపాయనుండు తెల్పిన నాలకించి పరమసంతోషభరితుండై
జనమేజయభూపాలుం డవ్వలవృత్తాంతము చెప్పు మని కోరుటయు. 65

—ఆశ్వాసాంతము.—

చ. ఘన మగుభారతామృతము గైకొని వ్రాయఁ దలంచి నప్డు డీ
వినుతచరిత్ర మెవ్వరికి వేడుక నిత్తునొ యంచు నెంచుచున్
దనయకు భర్తనారయ విధంబున నిగ్గని నీ కొసంగి నా
ననువగు కావ్యకన్యను దయామతిఁ గైకొను మిందుశేఖరా. 66

గద్యము—ఇది కవిరాజ శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రిగారి పుత్రికయును
కల్లూరి వేంకటసుబ్బారాయఁడుగారి పత్నియును
రాజ్యలక్ష్మీపరిణయాదిగ్రంథకర్త్రియు నగు
విశాలాక్షమ్మచే రచింపఁ బడిన
భారతకథామృతంబునందు
మహాప్రస్థానికపర్వము
పరమేశ్వరార్పణమస్తు
శ్రీ. శ్రీ. శ్రీ.

శ్రీ ర స్తు.

# భా ర త క థా మృ త ము.

## స్వ ర్గా రో హ ణ ప ర్వ ము.

క. శ్రీరంజిల్ల భవత్పద, సారసయుగ్మము భజింతు సర్వేశ్వర యో
దారిద్ర్యదుఃఖనాశక, కారుణ్యముతోడ మమ్ముఁ గావు మహేశా. 1

వ. జనమేజయుండు వైశంపాయనుం గాంచి మత్పితామహు లగుపాండవులును ధార్త
రాష్ట్రులును స్వర్గంబున నెట్లు ప్రవర్తించిరో తద్వృత్తాంతము వినిపించి నన్నుఁ
గృతార్థుం జేయు మనిన వైశంపాయనుం డిట్లు చెప్పం దొడంగె. 2

తే. బంధుదర్శనమును గోరి పల్కువాని, పాండవాగ్రజుఁ గాంచి యింద్రుండు మెచ్చి
తగినదూత నొక్కనిఁ బిల్చి ధర్మజునకు, బాంధవులఁ జూపు మనియునుబలికెనంత.

వ. ఆదేవదూత ధర్మజునిఁ గొనిపోవుచుండ నారదాదు లతని వెంబడించి పోయిరి. 4

—ధర్మరాజు స్వర్గంబున బంధువులఁ జూచుట.—

తే. శమనసుతుఁ డంత నున్నతాసనమునందుఁ, జెలఁగి భానునిపోలిక నలరువాని
దేవకన్యాపరివృతుఁడై తేజరిల్లు, నాసుయోధనుఁ గన్గొనె నంతలోన. 5

వ. అట్లు దివ్యభోగములతోఁ దులఁదూగుదుర్యోధనుం గాంచి ధర్మజుండు మునీంద్రు
ల కిట్లనియె. 6

చ. మునివరులార యీతఁ డతిమూర్ఖుఁడు లోభుఁడు పీనిమూలమై
జనవరు లెందఱో మునుపు సంగరమందునఁ జచ్చినా రిలన్
జనసుత సాధ్వి ద్రోవదిని సభ్యులముందఱ మానభంగమున్
మును పొనరించి నాఁ డితఁ డపూజ్యుఁడు వీనిని జూడఁ దప్పగున్. 7

తే. నకులసహదేవ భీమ ధనంజయులను, ద్రౌపదీదేవియుం గలతావునకును
నన్నుఁ గొనిపోవుఁ డోమునినాథులార, వారిసరి నే వసించెదవాఁడ ననిన. 8

వ. నారదుండు నవ్వుచు నవ్వసుధారమణున కిట్లనియె. 9

సీ. తనశరీరమును యుద్ధమునఁ ద్యజించెను, ధృతరాష్ట్రనృపునగ్రసుతుఁ డితండు
దేవతాసంభావ్యుఁడై వెలుంగుచు నుండె, బుణ్యు లితనిఁ నెంత్రు భూవరేణ్య
యితఁడు రాజుల నని హత మొనరించెను, నది పాప మెట్లగు నమలచరిత
యితని దాష్కృత్యము లిచటఁ బల్కఁగ రాదు, కాన నూరకయుండు కౌరవేంద్ర

తే. అనిన ధర్మతనూభవుఁ డనియె నిట్లు, పాపబుద్ధి సజ్జనపరితాపబుద్ధి
కుఁబు నాశ మొనర్చెఁ గులము నితఁడు, దేవతల కెట్లు పూజితుఁడై వెలింగె. 10

తే. అయిన నవి యటుండఁగ నీయుమనఘచరిత, తమ్ములనుబంధుమిత్రులఁ ద్రౌపదిఁగన
దత్తఱము బొందుచున్నాఁడఁ దాపసేంద్ర యనియు నచ్చట మునులతో ననియె నిట్లు.

సీ. దురమందు నను బొల్చి మరణించువారికి, శ్రాద్ధకర్మల నేను సల్పుచుండఁ
గుంతి కర్ణునిఁ దనకొడు కని చెప్పెను, నది మొదలుగ నమ్మహాత్ముఁ జూడ
నభిలాష కల్గె నే నతనిఁ దలంచిన, నుల్లము సంతాప మొందుచుండు
నతఁడు జీవింపఁగా నర్చింప లేనైతి, నని విచారము కల్గె ననఘులార

తే. కర్ణునిం జూడఁగడుకోర్కి కలిఁగె నాకుఁ, గానఁ గరుణాసమేతులై మహానులార
యన్నయగు కర్ణుఁ డెచ్చట నలరుచుండు నతని నాకుఁ జూపింపుఁడీ యతులితముగ.

వ. ద్రుపదవిరాటభీష్మద్రోణాదులను నాయన్నదమ్ములను జూడక తాళఁ జాల ననినన మ్మునీంద్రు లమ్మనుజేంద్రున కిట్లనిరి. 13

క. కురురాజోత్తమ నీకుఁ, సురనాథుఁడు చెప్పె వారిఁ జూడు మటంచున్
సురదూతతోడ నటు చని, పరికింపుము సకలమైన బాంధవుల ననన్. 14

వ. అంత దేవదూత కుంతీనందనుని ముంగునకుఁ దోడ్కొని పోయిన నందుర్గంధవస్తుసమేత మార్గంబును, దుష్టజంతుసహితంబును నసిపత్రవనంబును వైతరణీనదియు యాతనాబాధితు లగు పాపాత్ములను గాంచి ధర్మజుఁ డాదుర్గంధము సహింపలేక ముందునకుఁ బోవుచుండ నారకబాధాపీడితులు కొందరా ధర్మజున కిట్లనిరి. 15

సీ. పురుషోత్తమా నీవు పోకు మిచట నుండి, పుణ్యుఁడ వీవిందుఁ బొల్చుకతనఁ
బరిమళయుక్తమౌ వాయువు వీచెను నందున మాదుఃఖ మడఁగిపోయె
మాకు సౌఖ్యము గల్గె మదికి శాంతముఁ గల్గె, నినుమహాత్ముని మేము గనులఁ జూ
నత్యధికం బగు యాతనాబాధలఁ, బాసి యుంటిమి మేము పరమపురుష

తే. నీవు సతత మిచ్చోటున నిలుతు వేని, మేము సౌఖ్యము గాంతుము మేదినీశ
సతతమును నిందు నివసింపఁ జాల వేని, నిలుము కొంచెముకాలము నలలితాత

వ. అనిన విని ధర్మనందనుండు కటకటంబడి మీ రెవ్వ రన వా రిట్లనిరి. 1

సీ. నేను గర్ణుండను నే భీమసేనుండ, నే నర్జునుండను నే నకులుఁడ
నే సహదేవుండ నేను పాంచాలి నో, దేను ధృష్టద్యుమ్నుఁడ నే శిఖండి
ద్రౌపదేయాదుల మో పురుషోత్తమా, యని పల్కు పల్కుల నాలకించి
ధర్మతనూజుండు తనమనమందున, గడు విచారించియుఁ గటకటఁబడి

తే. అక్కటా వీరి నెటు చేసె నహహ దైవ, మెంత యో నీచుఁడన నొప్పు నిట్లొన
వాసవాద్యమరులు నీచభావు లయ్యు, యుక్తమున యుక్తము నెఱుంగకుండిరొక్కొ

సీ. వీరు కీడేమియుఁ గోరి సేయని వార, లేమి చేయువారి కిట్లు వచ్చె

నిట్టికష్టంబుల నీమహాత్ములకుఁ, గలిఁగింపవచ్చు నాకలుషమతులు
సత్యచరిత్రులు నిత్యదానరతులు, సర్వోత్తములు వీరు సజ్జనులును
సదక్షిణాంచితక్రతువు లొనర్చిరి, తగనిచోటను వీరు తనరుచుండ్రి
తే. పుణ్యముల నేమి చేయనిమూర్ఖుఁ డైన, ధార్తరాష్ట్రాగ్రజుఁడు సుతదారసహిత
పుణ్యలోకసుఖంబులఁ బొందుచుండె, ధర్మహీన మై కన్పట్టె దైవకృతము. 19
సీ. ఈగకాలంతయు నేసియుఁ బాపము, వీరు చేసి రటంచు వినఁగ లేదు
పాపలోకమున నివాసము వీరికిఁ, గలిఁగించె విధి నేమి పలుకవచ్చు
నని విచారంబున నాధర్మసూనుండు, తా విన్నమాటలే తలఁచుచుండి
యిది దైవమాయయో యిది స్వప్నమో కాని, నిశ్చయింపఁగఁజాల నిజమదేమొ
తే. అనియుఁ బరమాకులేంద్రియుఁడై యతండు, శోకవిహ్వలమనమున సుక్కిసుక్కి
యలుక దేవేంద్రుపైనను గలుఁగఁ గాఁగ, దేవదూతతో నిట్లనె భూవరుండు. 20
వ. దేవోత్తమా! నరకమున నున్నబాంధవులఁ బాసి రాఁ జాలనని మీదేవేంద్రుని
తోఁ జెప్పుమన నతండు దేవేంద్రున కావృత్తాంత మెరిగించిన నాశక్రుండు సక
లదేవగణంబుతో నట కేతెంచె నయ్యవసరంబున. 21
సీ. పాపులు యాతనాబాధితు లగుటలు, వేగమే మానెను వింత గాఁగ
దుర్గంధ మంతయుఁ దొలఁగెను గృధ్రాది, పక్షిజాతంబులు పాఱిపోయె
నస్థిపుంజము లెల్ల నదృశ్యమై పోయె నసిపత్రవనము లేదచటఁ జూడ
వైతరణియుఁ బోయె, బరిమళగంధము, వీచుచునుండెను వేడ్కఁ గాఁగ
తే. మలయమారుత మెల్లెడ నలరుచుండె, సకలదిశలు నిర్మల మయ్యె సాధ్యసిద్ధ
గరుడగంధర్వు లెల్లరుఁ గౌతుకమున, వలయితమవర్తనంబులు సలుపుచుండ్రి, 22
వ. వసువు లాదిత్యాదికిన్నరకింపురుషదేవతు లెల్లరు. బాండవాగ్రజుని చుట్టుం బరివే
ష్టించి యుండి రాకౌంతేయాగ్రజునిసుగుణమణులఁ బ్రశంసించుచుండి రంత నిం
ద్రుండు నిరుపమానతేజోవిరాజితుం డగుయుధిష్ఠిరున కిట్లనియె. 23
సీ. భూవరోత్తమ విను దేవతలందఱు, వగచిరి నీ వింతఁ బరఁగుకతన
నినుఁ దోడుకొని పోవఁ జనుదెంచి రెల్లరుఁ, గోపము విడుమయ్య కువలయేశ
నీ పుణ్యవశమున నీపరమపదము, నందున వసియింతు వింక కులజ
నరకలోకమునకు నరుదెంచువారికి, రాక తప్పదు సుమి రాజరాజ.
తే. పుణ్యపాపము లన రెండు పొదలుచుండుఁ, బుణ్యమున నాకలోకము పొంద వచ్చుఁ
బాపకృతమున నరకనివాస మగును, నాదునుడు లాలకింపుము మేదినీశ,

ద్రౌపదీదేవి యనఁగను [illegible] 41

వ. ఆమె సాన్నిధ్యమున నున్నవారెవ్వ రామె పుత్త్రులు వారే తల్లి ద్రౌపదియు లనఁ గీర్తిఁ గాంచి రని యిట్లనియె. 42

సీ. ఆతనిఁ గన్గొను మతఁడు మీతండ్రికి, నన్న యాధృతరాష్ట్రుఁ డనెడు నృపతి
యితఁడు నీయగ్రజుఁ డినసంభవుం డగు, కౌంతేయుఁడై పుట్టి కారణమున
రాధేయుఁ డితఁ డయ్యె రాజేంద్ర శ్రీకృష్ణుఁ, యదుపుంగవులఁ జూడు మచట నదిగొ
చంద్రునిఁ బోలెను సౌందర్యమూర్తి యా,నభిమన్యుఁ జూచితే యమలమూర్తి

తే. పాండుభూపాలుఁ డితఁడు పౌరవేంద్ర, కుంతిమాద్రు లాతనిఁ గొల్చుకాంత లరుగొ
యతఁడు భీష్ముఁడు వసువులం దలరుచుండె, దేవగురుదరి ద్రోణుని నీవు గనుము. 43

వ. ద్రుపదవిరాటాదులును దక్కుంగల సర్వబాంధవమిత్త్రాదులును ధర్మనందనున కింద్రుఁడు చెప్పె నని జనమేజయుఁడు వైశంపాయనునకుఁ జెప్పిన విని యమ్మహీరమణుఁ డమ్మునీంద్రుం గాంచి మహాత్మా యీకౌరవపాండవాదులు నాకలోకనివాసులై స్థిరముగా నుందురా లేక మరల మానవజన్మ మెత్తుదురా యది తెల్పు మన వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె. 44

— జనమేజయుఁడు దానాదు లొనర్చుట. —

సీ. కురుకులోత్తమ దేవగుహ్య మీవిషయము, దానిని విను సావధానుఁడ వయి
యనఘుఁ డాప్రద్యుమ్నుఁ డతఁడు సనత్కుమారునిఁ జేరి యుండెను జనవరేణ్య
ధృతరాష్ట్రభూపతి సతితోడ గూడి కుబేరలోకము గాంచె విమలచరిత
పాండుభూపాలుండు పత్నీద్వయముతోడ, నింద్రలోకమ్మున కేగియుండె

తే. వినుము యభిమన్యుఁ డతఁడు చంద్రునిఁ గవిసెను, కుంభజన్ముఁడు దేవతాగురునిఁ జేర
ద్వాపరాత్మకుఁ డయ్యె గాంధారవిభుఁడు, సూర్యునందుఁ గర్ణుడు చేరు నార్యవినుత.

తే. స్వర్గమున సుయోధనుఁ డతిసౌఖ్య మొంది, నరకలోకకష్టంబుల ననుభవించి
యవలఁ గల్గియుందుఁ జేరినాఁడ తనియనుజులందఱును రక్కసుల జేరి రిందుకులజ.

వ. విరాటధృష్టకేతుచేకితానభూరిశ్రవశ్శల్యయుత్తరులు విశ్వనామదేవతలం జేరిరి ధృష్టద్యుమ్నుఁ డగ్నిం బ్రవేశించె గాంగేయుండు వసువులం జేరె ధర్మజవిదురులు కాలునిం జేరిరి. బలభద్రుఁ డనంతుం జేరెఁ గృష్ణుండు విష్ణుం డయ్యె నర్జునుఁ డింద్రుం జేరె భీముఁడు వాయువుం జేరె మాద్రేయు లశ్వినులఁ జేరిరి ద్రౌపది ముకుందచరణాంభోజములు సేవించుచుఁ దత్పదముఁ జేరు గోపిక లప్సరస లైరి రుక్మిణి లక్ష్మిం జేరె నని చెప్పి వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె. 47